# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

(పద్య కావ్యము)

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము

పరిష్కర్త : ఆచార్య కె.జె.కృష్ణమూర్తి



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

(పద్యకావ్యము)

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము

పరిష్కర్త
ఆచార్య కె.జె.కృష్ణమూర్తి
తిరుపతి




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
**2004**

**SRI VENKATACHALA MAHATMYAMU**
(PADYA KAVYAMU)

*by*
**MATRUSRI TARIGONDA VENGAMAMBA**

Edited by
**Dr. K.J. KRISHNA MOORTHY, M.A., Ph.D.,**
Professor of Telugu (Rtd.)
Oriental Research Institute,
S.V. University,
Tirupati.

T.T.D. Religious Publications Series No : 641



First Edition : 2004

Copies : 2000

Cover design: P. Siva Prasad

Published by
**Sri Ajeya Kallam, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 507

DTP by
Siva Ram Offset Printers
M.V.Puram - Nellore.

*Printed at :*
Sowbhagya Printers, Warrangal

# ముందు మాట

తిరుమల తిరుపతి దేవస్థానములు ప్రచురించే ధార్మిక ప్రచురణల్లో వేంకటాచల మాహాత్మ్యానికి సంబంధించిన గ్రంథాలకు ఒక విశిష్టత ఉంది. పద్యమైనా, వచనమైనా, గేయమైనా, నాటకమైనా, కావ్యమైనా ....ఇలాగ రచనాప్రక్రియ ఏదైనా, మరి భాష ఏదైనా- అది వేంకటాద్రియొక్క మహిమను ప్రబోధించేదయితే, ఆ రచనకు ఒక విశిష్టత ఉంటుంది. కలియుగ ప్రత్యక్ష దైవంగా ఆరాధింపబడే మహనీయ అర్చామూర్తియైన శ్రీవేంకటేశ్వరుడి తత్త్వాన్ని, మహత్త్వాన్ని చాటుతూ వుంటాయి కాబట్టే, అటువంటి రచనలకు అంతటి ప్రత్యేకత!

వేంకటాచల పుణ్యక్షేత్రం యొక్క మాహాత్మ్య వైభవానికి మూలాధారమైన గ్రంథం ప్రాచీనకాలంలో వివిధ పురాణాల్లోనుండి సేకరింపబడి రూపొందింపబడింది. సంస్కృతంలో ఉన్న ఆ వేంకటాచల మాహాత్మ్య గ్రంథాన్ని అనువదించిన ఆంధ్రమహాకవుల్లో, కవయిత్రుల్లో అగ్రగణ్యురాలు మహిత సాహితీమూర్తి తరిగొండ వెంగమాంబ(1730-1817). ఈమెకంటె పూర్వులయిన కవులు ఒకరిద్దరు వేంకటాచల మాహాత్మ్యాన్ని తెలుగులో రచించినప్పటికీ, ఈ కవయిత్రి రచించిన ఈ పద్యకావ్యం తెనుగు వాఙ్మయంలో విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించింది. ఈ వైశిష్ట్యానికి ముఖ్యంగా మూడు కారణాలు గోచరిస్తాయి.

i) ఈ కవయిత్రి పెక్కేండ్లుగా తిరుమల క్షేత్రంలో నివసిస్తూ ఈ రమణీయ భక్తికావ్యాన్ని తిరుమలక్షేత్రంలోనే రచించివుండటం.

ii) ఈ కావ్యం సులభ సుందర శైలిలో అలరారుతూ అందరికీ హృదయాహ్లాదాన్ని కలిగించడం.

iii) ఈ కావ్యం వేంకటాచలక్షేత్ర మహిమను, ఈ క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారు వెలసిన పవిత్రగాథను తెలుగు ప్రజానీకంలో ప్రశస్తంగా ప్రచారం చెయ్యడం.

గడచిన రెండు శతాబ్దుల్లో ఎన్నో తడవలుగా చెన్నపురిలో ముద్రింపబడినప్పటికీ, ఈనాడు అరుదైపోయిన ఈ పవిత్ర గ్రంథం ప్రస్తుతం ప్రప్రథమంగా తిరుమల తిరుపతి దేవస్థానంవారి ధార్మిక ప్రచురణగా వెలువరింపబడటం శ్రీనివాసుని దివ్యసంకల్పమే అని భావించవలసి వుంది. ఈ కావ్యాన్ని పెక్కు ప్రతుల సహాయంతో చక్కగా పరిష్కరించి యిచ్చిన శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ విశ్రాంతాచార్యులు డా॥ కె.జె. కృష్ణమూర్తి గారికి మా కృతజ్ఞతలు.

''ఆనందనిలయుని సంస్థానం'' నుండి వెలువడుతున్న ఈ గ్రంథం భక్తలోకానికి ఆనందదాయకం కాగలదని మా ఆకాంక్ష!

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

తదితర ప్రాచీన మహాకవు లనేకులలాగానే స్వేచ్ఛానువాదంగా కొనసాగింది. ఈ మాహాత్మ్యకావ్యంలోని కవితాశైలి సందర్భోచితమై, సరళ సుందరంగా, మిగుల మనోజ్ఞంగా జాల్వారుతూ వుంది.

ఈ మాహాత్మ్య ప్రబంధం అవతరించిన నాటినుండీ వేంకటాచలంయొక్క మహిమలను ప్రజానీకంలో ప్రబోధిస్తూ తెలుగునేల నలుమూలలల మిగుల ప్రఖ్యాతి వహించింది. ఈ ప్రఖ్యాతికి భక్తిరసార్ద్రమై, సులలితమైన ఇందలి కవితామాధురియే ముఖ్య హేతువు. వేంకటాద్రియొక్క పవిత్రోదంతాలు, వేంకటేశ్వరస్వామివారి పరిణయగాథలు, మహిమా విశేషాలు ఇటీవలి రెండు శతాబ్దుల్లో ప్రచురంగా ఈ కావ్యంద్వారానే తెనుగువారికి చిరపరిచితాలుగా ప్రచారాన్ని పొందాయి. 18వ శతాబ్ది ఉత్తరార్ధంనుండి ఆంధ్రావనిలో విలసిల్లిన 'వేంకటేశ్వరాత్మక సాహిత్యం' పై ఈ ప్రబంధం ప్రసరింపజేసిన ప్రభావం ప్రత్యేకంగా పేర్కొనదగినదిగా ఉంది. సంగ్రహంగా ఇది ఈ కావ్యానికి గల విశిష్టత.

**రచయిత్రి:**

'కలౌ వేంకటనాయకః' – అని కొనియాడబడిన వేంకటేశ్వరుడే కథానాయకుడుగా వెలసిన ఈ కమనీయ కావ్యాన్ని రచించిన వెంగమాంబయొక్క పుట్టుకచే చరితార్థమైన గ్రామం తరిగొండ. లక్ష్మీనృసింహక్షేత్రంగా చారిత్రక ప్రశస్తి వహించిన ఈ గ్రామం తిరుపతికి వాయవ్య దిశన దాదాపు వంద కి.మీ. దూరంలో నెలకొని వుంది. తరిగొండ వాస్తవ్యులు, నందవర శాఖీయులు, వశిష్ఠ గోత్రులు అయిన కానాల కృష్ణయామాత్యుడు, మంగమాంబ అనే ఉత్తమ దంపతులకు శ్రీ వేంకటేశ్వరుని వరప్రసాదంగా ఈ కవయిత్రి క్రీ.శ. 1730 ప్రాంతంలో జన్మించింది.

# పీఠిక

రచన:

భారతావనిలోని పుణ్యక్షేత్రాలన్నిటిలో విశ్వవిఖ్యాతమైనది తిరుమల. తిరుమలకు గల అనేక నామాలలో అత్యంత విశిష్టమైన నామధేయం ' వేంకటాచలం '. ఈ పురాతన పుణ్యక్షేత్రంయొక్క వృత్తాంతం సంస్కృతంలో వరాహ పురాణం, భవిష్యోత్తర పురాణం, పద్మపురాణం - మొదలైన పన్నెండు పురాణాల్లో వర్ణింపబడివుంది. అలా వేర్వేఱు పురాణాల్లో వర్ణింపబడివున్న - వేంకటాచలక్షేత్రానికి సంబంధించిన - ఆ యా అధ్యాయాలను మహర్షి సములైన మహనీయులు ఒకే గ్రంథంగా పూర్వకాలంలో సంకలనం కావించారు. ఇలా సంకలనం చేయబడిన బృహద్ గ్రంథమే ''వేంకటాచల మాహాత్మ్య''మనే పేరుతో ప్రసిద్ధిగాంచింది. ఆ ప్రాచీన గ్రంథమే వేంకటాచల పుణ్యక్షేత్రంయొక్క ప్రభావ, వైభవాలకు, ప్రశస్తి, ప్రచారాలకు ప్రధానమైన ఆకరమై తర తరాలుగా విరాజిల్లుతూవుంది.

వేంకటాచల మాహాత్మ్య గ్రంథాన్ని సంస్కృతం నుండి ఆంధ్రీకరించిన కవీశ్వరుల్లో అగ్రగణ్యగా ఎన్నదగిన కవయిత్రీమతల్లి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వెంగమాంబ ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలుగులో ఆఱాశ్వాసాల పద్యకావ్యంగా వెలయించింది. ఇందులో మొదటి మూడాశ్వాసాల కథకు మూలం వరాహపురాణం ప్రథమ భాగం( 3 0 అధ్యాయాలు); అలాగే నాలుగవ, ఐదవ ఆశ్వాసాల కథకు భవిష్యోత్తర పురాణం ( 1 4 అధ్యాయాలు) మూలం. ఆఱవ ఆశ్వాసాన్ని మాత్రం ఈ కవయిత్రి పద్మపురాణభాగంనుండి స్వీకరించిన కొన్ని కథాంశాల ఆధారంతో స్వయంగా పెంపొందించి రచించింది. మొత్తంమీద వెంగమ్మ తెనిగింపు

వెంగమాంబకు దైవభక్తి సహజంగా అలవడింది. తల్లిదండ్రులు ఆమె ముగ్ధభక్తికి తొలుత సంతోషించినప్పటికీ, రాను రాను తన్మయత్వంతో నాట్యంచేస్తూ పాటలు పాడుతూ వెఱ్ఱివంరచిపోయే స్థితికి చేరుతూవుండటంవల్ల, ఆ బాలికయొక్క భక్తిధోరణిని నిరుత్సాహపరుస్తూ వచ్చారు. ఫలితం కనబడనందువల్ల, బాల్యంలోనే వెంగమ్మకు వివాహం కావించారు. వరుడు శ్రీవత్సగోత్రుడూ, చిత్తూరుకు సమీపమందలి నారగుంటపాళెం వాస్తవ్యుడూ అయిన ఇంజేటి వేంకటాచలపతి. వివాహమైన కొన్నాళ్లకే వరుడు పరమపదించాడు. పూర్వాచారం ప్రకారం తన ముత్తైదువు చిహ్నాలను తొలగించటానికి వెంగమాంబ అంగీకరింపలేదు. ''భగవంతుడైన వేంకటాచలపతియే నా పతిదేవుడు కావున నేను సువాసినిగానే ఉంటున్నాను'' - అని ఆమె పూర్వాచార పరాయణుల ప్రతినిధిగా విచ్చేసిన పుష్పగిరి పీఠాధిపతితో వాదించి, ఆయునను నిరుత్తరుణ్ణి గావించింది! వెంగమ్మ గొప్ప నృసింహోపాసకురాలనీ, ప్రహ్లాదాంశ గల పరమభక్తురాలనీ పుష్పగిరి స్వాములవా రామెను ప్రశంసించి వెళ్లారు.

అనంతరం, వెంగమాంబ రూపావతారం సుబ్రహ్మణ్య దేశికుడనే గురువర్యుని వద్ద బ్రహ్మవిద్యను, యోగాభ్యాస విధానాన్ని ఉపదేశపూర్వకంగా పడసింది. ఒకనాటి మధ్యాహ్నవేళ వెంగమాంబ యోగాభ్యాసం చాలించి అరమోడ్పు కనులతో కూర్చుండియుండగా, ఆకాశాన్నుండి కొన్ని అక్షరాల పంక్తులు మిఱుమిట్లు గొల్పుతూ దిగివచ్చి, ఆమె ముఖంలో ప్రవేశించాయట! ఈ దివ్యానుభూతిని కవయిత్రి శ్రీ వేంకటాచల మాహాత్మ్యంయొక్క అవతారికలో రెండు పద్యాల్లో వెల్లడించింది. (చూ. 1 ఆశ్వా., 4, 5 పద్యములు). ఈ రీతిగా ఆంధ్రసాహితీ జగత్తులో అక్షర శారదాసాక్షాత్కారాన్ని పొందిన ఏకైక కవయిత్రి తరిగొండ వెంగమాంబ!

ఆనాటినుండి వెంగమాంబ తన అపూర్వ ఆధ్యాత్మికానుభవ విశేషాలను ఆహ్లాదకరమగు రీతిని 'కవితైవ తపః' - అనే సూక్తిని సార్థకం చేస్తూ, రచనల రూపేణ ఆవిష్కరించటానికి పూనుకొన్నది. తరిగొండ నృసింహశతకము, నారసింహవిలాస కథ (యక్షగానము), శివనాటకము (యక్షగానము), రాజయోగామృత సారము (ద్విపద కావ్యము), బాలకృష్ణ నాటకము (యక్షగానము) - అనే కృతులను వెంగమాంబ తరిగొండలో రచించినది.

వెంగమాంబ తరిగొండ లక్ష్మీనృసింహస్వామివారి దేవాలయంలో ఎడమ వైపున ఉన్న నిలువెత్తు ఆంజనేయస్వామి విగ్రహంచాటున కూర్చుండి తఱచుగా యోగసమాధి నిమగ్న అవుతూ వుండేది. ఒకమాఱు ఆలయార్చకు డది గమనించి, ఆగ్రహంతో ఆ యోగీశ్వరియొక్క తలవెండ్రుకలు పట్టుకొని ఇవతలకు లాగినాడు! అత్యంత బాధాకరమైన ఈ సంఘటన జరిగిన మఱుక్షణాననే ఈ కవయిత్రి దైవప్రేరణతో తరిగొండను వీడి, అడవిదారులగుండా పయనించి తిరుమలక్షేత్రాన్ని చేరుకొన్నది.

ఆ కాలం (క్రీ.శ. 1745 - 50 ప్రాంతం)లో హథీరాంజీ మఠానికి అధిపతిగా నుండిన మహంతు తరిగొండ వెంగమాంబ యొక్క భక్తితత్పరతను గూర్చి విని, ఆమెకు శ్రీస్వామివారి ఆలయం తరపున ఒక ఆశ్రయాన్ని కల్పించినాడు. నందన వనాల నడుమ ఆనందనిలయంలో నెలకొనియుండి, భక్తజనుల కోరికలను అనుగ్రహిస్తూవున్న వేంకటేశ్వరుడు క్రొత్తగా తిరుమల చేరిన వెంగమాంబకు ఆశ్రిత పారిజాతంగా భాసించినాడు! ఆ భక్తిభావన ప్రేరేపింపగా, ఈ కవయిత్రి మళ్లీ కృతిరచనా కైంకర్యాన్ని ప్రారంభించింది.

తిరుమల క్షేత్రంలో శ్రీవారి సన్నిధిని సంకీర్తనాచార్యులుగా స్థిరపడియున్న తాళ్ళపాక అన్నమాచార్యుల వంశీయులు ఉత్తరమాడ వీథిలోని తమ యింటి ప్రక్కనగల చిన్నయింటిని శ్రీస్వామివారి భక్తురాలగు వెంగమాంబకు నివాసంగా ఇచ్చారు. అందువల్ల ఈ

కవయిత్రికి తాళ్ళపాక వంశకవుల రచనలను పరికించే సదవకాశం-స్వామివారి సంకల్పంవల్ల - లభించింది! వాటిలో అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనల ఫణితులను, శృంగారమంజరిని, అన్నమయ్య అర్ధాంగి తిమ్మక్క రచించిన సుభద్రాకల్యాణాన్ని, మనుమడు చిన్నన్న రచించిన అష్టమహిషీ కల్యాణాన్ని వెంగమాంబ తన రచనలలో సమర్థవంతంగా అనుసరించింది. ఇంతేగాక, 'పూర్వ కవీశ్వర వందనము'లో "వరలబ్ధ మన్నమాచార్యునకు"- అని అన్నమయ్యను పేర్కొని కొనియాడిన ఏకైక కవయిత్రి తరిగొండ వెంగమాంబయే! (చూ. 1వ ఆశ్వా., 18వ పద్యము).

అక్కారాం వేంకట్రామ దీక్షితులనే అర్చకుల పెద్ద వెంగమాంబ పొరుగున నివసిస్తూ వుండేవాడు. ఆయనమూలంగా ఈ కవయిత్రికి కొన్ని కష్టాలు ఎదురయ్యాయి. అందువల్ల వెంగమాంబ తిరుమల ఆలయానికి దాదాపు పదిమైళ్ల దూరంలో నెలకొనివున్న 'తుంబురుకోన' అనే దట్టమైన అరణ్య ప్రదేశాన్ని చేరుకొన్నది. అచ్చటి కొండగుహలో కొన్ని వత్సరాలు తీవ్రంగా తపస్సుచేసి, అపూర్వమైన సాక్షాత్కారానుభూతిని పొందింది. ఆ కొండగుహ "తరిగొండ వెంగమాంబ గవి"గా నేటికీ వ్యవహరింపబడుతున్నది.

వెంగమాంబ తుంబురు కోన నుండి మరల తిరుమల చేరిన నాటినుండి ఆమె మహానుభావత సర్వులకు చక్కగా విదితమయింది. ఈ భక్తకవయిత్రి ప్రతియేట నిర్వహించెడి నృసింహ నవరాత్రోత్సవముల మూలంగాను, భక్తి వేదాంత భావగర్భితాలైన రసవద్రచనలవల్లను ఈ కవయిత్రి ప్రఖ్యాతి తెలుగుదేశం నలువైపులా వెన్నెలవలె అలముకొన్నది! ఆనాడు ఆమె మఠంలో "అష్టఘంటములు" అనే పేరుతో ఎనిమిదిమంది వ్రాయసకాండ్రు ఏర్పడియుండి, ఆమె గ్రంథాలకు ప్రతులను తయారుచేస్తూ వుండేవారు. వెంకటగిరి, శ్రీకాళహస్తి, కార్వేటినగరం వంటి సంస్థానాధీశుల ప్రతినిధులు, కూచిపూడి భాగవతులు మొదలగు వారనేకులు వెంగమాంబ రచనల్లో తమకు కావలసిన వాటికి ప్రతులు వ్రాయించుకొని వెళ్లుతూవుండేవారు. ఈ రీతిగా ఆ కాలంలో మాతృశ్రీ

వెంగమాంబగారి మఠం నిత్యం సందడిగా ఉంటూ తిరుమలలో సందర్శింపదగిన ఆధ్యాత్మిక సారస్వత కేంద్రంగా అలరారుతూ వుండేది!

ఈ 'కవితాతపస్విని'యొక్క అమృతలేఖిని నుండి వేంకటాచల పుణ్యక్షేత్రంలో అవతరించిన అనర్ఘకృతు లివి :

విష్ణుపారిజాతము (యక్షగానము)

రమాపరిణయము (ద్విపద కావ్యము)

చెంచు నాటకము (యక్షగానము)

శ్రీకృష్ణమంజరి (మంజరీ ద్విపదలో రచింపబడిన సుందరస్తుతి)

శ్రీ రుక్మిణీ నాటకము (యక్షగానము)

గోపికా నాటకము (యక్షగానము)

శ్రీ వేంకటాచల మాహాత్మ్యము (పద్యకావ్యము)

అష్టాంగ యోగ సారము (పద్య కృతి)

జలక్రీడా విలాసము (యక్షగానము)

ముక్తికాంతా విలాసము (యక్షగానము)

తత్త్వ కీర్తనలు (ఆధ్యాత్మికగేయములు)

వాసిష్ఠ రామాయణము (ద్విపద కావ్యము)

పైన పేర్కొన్న కృతులేగాక, ఈ కవయిత్రి ఆ యా సన్నివేశాల్లో ఆశువుగా చెప్పిన పద్యాలు, శ్లోకాలు, పాటలు మొదలయినవెన్నో కలవు. మొత్తంమీద ఈ భక్తకవయిత్రియొక్క రచనలన్నీ ఇలవేల్పైన తరిగొండ లక్ష్మీనృసింహునకూ, ఇష్టదైవమైన తిరుపతి వేంకటేశ్వరునకూ అభేద భావనతో అంకితం కావింపబడినాయి. ఈ రీతిగా సువిస్తృతమైన సాహిత్యసేవయేగాక, వెంగమాంబ శ్రీవారి ఏకాంతసేవా సందర్భంలో "నిత్యముత్యాల హారతి" కైంకర్యాన్ని సైతం శాశ్వతంగా నెలకొల్పింది. ఈ

కైంకర్యాన్నిబట్టే "తాళ్ళపాకవారి లాలి, తరిగొండవారి హారతి" - అనే సూక్తి ఆవిర్భవించింది. ఈ విధంగా ఈ యోగీశ్వరి ఒకవైపు సాహితీ సేవను, మరొకవైపు శ్రీస్వామివారి కైంకర్యాలను, ఇంకొక ప్రక్క శిష్యులకు, శిష్యురాండ్రకు తత్త్వోపదేశాలను కొనసాగిస్తూ, సహస్రచంద్ర దర్శనం కావించి, క్రీ.శ. 1817న ఈశ్వర సంవత్సర శ్రావణ మాసంలో పరమపదాన్ని అలంకరించింది.

బాల్యంలో ఓనమాలు కూడా గురువుల వద్ద అభ్యసింపకపోయినా, యోగవిద్యా పాటవంతోనూ, పరిపూర్ణ భక్తిరసార్ద్ర చిత్తంతోనూ అపూర్వసారస్వతశక్తిని సాధించి, శ్రీవేంకటాచలమాహాత్మ్యాది అమృత కావ్యాలను వెలయించిన మహాకవయిత్రి తరిగొండ వెంగమాంబ. బమ్మెర పోతనామాత్యుడు, తాళ్ళపాక అన్నమాచార్యుడు, గిరిధరగోపాల భక్త మీరాబాయి - ఈ మహాత్ములతో పోల్చిచెప్పదగిన మహనీయ సాహితీమూర్తులు!

ఈ కవయిత్రియొక్క వాఙ్మయజీవితానికి శేషగిరివాసుని కోమల దరహాసమే స్ఫూర్తికేంద్రం! శ్రీవారి ఏకాంతసేవలో ఆమె నెలకొల్పిన "నిత్య ముత్యాల హారతి" చిట్టచివరి హారతి అయినట్లు, ప్రాచీన యుగానికి చెందిన కవయిత్రీమతల్లులలో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ కడపటి కాంతిదీపం!

**పరిష్కరణ:**

ఈ కావ్యాన్ని పరిష్కరించడంలో ఉపయోగపడిన శ్రీ వేంకటాచల మాహాత్మ్య ముద్రితాముద్రిత ప్రతుల వివరం ఈ దిగువన సంక్షిప్తంగా ఇయ్యబడుతున్నది.

ఎ) ముద్రిత ప్రతులు : ఎనిమిది.

1. పరిష్కర్త: మద్రాసు ప్రసీడెంసి కాలీజులో నాంధ్రపండితులు శ్రీరేకము రామానుజసూరి.

   శ్రీరామగుణదర్పణ ముద్రాక్షరశాల, మద్రాసు- 1866 సం॥ నవంబరు నెల 21వ తేదీ.

   Note:- ఈ ప్రచురణలో తొలి య్యైదాశ్వాసములు మాత్రమే ముద్రింపబడినవి. షష్ఠాశ్వాసమును చేర్పకపోవుటకు కారణము తెలియదు.

2. పరిష్కర్త: తిరుమల నివాసులు, శ్రీశ్రీనివాస చరణ సరోజ సమాసక్త చిత్తులు నగు వత్యం కొత్త పురుషోత్తమ భట్టాచార్యులు.
   గీర్వాణ భాషా రత్నాకర ముద్రాక్షర శాల, చెన్నపురి- 1889.

3. పండిత పరిష్కృతము.
   శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాల, చెన్నపురి - 1895.

4. పండిత పరిష్కృతము.
   విద్యాతరంగిణీ ముద్రాక్షరశాల, చెన్నపురి- 1907.

5. పఢడిత పరిష్కృతము.
   చిదానంద ముద్రాక్షరశాల, చెన్నపురి- 1912,
   ఆగష్టు నెల 16వ తేది.

6. పరిష్కర్త: ఆలూరు వాసుదేవయ్య.
   వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి- 1914.

7. పండిత పరిష్కృతము:
   అమెరికన్ డైమెన్డు ముద్రాక్షరశాల, చెన్నపురి - 1924.

8. పబ్లిషర్ : శ్రీ వేంకటేశ్వర బుక్ డిపో, తిరుమల.
   తిరు వేంకటేశా ముద్రణాలయము, తిరుపతి - 1955.

   Note:- ఈ ప్రచురణలో 4,5,6 అశ్వాసములు మాత్రమే ముద్రింపబడినవి.

బి) తాళపత్ర ప్రతులు : రెండు.

1. ఒకటవ ప్రతిలో 50 సెం.మీ X 2.5 సెం.మీ. కొలతలు గల 137 పత్రా లున్నాయి. ఇది ఆఱాశ్వాసాల సమగ్రప్రతి. ఈశ్వర సంవత్సరం చిత్రి (క్రీ.శ. 1877 మే) నెలలో వ్రాయబడినది. వ్రాత స్పష్టంగా ఉంది. దీని లేఖకుని పేరు ఆరు మొగపిళ్ల.

2. రెండవ ప్రతిలో 47 సెం.మీ.X 3 సెం.మీ. కొలతలు గల 172 ఆకు లున్నాయి. ఇందులో ఆఱాశ్వాసాలు ఉన్నప్పటికీ, కొన్ని ఆకుల్లో శిథిలత గోచరిస్తున్నది. స్వరూపాన్ని బట్టి ఇది పై ప్రతికన్న ప్రాచీనమైనదిగా తెలుస్తుంది. దీని లేఖనకాలం తెలియనప్పటికీ, దీని పరిస్థితిని(condition)బట్టి పై ప్రతికంటె కనీసం 30 ఏండ్లు పూర్వమైనదిగా - అనగా క్రీ.శ. 1847 ప్రాంతానిదిగా - భావింపదగి ఉంది. ఇందలి వ్రాత గుండ్రనిది. దీని లేఖకుడు మునస్వామి పిళ్ల. ఈ రెండు తాళపత్ర ప్రతులూ చిత్తూరు జిల్లా ప్రాంతంలో లభించినవి.

లభించిన ముద్రిత ప్రతులు ఎనిమిదింటిలోనూ ఆఱాశ్వాసాలు సమగ్రంగా గలవి ఆఱు. ఈ ఆఱు సమగ్రప్రతులలో తొలుతటిదైన (2వ సంఖ్యగల) ముద్రితప్రతిని 'కాపీ' చేసికొని, దానిని తక్కిన ముద్రిత, అముద్రిత ప్రతులతో వరుసగా సరిపోల్చి పరిశీలిస్తూ, ఈ కవయిత్రీ హృదయానికి అనుగుణమైన సవ్యమైన పాఠాన్ని నిర్ణయించి ప్రకృత పరిష్కరణలో స్వీకరించటం జరిగింది.

ముద్రిత ప్రతుల్లో 6వది (వావిళ్ల ప్రచురణ) తప్ప, తక్కినవన్నీ గుజిలీ ప్రతులు. వాటిల్లో అజ్ఞతవల్ల, అనవధానతవల్ల వాటిల్లిన అపపాఠాలు, అచ్చు తప్పులే అటనట చోటు చేసికొని ఉన్నాయి గాని, కవయిత్రి ప్రయోగించిన భాషాస్వరూపాన్ని (usage) పరిష్కర్తలు మార్చివైచిన దాఖలాలు లేవు. ఇక, విద్వాంసుల పరిష్కరణకు నోచుకొన్న వావిళ్ల ప్రతిలో - లాక్షణిక దృక్పథంతో కూడిన ఉదాత్తమైన అభిప్రాయంతోనే

కావచ్చు – ఈ కవయిత్రియొక్క రచనా స్వరూపం అచ్చటచ్చట మార్పులకు, చేర్పులకు గురి అయింది.

ముద్రిత ప్రతుల్లోని మార్పులను, చేర్పులను గుర్తించడంలోనూ, ఈ కవయిత్రీమతల్లియొక్క రచనాస్వరూపాన్ని ఆవిష్కరించడంలోనూ తాళపత్ర ప్రతులు రెండూ ఈ పరిష్కరణ కార్యంలో ఎంతో ఉత్కృష్టంగా ఉపయోగపడినాయి.

'ఆనందనిలయుని' దివ్యానుగ్రహంవల్ల ఈ మాహాత్మ్య కావ్యం తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణగా ప్రప్రథమంగా ప్రచురితం కావటంద్వారా చరితార్థత నందుతూవున్నందులకు మిగుల ఆనందిస్తున్నాను.

సుధీ విధేయుడు
**ఆచార్య కె.జె. కృష్ణమూర్తి**

# కృతజ్ఞతలు


విశిష్టమైన ఈ ధార్మిక గ్రంథంయొక్క పరిష్కరణ కార్యాన్ని నాకు అప్పగించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యంవారికి, సుగృహీత నామధేయులు, తిరుమల తిరుపతి దేవస్థాన శ్రీకార్యనిర్వహణాధికారి వరేణ్యులు శ్రీ అజేయ కల్లం, ఐ.ఎ.ఎస్, గారికి,

తిరుమల తిరుపతి దేవస్థాన గ్రంథ ప్రచురణ మండలి అధ్యక్షవతంసులు, సహృదయులు ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి, వరిష్ఠ సభ్యులు, సహృదయ వతంసులు ఆచార్య బిరుదురాజు రామరాజు గారికి, తిరుమల తిరుపతి దేవస్థాన పౌరసంబంధాధికారివర్యులు, సహృదయులు డా॥ పి. రంగారావు గారికి,

ఈ గ్రంథ ప్రచురణ విషయంలో ప్రముఖపాత్ర వహించిన సహృదయులు, తిరుమల తిరుపతి దేవస్థాన ''సప్తగిరి'' పత్రికా సంపాదకులు డా॥ ఎన్.యస్. రామమూర్తిగారికి, తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణల విభాగమందలి ఉద్యోగి మిత్రులు డా॥ కోటపాటి రాధారమణ గారికి, డా॥ కలువకుంట రామమూర్తిగారికి, అన్ని విధాలా సహకరించిన ''సప్తగిరి'' కార్యాలయోద్యోగి మిత్రులెల్లరకు,

ఈ గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించిన టి.టి.డి. ప్రెస్ మేనేజరు శ్రీయుతులు ఐ. పార్వతీశ్వరరావుగారికి, వారి సహోద్యోగులకు,

ఈ మాహాత్మ్య కావ్య రచయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ఆరాధ్య దైవమయిన ''**శ్రీ తరిగొండ శేషకుధరాధ్యక్షు**''నకు–

అనేక హార్దిక ధన్యవాదములు.

**–– ఆచార్య కె.జె. కృష్ణమూర్తి**

# విషయ సూచిక

| విషయము | పుట |
|---|---|
| ముందుమాట | iii |
| పీఠిక | v |

## ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

* * *

# శ్రీవేంకటాచల మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతాస్తుతి

శ్లో. శ్రీ కాంతాత్మ సరోజ చండకిరణం శీతాంశుబింబాననం
శ్రీ కంరాబ్జజ సన్నుతాంఘ్రికమలం చిన్మాత్ర మప్రాకృతమ్ ,
లోకాతీత మనేక గోపయువతీలోలం పరం సర్వగం
స్వాకారం తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేహం సదా. 1

ఉ. క్షీరసముద్రమందు సువిశేషమతిన్ జనియించి , కూర్మితో
వారిజనాభు దివ్యతర వక్షమునందు వసించి , పూర్ణశృం
గార విలాస లీలల సుఖస్థితి నొప్పుచు భక్త కోటికిన్
గౌరవమొప్పఁగా నెపుడుఁ గల్మల నిచ్చు సిరిన్ భజించెదన్. 2

శా. శ్రీ విఘ్నేశుని క్షేత్రపాలకు , నజున్ , శ్రీ శంకరున్ , దుర్గనున్
దేవేంద్రాదుల నాశ్రయింపుదును ; చిత్తే సత్తుగా నాత్మలో
భావింపన్ గుఱిఁ జూపినట్టి గురు సుబ్రహ్మణ్యు పాదాబ్జముల్
సేవింతుం ; బరవస్తుతత్త్వము మదిం జింతింతు నశ్రాంతమున్. 3

శా. అక్షీణాక్షర పంక్తి రీతి ముని మధ్యాహ్నంబునన్ నాకుఁ బ్ర
త్యక్షంబై , గురు నాది పూరుషునిఁ బ్రత్యక్షంబుగావించి, చి
త్సాక్షే బ్రహ్మమటంచుఁ జూపుచుఁ దదర్థంబుం గృపం జెప్పి , నన్
రక్షింపం బనిఁబూను భారతిని గీర్వాణిన్ బ్రశంసించెదన్. 4

చ. అలఘునభంబునుండి విమలాక్షర పంక్తుల రీతి వచ్చి, నే
నలసతఁ జెందియున్న తఱి నాననమందు వసించి , జ్ఞానముం
గలుగఁగఁ జేసి మానస వికారములం దొలఁగించి , జిహ్వపై
నిలిచి నటించు శారదను నిత్యము సన్నుతిసేయుచుండెదన్. 5

శా. పంకేజాసను( డాలకించి కన సత్ప్రావీణ్యమున్ దెల్పుచున్
శంకాతంకము లేక తాళగతులన్ సద్వీణ వాయించి , యే
ణాంకున్ హాస్యము సేయనోపు ముఖమం దాహ్లాదమున్ జూపు ది
వ్యోంకారాకృతియైన భారతిని నే నుప్పొంగి సేవించెదన్. 6

సీ. విప్రమాతృకలకు వెలిపట్లు , తెల్ల క
ల్వలు, గంధ , మౌక్తికముల నొసంగి
రాజమాతృకలకు రహిని( గావులు , మృగ
మద , హేమ , శోణాగ్ర మణు లొసంగి
వైశ్యమాతృకలకు( బచ్చపట్టులు , చంద్ర ,
మరకతంబులు , బొండుమల్లె లొస(గి
శూద్రమాతృకల కచ్చుగ నల్ల వల్వలు ,
నగరు, మొల్లలు , నీలహారము లిడి
తే. యానవాల్ , నేయి , తేనెయు , నాసవమును
బొస(గ నర్పించి కృతులు చెప్పుదురు కవులు
నే నొకటి నేర( , దరిగొండ నృహరికృపను
భక్తి మ్రొక్కెద మాతృకా శక్తులకును. 7

క. అల కాశినుండి వెలువడి
వలనుగ మా కొఱకు నందవరపురమందే
నెలకొని కులదేవతయై
యలరుచు మమ్మేలు చౌడమాంబను గొలుతున్. 8

శా. నే విజ్ఞానము మోసపోవు తఱి( దానే వచ్చి సత్ప్రేమతో
ధావళ్యాకృతి( జూపి మించిన యవిద్యాచ్ఛేదముం జేసి, మ
ద్భావంబందు వసించి లెస్సయగు శబ్దశ్రేణి నిచ్చే హయ
గ్రీవున్ సత్కరుణాపయోధి మదిలో( గీర్తించెదన్ నిత్యమున్. 9

శా. అంతర్యంబున నుంచి సంతత మనంతాఖ్యుం బ్రశంసించెదన్
స్వాంతంబందు సుపర్ణుఁడైన వినతా సత్పుత్త్రు భావించెదన్
సంతోషం బలరంగ నెల్లపుడు విష్వక్సేను సేవించెదన్
భ్రాంతుల్ దీరఁగఁ బూర్వదేశికుల సత్పాదాబ్జముల్ గొల్చెదన్. 10

శా. ధాటిన్ దుష్టనిశాటులం దునిమి సద్ధర్మంబు రక్షించి , శౌ
ర్యాటోపం బుపశాంతి చేసి ఫణి పర్యంకంబునన్ నిద్రితుం
డై టెక్కొప్పఁగఁ బవ్వళించియును సర్వాధారుఁడౌ గావునన్
కూటస్థుండితఁడంచు నెన్నుదు మదిన్ గోవిందరాజాహ్వయున్. 11

మ. అలఘుత్వంబున రావణాది ఖలదైత్యాళిన్ విదారించి, స
ల్లలితన్ సీతను గూడి యాత్మపుర ముల్లాసంబుతోఁ జేరి , యు
జ్జ్వల పట్టంబున కర్హుఁడై నిలిచి విశ్వస్వామియై యొప్పుటన్
కొలుతున్ సంతత మిష్టదైవమనుచున్ కోదండదీక్షాగురున్. 12

శా. శృంగారాకృతితోడ వచ్చి ' పదముల్ శృంగార సారంబుతో
డం గూఢంబుగఁ జెప్పు నీ ' వనఁగ, ' నట్లా చెప్పలే ' నన్న , నన్
ముంగోపంబునఁ జూచి లేచి, యట నే మ్రొక్కంగ మన్నించి , త
చ్ఛృంగారోక్తులు తానె పల్కికొను నా శ్రీకృష్ణు సేవించెదన్. 13

ఉ. కోరిన శ్రీనివాసునకుఁ గొంకక నైజనివాస మిచ్చి , యా
వీరుఁ డొసంగినంత పదివేలని తృప్తిగ నారగించుచున్
క్రూరత లేక , యోగివలె గుప్తత నుండు వరాహదేవుఁడే
సారపరాత్మతత్త్వమని సన్నుతి సేయుచునుందు భృత్యనై. 14

మ. తిరమై శ్రీయలమేలు మంగ యురమందే నిల్చి దీపింపఁగాఁ
బరమైశ్వర్య ధురంధరుండగుచు , నాపాలన్ గృప న్నిల్పి , సుం
దరదివ్యాకృతి నప్పటప్పటికి మోదంబొప్పఁగాఁ జూపి , మ
ద్వరదుండై తగు వేంకటాచలపతిన్ వర్ణింతు నశ్రాంతమున్. 15

ఉ. శ్రీరమణీహృదీశ్వరు .( జిన్మయమూర్తిని విశ్వతోముఖున్
క్షీరసముద్రశాయిని వ. కృతమాయుని దివ్యకాయునిన్
సారతరార్థముల్ దెలిపి ?త్కృపతో నను నేలు దేవునిన్
కూరిమితో భజింతు( ద. ?ండ నృసింహుని దూరితాంహునిన్. 16

క. అల సూర్యాది నవగ్రహ
ములను , బ్రజాపతుల , యోగిముఖ్యుల( , ద్రిమతం
బుల నుద్ధరించు ధన్యుల(
దల(తున్ మోక్షాభిలాష( దద్దయు వేడ్కన్. 17

## పూర్వకవీశ్వర వందనము

సీ. ఆది కవీశ్వరుండైన వాల్మీకికి
వ్యాసమౌనిక( , గాళిదాసకవికి
నతి(జేసి , వరలబ్ధ మన్నమాచార్యున,
కాంధ్రభాషా కవిత్వాఢ్యులగుచు
మొనయు నన్నయకు( , దిక్కనసోమయాజిక(,
బోతరాజునకు , సునీతులైన
కవులకు( , బండితాగ్రణులకు( , బౌరాణి
కులకు భక్తిని మ్రొక్కికొనుచు నేను
తే. వేంకటాచల మాహాత్మ్య విభవములను
పద్యఫణితిని రచియించి భక్తి మెఱయ
శ్రీనివాసుని పాదరాజీవములకు(
బొస(గ నర్పించెదన్ ముక్తి( బొందుకొఱకు. 18

సీ. పండితాగ్రణులార ! ప్రజలార ! యిపుడు నా
బాల భాష లసహ్యపడక వినుడి !
తల్లిదండ్రులు చిన్నపిల్లల పల్కు లా
హ్లాదంబుగా విందు రా విధమున

మీరు నా తప్పొప్పు లే రీతిగానైన
గేలిచేయక చిత్తగింపవలయు
' నాంధ్ర గీర్వాణ మహాకృతు లుండఁగా
నిప్పు డీ కృతి వినవేల ? ' యనక

తే. భక్ష్యములు మెక్కి యావలఁ బచ్చడియును
నంజుకొనిన విధంబుగా నా ప్రబంధ
మాలకింతురుగాకను నాశచేత
నేనుఁ జెప్పెద మీరు మన్నించి వినుఁడు !

శా. నా రీతిం దగ విన్నవించెదఁ , గృపన్ నా తంఁడులారా ! వినుం
డా రాజీవదాళాక్షు సత్కరుణ నాయందుండు , నైనన్ మదిన్
సారార్థంబుల నేర్పరించికొని భాస్వద్భక్తి యోగక్రమ
శ్రీ రమ్యంబుగ నాంధ్రరీతినిఁ బ్రకాశింపన్ గృతిం జెప్పెదన్. 20

సీ. నా చిన్ననాఁట నోనామాలనైన నా
చార్యుల చెంత నేఁ జదువలేదు
పరఁగ ఛందస్సులోఁ బదిపద్యములనైన
నిక్కంబుగా నేను నేర్వలేదు
లలిఁ గావ్యనాటకాలంకార శాస్త్రముల్
వీనులనైన నే వినఁగలేదు
పూర్వేతిహాస విస్ఫురితాంధ్ర సత్కృతుల్
శోధించి వరుసగాఁ జూడలేదు

తే. చేరి తరిగొండపుర నారసింహదేవుఁ
డానతిచ్చిన రీతిగా నే నిమిత్త
మాత్రమై పల్కుదును , స్వసామర్థ్య మిప్పు
డరసి చూచినఁగాని నాయందు లేదు. 21

సీ. దారునిర్మితవీణ నారూఢిఁ బలికించు
గాయక పురుషుని కరణిగాను
పురుషోత్తముఁడు దయాపూర్ణుఁడై నాజిహ్వ
యందుఁ దా వసియించి యరుదుగాను
పలికించుఁగావున భాగవత పురాణ
మమర నే ద్వీపద కావ్యంబుగాను
ద్వాదశస్కంధముల్ తగఁ జెప్పి హరికి స
మర్పించి , శ్రీ వేంకటాద్రి మహిమ
తే. మవనిపై రమ్య పద్యకావ్యంబు చేసి
శ్రీనివాసుని కే సమర్పింతునంటి
నీఁగ తోయధి దాఁటఁ బోయిన విధమున
నా స్వతంత్రత కిల బుధుల్ నవ్విపోరె ! 22

తే. నవ్విననుసమ్మతంబని నన్నుఁ బ్రోచు
చున్న శ్రీ వేంకటేశ్వరుఁ డున్నతముగ
నిరవుకొనియున్న వేంకటగిరి పురంబు
నిపుడు నొక కొంత వర్ణింతు నెట్టులనిన. 23

## వేంకటగిరి పుర వర్ణనము

సీ. ఘన గోపురములు , ప్రాకార మంటపములు
తేరులు , సత్పుణ్య తీర్థములును
కమలాప్త కిరణ సంకలితంబులై ప్రకా
శించుచుండెడి హేమ శిఖరములును
పావన పరివారదేవతాలయములు
మహిమ నొప్పు విరక్తమఠవరములు
రంగ దుత్తుంగ మాతంగ తురంగముల్
కొమరొప్పు బహుసాధు గోగణములు

తే. ముద్దుగాఁ బల్కు శుకపికములును , నీల
కంఠములును , మరాళ సంఘములు మఱియు
ఫల చయంబులు , తులసికాదళ, సుమములు
క్రిక్కిఱిసియుండు వేంకటగిరి పురమున. 24

సీ. వేద శాస్త్ర పురాణ విద్యా ప్రసంగ వి
వేక భాస్వరులైన విప్రవరులు
మహనీయ సత్య ధర్మ పరాక్రమములచే
భుజబలోన్నతులైన భూమిపతులు
రమణీయ కృషియు , గోరక్ష , వాణిజ్యము
వరసంపదలు గల్గు వైశ్యజనులు
బ్రాహ్మణసేవా ప్రభావజ్ఞులై , సుదా
సులునై మెలంగెడి శూద్రజనులు
తే. తేరువీధులు , నమిత శృంగారవనము
లమల మందిరములు , పంకజాకరములు
గలిగి మెలఁగఁగ మర్త్యలోకంబునందుఁ
గీర్తిచే నొప్పు వేంకటగిరి పురంబు. 25

సీ. ఘనభూవరాహదేవునకుఁ దూర్పున శ్రీని
వాసున కీశాన్య భాగమందు
స్ఫటిక సుకాంతి సోపాన మధ్యమునందు
మరకతచ్ఛాయల మలఁక లొప్పఁ
బూర్ణమౌ శ్రీస్వామిపుష్కరిణి జనాఘ
ముల హరింపఁగ మహోముఖ్యులైన
తీర్థవాసులు సర్వదేశాగతులకు సత్
సంకల్పములు చెప్పి , సకల దాన

తే. ధర్మశాస్త్ర వివేక వితానములను
జెప్పి విత్తము నపు డుపార్జించి హరికి
నర్పణముసేయ నా తీర్థ మావరించి
యనిమిషుల మాడ్కి వర్తింతు రాఢ్యులగుచు. 26

క. ఆ పుష్కరిణికిఁ బడమట
భూపతియగు కిటికిఁ దూరుపున వేదికపై
వ్యాపక జపతపములచే
దీపింతురు కొంద ఱచట ద్విజు లతిభక్తిన్. 27

సీ. మాళవ నేపాళ మలయాళ బంగాళ
చోళ టేంకణ సింధు శూరసేన
సౌవీర కుంతల శక కళింగ కిరాత
కోసల కేకయ కుకుర సాళ్వ
ద్రవిడ పుళింద విదర్భ మహారాష్ట్ర
బర్బరాభీరాంధ్ర పాండ్య మగధ
కాంభోజ కొంకణ కాశ్మీరముఖ్యదే
శస్థులు వేంకటాచలముఁ జేరి
తే. పుష్కరిణిలో మునిఁగి లేచి , భూవరాహ
దేవు నీక్షించి , వేంకటదేవుఁ గాంచి
సకలవస్తువు లర్పించి, సంతసించి
యాడుచును బాడుచుండుదు రనఘులగుచు. 28

క. జలరుహ , సుమ , ఫల పరిమళ
ములు , మృగమదసౌరభంబు , మొగి ధూపస్వా
దులు , పునుఁగు తైల గంధము
లలరుచు వాసించు వేంకటాఖ్య పురమునన్. 29

ఉ. అప్పురమందు దివ్యతర హాటక కుంభ విరాజమానమై
యొప్పు విమానమధ్యమున నుత్తమ పూరుషుఁడై మహాత్ముఁడై
ఒప్పుల కుప్పయై ధర మహోన్నతుఁడై వెలుఁగొందుచుండు మా
యప్పఁడు వేంకటేశ్వరుఁ డహర్నిశముం గమలా సమేతుఁడై. 30

తే. అమ్మహాత్ముని చరితంబు లాదిమునులు
సంస్కృతంబునఁ జెప్పి , రా సరణి నృహరి
తెలియఁజేసినయంత నేఁ దెనుఁగుగాను
పద్యకావ్యంబు రచియింతు భక్తిమెఱయ. 31

## షష్ఠ్యంతములు

క. హేమాక్రాంతకునకు, సం
గ్రామ భయంకరున , కఖిల కారణునకు , శ్రీ
భూమి వరాహస్వామికిఁ
గామిత ఫలదాయకునకుఁ , గరుణానిధికిన్. 32

క. అక్షీణ శౌర్యధైర్యా
ధ్యక్ష హిరణ్యాఖ్య రాక్షసాధిప వక్షో
విక్షోభక నఖరశిఖా
దక్షున , కతికోప విభవ తామ్రాక్షునకున్. 33

క. ఘోరసటాఝాట శిఖా
దూరీకృతజలధరునకు , దురిత హరునకున్
క్షీరాంబునిధి నినాదో
దారోక్తి ధురంధరునకు , దళిత పరునకున్. 34

క. హార హర హీర దర శర
పారద నారద విభా విభవ గాత్రునకున్
గూరిమితోఁ బ్రహ్లాదుని
సారకృపం బ్రోచినట్టి శాంతాత్మునకున్. 35

క. చండతర శౌర్యగౌరవ
ఖండీభవదరికి , భక్త కలుషజలరుహా
ఖండతర కరికి , శ్రీ తరి
గొండ నృకేసరికి , నాదుగుఱికిన్ , హరికిన్. 36

క. వేంకటగిరి నాయకునకుఁ
బంకజభవ జనకునకును, బరమాత్మునకున్
శంకరవర మిత్రునకుఁ, గ
లంక విరహితునకు , మోక్ష లక్ష్మీపతికిన్. 37

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన వేంకటాచల మాహాత్మ్యంబునకుఁ
గథాక్రమం బెట్టిదనిన. 38

## నైమిశారణ్య వర్ణనము

సీ. జంబీర మందార సహకార మాలూర
సాల రసాల హింతాలములును
వట బిల్వ బదరికాశ్వత్థ చందన కుంద
కురవక క్రముక తక్కోలములును
నారికేళార్జున నారంగ బంధూక
పారిజాతాశోక పాటలులును
గాదంబ కాంచన కరవీర పున్నాగ
కోవిదార మధూక కుటజములును
తే. మొదలుగాఁ గల బహువృక్షములును , లతలు
పూచి కాచి ఫలింప సంపూర్ణమగుచు
సర్వకాలంబులందు వసంత ఋతువు
రమ్యమైయున్న నైమిశారణ్యమందు. 39

క. సెలయేఱులు , కమలాకర
ములు , బహుకాసార బృందములు పూర్ణములై
కలకాలము నొక విధముగఁ
బొలుపై ప్రవహించు నచట బుధసేవ్యములై. 40

వ. అట్టి నైమిశారణ్యంబునందు శౌనకాది మహామునులు సూతునివలన సకల పురాణంబులు విని,తదనంతరంబున నొక్క శుభదినమందు సూతుం జూచి ‘ భూలోకంబున నూట యెనిమిది తిరుపతులు గల , వందు స్వయం వ్యక్తంబులు శ్రీరంగంబును , శ్రీముష్ణంబును , తోతాద్రియు , సాలగ్రామంబును , నైమిశంబును , బదరికాశ్రమంబును , కాంచియు , వేంకటాచలంబును నీ యెనిమిది స్వయంవ్యక్తంబులగుంగావున నిందులో విశేషించి సకలేష్టార్థ సిద్ధిప్రదంబయిన స్థలంబెయ్యది ? తెలుపు ’ మని మఱియు నిట్లనిరి. 41

క. ‘ ఘనముగ నర్చారూపము
లను నారాయణుఁడు భూతలంబున భక్తా
వనుఁడై విఖ్యాతినిఁ బొం
దిన సత్కథ మాకు నీవు దెల్పుము సూతా ! ’ 42

మ. అనినన్ సూతుఁడు నవ్వి ‘ మేలు, భళి ! మీరాసక్తితోఁ బ్రశ్న చే
సిన దీ లోకహితంబు , దీన వరలక్ష్మీ కాంతుఁ డుప్పొంగి మి
మ్మును,నన్నుం గడతేర్చుఁ గావున మహాముఖ్యంబుగాఁ జెప్పెదన్
వినుఁడీ తాపసులార ! చిత్తమలరన్ వీనుల్ వినోదింపఁగన్. 43

క. శ్రీ వేదవ్యాసుల కృప
చే వరుసగఁ దోఁచినవి వచించెద వినుఁ డా
దేవుని చరితములన్నియు
నా వశమే తెల్ప మౌనినాయకులారా ? 44

వ. అయినను నాకుఁ దోఁచినంత వినిపించెద , నెట్లన్న నెనిమిది స్వయంవ్యక్తంబులలో వేంకటాచలం బైహికాముష్మిక ఫలదాయకం బగుం గావున నతిశయంబగుచుండు. శ్వేతవరాహ కల్పంబునందు హరి శేషాద్రియందుఁ బ్రవేశించిన పుణ్యవృత్తాంతంబు వినుం ' డని సూతుం డిట్లనియె. 45

సీ. ' నారాయణస్వామి నాభీకమలమందు
మును చతురాస్యుండు జననమొందె
సృష్టికాలమునం దశేష భూతప్రపం
చంబు నొప్పుగ సృజనంబుఁ జేసె
నున్నతుఁడై చతుర్యుగ సహస్రంబును
జాగరణమున విశ్వమును బ్రోచె
నప్పు డాదిత్యానలానిలాంబుద పంక్తు
లొప్పుగా హద్దులఁ దప్పకుండె
తే. మహిమ మీఱఁ జతుర్దశ మనువులందు
వెలుఁగుచును విష్ణుదేవుండు విశ్వమెల్లఁ
బాలనము సేయఁగా బ్రహ్మపగలు జరిగెఁ
బద్మజుఁడు రాత్రి రాఁగానె పవ్వళించె. 46

సీ. ఆ బ్రహ్మ నిద్రించినట్టి రాతిరివేళ
భానుఁ డుగ్రకరాళిఁ బ్రబలఁజేసెఁ
గాలానల జ్వాల కణములఁ గ్రక్కఁగా
స్థావర జంగమ చయము లడఁగెఁ
బ్రళయ వాతూల మంబర మావరించుచు
విసవిస నమితమై విసరసాగె
సంవర్తకాది దుస్తర మేఘబృందంబు
మిన్ను ఘూర్ణిల నార్చె , మెఱపు లెసఁగె

తే. ద్విరదతుండ నిభంబులై దీర్ఘగతుల
వర్షధారలు గురిసె , నివ్వసుధ నీటి
బళువునకు నోర్వలేక లోపలికిఁ గ్రుంగు
నపుడు హైరణ్యలోచనుఁ డార్భటించి. 47

వ. ధరణీతలంబును రసాతలంబునకుం గొని చని యందు బహుకాలంబు క్రీడించుచుండె, నంత బ్రహ్మదేవుండు క్రమ్మఱ మేల్కాంచిన సమయంబున హరి పునఃసృష్టి సేయింప నుద్యుక్తుండై శ్వేత వరాహ రూపంబును ధరియించి మహాజలంబులోనం జొరఁబడి రసాతలంబునకుం బోయి ధరణిం బైకెత్తు సమయంబున హిరణ్యాక్షుం డడ్డంబు వచ్చి యుద్ధసన్నద్ధుండైన, నతనితో ఘోర యుద్ధంబుఁజేసి నిజదంష్ట్రాగ్రంబున వాని శిరంబు వ్రయ్యలు సేయఁగాఁ, దద్రక్తంబునం గలిసిన ప్రళయజలంబు రక్తతోయంబు కరణిం గనిపించినం జూచి జనలోకవాసులు వెఱఁగంది నిజయోగదృష్టిం జూచి , హరి క్రోడాకారుండై చేసిన కృత్యంబుఁ దెలిసి , తత్ప్రభావంబును వినుతింపుచున్న సమయంబున శ్వేత వరాహస్వామి నిజదంష్ట్రాగ్రంబున భూమిం గ్రుచ్చి పైకెత్తి తెచ్చినంజూచి దేవేంద్రాదులు వరాహస్వామికిఁ బ్రణామంబు లాచరించి , భేరీ మృదంగాది వాద్యంబులు మొరయించి కుసుమవృష్టిఁ గురియించి యనేక ప్రకారంబుల వినుతించి, యిట్లనిరి. 48

ఆ. 'హరి! వరాహరూప ! యసురను ఖండించి
హెచ్చి యిటకు ధరను దెచ్చినట్టి
నీవె ధరణి నమర నిలుపు మీ నీటిపై
ననఁగ యజ్ఞఘోణి హర్షమెసఁగ. 49

వ. నిజఖురంబుల మహాజలంబు నడఁచి చదరంబుచేసి యానీటిపై భూమినిఁ గుదురుగా నిలిపి , జనలోకవాసులైన దేవేంద్రాదుల నాదరించి 'యథాప్రకారంబుగా మీమీ స్థానంబులం దుండుఁ' డని నియమించి , బ్రహ్మను మేల్కొల్పి 'పూర్వ ప్రకారంబుగా సృష్టింజేయు' మని యాజ్ఞాపించి వీడ్కొని తలంగి , సన్నిహితుండై మ్రొక్కుచున్న పక్షీంద్రుం జూచి యిట్లనియె. 50

క. 'ధారుణి నీటన్ మునిఁగిన
కారణమున దాని నెత్తు కార్యము కొఱకీ
ఘోరాకారముఁ దాల్చితి
నా రూపముఁ జూచి లక్ష్మి నగదె ఖగేంద్రా ! 51

క. నా రూపం బీ భూమికి
గౌరవముగఁ దోఁచి నన్నుఁ గామించెను, నే
నీ రమణిని మోహించితి
నా రామామణికి నొప్పనని విహగేంద్రా ! 52

క. ఈ కఠిన శరీరము , మఱి
యీ కరణిం బెరుగు సటలు , నీ వికృతాక్షుల్
ప్రాకట దంష్ట్రాయుగ మీ
భీకరతనుఁ జూచి లక్ష్మి బెదరు ఖగేంద్రా ! 53

క. ఆ వైకుంఠ పురంబున
కే విధమున వత్తు ? లక్ష్మి యెక సక్కెముగా
' నీ వెవ్వఁ?' డనుచు నడిగిన
' శ్రీ విష్ణుఁడ ' ననుచుఁ జెప్ప సిగ్గగు గరుడా ! 54

క. కావున నచటికి నే రా ,
నే విధమున నైన ధాత్రి నెడఁబాయక ... ం
దే వసియించెద ' నన విని
యా విహగేంద్రుండు మ్రొక్కి హరి కిట్లనియెన్. 55

మ. ' దేవా ! ధారుణి నుద్ధరించుటకుఁ బోత్రిత్వంబుచే మించి ర
క్షోవీరుం బరిమార్చి యద్భుతముగా క్షోణీతలంబెత్తు మీ
ప్రావీణ్యం బిపు డాదిదేవత మహా భక్తిం బ్రశంసించు , నం
దే వేంచేయుఁడు ! సందియంబు వల దో దేవోత్తమా ! మ్రొక్కెదన్. 56

క. మీ కనపాయినియై తగి
యా కమలాదేవి వక్షమం దుండును, మీ
సూకరరూపముఁ జూపిన
నా కాంతకు వెఱపు దోఁపదయ్య మహాత్మా ! 57

తే. మీరు సర్వజ్ఞమూర్తులు , మీకుఁ దెలియ
కున్నదే ? నాకుఁ దోఁప కీ విన్నపంబుఁ
జేసినా , నింక దేవర చిత్తమునకు
సమ్మతంబైన యది లోక సమ్మతంబు.' 58

వ. అని గరుడుండు పునఃపునఃప్రణామంబులం జేసినం జూచి, కరుణించి
హరి యిట్లనియె. 59

సీ. 'అనఘ ! ఖగేంద్ర ! నేనచటి కిప్పుడు రాను
ధరణిపై వసియించి దానవులను
మర్దించి , సుజనుల మన్నింతు ; నిఁక నీవు
భోరున వైకుంఠపురముఁ జేరి
వనధిజ కచట నీ వార్త లొప్పుగఁ జెప్పి
క్రీడాచలముఁ గొని గెంట కిటకు
రమ్ము పొ ' మ్మన ఖగరాజు హరికి
మ్రొక్కి , వైకుంఠపురమార్గ ముఖత నొందె

తే. నపుడు కిటియైన విష్ణుఁ డీ యవనిఁ దిరిగి
తాను వసియింపఁదగిన సుస్థాన మరసి
చూచుచును వచ్చి వచ్చి యెచ్చోట నిల్వ
సమ్మతము లేక యప్పు డా చక్రధరుఁడు. 60

వ. గౌతమీనదికి దక్షిణంబుగా నఱునది యోజనంబులును , దూర్పు క్షార సముద్రంబునకుఁ బశ్చిమంబుగా నైదు యోజనంబులును , దక్షిణంబుగా నుండు సువర్ణముఖరికి నుత్తరంబుగా నుండు దివ్య స్థలంబు నీక్షించి గరుడాగమనంబున కెదురు చూచుచుండె నంత. 61

సీ. గరుడుండు వైకుంఠపురిఁ జేరి శ్రీరమా
దేవికి మ్రొక్కి ప్రార్థించి పలికె
'ఓ తల్లి ! హరి వరాహోగ్రరూపముఁ దాల్చి
హైరణ్యనేత్రుని హతునిఁ జేసి
యల రసాతలమునం దంటఁగ్రుంకిన ధర
దంష్ట్రాగ్రమున యథాస్థానమునకుఁ
దెచ్చి చక్కఁగ నుంచి , యచ్చట నిల్వ సం
కల్పించినాఁ డటుగాన 'నటకు
తే. మొనసి క్రీడాచలంబుఁ దె ' మ్మనుచు నన్నుఁ
బనుపఁగా వచ్చినాఁడ , నీ పర్వతంబు
నెత్తికొని పోవుటకు సెలవిమ్ము ' నాఁగ
సాగరజ యిట్టులనియె నాశ్చర్యముగను. 62

## గరుత్మంతుఁడు క్రీడాచలమును శేషాద్రికిఁ దెచ్చుట

చ. 'హరి కిటిరూపవైభవము నద్భుత మొప్పఁగ నేనుఁ జూచెదన్
సరఁగునఁ దోడి తె ' మ్మనినఁ జాగిలి మ్రొక్కి ఖగేంద్రుఁ డిట్లనెన్
కరుణను రమ్మటంచు బహుగా వినుతించుచు నేను పిల్చినన్
'ధరణిని వీడి రా ' ననియె దానవహంత గజేంద్రగామినీ ! 63

ఆ. సూకరోగ్రమూర్తి మీకుఁ జూపిన, మీరు
వెఱతురంచుఁ బల్కె విష్ణు ' వనుచు
విహగనాయకుండు విన్నవించిన, నవ్వి
లక్ష్మి యిట్టులనె సలక్షణముగ. 64

ఆ. 'నేను దనకు నెపుడు నిత్యానపాయిని
నగుచు నుండు టెఱిఁగి యద్భుతముగఁ
గ్రొత్తమాటలన్నఁ గ్రోడ విగ్రహు మాయ
వింత దోఁచె మదికి విహగనాథ ! 65

క. తానే రూపముఁ దాల్చిన
నే నా రూపము ధరించి నిశ్చలమతినై
పూని యురంబున నుండుదు
నా నడవడి నేఁడు క్రొత్తయయ్యె ఖగేంద్రా ! 66

క. తా నిచటికి రాకుండిన
నే నచ్చటికైన వచ్చి నిజముగఁ గిటియై
యానందించు మహాత్ముని
మానిత వక్షమున నుందు మహిని ఖగేంద్రా ! 67

సీ. పారీనమై తాను ప్రళయాబ్ధిపై నీదు
నప్పుడు తన వక్షమందె యుంటిఁ
గూర్మరూపముఁ దాల్చికొని యబ్ధిలో మున్గి
నప్పు డేనును దనయందె యుంటి
నంగుష్ఠమాత్రుఁడై యాకుపై శయనించి
నప్పుడు నేఁ దనయందె యుంటిఁ
జంద్ర చంద్రికల కెచ్చట వేఱులేకయు
న్నటువలె నేఁ దనయందె యుంటి
తె. నిప్పు డెడఁబాసి యుందునే ? యెంతకైన
నిచటి పరివారములతోడ నచటి కేను
వచ్చి యా క్రోడ విగ్రహు వక్షమందె
నిలిచియుండెద భయమేమి నిర్మలాత్మ ! 68

క. వేడుకలర భూదేవికిఁ
గ్రోడాకారంబు దాల్చి కులికెడి హరికిన్
క్రీడాచల మొప్పిన దిది
యాడకె కొనిపోవు టొప్పు నయ్య ఖగేంద్రా ! 69

ఉ. అప్పురమందు దివ్యతర హాటక కుంభ విరాజమానమై
యొప్పు విమానమధ్యమున నుత్తమ పూరుషుఁడై మహాత్ముఁడై
ఒప్పుల కుప్పయై ధర మహోన్నతుఁడై వెలుఁగొందుచుండు మా
యప్పుఁడు వేంకటేశ్వరుఁ డహర్నిశముం గమలా సమేతుఁడై. 30

తే. అమ్మహాత్ముని చరితంబు లాదిమునులు
సంస్కృతంబునఁ జెప్పి , రా సరణి నృహరి
తెలియఁజేసినయంత నేఁ దెనుఁగుగాను
పద్యకావ్యంబు రచియింతు భక్తిమెఱయ. 31

## షష్ఠ్యంతములు

క. హేమాక్షాంతకునకు, సం
గ్రామ భయంకరున , కఖిల కారణునకు , శ్రీ
భూమి వరాహస్వామికిఁ
గామిత ఫలదాయకునకుఁ , గరుణానిధికిన్. 32

క. అక్షీణ శౌర్యధైర్యా
ధ్యక్ష హిరణ్యాఖ్య రాక్షసాధిప వక్షో
విక్షోభక నఖరశిఖా
దక్షున , కతికోప విభవ తామ్రాక్షునకున్. 33

క. ఘోరసటాఝూట శిఖా
దూరీకృతజలధరునకు , దురిత హరునకున్
క్షీరాంబునిధి నినాదో
దారోక్తి ధురంధరునకు , దళిత పరునకున్. 34

క. హార హర హీర దర శర
పారద నారద విభా విభవ గాత్రునకున్
గూరిమితోఁ బ్రహ్లాదుని
సారకృపం బ్రోచినట్టి శాంతాత్మునకున్. 35

క. 'అచ్చెరువుగ నా చెంతకు
వచ్చెను సిరి , వచ్చె నీళ , వచ్చెను గిరియున్ ,
వచ్చెను పరివారము నా
కిచ్చట సంసార మింక హెచ్చు ' నటంచున్. 72

వ. వరాహస్వామి సంతసించుచున్న సమయంబున గరుడుండు వచ్చి యా మహాస్వామి చూపిన దివ్యస్థలంబునందుఁ గ్రీడాచలంబు నుంచి దండప్రణామంబు చేసిన , సంతసించి వరాహస్వామి యప్పర్వతం బెక్కి యా క్రీడాచలంబునందున్న స్వామి పుష్కరిణికిఁ బశ్చిమతటంబున నిలిచియున్న సమయంబున, బ్రహ్మరుద్రేంద్ర సుర దిక్పాలక ముని యోగి గరుడ గంధర్వాది మహాత్ములు వచ్చి శ్వేతవరాహస్వామిని వీక్షించి, సకల నిగమార్థగుంఫితోక్తుల బహుప్రకారంబుల వినుతించి, యానంద బాష్పధారాకలితనేత్రులై , పులకాంకురిత గాత్రులై సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి , జయ జయ శబ్దంబులుం జేసి ముకుళిత కరకమలులై మఱియు నిట్లనిరి. 73

## బ్రహ్మేంద్రాది కృత స్తోత్రము

**దండకము :**

శ్రీమన్మహాశ్వేత సత్క్రోడ రూపా ! యనిర్లేప ! బోధప్రదీపా ! ప్రతాపోజ్జ్వలా! శ్రీప ! భూపా ! హిరణ్యాక్ష కారిన్య దేహాద్రి దంభోళిధారా ! సురాధార ! ధాత్రీతలోద్ధార! ధర్మాద్రి ధీరా ! జగత్సార ! చిత్సార భూతా ! భవాంభోధిపోతా! సుమోక్ష ప్రదాతా! గుణాతీత ! వేదార్థనిర్ణేత ! పూతాత్మ ! ధాతా ! మహాపంచభూత ప్రభూత ప్రపంచాకరా! శ్రీకరా ! సుప్రసన్నాత్మవై మమ్ము రక్షింప [illegible] ! [illegible] త్రభావంబు లెన్నన్ సహస్రాననుండైన [illegible] వేడి చూడ్కుం , మహాభీకరాకారయుం జూడ మాకె యసాధ్యంబుగాఁ బో

చె;లోకంబులో మానవ వ్రాతముల్ చూచి భీతిల్లరే! తండ్రి ! మమ్ముద్ధరింపన్
సదా సౌమ్యరూపంబు వేఁ దాల్చి శ్రీ భూమి నీళా సమేతుండవై
దేవతిర్యఙ్మనుష్యాఖ్య జీవాళులం బ్రోచుచున్ , సర్వనిత్యోత్సవంబుల్
మహాభక్త బృందంబు లర్పింపఁగా దివ్యలీలా ప్రభావంబులం జూపుచున్
మీరు క్రీడాచలంబందు వేంచేసియుండుం డహో! పూర్ణకామా ! గుణస్తోమ!
దేవోత్తమా! దేవతాసార్వభౌమా ! తరీగొండధామా! నృసింహా ! హృతాంహా!
వరాహావతారా! నమస్తే నమస్తే నమస్తే నమః 74

మ. అని వారెల్ల బ్రహ్మప్రకారముల వేదాంతోక్తులం బ్రస్తుతిం
చిన , మోదించి వరాహ దేవుఁడు దయాసింధుండు బ్రహ్మాదులన్
గని ' రుద్రాబ్జజ ముఖ్యులార ! వికృతాకారంబు నేఁ దాల్చి దై
త్యుని ఖండించితి , భూమి నెత్తితి , మహాతోయంబులన్ దాఁచితిన్. 75

క. మీ మీ సుస్థానములం
దామోదముతోడఁ జేరి యందఱు పూర్వం
బే మాడ్కి మెలఁగుచుండుదు
రా మేరలు దప్పకుండుఁ డచలాత్మకులై. 76

శా. భూమ్యాదుల్ మదనుజ్ఞఁ దప్పక సదా పూర్వస్థితిన్ నిల్చు , నే
సౌమ్యత్వంబున సాగరాత్మజను వక్షఃస్థానమం దుంచెదన్
రమ్యాకారము నొంది భూజనములన్ రక్షించి యెల్లప్పుడున్
కామ్యార్థంబుల నిచ్చి వారి భవదుఃఖంబుల్ నివారించెదన్. ' 77

ఆ. అనుచు వారి కిట్లు లానతిచ్చి , వరాహ
దేవుఁ డప్పుడు సౌమ్యదేహుఁడగుచు
వరకృపారసంబు వారిపైఁ జిలికించి
శాంతచిత్తుఁడై ప్రశస్తముగను. 78

సీ. క్రీడాచలముమీఁద గెంటకున్నట్టి శ్రీ
స్వామి పుష్కరిణికిఁ బశ్చిమముగ
భవ్యపుష్కరిణి వాయవ్య కోణ సమీప
మందుఁ జిత్ర విచిత్ర హర్మ్యములును
దివ్య నీలస్తంభ నవ్యహాటక కుంభ
మరకతోన్నత ముఖమంటపములు
భానుకోటి ప్రభా పరిహాసకరరత్న
గోపుర ప్రాకారకుడ్యములును
తే. గలిగి యప్రాకృతాదిత్య కాంతి కలిత
మహిత మాయా నిగూఢ విమానమందు
మెఱయు శ్రీభూమి నీళా సమేతుఁడగుచు
శ్వేతకిటి నిల్చి యొప్పె నీ భూతలమున. 79

వ. ఇట్లొప్పుచున్న వరాహస్వామిని జూచి బ్రహ్మ రుద్రాదు లానంద మగ్నులై యనిమిషదృష్టుల నీక్షించుచున్న సమయంబున వరాహదేవుండు విమానంబుతోడ నంతర్ధానంబునొందె ; నప్పుడు బ్రహ్మాదులు జయజయ శబ్దంబులు చేసి వరాహస్వామి తిరోహితుండైన దిక్కునకు మ్రొక్కి , తత్ప్రభావంబులం బొగడుచుఁదమతమ నివాసంబులకుం జని ; రంత శ్రీ భూనీళాదేవులును పరివారంబులును హరికి దండప్రణామంబు లాచరించినం , జూచి సంతసించి హరి సిరితో నిట్లనియె. 80

క. 'సిరి ! నీవు నన్నుఁ గనుఁగొని
వెఱచెదవని రమ్మనుటకు వెఱచితి ; నీవై
కరుణను నీళను దోడ్కొని
పరివారముతోడ వచ్చు పని మేలయ్యెన్.' 81

వ. అనిన విని సిరి యిట్లనియె. 82

సీ. క్రీడాచలముమీఁద గెంటకున్నట్టి శ్రీ
స్వామి పుష్కరిణికిఁ బశ్చిమముగ
భవ్యపుష్కరిణి వాయవ్య కోణ సమీప
మందుఁ జిత్ర విచిత్ర హర్మ్యములును
దివ్య నీలస్తంభ నవ్యహాటక కుంభ
మరకతోన్నత ముఖమంటపములు
భానుకోటి ప్రభా పరిహాసకరరత్న
గోపుర ప్రాకారకుడ్యములును
తే. గలిగి యప్రాకృతాదిత్య కాంతి కలిత
మహిత మాయా నిగూఢ విమానమందు
మెఱయు శ్రీభూమి నీళా సమేతుఁడగుచు
శ్వేతకిటి నిల్చి యొప్పె నీ భూతలమున. 79

వ. ఇట్లొప్పుచున్న వరాహస్వామిని జూచి బ్రహ్మ రుద్రాదు లానంద మగ్నులై యనిమిషదృష్టుల నీక్షించుచున్న సమయంబున వరాహదేవుండు విమానంబుతోడ నంతర్ధానంబునొందె ; నప్పుడు బ్రహ్మాదులు జయజయ శబ్దంబులు చేసి వరాహస్వామి తిరోహితుండైన దిక్కునకు మ్రొక్కి , తత్ప్రభావంబులం బొగడుచుఁదమతమ నివాసంబులకుం జని ; రంత శ్రీ భూనీళాదేవులును పరివారంబులును హరికి దండప్రణామంబు లాచరించినం , జూచి సంతసించి హరి సిరితో నిట్లనియె. 80

క. 'సిరి ! నీవు నన్నుఁ గనుఁగొని
వెఱచెదవని రమ్మనుటకు వెఱచితి ; నీవై
కరుణను నీళను దోడ్కొని
పరివారముతోడ వచ్చు పని మేలయ్యెన్.' 81

వ. అనిన విని సిరి యిట్లనియె. 82

చ. అపుడు వరాహవిగ్రహుఁ డనంత కళాపరిపూర్ణుఁడై మహా
నిపుణత మీఱఁగా సిరిని,నీళను,ధారుణి నాదరించుచున్
విపుల పరాక్రమక్రమ వివేక విచక్షణులైన పార్షదుల్
కపటములేక కొల్వఁగ నఖండ సుఖస్థితి నొందె నిర్ధరన్. 87

తే. అనినఁ దాపసు లిట్లని ' రయ్య ! సూత !
స్వామి పుష్కరిణీ ప్రభావంబు మాకుఁ
దెలుపవే ! ' యన్న సూతుఁడా దివ్యమునులఁ
గాంచి యిట్లని పల్కె నుత్కంఠ మెఱయ. 88

సీ. 'మునులార ! వైకుంఠమున నుండు క్రీడా న
గంబుపై స్వామిపుష్కరిణి యుండి
పరఁగ నప్రాకృత పరిమళోదకమై , మ
హాపూర్ణమై యుండు , నచట సిరిని
భూనీళలను గూడి పురుషోత్తముఁడు జల
క్రీడలాడుచునుండు వేడుకలరఁ,
గ్రీడాచలముతోడ నీడకు దిగి వచ్చి
విరజాసమానమై ధరణి వెలసి
తే. హరికి సమ్మతమగుచు గంగాది నదుల
కన్నిటికి మాతృదేవతై , యఖిల జనుల
పాపములను హరింపుచుఁ దాప మడఁచి
యిష్టకామ్యార్థములను దా నిచ్చుచుండు. 89

వ. ఇట్టి స్వామి పుష్కరిణీ తీర్థ దర్శన పానంబులచేతనే స్త్రీశూద్ర జనంబులనైనఁ గడతేర్చుఁ గావున , విశేషించి స్నాన సంధ్యాది నిత్యనైమిత్తిక సకలకర్మాచరణులైన బ్రాహ్మణోత్తముల పుణ్యం బింతింతని చెప్పుట కశక్యంబగుచుండు; నదియునుంగాక పుష్కరిణీస్నానంబును , నేకాదశీ వ్రతంబును , సద్గురుపాదసేవనంబును గలుగుట యత్యంత

దుర్లభంబగుచుండు. సకల స్థావర జంగమంబులందు మానుషజన్మంబును బుష్కరిణీస్నానంబును,వేంకటాద్రియందు జీవించుచుండుటయు మిక్కిలి యతిశయంబు లగుచుండుఁ గావున వేంకటాద్రిమాహాత్మ్యంబును , బుష్కరిణీ ప్రభావంబును జెప్ప శక్యంబుగాదు. కనుక సంక్షేపంబుగాఁ జెప్పితి, నింక నొక్క యితిహాసంబు సెప్పెద విను ' ండని సూతుం డిట్లనియె. 90

సీ. మును తారకాసురుండను వాని సేనాని
యదిమి చంపిన బ్రహ్మహత్యచేతఁ
బీడితుఁడై నిజపితృవాక్యమంగీక
రించి గ్రక్కున నిర్గమించి మొనసి
యా వేంకటాద్రికై యభిముఖుఁడై వచ్చు
నప్పు డతని బ్రహ్మహత్య జడిసి
యా కుమారు విడిచి యార్చి చెచ్చెర డిగ్గి
పోయె , నంతట శివపుత్త్రుఁ డలరి

తే. వేంకటాద్రికి వచ్చి వేవేగ స్వామి
పుష్కరిణిలోనఁ గ్రుంకి తెప్పున వరాహ
దేవు నీక్షించి చాలఁ బ్రార్థించి మ్రొక్కి
యపుడు కృతకృత్యుఁడయ్యె షడాననుండు. 91

ఉ. కావున వేంకటాచల మఘంబులకెల్ల భయంకరంబునై
పావనమై, సువర్ణమణిభాస్వరమై , ధరణీసురాళికిన్
జీవనమై , తపోజనవశీకరమై , యజ రుద్ర శక్ర సం
సేవితమై , సమస్తులకు శ్రీకరమై పొగడొందు నీధరన్. 92

క. హరి కల్యాణ గుణమ్ముల
ధరణీధరమందు నుండుఁ దప్పక యెపుడున్
మఱి యింకెన్ని వచించినఁ
బరమార్థం బొకటె చూడఁ బండితులారా ! 93

క. ఘనమై ప్రాకృత జనముల
కనులకుఁ బాషాణపంక్తిగాఁ గనిపించున్
అనువుగఁ బుణ్యాత్ములకును
గనక గిరీంద్రంబురీతిగాఁ గనిపించున్. 94

వ. అట్టి వేంకటాచలంబునందుండి వరాహస్వామి జనులకు దృశ్యాదృశ్యుండగుచు వర్తించు, నప్పర్వతంబు భవతారకంబగుచుండు ; నిందులకు సందియంబు లేదు , సత్యం ' బన్న సూతుం జూచి శౌనకుండిట్లనియె. 95

ఆ. 'ఆ వరాహదేవుఁడా పర్వతేంద్రమం
దుండి యేమిసేయుచుండె, నెవరి
కేమి యిచ్చె ? వినుట కిష్టంబు పుట్టె మా
కా విధంబు దెల్పుమయ్య ! సూత ! ' 96

క. అన విని సూతుం డిట్లనె
' ననఘుండు వరాహదేవుఁ డా గిరిమీఁదన్
ఘనతరముగ వసియించుచుఁ
దన కాంతామణులతోడఁ దద్దయు వేడ్కన్. 97

సీ. వనపుష్పలతలచేతను బ్రకాశించుచు
నిరవయి తగు పొదరిండ్లయందు
నీలకాంతులచేతఁ జాల నొప్పుచునుండు
సలలిత సానుదేశంబులందుఁ
బరిమళ పుష్పముల్ పైఁ బ్రాలుచుండఁగాఁ
జల్లనై తగు పర్ణశాలలందుఁ
గనక మందిరములకైవడి దీపించు
రమణీయ గిరి గహ్వరములయందు

తే. మెప్పుగా బ్రవాలు పుప్పొడి కుప్పలందు
వన్నెకెక్కిన సెలయేటి తిన్నెలందుఁ
గాంతలనుగూడి చక్రి యేకాంతమందుఁ
గ్రీడ సల్పుచునుండు నాడాడఁ జెలఁగి. 98

చ. పరఁగ నధర్మవాదులగు పాపిజనంబుల నిగ్రహించుచున్
వరుసగ ధర్మచిత్తులను వర్ధిలఁ జేయుచునుండు నెప్పు , డా
హరి కివి నైజసద్గుణములైనవి గావున నప్పుడప్పుడున్
ధర నవతారముల్ తఱచు దాల్చుచునుండును ధర్మకర్తయై. 99

సీ. మాటిమాటికిని బ్రహ్మకు రాత్రి యైనప్పు
డతఁడు నిద్రింపఁగా , నఖిలగురుఁడు
తా నందు మేల్కని తన కుక్షిలో విశ్వ
మును దాఁచికొనియుండి , వనజభవుఁడు
నిద్రమేల్కొనఁగానె నిఖిలకారణ కార్య
యుక్త సృష్టిని వాని కొప్పగించు
రమణతో మీన వరాహాది రూపంబు
లటువంటి కాలంబులందుఁ దాల్చి

తే. దుష్టనిగ్రహమొనరించు , శిష్టజనుల
రక్షణముసేయు ; నొక్క వరాహకల్ప
మందుఁ జక్రికి మ్రొక్కి పద్మాసనుండు
వినయముప్పొంగ నిట్లని విన్నవించె. 100

ఉ. శ్వేతవరాహరూప ! నను( జేకొని విన్నప మాలకించి యీ
భూతలమందు శేషగిరి పూజితమై తగు నందు మీరు వి
ఖ్యాతిగ నిల్చియున్న , మిముఁ గాంచి తరింతురు మర్త్యులందఱో
తాత ! యటంచుఁ బల్కఁగ , విధాతను జూచి ప్రసన్నచిత్తుఁడై. 101

ఆ. చక్రి యిట్టు లనియె ' జలజసంభవ ! నీవు
కోరినట్ల నేనుఁ గ్రోడరూప
ధరుఁడనగుచు శేషధరణీధరమునందు
నిలిచియుందు ' ననియె నెనరుతోడ. 102

తే. అనిన విని మ్రొక్కి చనియెఁ బద్మాసనుండు
శ్వేతకిటి యానిమిత్తంబుచేత శేష
శిఖరియందు నివాసంబుఁజేసి జనుల
రక్షణము సేయుచుండుఁ బరాకులేక. 103

ఆ. ఆ వికుంఠమందు, నాదిత్యమండల
మందు , స్వర్గమందు హరి వసించు ;
నంతకంటె ముఖ్యమని వేంకటాద్రి పైఁ
జక్రధరుఁడు నిల్చె సమ్మతముగ.' 104

సీ. అనినఁ దాపసు లిట్టులనిరి ' శేషాద్రి , క్రీ
డాద్రి , వేంకటగిరి యనఁగ మూఁడు
నామధేయంబు లే మేమి కారణముల
చేఁ గల్గె , నవి నీవు చెప్పు ' మనిన
విని సూతుఁడిట్లనె ' మునులార ! మూఁ డభి
ధానంబులే కావు , పూని చూడ
ధరణి నొక్కొక నిమిత్తమున నొక్కొక పేరు
చెల్లుచుండును శేషశిఖరి కెపుడు

తే. గాన నాయాయి వృత్తాంత గౌరవములఁ
జూచి భావించి నామదిఁ దోఁచినంత
విశదముగఁ జెప్పెదను [illegible] ' యటంచు
సూతుఁ డిట్లని పల్కె సంప్రీతి మెఱయ. 105

## వేంకటాద్రికిఁ గల వివిధ నామములు

క. చింతించిన యర్థము లిపు
డెంతని లేదనక జనుల కిచ్చుచునుండున్
సంతోషముగా నిందునఁ
జింతామణి యనెడు పేరు శ్రీగిరి కొప్పెన్. 106

క. జ్ఞానం బించుకఁ గల్గిన
మానవు లందుండిరేని మఱిమఱి జ్ఞానం
బానాఁట వృద్ధిఁ బొందును
దానన్ జ్ఞానాద్రియనఁగ ధరపై నొప్పెన్. 107

క. అర్థముఖములగు కోర్కుల
సార్థకములు సేసి జనుల సంరక్షింపన్
దీర్థము లందుండుట నది
తీర్థాచలమనెడు పేర దీపితమయ్యెన్. 108

క. నిష్కామ తపోధనులకుఁ
బుష్కలముగ స్నాన పాన పూజ లొనర్పన్
బుష్కరిణులు గల వందునఁ
బుష్కరశైలం బనంగ భూమిని వెలసెన్. 109

క. మును వృషభాసురుఁ డనియెడి
యనిమిష కంటకుఁడు దానియందుండి తపం
బొనరించిన కారణమున
ననఘా ! వృషభాద్రిపేర నవనిన్ వెలసెన్. 110

క. అనిమిషులు ముదంబునఁ గనుఁ
గొనఁదగి తద్గిరిని శాతకుంభము లుండున్
గనుక మహాశోభితమై
కనకాచల మనెడు పేర ఘనతర మయ్యెన్. 111

క. నారాయణుఁడను విప్రుం
డారూఢిగఁ దపముసేసి హరి మెప్పించెన్
ధారుణిఁ దత్కారణమున
నారయ నారాయణాద్రి యన ఘనమయ్యెన్. 112

క. ఆ వైకుంఠపురంబునఁ
బావనమైయుండు దానిఁ బక్షీంద్రుఁడు తేఁ
గా వచ్చిన కారణమున
శ్రీ వైకుంఠాద్రియనఁ బ్రసిద్ధంబయ్యెన్. 113

క. నరసింహుం డా దితిసుతుఁ
నరుదుగ ఖండించి యచట నా ప్రహ్లాదుం
గరుణను బ్రోచిన కతమున
నరసింహగిరీంద్ర మనెడి నామము గల్గెన్. 114

తే. అంజనాదేవి తపమ్ము ముం దచటఁ జేసి
పొసఁగ హనుమంతుఁడను వరపుత్త్రుఁ గాంచె
నపుడు దేవతలెల్ల సహాయు లగుచు
నా గిరికి నంజనాద్రిపే రమర నిడిరి. 115

క. మునుపు వరాహ సమూహము
లనిశము వర్తించుచోట నా హరి కిటియై
యనువుగ నిల్చిన కతమున
ననఘ ! వరాహాద్రిపేర నా నగ మొప్పెన్. 116

క. ముని నీలుండను పేరిటి
వనచరుఁ డా శైలమున నివాసముచేసెన్
గనుకన్ నీలగిరీంద్రం
బనఁగా విఖ్యాతిఁ బొందె నది ధరమీఁదన్. 117

క. శ్రీకి నివాసంబై, భూ
లోకములో మానవులు విలోకింప మహా
శ్రీకరుఁడై హరి యుండఁగఁ
బ్రాకటముగ శ్రీనివాస పర్వతమయ్యెన్. 118

క. శ్రీని నురంబున నిడికొని
శ్రీనారాయణుఁడు ప్రజకు సిరులిచ్చుచు నం
దానందించుచు నుండఁగ
నానందాచల మనంగ నగ్గిరి యొప్పెన్. 119

క. శ్రీసతి యా వరగిరిపై
వాసంబై యుండి విపులవైభవ మెసఁగన్
భాసిల్లుచునుండఁగ నది
శ్రీ సద్గిరి యనఁగ నొప్పు క్షితిపై నెపుడున్. 120

క. పోడిమిగా సిరిమొదలగు
చేడియలను గూడి యచట శ్రీహరి వేడ్కన్
గ్రీడించుచు నుండుట నది
క్రీడాచలమనఁగ ధరను గీర్తిం బొందెన్. 121

క. గురుతర వైకుంఠంబున
నిరవుగ నున్నట్టి దాని నీ భూస్థలికిన్
గరుటామంతుఁడు దెచ్చుట
నరుదుగ నది గారుడాద్రి యన విలసిల్లెన్. 122

క. శేషాకృతితో నమరి వి
శేషత్వము నొంది సర్వశేషినిఁ దనపై
భూషణముగ నిడికొనుటను,
శేషాచలమనఁగ భూప్రసిద్ధంబయ్యెన్. 123

ఆ. అధిక ధర్మములకు నాటపట్టయి , ధర్మ
సిద్ధిఁ బ్రజకుఁ గలుగఁజేయుచుండు
నందుచే వృషాద్రి యను నామధేయంబు
దాని కొప్పుచుండు ధరణిమీఁద. 124

ఆ. అమరఁగా వకార మమృత బీజము , కట
ములును సంపదర్థముల వెలుంగు;
నట్టి మూఁడు గూడి యమృత సంపద లిచ్చు
నందుచేత వేంకటాద్రి యయ్యె. 125

వ. ఇవ్విధంబునఁ బర్వతంబునకుఁ గల్పభేదంబులచేత ననేక నామంబులు గలుగుచుండు. అప్పర్వతమాహాత్మ్యం బింతయని వచియింప సురగురు, చతుర్ముఖ , షడాస్య , సహస్రముఖులకైన శక్యంబు గాకుండు. శ్రీ మన్నారాయణుండట్టి పర్వతాగ్రంబున వసియించియుండి , యందొక కాలంబునఁ దద్గిరికి నుత్తరభాగంబునందు రమాసమేతుండై వనగిరి శృంగంబులందు వినోదంబుగా విహరించుచున్న సమయంబున. 126

సీ. భార్యలతోడఁ దాపసు లొక కొందఱు
శ్రీ వేంకటాద్రినిఁ జేరవచ్చి
కందమూల ఫలాదికములును , బహుపుష్ప
ములు , తీర్థములు చూచి మురిసి యచట
నిల్వ సంకల్పించి , నిలయముల్ గల్పించి
యర్మిలి నుండి మహాధ్వరంబుఁ
జేయుచుండఁగఁ జూచి సిరిని విలోకించి
హరి యిట్టులనియె ' నో యబ్ధికన్య !
తే. జనులు గనరాని యీ మహాస్థలమునందుఁ
జేరి మును లధ్వరంబుఁ జేసెడు విధంబు
చూడు మిచ్చోట ' నని దయం జూపి మరల
నిట్టులనియెను సంతోష మినుమడింప. 127

## హరి విటవేషధారి యగుట

సీ. 'సతి ! చూడు మవి యజ్ఞశాల సదశ్శాల,
లవిగాక యిటుచూడు మగ్నిశాల ,
సకియ ! హవిర్భాగశాల పత్నీశాల
యజమానశాల లల్లవిగొ చూడు !
మది మహానసగృహం , బవి యజ్ఞపాత్రముల్
పశు సుయూపస్తంభ పంక్తు లివియె
వారు ఋత్విక్కులు , వీరు నధ్వర్యులు
సోమయాజితఁ , డది సోమిదమ్మ
తే. చక్కగాఁ జూడు ! మీ మహాశ్రౌతకర్మ
చయములెల్లను నాయందె జననమందెఁ
గాన, సవనస్వరూపుఁడనైన నాకుఁ
బ్రీతిగా యజ్ఞములు బుధుల్ సేతురిట్లు. 128

ఆ. వీరి కర్మనిష్ఠ వేడుకగాఁ జూడ
వలయు నిపుడు , యజ్ఞవాటమునకుఁ
బోయి వారుసేయు పుణ్యవపాయాగ
సరణిఁ జూచుటొప్పుఁ జంద్రవదన! !29.

ఉ. కావున వేశ్యచందమును గైకొను మీవు , హొయల్ చెలంగఁగా
నే విటకానికైవడిని నిక్కుచు సొక్కుచు వచ్చి , యచ్చటం
బావకకుండమందు వప భక్తిని బ్రాహ్మణు లుంచినప్పు డే
నా వప నారగించెద బుధావళి మెచ్చఁగ , నీవు చూడఁగన్.' 130

సీ. అన విని సిరి మందహాసాస్యయై, కామ
రూపిణియై కుల్కుఁజూపు లెసఁగఁ
బరఁగఁ జందురుకావి పావడపైఁ జల్వ
జిలుఁగు బంగరు పూల చీర మెఱయ

ముత్యముల్ ముకురముల్ ముద్దుముద్దుగఁ గూర్ప
రంగు మించిన పట్టు అవిక వెలుఁగఁ
గుచభారమున వడంకుచు నుండు మధ్యమం
దురుమేఖలాబంధ మొప్పుఁ జూపఁ
తే. గనులఁ గాటుక , గంధలేపనము మేన
నుదుటఁ గస్తూరి తిలకం , బనూన నీల
కుటిల కుంతలములు ముద్దుఁగుల్కఁ , బైఁడి
బొమ్మకైవడి నొప్పె సంపూర్ణ కళల. 131

సీ. బటువు ముత్యముల పాపట బొట్టు , రాగిడి
జడబిళ్లలును , గుచ్చు లడరి వెలుఁగ
బంగారు కడియముల్ , పచ్చల చేకట్లు
రతనంపు వంకీల్ కరముల నమర
మగఱాల కమ్మలు , పగడాల పేరులు
చెవులను , నఱుతను జెన్ను మిగుల
వ్రేళుల నూర్మికల్ వేర్వేఱు తెఱఁగుల
విడువని కాంతిచే వెలుఁగుచుండ
తే. హంస చెక్కిన నత్తు· ముత్యములు గదలఁ
జిఱుత గజ్జెల మొలనూలు చిందుద్రొక్కఁ
గాళ్ళఁ జిఱుగజ్జె , లందియల్ కదిసి మొరయ
శ్రీవనిత విశ్వమోహినీదేవి యయ్యె. 132

క. క్రొక్కాఱు మెఱు పులన్నియు
నొక్కెడ గుమిగూడి నిల్చియున్న విధముగాఁ
గ్రిక్కిఱిసి యద్భుతంబుగ
మిక్కుటమై యుండె లక్ష్మి మేని సుకాంతుల్. 133

క. వర సరసిజమును జేకొని
సురుచిరముగఁ దళుకు బెళుకుఁ జూపులతో నా
హరిని విలోకింపఁగ , హరి
చిఱునగవున సిరినిఁ జూచి చెలువము మీఱన్. 134

సీ. ఆ కామినీమణి కనురూపముగఁ జక్రి
చక్కని మనుజవేషంబుఁ దాల్చె
నది యెట్ల యనిన నీలాంబుద వర్ణుండు
నాజానుబాహుఁ డాహ్లాదముఖుఁడు
నీలకుంతలయుక్త బాలేందుఫాలుండు
కంబు కంఠుండు మంగళ కరుండు
నీరజాక్షుండు గంభీరవక్షుఁడు సింహ
మధ్యుండు మన్మథ మన్మథుండు
తే. లలిత సౌందర్య విలసితోల్లాస కలిత
మందహసితాధరుఁడు సుకుమారుఁడగుచుఁ
గలికి చూపులలోన శృంగార రసము
పొసఁగి కుల్కఁగ హరి జారపురుషుఁడయ్యె. 135

సీ. కనక పుష్పముల నొప్పిన కుసుంబాపాగ
రాణింపఁ , గల్కితురాయి మెఱయ
దాసు కట్టిన పూల దండలు భుజముపై
నొరయుచు మెఱయుచు నూఁగి యాడఁ
జల్వచేసిన పైఁడి సరిగంచు దోవతి
[illegible] ప్పుచు మేని సొగసుఁ జూపఁ

దాణిముత్యంబుల హారి మొరయు

తే. ముత్యములఁ గెంపులను నీలములను గూడి
కాంతులను మించు పోఁగులు కర్ణములను
మెఱయుచును దూలియాడఁ, గాశ్మీరశాలు
వమర వలెవాటు వైచి యొయ్యార మెసఁగ. 136

సీ. విలసిత భ్రూలతా విక్షేపణంబు లా
యనిమిషపతి ధనుస్సును జయింప
నుదుటి గంధపుఁ జుక్క కదిసి నీలాభ్రమం
దొఱయు పూర్ణశశాంకు నొగి హసింప
దంతాళి కాంతి వింతగ వజ్రముల పంక్తి
దీధితులను మించి ధిక్కరింపఁ
గర్పూర తాంబూల కలితాధరము బింబ
ఫలరక్తిమను జూచి పరిహసింప

తే. మఱియు నాసాగ్రమున నొప్పు మౌక్తికమున
కిరుగడల నీలకాంతుల నెనసి సొగసు
గానుపింపఁగఁ దగు మీసకట్టు మెఱయఁ
జెక్కుటద్దములను గాంతి పిక్కటిల్ల. 137

సీ. మేఘంబుపై వెల్గు మెఱుపుఁదీఁగలవలెఁ
దగిన బంగరు జన్నిదములు మెఱయ
క్షురికాయుధంబు సిస్తుగ వామ హస్తంబు
తోఁబట్టి, ధవళ సత్తోయజమును
నుంగరంబుల కాంతు లుప్పొంగు కుడిచేత
నొకలీలగాఁ బట్టి యూపికొనుచు
శరణాగతత్రాణ బిరుదంబు లనఁదగు
నందియల్ పాదంబులందు మొరయ

తే. మురిసి విటవేషధరుఁడైన హరి హొయలుగఁ
జెలఁగి విటకత్తెవలె నుండు సిరినిఁ గూడి
పాదుకలు మెట్టికొనుచు నా ప్రబలయజ్ఞ
వాటమును జూచు వేడ్కతో వచ్చుచుండె. 138

సీ. ఆ హరి నీక్షించి యాగాధ్యులగు విప్రు
 ' లితఁ డెవ్వరో ! ' యను చిట్టు లనిరి :
' వనితామణినిఁ గూడి వచ్చుచుండెడివాఁడు
 మహిమ నొప్పు వసంత మాధవుండొ ,
నలుఁడో , జయంతుఁడో , నలకూబరుండొ , సు
 రేంద్రుఁడో , చంద్రుఁడో , యీశ్వరుండొ ?
ఈ మహాటవి కిప్పు డేల వచ్చిరొ ? వీరి
 కాంతులు గగన దిగ్భాగములను

తే. జాలఁ గప్పెను ; విప్రుఁ డో ? క్షత్రియుండొ ?
విప్రుఁడగుటకు యజ్ఞోపవీత చిహ్న
మమరియున్నది , క్షత్రియుం డగుట కెడమ
చేత నాయుధ మున్నది ; సిస్తుఁ జూడ
విటునికైవడి నున్నాఁడు వేశ్యతోడ. ' 139

ఆ. అనుచు వారలంద అద్భుతంబుగఁ జూడ
వచ్చి శౌరి యజ్ఞవాటమందుఁ
జేరి ద్విజుల నడుమ సిరితోడఁ గూర్చుండి
విడెము సేయుచుండె వేడు కలర. 140

క. అప్పుడు వారి తనువులం
దొప్పిన కస్తూరిగంధ మూర్వీసురులం
గప్పుచు వాసింపఁగ , వా
రప్పద్మదళాక్షుఁ జూచి యని రీ రీతిన్. 141

సీ. 'ఓ మహారాజ ! నీ యూరేమి ? పేరేమి ?
ఎవరు నీ తలిదండ్రు ? లిచటి కేల
వచ్చితి ? విప్రు డీ వనమందు సవనముల్
చేయుచుండెదము , నీ చిత్తమందు
మా మీఁద దయయుంచి మా మఖంబులకు స
హాయుఁడవై యుండి యసురవేధ ,
చోరవేధయు , మృగస్తోమంబుచే వేధ
దప్పించు , మా వంటి తాపసులను
తే. వసుమతీశ్వరులే కావవలయు ననెడి
ధర్మపద్ధతి దప్ప కధ్వరము లిచట
నీవు సేయించు మా చేత నిర్మలాత్మ ! '
యనినఁ జిఱునవ్వు నవ్వి యిట్లనియెఁ జక్రి. 142

సీ. 'రాజను గాను , ధరామరుండను గాను
గడకు వైశ్యుఁడను శూద్రుఁడను గాను
దలిదండ్రులును లేరు , ధరను నాకొక్క ని
వాసంబు లేదు , సర్వస్థలముల
సర్వరూపకుఁడనై చరియించుచుండుదు ,
నగుణుండ , నామ వర్ణాశ్రమములు
లే 'వని పల్కఁగా , నా విప్రు లిట్లని
' రయ్య ! మీ వాక్కుల కర్థ మిపుడు
తే. మాకుఁ దోఁపదు , మీ చెంత మచ్చి కలర
నిపుడు గూర్చున్న లలితాంగి యెవ్వ ?' రనిన
మందహసితాస్యుఁ డగుచున్న మాధవుండు
పలికె నిట్లని వారితోఁ బ్రౌఢి మెఱయ. 143

ఆ. 'నాకు నేనె గాని , నా కెవ్వరును లేరు
ఒంటిగాఁడ నగుచు నుండఁ జూచి
వనమునందుఁ బుట్టి వచ్చి మోహిని వలె
నన్నుఁ బట్టె నీ యనాది దయిత. 144

క. మచ్చిక నపు డిరువురమును
ముచ్చటగాఁ గలిసి యుండి, మునులగు మీ రిం
దచ్చుగ నుండుట గనుఁగొని
వచ్చితి మిటు మిమ్ముఁ జూడ వరగుణులారా ! 145

సీ. ఇచ్చోట మీరంద ఱే మేమొ చేసి సం
గీతముల్ పాడెడి రీతులేమి ?
యౌదుంబరపు శాఖ లమరఁగాఁ జేపట్టి
వేర్వేఱ సురలను బిల్చుటేమి ?
ఈ యగ్నికుండమే ? మీ దారుపాత్ర లే ?
మీ పశుహింస యే ? మిన్ని మీరు
మాకుఁ జెప్పు ' మటన్న , నా కర్మనిష్ఠు లి
ట్లనిరి ' వపాయాగ మాచరింప
తే. సమయ మిది గాన వేదోక్త శాస్త్ర విహిత
మగు వపాయాగ మొనరించి , యవల మీరు
మమ్ము నడిగిన వెల్ల సమ్మతముగాఁగఁ
జెప్పెదము విందుఁగాక మా యప్ప ! ' యనుచు. 146

తే. అపుడు సమ్మతిఁజేసి యాగాధ్యు లందు
హరినిఁగూర్చి వపాయాగ మాచరించు
సమయమున శంఖచక్ర చిహ్నముల నచట
నందఱకుఁ జూపి వప నంది హరి గ్రహించె. 147

చ. హరి పరమాత్ముఁ డచ్యుతుఁ డనంతుఁడు నిర్జరులెల్లఁ జూడఁగాఁ
గరముల నంది యా వపను గ్రక్కున మెక్కఁగ, సంయమీశ్వరుల్
వరుసగ నందుఁ జిత్తరువు వ్రాసిన బొమ్మల రీతి భక్తిచేఁ
బరవశులై రమేశుఁడగు పద్మదళాక్షునిఁ జూచుచుండఁగా. 148

వ. అప్పుడా నారాయణుండు శ్రీవత్సలాంఛనాంచిత విశాలవక్షుండును, సకల దివ్యరత్నాభరణ భూషితుండును, సహస్రకోటి మార్తాండప్రభా భాసమాన గాత్రుండును, పరిమళమిళితాధరుండును నగుచుఁ, గరుణాకటాక్షవీక్షణుండై మునులం జూచి 'యధికతృప్తిం జెందితి' నని పల్కి, రమాసహితుండై తిరోధానంబు నొందె; నంత నవ్విప్రులు సంతసించి 'హరి ప్రత్యక్షంబుగా వపాగ్రహణంబుఁ జేసినందునఁ గృతార్థుల మైతిమి, జన్మంబులు సార్థకంబులయ్యె' నని సంతసించి యజ్ఞంబు సమగ్రంబుఁ గావించి, యవభృథ స్నానంబులు చేసి కృతార్థులయి' రని పల్కి, శౌనకాదులంజూచి సూతుండు మఱియు నిట్లనియె. 149

మ. 'మును జాబాలిమునీంద్రుఁ డీ కథ మహాముఖ్యంబుగా నాకుఁ జె
ప్పెను, నే నాయది మీకుఁ జెప్పితిని; సంప్రీతిన్ రమేశుండు చే
సిన దింకొక్క విశేష సత్కథ ధరన్ జిత్రేతిహాసంబుగన్
వినుఁ డా చంద' మటంచు సూతుఁ డనియెన్ వేవేగ మోదంబునన్. 150

వ. యజ్ఞంబున వపాగ్రహణంబు చేసి బ్రాహ్మణోత్తముల రక్షించిన యనంతరంబున, శ్రీమన్నారాయణుండు సుందర సుకుమార శరీరుండై గిరికి నుత్తర భాగమందే విహరించుచున్న సమయంబునం దొక్కనాఁడు. 151

## కుమారధార మహిమ

సీ. దేశాంతరాగత ద్విజుఁడు వృద్ధ శిరస్కుఁ
డతి బలహీనుండు నాత్మసుతునిఁ
గౌండిన్యుఁ డనువానిఁ గానక యందందుఁ
దా వెదకుచు వచ్చి దారిఁ దప్పి,

ఘనవేంకటాద్రి మార్గంబులోఁ జేరి మ
హారణ్యమునఁ జొచ్చి యార్తిఁ బొంది ,
యాఁకలి దప్పి మెండై , నేలఁ బడువేళఁ
దనసుతుఁ బేర్కొని తల్లడించి
తే. 'యేర ! కౌండిన్య ! యెందుఁ బోయితి ? ' వటంచు
బహు విధంబులుగా దుఃఖపడుచుఁ బల్క ,
దీనరక్షకుఁడగు నాదిదేవుఁ డతని
కెదురుగా నిల్చి కరుణతో నిట్టులనియె. 152

తే. 'వృద్ధ విప్రుఁడ ! యీ మహావిపిన భూమి
కేల వచ్చితి ? వవనిలో నింకఁ గొన్ని
దినము లుండెదవో , లేక దేహ మిపుడె
విడిచిపోయెదవో తెల్పు విశదముగను. 153

క. అన విని విప్రుం డిట్లనె
' ననఘ ! శరీరంబుమీఁద నాసక్తియు లే ;
దనిమిషుల ఋణముఁ దీర్పక
చను ? టెట్లను సందియంబు జనియించె ' ననెన్. 154

క. ఆ వార్తలు విని మాధవుఁ
డా విప్రుని కరముఁ బట్టి యచ్చటఁ గల యా
పావన తీర్థముఁ జేర్చిన
నా వసుధామరుఁడు స్నాన మచ్చటఁ జేసెన్. 155

వ. ఇట్లు స్నానంబుఁ జేసిన శతవృద్ధ బ్రాహ్మణుండు పదియాఱేండ్ల బాలకుమారుండై , షోడశకళా పరిపూర్ణుండై నిలిచియున్న సమయంబున, హరి సహస్రాక్షుండును సహస్రపాదుండును సహస్ర శీర్షుండును సహస్ర బాహుండునునై యక్కుమారునకుఁ బ్రత్యక్షంబైనం , జూచి గగనంబుననుండి దేవేంద్రాదులు దేవ దుందుభులు మొరయించి హరి శీర్షంబునఁ గుసుమ

వర్షంబులు గురియించి, పొగడి ; రప్పుడు విశ్వరూపుండైన హరి యవ్విప్రుం జూచి 'నీకు ధనసమృద్ధి యగు, 'నింక దేవఋణంబు దీరుటకు నాశ్రమంబునకుం జని యాగంబు సేయు' మని యానతిచ్చి యంతర్ధానంబు నొందె, నవ్విప్రుండు నిజాశ్రమంబున కరిగె ; 'నివ్విధంబున వృద్ధబ్రాహ్మణుం డీ తీర్థంబునందు స్నానంబుఁ జేసి బాల కుమారుండయ్యెం గావున, నీ ధారాతీర్థంబు కుమారధార యనఁగాఁ బ్రసిద్ధంబగుంగాక ! ఈ తీర్థంబునఁ ద్రిమాసంబులు జితేంద్రియుండై త్రికాల స్నానంబు లాచరించినవాఁడు వజ్రకాయుండై ముదిమి లేక సుఖించుఁగాక !' యని నిర్ణయించి దేవతలు చనిరి. ఈ కథ జాబాలి మునీశ్వరుండే నాకుఁజెప్పె' నని సూతుండు శౌనకాదులం జూచి మఱియు నిట్లనియె. 156

సీ. 'వాల్మీకి నాకుఁ బూర్వంబునం దొక యితి
    హాసంబుఁ జెప్పె, నెట్లనిన వినుఁడు !
చంద్రవంశజుఁడైన శంఖణుఁడను రాజు
    కాలవశంబున బేల యగుచుఁ
దన శత్రువుల కోడి, తానేలు రాజ్యంబు
    నెడఁబాసిపోయి రామేశ్వరంబుఁ
జేరి, యచ్చట రామసేతువందు మునింగి
    వచ్చి, యామీఁద సువర్ణముఖరి
తే. యందుఁ గ్రుంకి, తదుత్తరమందుఁ జాల
రమ్యతరమైన పద్మసరస్సు చెంతఁ
జేరి స్నానముఁ జేసి, తత్తీరమందు
నిలిచి తాఁ దనలో నిట్లు దలఁచె నపుడు. 157

చ. 'కటకట ! శాత్రవుల్ గినిసి కయ్యముచేసి మదీయ రాజ్యమం
దటువలె నాక్రమించి, రిపు డన్నము వస్త్రము గల్గుటెట్లు ? నే
నెటువలె నోర్తు కష్టమున, కీశ్వరుఁ డీ గతిఁ జేసె, నింక మీఁ
దటి గతి యే ?' మటంచుఁ బరితాపముచే విపులార్తిఁ బొందుచున్. 158

వ. ఇట్లనేక విధంబుల శోకాకులితమానసుండై , కించి దున్మీలితాక్షుండై , నిదురించినట్లు పరవశుండై యున్న సమయంబున నశరీరవాణి యిట్లనియె. 159

తే. 'నిర్మలాత్మక ! మదియందు నీవు ధైర్య
మొందు , చింతింప కిచటికి నుత్తరముగఁ
గ్రోశ దూరాన వేంకట కుధరవరము
వెలుఁగుచున్నది ; యటకు వేవేగఁ బొమ్ము. 160

వ. అప్పర్వతంబు మహాపన్నులకుఁ గామధేనువుచందంబున , శోకార్తులకుఁ గల్పవృక్షంబుకైవడిఁ జింతితార్థంబు లిచ్చుచుఁ జింతామణి యను పేరిటఁ బ్రకాశమానంబై యున్నది. నిర్హేతుక జాయమాన కటాక్ష వీక్షణుండై సకల జనార్తి నివారకుండైన శ్రియఃపతి యచ్చట వసియించియుండు ; నందు శ్రీస్వామిపుష్కరిణి సకలాఘనివారిణియయి , యిష్టకామ్యార్థ ఫలదాయినియయి , శుభోదక పూరితంబై యుండుఁ ; దత్పశ్చిమ తటంబున వల్మీకభూధరం బుండు , నందు నిల్చి త్రిసంధ్యంబునందుఁ బుష్కరిణియందుఁ గ్రుంకులిడి షణ్మాసంబులు విజితేంద్రియుండవై , నిష్ఠాగరిష్ఠుండవై శంఖ చక్ర గదాధరుండైన శ్రీ వేంకటేశ్వరుని భావించి షోడశోపచారపూజలు సమర్పించుచుండు ; మంత శ్రీస్వామి ప్రసన్నుండై నిన్ను రాజ్యాభిషిక్తుం జేయు ' నని పలికిన యశరీరివాక్కులు విని సంతసించి , ప్రసన్న మనస్కుండై లేచివచ్చి వేంకటాచలారోహణంబు చేసి చందనాగరు పున్నాగ బీజపూర ముఖ్య ఫల పుష్పలతా శోభితంబును, జమరీ కస్తూరీమృగ ప్రముఖ మృగావాసంబును , శుక కలకంఠ మయూర రాజహంస విహార కూజిత కలితంబును, నయనానందకరంబునైన వేంకటాద్రి దర్శనంబుచేసి , తన్మధ్యంబున దివ్యపరిమళోదక పూర్ణంబును , శోణకమల నీలోత్పల పరివృతంబును , మత్స్య కచ్ఛప ప్రముఖ జలచర సంకులంబైన స్వామిపుష్కరిణి దర్శనంబుచేసి , తత్తీర్థమందు సంకల్పపూర్వకంబుగాఁ ద్రికాల స్నానంబు లాచరించుచు శ్రీ వేంకటేశ్వరస్వామి యవయవ ధ్యానంబుసేయుచు షణ్మాసంబులు పూజించుచున్న యనంతరంబున. 161

## హరి శంఖణరాజునకుఁ బ్రసన్నుండగుట

సీ. హారకుండల కిరీటాది భూషణ ధర్మ
చేలకాంతులఁ బ్రకాశించువాఁడు
తులసికాదళ పరిమళ పుష్పహార వి
రాజిత సూక్ష్మోదరంబువాఁడు
తిలకాంక నిటల ప్రదేశమందు నటించు
కమనీయ కుటిలాలకములవాఁడు
శ్రీవత్స కౌస్తుభ చిహ్నముల్ గలవాఁడు
కరుణ నొప్పిన గొప్ప కనులవాఁడు
తే. శంఖ చక్ర గదాబ్జ హస్తములవాఁడు
ఉరమునం దబ్ధిసుత నుంచి పరఁగువాఁడు
ఇరుగడల భూమి నీళల నొఱయువాఁడు
దీనపాలన మొనరింపఁ దివురువాఁడు. 162

వ. అప్పు డనేకసహస్రకోటి సూర్యప్రకాశసదృశ దివ్యవిమానమధ్య ప్రదేశమందుండి స్వామిపుష్కరిణీ మధ్యంబున నిలిచి శంఖణ మహారాజునకుఁ బ్రత్యక్షంబైన సమయంబున బ్రహ్మరుద్రేంద్ర ప్రముఖులు వచ్చి భేరీమృదంగాది మంగళ వాద్యంబులు మొరయించి, పుష్పవృష్టిఁ గురియించి , నృత్తగీతంబులు గావించి , నిగమాంత సూక్తుల వినుతించుచుండి ; రప్పుడు శంఖణ మహారాజు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యిట్లనియె. 163

సీ. 'దేవదేవ ! మహాత్మ ! దీనరక్షక ! జగ
న్నాయక ! కరుణతో నన్నుఁ జూడు
మునుపు మా పూర్వుల కొనర మీ రిచ్చిన
పృథ్వి శాత్రవుల కొప్పించి వచ్చి
యతిదీన దశ నొందినట్టి నా కిప్పుడు

ప్రత్యక్షమైతివి పరమపురుష !
నా శాత్రవులఁ ద్రుంచి నా రాజ్య మిప్పించు '
మనిన శంఖణున కిట్లనియెఁ జక్రి

తే. 'చింత విడువుము రాజ ! నీ సీమఁ జేరి
పట్టభద్రుండవై యుండు భార్యతోడ '
ననుచు జలదగంభీరోక్తి నానతిచ్చి
హరి తిరోధానమొందె నత్యద్భుతముగ. 164

తే. అప్పు డా బ్రహ్మముఖ్యులు హరినిఁ బొగడి
'స్వామిపుష్కరిణీస్నాన సత్ఫలంబు
హెచ్చి యితనికి స్వామిత్వ మిచ్చె ' ననుచుఁ
జనిరి వారందఱును నిజస్థానములకు. 165

ఆ. శంఖణుండు నపుడు స్వామిపుష్కరిణికి
మ్రొక్కి , శైలమునకు మ్రొక్కి , హరికి
మ్రొక్కి , భార్యతోడ ముదముతో గిరి డిగ్గి
పోవుచుండ నతని భూమియందు. 166

క. విమలుండగు శంఖణు రిపు
లమితాశను రాజ్యమేల నన్యోన్య విరో
ధము లెసఁగఁ బోరి మడిసిరి
క్రమముగ నమ్మహికి రాజు గావలె ననుచున్. 167

వ. తద్దేశవాసులు శంఖణమహారాజును వెదకుచు గోదావరీ తీరంబుఁ జేరి , రంత నమ్మార్గంబున శంఖణుండు వచ్చి తత్తీరంబునందున్న నిజదేశవాసుల నీక్షించి శత్రునాశన ప్రకారంబు విచారించుకొని కాంభోజదేశంబునకుఁ బోయి శ్రీ వేంకటేశ్వరప్రసాదంబునఁ బూర్వప్రకారంబుగాఁ బట్టభద్రుండై నిజరాజ్య వరిపాలనంబు చేయుచుండె ; నదియునుంగాక నింకొక్క యితిహాసవృత్తాంతంబు గల , దది వినుం ' డని శౌనకాదులతో సూతుండు మఱియు నిట్లనియె. 168

సీ. మధ్యరాష్ట్రమున నాత్మారాముఁడనెడు సత్
బ్రాహ్మణుం డాఢ్యుండు పండితుండు
దేవ భూసుర పూజ లేవేళఁ జేయుచు
విహిత ధర్మజ్ఞుఁడై వెలయుచుండి
యటమీఁదఁ బిత్రార్జితార్థంబు కాల వ
శంబున నానాఁట సమసినంతఁ
దానర్థహీనుఁడై దారిద్ర్యమున నేమి
తోఁపక నాత్మలో దుఃఖపడుచు
తే. నిల్లు వెల్వడి శ్రీ వేంకటేశుఁ డున్న
పర్వతశ్రేష్ఠమున కధోభాగమందు
ధన్యమైయున్న కపిల తీర్థంబు చెంతఁ
జేరి స్నానముచేసి తత్తీరమందు. 169

క. కపిలేశ్వర సన్నిధియం
దపు డాహ్నిక నిష్ఠ నుండి, యట లేచి మహా
విపినములోపలఁ జొరఁబడి
చపలత నొక మార్గమందు శైలం బెక్కెన్. 170

వ. తన్మార్గంబునందున్న కపిల తీర్థప్రముఖ సప్తదశ తీర్థములయందు స్నానంబులు చేసి , నిర్మల చిత్తుండై పర్వతారోహణంబు చేయుచుండి తన్మార్గ సమీపంబున నుండు గుహామధ్యంబున ధ్యానయోగనిష్ఠుండై యున్న సనత్కుమారు సన్నిధానంబు చేరి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి నిలిచి ముకుళిత హస్తుండై వినుతించి యిట్లనియె. 171

క. 'తాపసవర్య ! మహాత్మక !
పాపాత్ముఁడనైన నన్నుఁ బటుకృపతోడం
జేపట్టి ప్రోవవలయును
నీ పాదమె దిక్కునాకు నిర్మలహృదయా ! 172

క. దారిద్ర్యముచేతను సం
సారంబును విడిచివచ్చి సరగున నిన్నే
చేరితి , నా కష్టదశన్
వారించి సుఖంబు నీయవలయు మహాత్మా ! ' 173

మ. అనినం దాపసవర్యుఁ డిట్లనియె ' నీ కాయాస మింకేల ? చే
సిన పాపంబు నశించుకాల మిదె వచ్చెం , బాప మేదంటివా ?
విను జన్మాంతరమందు మాధవుని సేవింపన్ వివేకంబు లే
కను లోభంబున దానకంటకుఁడవై గర్వంబుతో నిక్కుచున్. 174

ఆ. దానమిచ్చు వారి , దానంబుఁ గొనువారి
ననుసరించి యొకరియం దొకరికిఁ
గనరు పుట్టునట్టి కల్లమాటలు నీవు
చెప్పి , దానహాని చేసినావు. 175

క. ఆచార విహీనుఁడవై
యే చోటులనైనఁ గుడిచి , హెచ్చగు జనులన్
జూచి హసించుచునుంటివి
దాఁచితి వర్థంబు నీవు దానము లీకన్. 176

క. ఆ పాపచయం బిపు డా
కాపిల తీర్థమునఁ గ్రుంకఁగానే తొలఁగెన్.
శ్రీపద్మాలయ కృప నీ
కీపట్లను గావలయు నదెట్లంటేనిన్. 177

క. వ్యూహమహాలక్ష్మి సదా
శ్రీహరి వక్షఃస్థలమునఁ జిరభూషణమై
మాహాత్మ్యముతో నెలకొని
బాహుళ్యముతోడ సిరులు భక్తుల కిచ్చున్. 178

సీ. ఆ వ్యూహలక్ష్మి వృత్తాంతంబు విను దయా
లోల తరంగాక్షి, లోకమాత
పూర్ణచంద్ర నిభాస్య , పురుషోత్తమప్రియ
పద్మాలయ , విమలపద్మపాణి
వ్యూహ భేదములచే నొనరి మహాలక్ష్మి
యనఁ , గీర్తియన , జయ యనఁగ నొప్పుఁ
గారుణ్యదివ్యమంగళవిగ్రహ యయి , మ
హాదీనరక్షణి యగుచునుండు
తే. విను మనాయాసముగ భక్తవితతి సేయు
పాపచయము నడంచి సంపదల నిచ్చు
నా మహాదేవిమంత్ర మే నాప్తముగను
జెప్పెదను నీవు సద్భక్తిచే జపించు ' 179

వ. అని పల్కి యంగన్యాస కరన్యాస పూర్వకంబుగా లక్ష్మీమంత్రం బుపదేశించి, ధ్యానప్రకారంబు సాంగంబుగాఁ జెప్పి , ' వేంకటాచలంబున కరుగుము. శ్రీనివాసుండు నీకుఁ బ్రసన్నుండై నీ యిష్టార్థముల నిచ్చుఁ బొ ' మ్మని యానతిచ్చి సనత్కుమారుండంతర్ధానంబు నొందె ; నంత నాత్మారామాభిధానుండు భయభ్రాంత చిత్తుండై , పులకితశరీరుండై , యానంద బాష్పధారాకలితనేత్రుండై తద్గురుధ్యానంబుసేసి , లక్ష్మీమంత్ర జపం బారంభించి జపించుచు , నాకాశగంగ భూమికి దిగివచ్చు చందంబున, విరజానదికైవడిఁ బరమ పావనంబులైన తీర్థంబులు శైలాగ్రమందుండి ప్రవహించుచు ధరణికి దిగివచ్చుచున్నం జూచి సంతసించుచు, గృతస్నానుండై పర్వతారోహణంబు చేసి , స్వామి పుష్కరిణియందుఁ గ్రుంకులిడి, జపశీలుండై హరిధ్యానంబు సేయుచున్న సమయంబున. 180

సీ. ప్రాకారపంక్తులు , బహుమంటపంబులు
వివిధ సత్కల్యాణ వేదికలును
ఘనతరతప్తకాంచన నిర్మితంబులై
కొమరుమించు ననేక గోపురములు

నమరేంద్రనీల సౌధాట్టాలకంబులు
సరసమౌక్తికముల చప్పరములు
భానుకోటి ప్రభా భాసమాన సురత్న
సహితంబులగు సభాస్తంభములును
తే. గలిగి గంధర్వనగరసంకాశ మగుచు
విధి శివేంద్రాది సిద్ధసేవితము నగుచు
గీత నర్తన వాద్య సంకీర్ణ మగుచు
నమరు నొక దివ్యధామ మధ్యంబునందు. 181

సీ. కుండ లాంగద రత్న కోటీర కౌస్తుభ
ముఖ భూషణము లంగముల వెలుంగ
రమణీయ కనకాంబరంబు చుంగులు జాఱఁ
బరిమళ గంధలేపనము మెఱయ
నీల కాంతుల నొప్పు నిటాలాలకంబులు
బాల మిళిందాళి పగిది వెలుఁగ
నురమునం దిరవుగా వ్యూహలక్ష్మి వెలుంగ
శతకోటిమన్మథ సదృశుఁడగుచు
తే. నపుడు భూనీళ లిరుగడలందుఁ జెలఁగఁ
బుండరీకాక్షుఁ డందున్న భూసురునకు
దయను బ్రత్యక్షమయ్యె నత్తఱిని విప్రుఁ
డలరి సాష్టాంగ దండంబు లాచరించి. 182

వ. ఇట్లు దండప్రణామంబులు చేసి , వినుతింప నేమియుఁ దోఁపక గద్గద కంఠుండై యనిమిషదృష్టి నీక్షించుచున్న యాత్మారామునిఁ జూచి నిర్హేతుక జాయమాన కటాక్షవీక్షణుండై హరి యిట్లనియె. 183

తే. 'నీకు భయమేల ? వ్యూహలక్ష్మీ కటాక్ష
మిపుడు నీయందుఁ బొందిన , దింకమీఁద
నాయు వారోగ్య మైశ్వర్య మమర నీకుఁ
గల్గు , విజ్ఞాననిష్ఠయుఁ గలుగు విప్ర !' 184

సీ. అని పల్కి మాధవుం డా బ్రాహ్మణున కప్పు
డభయం బొసంగి , బ్రహ్మాది సురలు
తను నుతింపఁగఁ దిరోధానంబు నొందె , న
య్యవనీసురుండు భయంబు నొంది
యీ వార్త లిపు డానతిచ్చిన జగదీశుఁ
డిందుండె , నింతలో నెందుఁ జనెనొ ?
తలఁచి చూచిన నిది దబ్బరో , నిక్కమో
కలఁగంటినో ' యని కళవళమునఁ

తే. గొంతసేపున్న , నవల సద్గురుని కృపను
హరి వరము లిచ్చినది నిక్క మనుచుఁ దలఁచి
నమ్మి , గిరి డిగ్గి తన మందిరమ్ముఁ జేరి
సిరుల నొప్పుచు దానముల్ సేయుచుండె. 185

క. ఈ కథయును బూర్వము వా
ల్మీకి మునీశ్వరుఁడు చాల మెప్పు దలిర్పన్
నా కొనరఁగఁ జెప్పినదే
మీకిటు సెప్పితిని సంయమి ప్రభులారా ! ' 186

చ. అనిన ' వరాహపర్వత మహత్త్వము చక్కఁగ నీవు దెల్పఁగా
విని ముదమొందెఁ జిత్త,మిఁక వేడుక మీఱ వికుంఠ పర్వతం
బన విలసిల్లు సద్గిరి మహత్త్వముఁ జెప్పు ' మటంచు మౌను ల
త్యనఘులు సూతుఁ జూచి విపులాశను బల్కి రటంచుఁ గ్రమ్మఱన్. 187

సీ. 'ధీరాత్మ ! పదియేఁడు తీర్థంబు లా శైల
మందుండునంటి , వింకా మహిమల
వేర్వేఱ వరుసగా వివరించి చెప్పు మో
యమలాత్మ సూత ! నీ ' వనుచు నడుగ
నా సూతుఁ డిట్లనె ' నరసి యా తీర్థ మా

హాత్మ్యంబులను జెప్ప నలవి యగునె ?
పెద్దలు నాకుఁ జెప్పిన రీతిగా మీకుఁ
జెప్పెద వరుసగాఁ జిత్తగింపుఁ

తే. డనుచు సూతుఁడు బాదరాయణునిఁ దలఁచి
మఱియు నిట్లని పల్కె ' నో మౌనులార !
హరికళాంశజుఁడై కర్దమాఖ్యమునికిఁ
బుత్త్రుఁడైనట్టి కపిలుండు పూర్వమందు. 188

శా. ఆ పాతాళమునందు సాంఖ్యవర యోగాభ్యాసముం జేయుచుం
జాపల్యంబు నడంచి యా కపిలుఁ డుత్సాహంబుతో లింగ మం
దా పట్లం దగ నిల్పి యర్చనము సేయంగా , మహత్త్వంబుతో
దీపించెన్ ఘనలింగ మిద్ధరను భేదించెన్ మహాదీర్ఘమై. 189

ఆ. అప్పు డొక్క కాలమందు సురలచేత ,
జనులచేతఁ బూజఁ గొనఁగఁదగిన
కారణంబువలనఁ గపిలలింగ మనంగఁ
బెరిఁగి వచ్చి నిలిచెఁ బృథ్విమీఁద. 190

ఆ. సగరనందనులకు సద్గతి నిచ్చి , యం
దున్న భోగవతి మహోన్నతముగ
వేగ లింగమూర్తి వెంటనే ధరను భే
దించి వచ్చి కపిలతీర్థ మనఁగ. 191

క ప్రవహించుచు మనుజావళి
భవముల హరియించి లోకపావని యయ్యెన్ ;
దివిజులు , నరు లా లింగము
నవిరళ సద్భక్తితోడ నర్చింతు రిలన్. 192

సీ. కపిల తీర్థోపరిగాఁ జక్రతీర్థంబు
ప్రవహించు, మును దేవపతి యహల్యా
నెనయు పాపము నీఁగ నింద్రుఁ డా చక్ర తీ
ర్థమున స్నానముఁ జేసి ధన్యుఁడగుచుఁ
జనియెఁ ; దదుపరి విష్వక్సేన తీర్థంబు
పుణ్యవృద్ధికి హేతుభూత మగుచుఁ
బ్రవహించుచుండుఁ బూర్వము వరుణాత్మజుం
డైన విష్వక్సేనుఁ డచటఁ దపము

తే. సలుపఁగా , మెచ్చి హరి వచ్చి శంఖ చక్ర
యుగళ మపు డిచ్చి , పరివార యూథములకుఁ
గర్తగ నితని నుంచిన కారణమున
నతనిపేరిట నా తీర్థ మచట నుండు. 193

క. పంచాయుధ తీర్థంబులు
నంచితముగ దాని కుపరియం దొప్పుచు దీ
పించు ; ఘనానల తీర్థము
మించి తదూర్ధ్వంబునందు మెఱయుచునుండున్. 194

ఆ. పరఁగ దాని కుపరి బ్రహ్మతీర్థము మహా
హత్య నడఁప నొప్పు , నందుఁ గ్రుంకు
ప్రజకునెల్లఁ బుణ్యఫల మిచ్చు ; దానిపై
సప్తమునుల తీర్థచయము నుండు. 195

ఆ. ఒకటి కంటె నొకటి యుత్తరోత్తర దశా
ధిక ఫలంబు లిచ్చు , తీర్థ మహిమ
లింత యొప్పుచుండు ; నెఱిఁగి బ్రహ్మాదులే
చెప్పలేరు నేనుఁ జెప్పఁగలనె ! 196

క. మఱి యింకొక్క విశేషం
బరుదుగఁ జెప్పెదను పూర్వమందొక ధరణీ
సురుఁ డిలఁ గల తీర్థములను
వరుసగ నన్నియును జూడవలయు నటంచున్. 197

సీ. పోయెడి తెరువందుఁ బురుషోత్తముఁడు వాఁడు
శయనించి నిదురింప స్వప్నమందుఁ
బల్కె నిట్లనుచు ' నో బ్రాహ్మణోత్తమ ! దూర
తీర్థముల్ వెదకుచుఁ దిరుగనేల ?
యదె చూడు మీ పుష్కరాద్రి సమీపమం
దున్నది , దానియం దొప్పుచున్న
పదియేఁడు తీర్థముల్ పరమపావనము , లా
తీర్థంబులందు విధి క్రమముగ
తే. స్నానములు సేయు వరుసగా సకల సిద్ధు
లమరఁగా నీకుఁ గల్గు ; నీ యర్థమందు
సంశయింపకు ' మన విని సంతసించి
భూసురుఁడు మేలుకని లేచి , బుద్ధియందు. 198

తే. తలఁచె నిట్లని ' శ్రీరమాధవుఁడు స్వప్న
మందుఁ జెప్పిన గతిఁ బుష్కరాద్రిఁ జేరి
యచటి తీర్థంబులను గ్రుంకి యఖిల సిద్ధు
లేను పొందెద ' నని నిశ్చయించి వచ్చి. 199

వ కపిల తీర్థంబు మొదలుకొని సప్తదశతీర్థంబులయందు విధి ప్రకారంబుల స్నానంబులు చేసి సకల సిద్ధులం బొందె ' నని చెప్పి క్రమ్మఱ సూతుం డిట్లనియె. 200

తే. అరయఁగా మూఁడు కోట్లు నొక్కర్ధకోటి
తీ ములు గల్గియుండు నీ త్రిభువనముల
యందు, శ్రీ వేంకటాద్రిపై నఖిల తీర్థ
ములు గలిగియుండుఁ గావున ముఖ్యమయ్యె. 201

వ. ఇట్టి వేంకటాద్రికిఁ బ్రదక్షిణం బాచరించిన భూప్రదక్షిణంబు చేసిన వారికిఁ గలుగునంత పుణ్యఫలంబు సిద్ధించు ; నింక నొక్క విశేషంబు గల , దది యెట్లన్న హలాయుధుం డా వేంకటాద్రి శిఖరదర్శనంబు చేసిసకల తీర్థయాత్రా ఫలంబునంబొందెనని వినియుంటి ; నదియునుంగాక ధర్మరాజాది పాండుసుతు లరణ్యవాసంబు సేయ నరుగునప్పుడు వారితో శ్రీకృష్ణుం డాప్తంబుగా నిట్లనియె. 202

సీ. 'పాండవాత్మజులార ! ప్రబలులయ్యును మీరు
కర్మవశంబున గ నములను
వసియించు కాలంబు దా ! మంచి
దెట్టైన జయ కిత్తు నేను
చింతింప వలవదు , శ్రీ వేంకటాద్రికిఁ
జిరభక్తితోఁ బోయి క్షేత్రపాల
పాలితమైనట్టి పరమ పావన తీర్థ
సాన్నిధ్యమున నిల్చి స్నాన పాన
తే. జపము లొనరించుచుండుఁడు ! సకలపాప
హరణమై పోవు , నటుమీఁద నరుల గెలువ
వచ్చు ' నని కృష్ణుఁ డుపదేశమిచ్చి పనుప
నప్పు డా పాండవులు వేంకటాద్రిఁ జేరి. 203

ఆ. క్షేత్రపాలుఁ డున్న సిద్ధస్థలమునందు
నిలిచి , స్నానపాన నిష్ఠలచట
సలుపుచుండ నొక్క సంవత్సరము చనె
వేంకటేశుఁ డాదరమున. 204

సీ. పాండవాగ్రజుని స్వప్నమునందుఁ బ్రత్యక్ష
మై ' మహారాజ ! మీ రరుల నెల్ల
సమయించి యలఘురాజ్యము నేలు పొ ' ండని
యానతిచ్చిన శమనాత్మజుండు
మ్రొక్కి గ్రక్కున లేచి ముదమంది భీమార్జు
నాదుల కా స్వప్న మపుడు సెప్పి
తడయక భార్యతోఁ దమ్ములతో వేంక
టాద్రిఁ జెచ్చెర డిగ్గి యడవులందు
తే. వాసములు చేసి , యటు తఱి వచ్చినపుడు
శత్రువుల గెల్చి జయమొంది , సామజాఖ్య
నగరమునఁ బట్టభద్రుఁడై నందసుతుని
ననుసరించుచు నుండె ధర్మాత్మజుండు. 205

వ. గుఱుతుగఁ బాండునందనులు గొన్ని దినంబులు భక్తియుక్తులై
తరమిడి నందు నిల్చిన కతంబునఁ బాండవ తీర్థమంచు నె
త్తఱి నరు లెన్నుచుండుదురు ; దాని మహత్త్వము క్షేత్రపాలకుం
డెఱుఁగు మునీంద్రచంద్ర! పరు లెవ్వ రెఱుంగ రిఁకేమి సెప్పుదున్. 206

వ. అదియునుంగాక స్వామిపుష్కరిణికిఁ బూర్వదిగ్భాగంబున జరాహరంబును, వలిఘ్నంబును , రసాయనంబు నను మూఁడు తీర్థంబులును , హరి వసింపఁదగిన వైకుంఠపర్వత గహ్వరంబును , అష్టలోహ ఖాతంబులును గలిగియుండు; నింతయు స్వామి పుష్కరిణికి ద్వావింశతి శరపాత దూరంబున మాయాతిరోహిత శక్తి యిన్నిటి నావరించియుడుం గావునఁ దత్తీర్థాదులు బుధులకైనఁ గన నశక్యంబు లగుచుండు ; నట్టి మహిమ నొప్పుచున్న వేంకటాచలంబందుఁ గుంటులు , నంధులు , మూకులు , బధిరులు , గొడ్రాండ్రు , ధనహీనులు నైనవారు శ్రద్ధాగరిష్ఠులై హరియందు భరన్యాసంబుఁ

జేసి నిస్సంశయులై నమ్మియున్న , వారికిఁ దదుపద్రవంబులు నివారితంబులై సుఖంబు గలుగు ; నదియునుంగాక తత్పర్వతంబునకు యుగభేదంబులచేత నొక్కొక్క విశేషంబు గలుగుచుండు నది యెట్లనిన. 207

సీ. ఆ వేంకటాద్రి మహాద్భుతంబుగ నొక్క
తఱి శ్రీనివాసుని కరణి వెలుఁగు
నొక వేళఁ గనకాద్రి యొప్పునఁ జూపట్టు
నొక వేళ జ్ఞానసంయుక్త మగుచుఁ
గనిపించు , నొక వేళ ఘనమణిరూపమై
కనిపించు , భూషణ క్రమముగాను
గనిపించు నొక వేళఁ , గలికాలములయందుఁ
బాషాణగిరి రీతిఁ బ్రజకుఁ దోఁచు
తే. నందుచే వేంకటాద్రి మాహాత్మ్య మెఱిఁగి
చెప్పలేఁ డింతయని యాదిశేషుఁడైన
విబుధజనములు చెప్పఁగా వినినయంత
చెప్పితిని గాని , నే నంత చెప్పలేను.' 208

క. అని యిటు సూతుఁడు వలుకఁగ
విని శౌనక ముఖ్యులనిరి ' వేంకటగిరిసద్
ఘనతర మహిమము లెంతగ
వినినం బరితృప్తి లేదు వీనుల కనఘా ! 209

క. కావునఁ బెద్దలు దెల్పిన
శ్రీ వేంకటగిరి మహా విచిత్ర మహిమలన్
భావింపఁగ వరుసగ నీ
వే [illegible]క్కగఁ జెప్పు సూత ! విమల ఖ్యాతా ' ! 210

తే. అనిన ' జైమిని మును చెప్పినట్టి రామ
చరిత మిపుడేను చెప్పెద , సావధాన
మతిని వినుఁ ' డని మరల నమ్మౌనివరులఁ
గాంచి సూతుఁడు పల్కె నుత్కంఠ మెఱయ. 211

సీ. 'దనుజారి పూర్వంబు దశరథాత్మజుఁడన
జనియించి , గాధేయు జన్న మమరఁ
గాచి , శంకరుకార్ముకంబును ఖండించి
జానకిఁ జేపట్టి , జామదగ్న్యు
బలమార్చి , సాకేత పట్టణంబును జేరి
జనకాజ్ఞఁ గైకొని చని యరణ్య
వాసంబుఁ జేయ , రావణుఁడను దనుజుండు
లలన సీతను దనలంక కెలమిఁ
తే. బట్టి కొనిపోవ , రామభూపాలకుండు
రావణునిఁ ద్రుంచుకొఱకు సుగ్రీవుతోడ
నాంజనేయాది కపులతో నపుడు వేంక
టాద్రి చెంతనె లంకకు నరుగుచుండె. 212

## శ్రీరాములు వేంకటాద్రికి వచ్చుట

తే. అంజనాదేవి శ్రీవేంకటాద్రిమీఁద
నుండి రాముఁడు బహుకపితండములను
గూడి వచ్చుట గని , పైఁడికొండ డిగ్గి
మొనసి యెదురుగఁ జని రాఘవునకు మ్రొక్కి. 213

క. ఘనుఁడగు రాముఁడు విష్ణుం
డని మనమున నిశ్చయించి , యతిశయభక్తిన్
వినుతులు సేయుచు , నచ్చట
నెన లేని ముదంబు మీఱ నిట్లని పల్కెన్. 214

ఉ. 'రామ ! సుకీర్తికామ ! బహురాక్షస యూథ విరామ ! సద్గుణ
స్తోమ ! దినేంద్రవంశ ఘనతోయధి సోమ ! దశాస్య భీమ ! నీ
శ్రీ మహిత ప్రభావమును శేషుఁడు సన్నుతి సేయలేఁడు , నే
నేమి నుతింప నేర్తు ? జగదీశ్వర ! మ్రొక్కెద నన్నుఁ గావవే ! 215

సీ. ఈ వేంకటాద్రిపై నేను వర్తింపుదుఁ
గావున నాయందుఁ గరుణ నుంచి
వేంకటాద్రికి మీరు విచ్చేయుఁ ' డన విని
శ్రీరాముఁ డిట్లనె ' వీరకపుల
తోడ శీఘ్రంబైన దూరప్రయాణంబు
కలిగియున్నది , కార్యఘటనమైన
వెనుక నీవనినట్ల వేంకటాద్రికి వత్తు '
మనఁగ ' దేవర దర్శనార్థ మచటఁ
తే. గాచియున్నారు మునివరుల్ గాన , వారిఁ
జూడ రావలె ' ననుచు నా చేడె పిలుచు
సమయమున నాంజనేయుఁ డచ్చటికి వచ్చి
వినయమున మ్రొక్కి యిట్లని విన్నవించె. 216

తే. 'దేవ! మాతల్లి యంజనాదేవి మనవి
చేసినది మీరు మన్నించి చిత్తగింప
వలయు , నేలన్నఁ గపులెల్ల నలసినారు
గనుక శ్రీ వేంకటాద్రికిఁ జనుట యొప్పు. 217

సీ. శ్రీయంజనాశ్రమ సిద్ధ స్థలమునందు
ఫలసుమ వృక్షముల్ గలిగియుండుఁ
గందమూలాదులు , ఘన పుణ్యతీర్థంబు
లందుండుఁ గనుక నేఁ డచట నిల్పి

యవలఁ బోఁదగు , నంజనాద్రి దూరము గాదు
మన ప్రయాణమునకు మార్గ మదియె
యటుగాన మా తల్లియందు సత్కృప నుంచి
యటకు రావలె నిపు ' డనఁగ రామ

తే. చంద్రుఁ డబ్జాప్తసుతుని , లక్ష్మణునిఁ జూచి
మందహసితాస్యుఁడై ' హనుమంతుఁ డనుట
వింటిరే '! యన్న వారు భూవిభునిఁ జూచి
' దేవ ! శ్రీ వేంకటాద్రికిఁ బోవవచ్చు.' 218

క అని యిట్లు మనవి చేయఁగ
విని రాముఁడు సమ్మతించి, వేడుకగా న
య్యనిలతనూజుని నెనరునఁ
గనుఁగొని యిట్లనియెఁ జాల గౌరవ మొప్పన్. 219

ఉ. 'మారుతపుత్ర ! నీ మనవి మా మది కిష్టమె యయ్యె , నిప్పు డా
సారతరాంజనాఖ్య వరశైల సుమార్గమునందె పోద ; మా
దారిని వానరావళికిఁ దప్పక చూపు ' మటంచుఁ బల్కఁ,న
వ్వీరుఁడు సమ్మతించి కపివీరులఁ బిల్చి ముదంబు మీఱఁగన్. 220

ఆ. వేంకటాద్రిమార్గ మంకితముగఁ జూపి
హరిసమూహ విభుని యనుమతమున
రామ లక్ష్మణులను రహిమీఱ భుజములం
దుంచికొని బలంబు వెంచి నడచె. 221

ఆ. నిక్కి వేంకటాద్రి కెక్కు మార్గమునందు
వరమునీంద్రు లెదురు వచ్చి నిలిచి
బహువిధముల రామభద్రుని వినుతించి
యిట్టు లనిరి మోద మినుమడింప. 222

ఉ. 'రామనృపాల ! ఘోరతర రావణశౌర్య విఫాల ! భవ్య సు
త్రామ సురార్య యోగిజన తాపసపాల ! కృపాలవాల ! శ్రీ
భూమిసుతాత్మలోల ! పరిపూర్ణ సుకీర్తి విశాల ! వానర
స్తోమముతోడ వచ్చు మిముఁ జూచి కృతార్థుల మైతి మిద్ధరన్. 223

సీ. చిరకాలమున నుండి శ్రీవేంకటాద్రిపైఁ
దపమొనర్పఁగ నా విధాత వచ్చి
రామ సౌమిత్రు లీ రమ్యవేంకట శైల
మునకు వచ్చెదరు సమ్మోద మలర
వారు వచ్చెడుదాఁక వదల కిచ్చట నుండి
వచ్చినప్పుడు మీరు వారి నిచట
సంతోషమునఁ జూచి సత్యలోకమునకు
రండు మీ ' రనిన కారణముచేత

తే. నెదురు చూచుచునుండి మే మిచట మిమ్ముఁ
గాంచితిమి , మా తపంబు లిక్కడ ఫలించె
నింతయే చాలు సెలవిమ్ము ! యిపుడు బ్రహ్మ
యున్న లోకముఁ జేరెద మో మహాత్మ !' 224

మ. అనినన్ రామనృపాలకుండు పరమాహ్లాదంబుతో వారలన్
గని ' యో తాపసవర్యులార ! మిము నీ కాంతారమధ్యంబునం
దొనరం గంటిమి సంతసం బొదవె , మీరుత్సాహ ముప్పొంగఁగాఁ
జనుఁ డబ్జోద్భవుఁ డున్న చోటి ' కనుచున్ సంప్రీతితోఁ బల్కఁగన్. 225

క. ఆ మౌనులు ముద మొందుచు
రామునిచే సెలవు నంది రయమున నపుడే
తామరసోద్భవు లోకము
నామోదము మీఱఁ జేరి రనఘాత్మకులై 226

వ. తదనంతరంబున రామచంద్రుండు తత్పర్వతోత్తర మార్గంబునఁ బర్వతారోహణంబు సేయుచుండి , తన్మధ్యంబున యక్ష శాపమోక్షంబు చేసివచ్చి, కందమూల ఫలభరితంబైన యంజనాశ్రమంబునందు నాకాశ గంగ సమీపంబునఁ గపి సమూహములతోడ రామలక్ష్మణులు నిలిచి తత్తీర్థంబున స్నాన సంధ్యాది కృత్యంబులు నెఱవేర్చి ; రంజనాదేవి ఫలపుష్పంబులు సమర్పించి పూజింపఁగా, రామలక్ష్మణులు సంతుష్టులై యంజనాదేవి నాదరించి వీడ్కొని, తదనంతరంబున సుగ్రీవాంగద నల నీల జాంబవత్ప్రముఖ కపిశ్రేష్ఠ పరివృతులై స్వామిపుష్కరిణికి వచ్చి జయప్రద సంకల్ప పూర్వకంబుగా స్నానంబులు చేసి , ఫలపుష్ప భరితంబైన తత్తీర శృంగార వనంబునందు సుఖాసీనులై తత్పర్వతంబున వసియించియుండి, దర్శనార్థంబుగా వచ్చిన మునుల కనేక ఫలదానంబులు చేసి, పుష్కరిణికి నైరృతి భాగంబున నీ కపులు నిర్మాణించిన పర్ణశాలలయందు నిలిచియున్న సమయంబున నాంజనేయుండును ననేక మధుర ఫల కందమూలాదులు, తేనె పెరలు తెచ్చి సమర్పించినఁ , బరివారంబులతోడ రామలక్ష్మణు లారగించి పరిపూర్ణులై యయోధ్యాపురంబునందున్న చందంబున సంతసించుచున్న సమయంబున. 227

సీ. ఘనుఁ డాంజనేయుండు కపిసమూహమునెల్ల
పిలిచి యిట్లనియె సంప్రీతి మెఱయ
' వానరులార ! యీ వనపర్వతములందుఁ
జూత , జంబూఫల వ్రాతములును
పనసపండ్లును , ద్రాక్షపండ్లును , బదరికా
ఫలము , లరఁటిపండ్లు , పాలపండ్లు
మొదలైన బహు ఫలంబులు మెక్కుఁ , డానంద
మున విహరింపుఁ డీ వనములందు

తే. ననిన విని కపిబృందంబు లపుడు చెలఁగి
ఫల మహీరుహముల కెగఁబ్రాకి యార్చి
కావలసినట్టి పండ్లెల్లఁ గఱచి మెక్కి
పేటు లెగఁబ్రాకి బలుతేనె పెరలు దించి. 228

వ. అప్పుడా కపివరు లుప్పొంగి తేనెపెరలఁ జించి ప్రోవులు చేసి , యా కుప్పలు పంచికొని యబ్బురపాటునఁ జప్పరించుచు, నొండొరుల ఱొప్పుచు , ముక్కు చిట్లించుచుఁ , బ్రక్కలు గోకుచుఁ , జెవులు బోంద్రించుచు , నొకరి తోక నొకరు కఱచుచు , నొక్కరి చెవుల నొక్కరు చప్పరించుచుఁ , బండ్లు గీటించి కన్నులు బిక్కరించి కికురింత లిడుచుఁ , గొండకొండకు లంఘించుచు నిట్లనేక ప్రకారంబులఁ బర్వతాకారులైన కపులు నిజజాతి కుచేష్టలు చేయుచునుండి , యంద ఱొక దిక్కు గుంపులై కూర్చుండి యొకరినిఁ జూచి యొక్క రిట్లనిరి. 229

క. 'బహుపర్వతములు సూచితి
మహహా ! యీ పర్వతేంద్ర మత్యద్భుత , మీ
మహిమము లింతింతని ధర
నహినాథునికైనఁ బొగడ నలవియె ! తలఁపన్. 230

క. రాముని కృపచే నిచ్చటి
కామోదముతోడ వచ్చి , యఖిల ఫలంబుల్
కామించి భుజించితి ; మిపు
డే మేలొనరింపవచ్చు నినకుల పతికిన్. 231

సీ. శ్రీరాఘవున కపకారంబుచేయు రా
వణుని వాలములతో నణఁగఁజుట్టి
పట్టి తెచ్చిఁక రామభద్రుని ముందఱఁ
బడవైతు ' మని మించి పలుకువార

'లా లవణాబ్ధిలో నా త్రికూటాద్రితో
నా లంకఁ దెత్తమిం' దనెడు వారు
'పంక్తికంధరుఁ డింకఁ బాతాళమందున్న
నీడ్చి తెత్తు' మటంచు నెగురువారు
తే. 'గగన మందున్న చంద్రభాస్కరులతోడ
నసుర నిటు పట్టి తేవచ్చు' ననెడువారు
నుబ్బితబ్బిబ్బులై నగుచుండువారు
కూరిమిని రామజయమునే కోరువారు. 232

వ. ఇవ్విధంబున నందఱు పలు విధంబులఁ బలుకుచు లేచి విహరించుచుండి, స్వామిపుష్కరిణికి నీశాన్య భాగంబునం దొక్క గిరి గహ్వరంబు నీక్షించి గజ గవయ గవాక్ష గంధమాదన మైంద ద్వివిద ప్రముఖులైన వానరు లయ్యంధకార బిలంబునఁ జొరఁబడి కిచకొట్టుకొనుచుఁ బరిగి పరిగి పోవుచుండి, యందొక్క దివ్యజ్యోతి నీక్షించి తత్సమీపంబున కరుగుచున్న సమయంబున. 233

## వైకుంఠగుహా ప్రభావము

సీ. ఆ గుహలోఁ దప్త హాటక నవరత్న
గోపుర ప్రాకార కుడ్యతతులు
వజ్ర కవాటముల్, వైడూర్య మాణిక్య
మరకత మౌక్తిక మంటపములు
ప్రాసాదముల్, చిత్ర భవన సమూహముల్
పచ్చ తోరణములు హెచ్చి మెఱయ
హేమరథంబులు, సామజాశ్వంబులు
విహరింపఁదగు శతవీథు లొప్ప

తే. విమల గానంబులును , నృత్త వివిధ వాద్య
తతులు ఘోషింప , సౌందర్యవతులు మెలఁగ
వర చతుర్భుజులును గదాధరులు శంఖ
చక్రపాణులు నచటనే సంచరింప. 234

తే. అమరి యప్రాకృతంబై మహాప్రకాశ
మహిమచే నొప్పు నప్పుర మధ్యమందుఁ
గాంచనాద్రినిభంబై ప్రకాశయుతము
భానుసంకాశమైన విమానమందు. 235

సీ. నీలాభ్రగాత్రుండు నీరజనేత్రుండు
నాజానుబాహుండు నచ్యుతుండు
గనకాంబరుండు సత్కంబుకంఠుండు , స
ల్లలిత సద్భూషణాలంకృతుండు
శంఖ చక్ర గదాబ్జ సహిత హస్తుండు , మ
హాత్ముండు పూర్ణచంద్రాననుండు
సురుచిర సుందర సుకుమార దేహుండు
విమల సత్కారుణ్య వీక్షణుండు

తే. నగుచు ఘనభోగి భోగ పర్యంకమందు
వాసి మీఱఁగఁ గూర్చుండి వామపదము
ముడిచికొని , కుడిపాదంబు పుడమిమీఁద
నింపుగాఁ జాచియుండె లక్ష్మీశ్వరుండు. 236

క. కరములు రెం డా ఫణిపై
నిరవుగ నూఁదికొని , లక్ష్మి యెదపై వెలుఁగన్
ధరణియు నీళయు భక్తిని
నిరుగడల వసించి వేడ్క నెనయఁగ మిగులన్ 237

వ. ఇవ్విధంబున సుఖాసీనుండై యున్న పరమపురుషునికి గరుడ సుందరీమణులు శ్వేతచ్ఛత్రంబులు వట్టఁ, జామరంబులు వీవ, నందందు గుంపులు గూడి శంఖ చక్ర గదా పాణులు శ్వేతాంబర, శ్వేతపుష్ప మాలికాలంకృతులై పరివేష్టించి కొలువఁ, గోటి సూర్యప్రకాశుండై కొలువున్న పరమపురుషుని సంతోషమగ్నులై చూచుచున్న కపుల నీక్షించి యందొక వేత్రహస్తుండు తఱుమ వచ్చిన, భీతిల్లి మార్గంబును గానక యందందుఁ బ్రాఁకులాడుచుఁ గికురించుచున్న కపులంజూచి, కరుణాయత్త చిత్తుండై యా వేత్రహస్తుండు మార్గంబుఁ జూప, నక్కపు లా మార్గమున నీవల వచ్చి, యాశ్చర్యంబు నొంది తమలోఁ దాము వితర్కించి యిట్లనిరి.238

సీ. 'శ్రీరామచంద్రునిఁ జెనకి గెల్వఁగలేక
రావణుండు గుహాంతరాళమందుఁ
జేరి, రాక్షసమాయ లీరీతిగాఁ జూపె
నని తోఁచుచున్న దిం' దనెడువార,
' లా పంక్తికంఠు మాయలు గావు, భావింప
హరి మాయ గావలె' ననెడి వారు
' నీ సంశయము దీఱ నీమాటు గుహలోని
కరిగి క్రమ్మరఁ జూత 'మనెడువారు

తే. ' మనము మాత్రమె పోరాదు, మర్కటముల
నన్నిటినిఁగూడి పోవచ్చు' ననెడువారు
' నపుడు కలఁగంటి, మిది దబ్బ'అనెడువారు
' నన్నృతమేలగు, నిక్కమే ' యనెడువారు. 239

వ. ఈ ప్రకారంబుల నంద ఱిన్ని విధంబుల సంశయించుచు నా గుహ మరలఁ జూడఁబోయినఁ గనఁబడకుండె; నంతట విస్మయంబొందుచుఁ గపి ... ంబుఁ చెప్పినఁ, గపులందఱుం

దండప్రణామంబులు చేసి, గుహా వృత్తాంతంబు విన్నవించిన రామచంద్రుండు చిఱునవ్వునవ్వి యిట్లనియె. 240

సీ. 'దేవర్షి రాజ నదీమూలములు పరీ
క్షించి నిర్ణయముగాఁ జెప్పరాదు
మహిమాఢ్యుఁడైన రమామనోహరుఁడిందుఁ
జరియించు రీతి దబ్బఱనరాదు
హరిగిరి మహిమముల్ హరికే తెలియుఁగాని
దేవతలకునైనఁ దెలియఁబోదు
వేంకటాచలమందు వివిధమహిమ లుండు
మించి పరీక్షింప మీకుఁ దగదు
తే. మంచి, దైనను కొదువేమి ? మాధవుండు
కరుణతో మీకుఁ బొడసూపెఁగాన , మీరు
ధన్యులైతిరి పొం ' డని దయను బలికి
యలరి రాఘవుఁ డా దినం బచటనుండి. 241

క. మఱునాఁ డా శైలము దిగి
హరిబలములఁ గూడి రాముఁ డతిశూరుండై
త్వరగాఁ జని లవణాబ్ధిని
గిరు లిడి ఎంధించి మించి కీర్తి చెలంగన్. 242

చ. కపులును దమ్ముఁడుం గొలువఁగా నట లంకకుఁ బోయి , యచ్చుటన్
విపుల బలంబుతో నసురవీరులనెల్ల వధించి, ధీరతం
గుపితునిఁ గుంభకర్ణు నిలఁ గూలిచి , రావణుతోడఁ బోరి యా
చపలునిఁ ద్రుంచె రాఘవుఁడు సర్వమునుల్ సురలు న్నుతింపగన్.243

సీ. సీత నచ్చటఁ బరీక్షించి రాముండు చే
పట్టి , విభీషణు భక్తి మెచ్చి
యతనికి లంకలో నమరఁ బట్టముఁ గట్టి
జానకీ లక్ష్మణ సహితుఁడగుచు

వానరసమితితో వరపుష్పకము నెక్కి
రమ్య సాకేతపురంబుఁ జేరి
భరతశత్రుఘ్నులు భక్తితోఁ గొలువఁగాఁ
బట్టాభిషిక్తుఁడై, ప్రజలనెల్ల
తే. నుచిత కరుణను బాలింపుచుండె ' ననిన
మౌనిపుంగవు లని రిట్లు ' మర్కటములు
పోయి గుహయందుఁ జూచిన పురుషుఁడెవఁడు?
తెలుపు ' మన సూతుఁ డిట్లని పలికె నపుడు. 244

శా. 'వైకుంఠం బెడఁబాసి శేషగిరిపై వర్తించు నారాయణుం
డా కాలంబున నా గుహాంతరమునం దా వానరశ్రేణికిన్
జోకంజూప నిజస్వరూపము , కపుల్ చోద్యంబుగాఁ జూచి భూ
లోకంబందు వచింపఁగా , నెఱిఁగి రీ లోకంబులో మర్త్యులున్. 245

వ. ఇవ్విధంబున గిరిగహ్వరంబునందుండి హరి హరిసమూహంబునకు వైకుంఠంబుఁ జూపినందున నా గుహ వైకుంఠగుహ యనఁ బ్రసిద్ధంబయ్యె; నందు నిత్యముక్తులు సేవింప శ్రీ భూ నీళా సమేతుండై చక్రధరుండుండుంగావునఁ దద్వైకుంఠాద్రి జగత్ప్రఖ్యాతంబై యుండు ; నట్టి వైకుంఠగుహా ప్రభావంబు వినినవారికిఁ గలిదోషం బంటక , పుత్త్రపౌత్త్రాభివృద్ధి గలిగి మహైశ్వర్య సంపన్నులై మోక్షప్రాప్తు లగుదు ' రనిన విని శౌనకాదులు సూతునిఁ జూచి యిట్లనిరి. 246

## ఆశ్వాసాంతము

క. పంకజలోచన ! దనుజ భ
యంకర ! సుగుణాభిరామ ! యవ్యయ ధామా !
శంకరమిత్ర ! శుభాకర !
వేంకటగిరి రమణ ! మౌని వినుత వితరణా ! 247

మాలిని :

కలశజలధిబాలా కాంత శృంగారలీలా !
సలలిత గుణజాలా ! సామసద్గానలోలా !
ఖలదనుజ విఫాలా ! కాలకర్మాది మూలా !
విలసిత గుణశీలా ! వేంకటాఖ్యాద్రి పాలా !

గద్య :

ఇది శ్రీతరిగొండలక్ష్మీనృసింహ కరుణాకటాక్ష కలితకవితావిలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ వెంగమాంబా ప్రణీతంబైన శ్రీవేంకటాచల మాహాత్మ్యంబను వరాహపురాణంబునందు వేంకటగిరిపుర వర్ణనంబును, నైమిశారణ్య వర్ణనంబును , శౌనకాది మహామునుల ప్రశ్నయు , బ్రహ్మాదిన ప్రళయప్రకారంబును , హరి శ్వేతవరాహంబై హిరణ్యాక్షుని సంహరించి రసాతలగతయైన భూమిని యథాస్థానంబునం దుంచుటయు , వరాహస్వామి యనుమతంబున శ్రీ భూనీళలతోడ వైకుంఠమందున్న క్రీడాచలంబును గరుడుండు కొనివచ్చి భూలోకమందు నిల్పుటయు , వరాహస్వామి తత్పర్వతారోహణంబు చేసి యందుండుటయు , బ్రహ్మేంద్రాదులు వచ్చి యా స్వామికి మ్రొక్కి వినుతించుటయు , వరాహస్వామి శేషాద్రియందు విహరించుటయుఁ , బుష్కరిణీ మాహాత్మ్యంబును , వేంకటాద్రికి నొక్కొక్క నిమిత్తంబున నొక్కొక్క నామంబు గలుగుటయు , వరాహస్వామి క్రీడానగంబునకు నుత్తర దిగ్భాగంబున విహరించుచుండి శ్రీసతియుం దానును విటవేషధరుఁడయి మునుల యజ్ఞశాలయందుఁ బ్రవేశించి వపాగ్రహణంబు చేయుటయు , దేశాంతరాగతుండైన వృద్ధ బ్రాహ్మణుని హరి కుమార ధారయందు స్నానంబు చేయించి బాలకుమారునిఁగాఁ జేసి పంపుటయు , శంఖణ మహారాజునకు శ్రీనివాసుండు పుష్కరిణియందుఁ బ్రత్యక్షంబై రక్షించుటయు , నాత్మారాముఁడను బ్రాహ్మణునకు హరి ప్రసన్నుండై భాగ్యంబు నిచ్చుటయుఁ , గపిలలింగ , కపిలతీర్థోద్భవంబులు,

దత్కపిలతీర్థాది సప్తదశ ౬ ం ప్రభావంబులును , తీర్థయాత్ర పోవు విప్రునకు స్వప్నమందు హరి ప్రసన్నుం౭ పుష్కరాద్రియందు( గల తీర్థంబుల( జూపుటయు, ధర్మరాజాదు లొక్క సంవత్సరంబు వేంకటాద్రియం దొక్క పుణ్యతీర్థంబు నాశ్రయించి యుండుటయు , యుగభేదంబులచేత వేంకటాద్రి ప్రకాశించు చిహ్నంబులును, రావణ సంహరణార్థంబుగా నరుగునప్పుడు రామచంద్రుం డొక్కదినంబు వేంకటాద్రియందు వసియించి యుండుటయు , వైకుంఠ గుహయందు( గపులకు( బరమ పురుషుండు ప్రత్యక్షంబగుటయు నను కథలం గల ప్రథమాశ్వాసము.



# శ్రీవేంకటాచల మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

క. వ్యాసమునీశ్వర హృదయ ని
వాస ! చిదుల్లాస ! దుగ్ధవారిధిశయనా !
వాసవ వందిత పదయుగ !
భాసుర తరిగొండనృహరి ! భవ దురితారీ ! 1

ఆ. 'విశ్వచర్య లెల్ల విశదంబుగా నీవు
తెలిపినావు, మాకుఁ దెలుపఁగలవు
గాన , విష్ణుకథలు క్రమమొప్పఁగా మాకుఁ
దెలుపు సూత ! విమల ధీసమేత ! 2

క. మాయావి యగుచు విష్ణుం
డా యా స్థలముల వసించి, యతిభక్తులకున్
నాయకముగఁ గనిపింపుచు
నాయెడఁ గనిపింపకుండు నంటివి సూతా ! 3

సీ. అంజనాద్రి సమానుఁడైన శ్రీ స్వామి నం
దెవ్వరు నిల్పినా రిరవు చేసి ,
యెవ్వరు ప్రార్థింప నీశ్వరుఁ డచ్చోట
నిలుకడగా నిల్చె నిత్యుఁడగుచు
నా రీతిఁ దెల్పు నీ ' వని మును లడుగఁగా
నా సూతుఁ డనియె ' నా వ్యాసమౌని
చెప్పిన కథ మీకుఁ జెప్పెద నెట్లన్న
సనకాది యోగుల శాపమంటి
తే. జయుఁడు విజయుండు దితియందు జననమొంది
కనకలోచనుఁడని , హేమకశిపుఁడనఁగ
ధరణిపైఁ బుట్టి సాధుబాధల నొనర్పఁ ,
జక్రి కిటియై హిరణ్యలోచనునిఁ ద్రుంచె. 4

ఆ. అపుడు భర్మకశిపుఁ డాగ్రహోదగ్రుఁడై
సాధుభక్త తతికి బాధఁ జేసె
నందుచే నృసింహుఁడై చక్రి యా దైత్యు
కడుపుఁ జించి చంపి క్రౌర్య మెసఁగ. 5

సీ. పరమభక్తుండైన ప్రహ్లాదు రక్షించె ;
నటులేఁగి కనకాక్షుఁ , డా హిరణ్య
కశిపుఁడు నటు కొంత కాలంబునకుఁ గుంభ
కర్ణ , రావణు లనఁగా జనించి
రామచంద్రునిచేత భూమిపైఁ బడుదాఁక
బాధించుచుండిరి సాధువులను
కావున శక్రాదిదేవతల్ మౌనులు
నా రావణుని దుర్గుణాళి హరికి

తే. మనవి చేసెదమని పోయి ఘన సుధాబ్ధి
తీరమును జేరి పలికి ' రో దేవ దేవ !
రావణుని బాధ తప్పించి నీవు మమ్ముఁ
బాలనము సేయవలయు నో పరమ పురుష ! ' 6

వ. అని యివ్విధంబున క్షీరాబ్ధికి నుత్తరభాగంబున నిలిచి దేవేంద్రాది దేవతలును, మహామునులును ననేక ప్రకారంబుల వేదాంతగుంఫితోక్తుల వినుతించి, మఱియు నిట్లనిరి. 7.

ఉ. 'దేవ ! సుధాబ్ధివాస ! బహుదీనదయాపర ! చిత్తగింపవే !
రావణనామధేయుఁ డొక రాక్షసుఁ డద్భుత పాపకర్ముఁడై
భూవలయంబునందుఁ గృతపుణ్యుల నేఁచుచునుండు , వాని నీ
వే వధియింపఁ గావలయు ; వేఱొకఁ డెక్కడ లేఁడు మాధవా ! ' 8

క. అని యిటువలె బహువిధముల
విసుతించినఁ బలుకకున్న ' విష్ణో హో ! ' యం
చును ధ్వనిసేయుచుఁ బిలువఁగ
ననఘుండగు విష్ణుదూత యంబరవీధిన్. 9

ఆ. వచ్చి యిట్టు లనియె ' వనజాక్షుఁ డిందు లేఁ ,
డవనిమీఁదఁ బర్వతాగ్రమందు
మెలఁగుచుండు ; నటకు మీ రేఁగుఁ , డిచ్చోటఁ
గలకలంబు సేయవలదు పొండు!' 10

క. అని వాఁడు వలికి పోయిన
విని మౌనులు సురలు దేవవిభుఁ డాశ్చర్యం
బును బొందుచు , నందుండక
చని చని శోధించి రిలను శైలములెల్లన్. 11

వ. ఇట్లు శోధించి గిరులయందు హరినిఁ గానక , వైకుంఠంబునం దుండునని నిశ్చయించి , యా వైకుంఠమార్గంబువట్టి పోవుచున్న సమయంబున. 12

సీ. శరదభ్ర శుభ్ర భాస్వర శరీరమునందు
శ్వేత ప్రకాశ విభూతి మెఱయ
ధవళ సంపూర్ణచంద్ర కళంకమనఁదగు
నైల్యవత్ కృష్ణాజినంబు వెలుఁగ
సురుచిరారుణ జటాజూటంబు శిరమునఁ
దపన బింబంబు చందమునఁ దోఁప
ననిశంబు నారాయణాష్టాక్షరినిఁ దగఁ
బలికింపఁదగు వీణె పట్టి భుజము
తే. మీఁద హత్తించి, శ్రీహరి మెచ్చురీతి
వీణె మీఁటుచు గాన ధురీణుఁడైన
నారదుఁడు రాఁగఁ జూచి యానందమొంది
యింద్రుఁ డమర సమేతుఁడై యిట్టులనియె. 13

క. 'ఓ నారద ! త్రిభువనములు
మానక చరియింతు వీవు , మర్మంబులు నీ
ధ్యానమునకుఁ గనిపించును
గాన మహాత్ముఁడవు నీవు ఘనమునిచంద్రా ! 14

సీ. శ్రీశైల భూములఁ జేరి రావణుఁ డతి
సాధుజనులఁ జూచి బాధపఱచుఁ
గావున , వాని నేగతినైన శ్రీరమా
వరుఁడె నిర్జింపఁగావలయుఁ గనుక
విష్ణుదేవుని మేము వెదకుచు క్షీరాబ్ధిఁ
జేరి యెంత వినుతించినను మాకుఁ
బ్రత్యక్షమే గాక, పలుకులే పలుకక
యా విష్ణుఁ డుండఁగా , నంతలోనఁ
తే. జదలఁ దా నిల్చి యొక శంఖచక్రధరుఁడు
' హరి యిచట లేఁడు , భూలోకమందు విపుల
భూధరముమీఁద నున్నాఁడు పొం ' డటంచుఁ
జెప్పి పోయెను , వాఁ డెందుఁ జేరినాఁడొ ? 15

క. అచ్చట నా వార్తలు విని
వచ్చితి మందఱము మేము వన దుర్గములన్
హెచ్చుగ వెదకితి , మా హరి
యెచ్చటఁ బొడసూపకున్న నీ మార్గమునన్. 16

క. చనుదెంచితి, మా దేవుం
డనుపమ వైకుంఠపురమునం దుండును గా
వున రావణ వృత్తాంతము
వినిపించెద మచట హరికి విబుధమునీంద్రా ! ' 17

చ. అన విని నారదుం డనియె ' నయ్య ! వికుంఠమునందు విష్ణుదే
వుని( గన(గాను నేను బహుళోత్కళికన్ జన. నొక్క పార్షదుం
డనియె ' వికుంఠమున్ విడిచి యా హరి భూతలమందు లక్ష్మితో
నొనర(గ నొక్క దుర్గమున నుండును పొ ' మ్మనె నద్భుతంబుగన్. 18

క. కావున నచటికి మీ రి(క(
బోవలసిన దేమి ? చక్రిపుత్రునికడకే
పోవుద , మా జలజోద్భవు
నీ వివరం బడిగి వత్త మిందఱ ' మనుచున్. 19

## ఇంద్రాదులు సత్యలోకమునకు( బోవుట

ఆ. దేవమౌని పల్కె , దేవేంద్ర సుర ముని
ముఖులు సత్యలోకమునకు( బోయి
ఘన చతుర్ముఖములు,కర చతుష్టయమును
గలిగి యొప్పుచున్న కమలభవుని. 20

సీ. కాంచి రచ్చట( దప్తకనకాభదేహుండు
లోకవందితు( డష్టలోచనుండు
మహనీయ దండ కమండలు హస్తుండు
బాలభానుప్రభా భాసితుండు
నతిశయ దివ్య పద్మాసనాసీనుండు
పరమతాపసజన పరివృతుండు
నిర్మల సత్కర్మ నిష్ఠా గరిష్ఠుండు
పరమాత్మృతధ్యాన పరవశుండు
తే. నగుచు , నామ్నాయ.ధర్మశాస్త్రాదు లందు
వింత వింతగ మూర్తిభవించి మెల(గ( ,
జేరి సావిత్రి , గాయత్రి , భారతియును
గొలువ(గా గొల్వునందున్న జలజభవు(డు. 21

ఆ. దేవతలను, మునుల భావించి చూడఁగా ,
నంత వారు నజుని చెంతఁ జేరి
మ్రొక్కి , హస్తములను ముకుళించి నిలువఁగా
వారిఁ జూచి పలికె వనజభవుఁడు. 22

క. 'ఎక్కడ వచ్చితి రందఱు ?
నిక్కడఁ గూర్చుండుఁ ' డనుచు నెంతో కరుణన్
చక్కఁగఁ దము మన్నింపఁగ
నక్కడఁ గూర్చుండ , వారి కజుఁ డిట్లనియెన్. 23

తే. 'అందఱికి మీకుఁ గుశలమే? ' యనుచు నజుఁడు
వలుక , వా రిట్టులనిరి ' మీ లలిత కరుణ
వలన మా-కెల్లఁ గుశల మీవఱకు , ధరను
జాలఁ బుట్టిన దీపు డొక్క సంకటంబు. 24

వ. అది యెట్లన్నను రావణప్రేరితులై రాక్షసులు శ్రీశైల ప్రాంత భూములందుఁ జేరి జనులను , మమ్ము ననేక ప్రకారంబుల బాధించుచుండుదు రెట్లనిన. 25

క. మనుజులఁ గబళింపుచు వా
రనిశము బహుపాప కర్ములై గర్వముతో
డను మద మెంతయు మీఱఁగ
మునులను బాధింతు రెపుడు మూఢాత్మకులై. 26

వ. ఇవ్విధంబున రాక్షసులఁ బురికొల్పి సాధుబాధ గావించుచున్న రావణుండు నశింపక లోకంబులకు శుభంబు గలుగ 'దని మఱియు నిట్లనిరి. 27

క. 'పాపాత్మకుఁడగు వానికి
శాపము వెట్టకను మేము శాంతాత్ములమై
యా పంక్తికంఠుఁ ద్రుంపను
శ్రీపతియే గాక యెవరిచేఁ గాదనుచున్. 28

సీ. వరసుధాంబుధియందు వైకుంఠపురమందుఁ
త్రిభువనంబుల మేము తిరిగి వెదకి
వచ్చితి , మందెందు వాసుదేవుఁడు లేఁడు
కావున మేము మీకడకు వచ్చి
శరణుఁ బొందితిమి , శ్రీహరి వసింపుచునుండు
చోటు మీరే మాకుఁ జూపవలయు
సర్వజ్ఞులగు మీరు చక్రి విహారంబు
లెఱిఁగి యుండుదురు , మా కెఱుఁగరావు
తే. చెనకి తపముల విఘ్నముల్ చేసి మాకు
నమితరోషముఁ బుట్టించునట్టి దనుజు
నడఁపఁదగు శక్తి యుక్తు లా హరికిఁ గలుగు
నందుచే నింత వెదకెద మసురహరుని. ’ 29

క. అని వారందఱు వలుకఁగ
వనజజుఁ డిట్లనియె ‘ నిపుడు వాఁ డెవ్వరిచే
తను జావఁడు , కాలము వ
చ్చిన యపు డొక నరుఁడు వాని శిరములఁ ద్రుంచున్. 30

క. దేవతలాదిగ నెవ్వరి
చే వధ్యుఁడుగాక యెపుడు జీవించుటకై
రావణుఁ డుగ్ర తపంబును
గావించెను, వానిఁ గెల్వఁ గాదెవ్వరికిన్. 31

సీ. దాని కుపాయంబు నేను చెప్పెద మీకు
శ్రీ వేంకటాద్రిపైఁ జేరియున్న
హరినే శరణుఁ బొందుఁ, డతఁడు మీ యార్తిని
వారింపఁదలఁచి రావణునికొఱకు

మనుజరూపంబునైనేను దాల్చి వాని ఖం
డించి మిమ్మెల్ల రక్షించు , మీరు
చింతిపవలవ దా శ్రీవేంకటాద్రికి
మీవెంట నేవత్తు , మీరు నేను

తే. శ్రీనగంబున కేఁగి దక్షిణముగాను
బోయి పద్మాక్షు నప్పుణ్య భూధరంబు
నందు వెదకి మహాత్ముఁడైనట్టి హరికి
మ్రొక్కిరాఁదగు పని మహోముఖ్య మిపుడు. 32

తే. శ్రీవనితతోడఁ గూడి మాయావి యగుచు
ఖగమృగాదులయందుండి గహనములను
జాల వేడుకతోఁ గ్రీడ సల్పుచుండు
నిందుచే నెందుఁ బొడచూపఁ డీశ్వరుండు. 33

వ. అయిన నింక నొక్కవిశేషంబు గల , దది యెట్లన్నను దశరథుండు పుత్త్రార్థియై స్వామిపుష్కరిణీ తటంబునందుఁ దపంబు సేయుచుండు నప్పు డా దశరథునకు హరి ప్రత్యక్షంబగు ; నందాఁక నప్పర్వతంబునందు నిరీక్షించుచుండుద , మచ్చట నా రాజునకుఁ బ్రసన్నుండైన హరికి మ్రొక్కి ప్రార్థింపుద'మని దేవతల కీ రహస్యంబు చెప్పి , బ్రహ్మ వేంకటాద్రికి నుత్తర భాగంబుననుండి హరిని వెదకుచు గిరిప్రదక్షిణంబు చేసి , తదనంతరంబున. 34

సీ. సంతాన మందార చంపక వకుళ వి
ఖ్యాపిత ద్రుమవృతమైన దాని
దిక్కులసుస్వాదు పిక్కటిల్లఁగఁజేయు
ఫల పుష్ప వితతిచేఁ బ్రబలు దాని
శుక పిక ప్రముఖ పక్షులు వినోదములుగా
నుప్పొంగి పలుకఁగా నొప్పు దాని
ఘన గండభేరుండ కంఠీరవాది మ
హామృగ ధ్వనుల మిన్నందు దాని

తే. గరుడ గంధర్వ యక్ష కిన్నర గణంబు
లమర మెలఁగెడి సానుదేశముల దాని
నదులు, కమలాకరములు నానా ముఖముల
నతిశయింపఁగ విస్తీర్ణమైన గిరిని 35

## బ్రహ్మేంద్రాదులు వేంకటాద్రికి వచ్చుట

చ. కనుఁగొని బ్రహ్మముఖ్యు లతికౌతుక మొప్పఁగ నా గిరీంద్రమం
దొనరఁగఁజేరి , యందఱు మహోత్తమ తీర్థములందుఁ గ్రుంకుచున్
వన ఫలపుష్పముల్ గొనుచు వారిజనాభునిఁ బూజసేయుచున్
సునిశిత భక్తి నచ్యుతునిఁ జూచుట కచ్చట నిల్చి రందఱున్. 36

వ. ఇట్లు నిల్చి స్వామిపుష్కరిణీ ప్రముఖ పుణ్యతీర్థంబుల నాశ్రయించి
తపంబులు సేయుచుండి , రంత 37

## దశరథుఁడు వేంకటాద్రికి వచ్చుట

సీ. దశరథుఁ డటుమీఁదఁ దనకుఁ బుత్త్రులు లేక
పరితాపమున నిజగురునిఁ జేరి
మ్రొక్కి యిట్లనియె ' నో మునినాథ ! మీవంటి
గురువు లుండఁగ నాకుఁ గొడుకు లేల
కలుగరు ; నేనేమి కర్మంబుఁ జేసితి ? '
ననిన వసిష్ఠుఁ డిట్లనియె ' రాజ!
ఘనపుణ్యుఁడవె కాని , కలుషకర్మ మొకింత
గలిగినందున సుతుల్ గలుగరైరి
తే. గానఁ గర్మంబు నడఁప వేంకట నగమున
కరిగి పుష్కరిణీస్నాన మనుదినంబు
సేయుచును దత్తటమున వసించి తపము
నీవు సల్పుము పాపంబు పోవు నవల 38

క. ఘనవంశోద్ధారకులగు
తనయులు పుట్టెదరు నీకుఁ దాపత్రయ మే
లను ? వేంకటగిరి కిప్పుడె
మన మలరఁగఁ బయనమగుట మంచిది భూపా ! 39

మ. అనఘా ! వేంకటనామధేయగిరియం దంభోధిజాయుక్తుఁడై
వనజాక్షుండు మహావినోదములుగా వర్తించుచున్నాఁడు గా
వున నీ పాప మడంచి నీకు వరపుత్రోత్పత్తిఁ గావించు , నిం
కనుమానింపకు ' మన్న రాజు పరమాహ్లాదంబుతో నిట్లనెన్. 40

క. 'ఆ వేంకటగిరి యెక్కడఁ
బావనమై యుండు నటకుఁ బయనపు లగ్నం
బీ వేళ నేర్పఱింపుఁడు
పోవలె నచ్చటికి మౌనిపుంగవ ! ' యనఁగన్. 41

సీ. అపుడు వసిష్ఠుఁ డిట్లనియె ' గంగానది
కటు దక్షిణంబుగా నా సువర్ణ
ముఖరికి నుత్తరంబుగ నొక్క క్రోశ దూ
రమున గంగకు దక్షిణముగ ద్విశత
యోజన దూరమం దుండు వేంకటగిరి
యందు గంగానది కతిశయంబు
లగు పుణ్యతీర్థంబు లమితమై ప్రవహించు
నన్నిటి కతిశయమగుచు స్వామి
తే. పుష్కరిణి యొప్పు , నతి దివ్య పుష్పలతలు
మధుర ఫలవృక్షములు మహామహిమ నమరి
సర్వకాలంబులందు వసంతఋతువు
లీలగాఁ గాచి పూచి ఫలించు నచట. 42

సీ. మేరు సమానమై తేరు శృంగారించి
నటువలె శ్రీవేంకటాద్రి యొప్పు
రమణీయమగు చైత్రరథముచందంబుగాఁ
గన్నుల పండువై కానుపించుఁ
గిన్నర గంధర్వ గీర్వాణ భామినీ
గాన నృత్తము లందుఁ గలిగియుండు
ఘన కులాచలములఁ గాంచి నవ్వుచు హేమ
శిఖరాళిచేఁ బ్రకాశించుచుండుఁ

తే. బ్రాకృతులు చూడఁ బాషాణ పర్వతంబు
కరణిఁ గన్పించు నా శైలగౌరవంబు
శేషుఁడైనను వర్ణించి చెప్పఁగలఁడె ?
శక్యమే నాకు దశరథచక్రవర్తి ! 43

తే. వేంకటాద్రికిఁ బయన మీ వేళఁ జేయ
వలయు , నిది శుభలగ్న మో వసుమతీశ ! '
యనిన విని పంక్తిరథుఁడు పుత్త్రార్థియగుచు
నా గురునితోడ శ్రీగంగ కరిగి యచట. 44

వ. దశరథుండు వంశాభివృద్ధి సంకల్ప పూర్వకంబుగా గంగాస్నానంబు చేసి , జపతపంబులును , షోడశ మహాదానంబులును జేసి , యందుండి కదలి, గోదావరీ, కృష్ణవేణీ , మలాపహారి , తుంగభద్రా ప్రముఖ నదులయందుఁ గ్రుంకుచు వచ్చి వచ్చి , యుత్తుంగ శృంగ సమేతంబై , ఫలపుష్పభరితంబై , చైత్రరథ సదృశంబై యొప్పుచున్న వేంకటాచలంబు నారోహించి , తద్గిరి గహ్వర , సానుదేశ ప్రముఖ సిద్ధస్థలంబుల నీక్షించుచు వచ్చి , తదనంతరంబున. 45

సీ. పద్మ నీలోత్పల ప్రముఖాంబుజశ్రేణు
లందు ఝుంకారంబు లళులు సేయ
వనజనాళంబులు ఘనమరాళంబుల
తుండంబులం దంటి తూలియాడ
మత్స్య కచ్ఛప ముఖ్య మహనీయ జలచర
బృందంబు లీఁదుచు సందడింపఁ
దరఁగలు సుడులు భాస్వరములై కనిపింపఁ
బూర్ణమౌ శ్రీ స్వామిపుష్కరిణినిఁ
తే. జూచి దశరథుఁ డప్పుడు చోద్యమంది
మ్రొక్కి , తత్తీరముల నుండు మునివరులను
గాంచి సద్భక్తితోఁ గరకమలములను
లలితుఁడై మోడ్చి యచ్చోట నిలిచియుండె. 46

వ. ఇట్లు నిలిచి దశరథుండు చూడ నప్పుష్కరిణీతీరంబునం దనేక దివ్యఫలపుష్పవృక్ష భరితంబులైన శృంగారవనంబులయం దనేక జటాధారులును, సిద్ధాసన , సింహాసన, భద్రాసన , గోముఖాసన , స్వస్తికాసన ప్రముఖాసనాసీనులై రేచక , పూరక , కుంభక యుక్త ప్రాణాయామంబులు సేయువారును,ఆధార,స్వాధిష్ఠాన,మణిపూర,కానాహత,విశు,ద్ధాజ్ఞా చక్రంబుల యందున్న పంచాశద్వర్ణంబుల నవలోకించుచుఁ , దత్తదధిష్ఠాన దేవతల నజపా విధానంబుగా నర్చించుచు నాడీశోధనంబు చేసి , క్రమక్రమంబుగా షడాధారంబులు భేదించి , సుషుమ్నానాడి మార్గంబున నూర్ధ్వముఖంబుగా గమనించి , సహస్రార కమలాంతర్గత సుధాబిందు పానానుభవంబునఁ బరవశులై చొక్కుచుండువారును, హృదయకమల కర్ణికామధ్యంబున నంగుష్ఠమాత్రుండై ప్రకాశించుచున్న పరమపురుషుని ధ్యానించి , తదనుభవంబున నానందించువారును , సాంఖ్య , తార , కామనస్క యోగాభ్యాస పరవశులై యంతర్లక్ష్య , మధ్య లక్ష్యావలోకనంబులు

సేయువారును , శ్రోత్ర నేత్ర నాసాపుట నిరోధంబు చేసి యాత్మప్రత్యయప్రకారంబు నీక్షించుచు దశవిధ నాదంబు లాలకించువారును, అంతర్లక్ష్యంబునుండి యరగంటి చూపున స్వరూపధ్యానంబు సేయువారును, గనులు మూసి , శిరంబు వంచి యూర్ధ్వజ్ఞప్తిఁ గళామాత్రంబు నిల్పువారును, ఇదమిత్థమనుట మఱచి యెఱుక మాత్రంబై శేషించి కేవలాత్మానుభావంబు సేయువారును , స్థూల జిహ్వాగ్రంబును దదుపరి సూక్ష్మజిహ్వాగ్రంబుఁ దాఁకునట్టుగాఁ జొనుపుచుఁ దదేక నిష్ఠచే లంబికాయోగాభ్యానంబు చేయువారును, నివ్విధంబున ధ్యాన షణ్ముఖీ శాంభవీ రాధాయంత్ర ఖేచరీముద్రాభ్యాసపరులై యోగానుష్ఠానపరులైనవారును , నేకపాదస్థులై సవితృమండల మధ్యవర్తియైన నారాయణవిగ్రహంబు నవలోకించువారును, బంచాగ్నిమధ్యంబునందుఁ గూర్చుండి మహాఘోరతపంబు సేయువారును, నృసింహానుష్టుభంబును , రామతారకంబును , గోపాల మంత్రంబును , వరాహ మంత్రంబును , వాసుదేవ ద్వాదశాక్షరంబును , నారాయణాష్టాక్షరంబును , శుద్ధ ప్రణవ మంత్రంబును నిత్యాది సప్తకోటి మహామంత్రంబు లంగన్యాస, కరన్యాస , ధ్యాన పూర్వకంబులుగా నేకాగ్ర చిత్తంబున జపంబులు సేయువారును , శ్రీమన్నారాయణ విగ్రహంబును బాటించుచు (భావించుచు?) షోడశోపచార పూజలు సమర్పించుచు నారాయణ మంత్రపారాయణు లైనవారును , వ్యాఘ్రాజిన , కృష్ణాజిన , వల్కలాంబరులై , వాతాంబు పర్ణ కందమూల ఫలాహారులునై యిట్లనేక విధంబులఁ గర్మ జ్ఞాన భక్తి వైరాగ్య జప తప హోమాది సకల సత్కర్మ నిష్ఠులై యున్న మహా మునిజనుల మధ్యంబునందు. 47

సీ. అలఘు చతుర్బాహువులు, చతుర్ముఖములు

నెనిమిది కన్నులు , ననల సదృశ

తనువు దీపింపఁగా ధ్యానయోగ సునిష్ఠ

నూని పద్మాసనాసీనుఁడగుచు

ననుపమ నారాయణాష్టాక్షరీ జప
కలితుఁడై నాసికాగ్రమున దృష్టి
హత్తించి , స్ఫటిక సదక్షమాలిక చేతఁ
బట్టి చిత్తము బిగఁబట్టి, చక్ర

తే. పాణి పదములయం దుంచి పరమభక్తి
చే భరన్యాస యోగ సంసిద్ధుఁడగుచు
వనజసంభవుఁ డుండఁగాఁ గని వసిష్ఠ
సంయమీంద్రుఁడు చాల నాశ్చర్యమొందె. 48

ఉ. ఆ మునులంద ఱచ్చట మహాద్భుతనిష్ఠల నుండు రీతులన్ ,
దామరసోద్భవుండు పరతత్త్వ వివేక విచార శీలుఁడై
యా మధుసూదనున్ హృదయమందుఁ గనుంగొను నిశ్చలత్వమున్
భూమిపుఁ డాత్మ నద్భుతముఁ బొందుచుఁ జూడ , వసిష్ఠుఁ డిట్లనెన్. 49

తే. 'దశరథేశ్వర! యీ మహాతాపసులను
గూడి పద్మజుఁ డిచట నెక్కువ తపంబు
సేయుచున్నాఁడు గావున శ్రీశుఁ డింక
నమర వీరికిఁ బ్రత్యక్షమగుట నిజము. 50

తే. ధన్యుఁడగు సర్వలోకపితామహుండు
భక్తి మెఱయ నివాత దీపంబువలెను
దాను చలియింపకున్నాఁడు గాన నజుని
మెచ్చి ప్రత్యక్షమగును లక్ష్మీవిభుండు. 51

ఉ కావున దివ్యపుష్కరిణి కామ్య ఫలప్రదయంచు నమ్మి యో
భూవర ! నీ వతిత్వరగఁ బుష్కరిణీజలమందుఁ గ్రుంకి , స
త్పావక భక్తి నిష్ఠను జపం బొనరింపు'మటన్న , నవ్వి , ధా
త్రీవిభుఁ డిట్లనెన్ ' పరమదేశిక ! తజ్జప మీవు సెప్పవే ! ' 52

సీ. అనిన శ్రీవేంకటేశాష్టాక్షరీ మంత్ర
మా వసిష్ఠుండు పుత్రార్థియైన
దశరథేశ్వరునకు దయ నుపదేశంబు
సేయఁగా , నృపతి వసిష్ఠమునినిఁ
బూజించి కూర్చుండి , పుత్రార్థియై మహా
శిష్టుఁడై జపమందుఁ జేయుచుండె
నపుడు శుచిర్భూతుఁడై వసిష్ఠుఁడు తప
మొక దిక్కు గావించుచుండె ; నంత
తే. మిన్ను ఘూర్ణిల్లఁగా నవమేఘ బృంద
ముఱిమినట్లు మహాధ్వని యొకటి వొడమె
నా ధ్వనికి ధ్యానపరవశులైన బ్రహ్మ ,
దేవముఖ్యులు కన్నులు దెఱచి రపుడు. 53

తే. దశరథుఁడు లేచి వెఱఁగంది ధాతృముఖ్యు
లైన సురలకు,మునులకు నలరి మ్రొక్కె
నపుడు ' వంశాభివృద్ధి నీ కగు ' నటంచు
నంద ఆా రాజు దీవించి రద్భుతముగ. 54

క. 'ఆకాశంబునఁ బొడమిన
భీకర రభసంబు చెవుల భేదించిన దిం,
దీ కాల మభ్రఘోషం
బీ కరణినిఁ బుట్టఁదగిన హేతువదేమో ? ' 55

క. అని యందఱు గగన దిశం
గనుఁగొనుచుండఁగ ననేక కమలాప్తులు గూ
డిన యట్టుల నతితేజము
గనిపించెను దానిఁ జూడ ఘనతరమగుచున్. 56

క. జ్వలన గ్రహ నక్షత్రము
లలఘు తటిల్లత లనేకులగు చంద్రులతోఁ
గలసిన గతి నమిత ద్యుతి
విలసితముగ నభము నిండె విస్మయకరమై. 57

క. ఎక్కడఁ జూచినఁ గాంతులు
క్రిక్కిఱిసినఁ జూడలేక గీర్వాణముఖుల్
తక్కక కన్నులు మూసిరి
యక్కడనే చూచ ునుండె నజుఁ డతిభక్తిన్. 58

సీ. అప్పుడు కోటి సహస్ర మార్తాండ ప్ర
భానిభంబైన విమానమందు
బొసఁగ ననేక గోపురము , లనేకంబు
లైన ప్రాకారముల్ , హర్మ్యములును
లలితంబులైన నీలస్తంభములు, బహు
పటువజ్ర సద్వారబంధములును
భర్మ కవాటముల్ , భాసుర విద్రుమ
మంటపంబులు , దీర్ఘమందిరములు
తే. కాంచనోన్నత గోపుర , కలశములును
భూరి మరకతముల నొప్పు తోరణములు
ఘనతర ధ్వజములు , పతాకలును మెఱయఁ
బంచ వర్ణ ద్యుతుల నొప్పు పట్టణమున. 59

తే. పుష్పమౌక్తిక హారముల్ భూరి కలశ
జాలముల నంటి గాలికిఁ దూలి యాడఁ
గలికి చిల్కలు శిఖి,కలకంఠములును
గులికి పలుకుచు నందందుఁ గునిసి మెలఁగ. 60

## వేంకటేశ్వరుఁడు బ్రహ్మాదులకుఁ బ్రత్యక్షమగుట

వ. ఇవ్విధంబున నొప్పుచున్న పట్టణమధ్యంబున సభామంటపంబును, దన్మధ్యంబున సహస్రమణిస్తంభయుక్తంబైన క్రీడామంటపంబు ప్రకాశింప, దన్మంటప చతుర్ద్వారంబులయందు ద్వారపాలకులు నిలిచియుందు; రప్పురంబునందు రంగదుత్తంగ మాతంగ తురంగ సంఘంబులు మెలంగు. రాజవీధులను నవయౌవనాలంకృత సుందరీజన సమూహంబులును మెలఁగుచుండుదు ; రీ ప్రకారంబున ననేక చిత్ర విచిత్ర కలితంబైన దివ్యవిమానంబు వీక్షించి , యగస్త్యవసిష్ఠ ప్రముఖులైన మహాఋషుల నీక్షించి బ్రహ్మ యిట్లనియె 61

చ. 'మునివరులార ! మజ్జనకు ముఖ్యవిమాన లసత్ప్రకాశ మా
దినకర , చంద్ర , పావకుల దీధితులన్ హసియించుచున్ మహా
ఘనతరమై నభోదిశను గన్పడుచున్నది చూత ' మంచు న
య్యనిమిష , తాపసోత్తముల నందఱఁ బిల్చి ప్రమోదచిత్తుఁ డై. 62

సీ. అంబరమార్గమం దరిగి విమాన పూ
ర్వద్వారమునఁ జొచ్చి వనజభవుఁడు
పోవుచుండఁగఁ జూచి పురుహూతముఖ సుర ,
సంయముల్ , దశరథ చక్రవర్తి
యజుఁడు పోయిన మార్గమం దా విమానంబు
నందుఁ బ్రవేశించి , యచట విష్ణు
నంతరాంతరములం దరుదుగా వెదకుచు
భయభక్తు లెసఁగ నా బ్రహ్మముఖులు
తే. వాసుదేవుని వీక్షించు వాంఛ మించ
మనము లుప్పొంగ నాస్థాన మంటపంబు
లోఁ బ్రవేశించి , రప్పు డా లోకకర్త
యైన నారాయణుండు దయాళుఁ డగుచు. 63

వ. క్రీడామంటప మధ్యంబున నవరత్న స్థగితంబైన పద్మపీఠంబునం దప్రాకృత ప్రకాశుండై. 64

సీ. మకుట కౌస్తుభరత్న మకరకుండలములు
ఘన మేఖలాంగద కంకణములు
వరవనమాలికా వైజయంతులు , దీప్తి
నమరు గ్రైవేయక హారములును
గనకాంబరము నీలకాంతుల నీను దే
హమునందు వెలుఁగఁగా , నభయదాన
కలిత దక్షిణ కరకమలంబు పావన
చరణంబు లర్చింపఁ దెరువు చూప
తే. వామ హస్తాంబుజము కటిసీమ నొప్పఁ
దక్కినటువంటి రెండు హస్తముల శంఖ
చక్రయుగళి ప్రకాశింప , శాంతి యొసఁగ
సర్వతోముఖుఁడై దయాస్వాంతుఁ డగుచు. 65

క. హరి ముదమొందుచు నుండిన
తఱి నా హరివక్షమందుఁ దగు భూషణమై
సిరి వెలుఁగఁగ , నిరుగడలను
ధరణియు,నీళయు వసించి తద్దయు మెఱయన్. 66

సీ. నీలమేఘమునందు నిలిచిన క్రొక్కాఱు
మెఱుపురీతిని సిరి యురమునందుఁ,
గుడి భాగమున నీళ , యెడమ భాగంబున
భూదేవి బహురత్న భూషణములు
బంగరంచుల కుసుంభా వస్త్రములు దాల్చి
కుటిలాలకంబులు నిటలములను
లీలగాఁ జాల మిళింద పంక్తులవలెఁ
జలియింపఁ , గస్తూరి తిలకములును

తే. గనులఁ గాటుక , గంధలేపనము లమర
వరకిరీటంబులను విరిసరులు గదలఁ
జంద్రబింబనిభాస్య లా చక్రధరునిఁ
గొలిచి మెలఁగుచు సంతోషకలితలైరి. 67

వ. ఇవ్విధంబున నతికోమల తులసీదళచ్ఛాయ దేహకాంతి నొప్పుచు దక్షిణ హస్తంబున నీలోత్పలంబు పూనియున్న భూదేవియు , విద్యుల్లతా సమానయై ప్రకాశించి కరంబుల శుభ్రకమలంబులఁ బట్టియున్న శ్రీదేవియుఁ , గమలకర్ణికా సన్నిభయై దీపించి వామకరంబున శోణాంబుజంబు ధరించియున్న నీళాదేవియు హరి నొఱసి మురియుచుండఁగా , దత్సమీపంబున ఛత్ర చామరంబులు వట్టి సుందరీమణులు కొలిచియున్న సమయంబున శ్రీనివాసుండు కరుణాకటాక్షవీక్షణుండై బ్రహ్మేంద్రాదులకుఁ బ్రత్యక్షంబయ్యె ; నప్పుడు కమలగర్భాగస్త్య వసిష్ఠాది మహామునులును, సనక సనందనాది మహాయోగులును, నింద్రాది దేవతలును శ్రీమన్నారాయణునకు సాష్టాంగ దండ ప్రణామంబులు, జయజయ శబ్దంబులును జేసి , పులకాంకిత శరీరులును , గద్గద కంఠులును , సంతోష బాష్ప ధారాపూరితాక్షులునై కరంబులు ముకుళించి యిట్లనిరి. 68

## శ్రీమన్నారాయణుని బ్రహ్మాదులు ప్రార్థించుట

దండకము :

శ్రీమత్పరాకాశ శేషాచలాధీశ మంగాముఖోల్లాస మౌనీంద్ర హృద్వాస సంపూర్ణ శృంగార సద్భక్త మందార మాధుర్య వాగ్వ్రాత మాయాగుణాతీత సర్వార్థనిర్ణేత సన్మోక్ష సంధాత శ్రీ భూమినీళాసమేతా2౦బుజాతాక్ష పాఠీన కూర్మామిత క్రోడరూపా నృకంఠీరవా వామనా రామ రామా మహాసీరహస్తా యశోదార్భకా బుద్ధ కల్కి ప్రభావోజ్జ్వలాకార కాలానురూప ప్రకారాద్భుతానంత లీలావతారా నిరాకార వేదాంత సారా2బ్ధి గంభీర హేమాద్రి ధీరా వికారాకరాపార సంసార దూరా చిదాకార కారుణ్య పూరా22గమాగణ్య పుణ్యానుగుణ్యా సదాక్షిణ్య

హైరణ్యనేత్రాది దైత్యేశ్వరారణ్య దావానలజ్వాల దేవేంద్ర ముఖ్యామర
శ్రేణిపాలా సుశీలా సువర్ణాభచేలా రమాలోల విశ్వాదిమూలా
మహాయోగిజాలాత్మకంజాత రోలంబ బింబాధరా కంబుకంఠా నిరాలంబ
గోవింద నందాత్మజా గోపబృందావనా దివ్యబృందావనావాస కందర్పసౌందర్య
మందస్మితాఽబ్జోపమాననాఽఽనందకందా ముకుందా గదా శంఖ
చక్రాద్యనేకాయుధా ఘోర నక్రాంతకా దీనశుండాల సంరక్షకాఽఖండ చండ
ప్రతాపా లసత్కుండలాలంకృతాఽజాండ భాండోదరాఽనంత శాంత
స్వరూపాఽఘనిర్లేప నిర్వాణమార్గ ప్రదీపా రణోద్దామ లోకాభిరామా ఘనశ్యామ
సంపూర్ణకామా మహాశత్రు భీమా జితక్రూర భౌమా మునిస్తోమ దేవోత్తమా !
దేవతాసార్వభౌమా ! సదా మిమ్ము సేవించు మమ్మెల్ల రక్షింపు మీశా !
తరిగొండ ధామా ! నృసింహా ! నమస్తే నమస్తే నమస్తే నమః. 69

వ. అని యివ్విధంబున వినుతించి మ్రొక్కుచున్న బ్రహ్మాదులం గరుణించి
చూచి హరి మేఘ గంభీరభాషణంబున నిట్లనియె. 70

ఆ. 'వనజగర్భ ! నీవు వచ్చిన పనియేమి?
తెలుపు 'మనిన బ్రహ్మదేవుఁ డలరి
మరల వినుతిఁజేసి మధుసూదనునిఁ జూచి
యిట్టు లనియె మోద మినుమడింప. 71

సీ. 'దేవ దేవ ! పరాత్మ ! దీనరక్షక ! విన్న
వించెద మనవి యాలించి వినవె !
యా విశ్రవఃపుత్త్రుఁడైన రావణుఁడు మ
హాఘోర తపము మున్నాచరించి
సుర యక్ష కిన్నర గరుడ గంధర్వ ప్ర
ముఖులచే మడియని ముఖ్య వరము
లడిగె , లేదన కూర కా వరంబులు వాని
కిచ్చితి , నందున హెచ్చి వాఁడు

తే. లంకలోనుండి బాహుబలమున హెచ్చి
భటులఁ బురికొల్పి శ్రీగిరి ప్రాంతదేశ
ములఁ జరించు మహాసాధువులకు హింస
సేయుచున్నాఁడు వాఁడు నశించిపోఁడు. 72

ఆ. వరము లడుగువేళ వాఁడు మానవునిచే
మడియకుండు వరము నడుగలేదు
గాన, వాని కంతకాలంబు వచ్చిన
తఱిని వానిఁ ద్రుంచు నరుఁ ' డటంచు. 73

క. సరసిజగర్భుఁడు పల్కిన
హరి దరహసితాస్యుఁడగుచు నప్పు డగస్త్యున్
కరుణను జూచి ' మహాముని
వర ! నీ విపు డిచటి కేల వచ్చితి ? ' వనఁగన్. 74

ఉ. అప్పు డగస్త్యమౌని కమలాక్షుని సన్నుతిఁజేసి యిట్లనెన్
' ముప్పిరిగొన్న గర్వమున మూర్ఖదశాస్యుఁడు మర్త్య కోటులన్
తెప్పునఁ ద్రుంచుఁగాన జనదీనదశన్ గనలేక తత్క్రమం
బిప్పుడు మీకుఁ జెప్పఁదగు హేతువు గల్గఁగ వచ్చితీశ్వరా ! 75

ఆ. పంక్తికంఠుఁ ద్రుంచి ప్రజలను రక్షించి
మమ్ముఁ గావు ' మనుచు మౌనివరుఁడు
విన్నవింపఁగాను విని నవ్వి సనకాది
యోగివరులఁ జూచి శ్రీగురుండు. 76

ఆ. 'ఆదియోగు లగుచు నానందమున నుండు
వారు మీరు నిటకు వచ్చినట్టి
హేతువేమొ తెల్పుఁడిపు ' డన్న సనకాది
యోగు లిట్టు లనిరి ' యో మహాత్మ ! 77

క. ఆంతర్య జ్ఞానాక్షుల
సంతతమును జూచుచున్న సద్విగ్రహమున్
వింతగఁ గర్మాక్షులఁ గను
భ్రాంతిని వచ్చితిమి మేము పరమపదేశా !' 78

చ. అని సనకాది యోగివరు లాత్మరహస్య విచార లక్షణం
బెనసిన యోగమార్గరతి హెచ్చిన సూక్తుల విన్నవింపఁగా
విని ముదమొంది నవ్వుచును విష్ణుఁడు జిష్ణునిఁ జూచి 'నీవు వ
చ్చిన పనియేమి ? మా కిపుడ చెప్పు'మటన్న సురేంద్రుఁ డిట్లనెన్. 79

సీ. 'యజ్ఞేశ ! యజ్ఞాంగ ! యజ్ఞభావన ! యజ్ఞ
కర్మఫలప్రద ! నిర్మలాత్మ !
మాధవ ! మా పితామహుఁడు , నగస్త్యుండు
మనవిచేసిన రీతి ననిశ మవని
యందు రావణుఁడు దురాత్మకుఁడై మమ్ము
బాధించు , శ్రీనగ ప్రాంతములను
ముని మనుష్యాదుల మూర్ఖుఁడై వేధించు
వాని మర్దింప నెవ్వాఁడు లేఁడు
తే. దేవ ! రయమున వాని మర్దించి సకల
జనుల , మౌనుల , మమ్ము రక్షణము చేయు
శక్తి యుక్తులు మీ యందుఁ జాలఁ గలవు
గాన మేమెల్ల దుగ్ధ సాగరమునందు. 80

ఆ. మిమ్ము వెదకి వెదకి , మీ రందు లేకున్న
విపిన గిరులయందు వెదకి , మూఁడు
లోకముల , వికుంఠలోకంబునందును
నెరసి వెదకి వెదకి నేఁటి కిచట. 81

క. మీ పాదంబులు గంటిమి
తాపము చల్లారె , భూతదయ దళుకొత్తన్
పాపాత్మకుఁడగు రావణు
నీపట్ల నడంచి మమ్ము నేలు ముకుందా ! 82

సీ. క్షీరసాగరమును , శ్రీవికుంఠము నెడఁ
బాసి మీ రీ శేషపర్వతమున
వసియించియుండి యెవ్వరికినిఁ గనిపింప
కిచ్చటనే యుండు హేతువేమి ?
ఇందె మీరుండఁగా నీ లోకవాసుల
మించి రావణుఁడు గాఱించుటేమి ?
దుష్టుల మర్దించి శిష్టుల రక్షించు
మహనీయ సత్కీర్తి మఱచుటేమి ?
తే. పరమపూరుష ! మమ్ము నెప్పటి విధమునఁ
బాలనముసేయఁ బనిఁబూని పంక్తికంఠు
నడఁపవే !' యని మ్రొక్కఁగా నంబుజాక్షుఁ
డబ్జజాదులఁ జూచి యిట్లనియె మగుడ. 83

చ. 'జలజజ ముఖ్యులార ! మిము సత్కృపమీఱఁగ నేనె ప్రోచెదన్
ఖలుఁడగు రావణాసురునిఁ గాలము రాఁ గని నేనె త్రుంచెదన్
జెలఁగుచు నబ్ధిదాఁటి దశశీర్షుఁడు క్రమ్మఱ నిందు వచ్చినన్
దొలఁగ నడంచి నే నదరఁ దోలెద నెమ్మది నుండుఁ డందఱున్.' 84

చ. అని హరి పల్కుచున్న తఱి నా నిటలాక్షుఁడు వచ్చి విష్ణుదే
వుని వినుతించి యిట్లనియె ' భూరికృపాబ్ధి ! వికుంఠ పట్టణం
బును విడనాడి వచ్చి ఫణిభూధరమందు వసించియుండియున్
మనుజుల కష్ట దుర్దశల మాన్పక తేరగ డాఁగియుందురే ? 85

సీ. మర్త్యలోకమునకు మనుజాశనుల వేధఁ
దప్పింప శేష భూధరమునందు
నిలిచి భూప్రజలకు నీవు ప్రత్యక్షమై
యున్న , రాక్షసులు రాకుందు రిటకు
వారు రాకుండిన ధీరాత్ములై మాన
వులు నిన్ను సేవించుచుందు రిచటఁ
బొసఁగ నీ కీ గిరి భూలోకవైకుంఠ
మగుచుండు , నినుఁ బాయ కనిశ మేను
తే. నిలుతు భూలోకమందిఁక , నేను నిలువఁ
దగిన స్థాన మొకటి సిద్ధముగను దెల్పు
మిరువురము భూమియం దుంద మింక ' ననఁగ
నిందిరాధీశ్వరుఁడు నవ్వి యిట్టు లనియె. 86

ఉ. 'ఓ పరమేశ! నీ విచట నుండుట సమ్మతమయ్యె నాకు , నీ
వీ పటుపర్వతేంద్రమున కింద్రదిశన్ వసియించి యుండు , నీ
ప్రాపునఁ జేరి భూప్రజలు భక్తినిఁ గొందఱు నిన్నుఁ గొల్తు రీ
వీ పని సేయు ' మన్న గిరిజేశుఁడు సమ్మతి నొందె నయ్యెడన్. 87

క. హరి హరు లీ భూతలమున
నిరవుగ నుండుటకు నజ సురేంద్రాది మునుల్
పరమానందము తగఁ జెం
దిరి ; దశరథుఁ జూచి వాసుదేవుఁడు పల్కెన్. 88

ఆ. 'దశరథేశ ! నీవు తాపసులను గూడి
యిటకు వచ్చినట్టి హేతువేమి ?
తెలుపు ' మనిన , భక్తి దీపింపఁగాఁ గోస
లేశ్వరుండు శ్రీ రమేశుఁ జూచి. 89

వ. కరకమలంబులు ముకుళించి నిలిచి, యనేక ప్రకారంబుల వినుతించి
యిట్లనియె. 90

తే. 'విశ్వకారణ ! విశ్వాత్మ ! విష్ణుదేవ !
సంతతానంద విగ్రహ ! చక్రపాణి !
మిమ్ముఁ జూడఁగ మదినెంచి మీ కటాక్ష
మిపుడు గామించి వచ్చితి నిందిరేశ ! 91

## దశరథుఁడు స్తుతించుట

ఆ. ఎవరికొఱకుఁ బద్మజేంద్రముఖ్యులు తపం
బెపుడుఁ జేతు , రెవరి యిష్ట సూక్తు
లెపుడు వినఁదలంతు , రెవరి ప్రత్యక్షంబుఁ
గోరుచుందు రట్టి గురుఁడ వీవె. 92

ఆ. విష్ణుదేవ ! సకల విమత సంహరణ కా
రణ ! పురత్రయంబు నణఁచినట్టి
సాధనంబె మీకు సాధనంబగు , మీ ప్ర
భావ మెఱుఁగ దరమె బ్రహ్మకైన ? 93

ఆ. సృష్టికర్త లెల్ల శ్రీ స్వామి ! నీదు మ
హాజ్ఞ మీఱ వెఱచి యనవరతము
వారి వారి పనుల వారు చేయుదురు, నీ
కంటె నధికు లెచటఁ గలరు ? తలఁప. 94

ఆ. నాశరహితమై , యనాది ప్రకాశమై
బట్టబయల నుండు పరమపదము
మీ నివాసమయ్యెఁ గాన మీ సర్వోన్న
తత్వ మెఱిఁగి పొగడఁ దరమె నాకు ? 95

సీ. దేవ దేవ ! పరాత్మ ! దీనుఁడనై యొక్క
మనవి చేసెదను సమ్మతిని వినుఁడు !
మీ రిచ్చినటువంటి భూరి భాగ్యంబులు
గలిగియున్నవి , వంశగౌరవంబు
నిలుపఁగాఁ దగు పుత్త్రకులు లేరు గావునఁ
జింత పుట్టినది నా చిత్తమందుఁ
' బుత్త్రహీనునకు సత్పుణ్యలోకములు లే '
వను వేదపూరుషుం , డందువలనఁ
తే. దాపమొందుచు వచ్చి నే మీ పదములు
నమ్మి సేవించితిని గాన , సమ్మతముగ
సత్య ధర్మ పరాక్రమ శక్తి మతులు
గలుగు పుత్త్రుల నొసఁగవే ! కమలనాభ ! ' 96

క. అని దశరథుఁ డిటు వలుకఁగ
విని మనమున సంతసించి విష్ణుం డపు డి
ట్లనియెను ' జన్మాంతరమున
ఘనపాపము చేసినావు గావున నీకున్. 97

తే. పుత్త్రకులు గల్గరై రహో ! భూప ! ' యనిన
విని మనంబున లజ్జించి , వేగ ధైర్య
కలితుఁడై పంక్తిరథుఁడు దక్కకను మరల
నిందిరాధీశ్వరునిఁ జూచి యిట్టు లనియె. 98

సీ. 'నారాయణాఖ్యాత ! నా పూర్వ జన్మమం
దేను చేసిన పాప మెంత యున్న
నబ్జాప్తుఁ డుదయించినపు డంధకారంబు
నశియించినటువలె నా యఘంబు

మిముఁ జూచినప్పుడే సమసిపోయినది , నా
కింక పాపంబు లే ; దెట్లనైన
నిపుడు నా తప్పుల నీ రీతి నెన్నక
పుత్త్రుల నిచ్చి నన్ పుణ్యగతిని
తే. మీరె పొందింపవలయు నో నీరజాక్ష !'
యని భరన్యాస మప్పుడా హరి పదంబు
లందుఁ జేసి మహాదీనుఁడగుచు నిలిచి
యున్న దశరథుఁ జూచి పద్మోదరుండు. 99

వ. అప్పుడు నిర్హేతుక జాయమాన కటాక్ష వీక్షణామృత బిందు బృందంబు లా
నృపతి యందుఁ జిలికి యిట్లనియె. 100

సీ. 'దశరథేశ్వర ! మీకుఁ దాపత్రయం బింకఁ
బనిలేదు , నేనె నీ పాపములను
హరియించి నిన్నుఁ గృతార్థునిఁగాఁ జేసి ,
బాహు బలాఢ్యులై ప్రబలి ధరను
నా సమానులునైన నలుగురు కొడుకుల
నీ కిచ్చెదను , నమ్మి నీ పురంబుఁ
జేరి యచ్చట నీవు శీఘ్రంబుగాఁ బుత్త్ర
కామేష్టిఁ గావింపు క్రమముగాను
తే. నన్ను నీవు నుతించిన నాల్గు శ్లోక
ములకు నే సంతసించితి ; ముఖ్య వరము
లిచ్చి తిఁకఁ బొమ్ము నీ భూమి కినకులేశ ! '
యనిన విని పంక్తిరథుఁడు శ్రీహరికి మ్రొక్కి. 101

వ. అనేక విధంబుల వినుతించి, మరల సెలవు గైకొని , బ్రహ్మాదులకు మ్రొక్కి
దీవన లంది , నిజగురు వసిష్ఠసహితుండై యయోధ్యాపురంబుఁ జేరి పుత్త్ర
కామేష్టి ప్రయత్నంబు సేయుచుండె ; నంత. 102

ఆ. 'జలజగర్భ ! నీవు సత్యలోకము (బాసి
యిచట నుండ నింక నుచితమగునె ?
నేను కొంతకాల మీ నగమం దుందు
నీవు సేరు మింక నీ పురమున .' 103

క. అని పలికిన హరి పలుకులు
విని, కమలజుఁ డేమి యనక విన్న(దనముతోఁ
దన తలలు వంచి యుండినఁ
గని నగి హరి యిట్టులనియె గారవ మొప్పన్. 104

ఆ. 'కొడుక! నీవు మదినిఁ గోరిన కోరిక
నిచ్చెదను శిరంబు లెత్తి యడుగు'
మనిన బ్రహ్మదేవుఁ డా హరి పదపద్మ
ములకు మ్రొక్కి లేచి పలికె నిట్లు. 105

సీ. 'జనక ! మీ రిప్పు డీ శైలాగ్రమున నెట్లు
నిలిచియున్నా రట్లనే జనులకుఁ
గనిపింప వేఁడెదఁ గల్పాంత పర్యంత ,
' మదియేల ? ' యనిన , నీ యవనిమీఁద
జనియించు మనుజులు సత్య శౌచాచార
ముల వీడి చెడుదురు కలియుగమున
నటుగాన యముఁడు మహానారకములందుఁ
బడఁగూల్చి తిట్టుచు బాధఁ బెట్టి ,
తే. యవల విడిచిన , దుఃఖమగ్నాత్ములగుచుఁ
బుట్టి గిట్టుచు నుందు రీ భూతలమున
వారిఁ గడతేర్ప నిచట నెవ్వరును లేరు
శ్రీమహాస్వామి ! మీరె రక్షింపవలెను. 106

సీ. కలియుగంబునన్దయందుఁ గలిగెడి మనుజు ల
ల్పాయుస్సహితులు దురాగ్రహులును
గరినులు లోభులు కాముకుల్ వంచకుల్
క్రోధులు జడమతుల్ కుత్సితులును
పరధనాసక్తులు పరసతీరతులు , ని
ర్భాగ్యులు గర్వులు పాపమతులు
సాధుదూషకులు మాత్సర్యసంకలితులు
జారులు చోరులు సకల పాప
తే. కర్మములు చేసి పడిపోయి కష్టదశలఁ
బొందుదురు గాన వారినిఁ బ్రోచుకొఱకు
మీరు వేంకటగిరియందె మెలఁగుచుండి
వారినెల్లను రక్షింపవలయుఁ దండ్రి !' 107

చ. అన విని విష్ణుఁ డిట్లనియె ' నౌర ! కుమార ! మదీయ మానసం
బునఁ గల యర్థ మీవు బహుముఖ్యముగా వినిపించి, తందు చే
ఘనతరమైన భూతదయ గల్గినవాఁడవటంచు మెచ్చితిన్
జనహితకారియైన ఫణిశైలమునందె వసింతుఁ బద్మజా ! 108

ఆ. సకలతీర్థములకు స్వామిని యైనట్టి
పుష్కరిణి వికుంఠపురమునుండి
వచ్చి యీ నగమున వసియించియుండఁగాఁ
బాపమెట్ల పొందుఁ బ్రజల నింక. 109

సీ. ఆ వికుంఠంబునం దైరమ్మదాఖ్యచే
దీపించు సత్పుణ్య తీర్థమునకు,
నదియునుగాక గంగాది తీర్థములకు
స్వామియై యీ శేషశైలమందు

ఘనముగా నుండు పుష్కరిణిలో భక్తితో
స్నానముల్ చేసిన జనులకెల్ల
సకలపాపంబులు , సకల రోగంబులు
సమసిపోవును , గల్గు సంపదలును
తే. భూమిలోపల వారల కామితార్థ
ములను నేనిత్తుఁ , జింతింపవలదు నీవు
సంతసించుచు నుండు మో జలజగర్భ ! '
యనినఁ జక్రినిఁ జూచి యిట్లనియె నజుఁడు. 110

క. 'దనుజులు భూలోకంబున
వనదుర్గములందు డాఁగి వచ్చి చలముచే
మనుజుల బాధింపుదు రటు
గనుకను దద్వేధ మాన్పఁగావలె నీశా ! ' 111

తే. అనిన విని చక్రమును జూచి యంబుజాక్షుఁ
డనియెఁ ' గుముదాది వీరుల నమరఁ గూడి
వివిధ సాధనములతోడ వేగఁ బోయి
రాక్షసులఁ ద్రుంపు మో చక్రరాజ! యిపుడె. ' 112

సీ. అన విని యా చక్ర మబ్జాక్షునకు మ్రొక్కి
కుముదాది వీరులఁ గూడి వెడలి
ప్రళయ కాలాభీల భానుబింబము రీతి
సరభసంబుగఁ బోయి సకల దుర్గ
దిగ్దేశముల నుండు దేవకంటకులపైఁ
గవిసి పోరాడి యాగ్రహముఁ బెంచి
యా రాక్షసులఁ ద్రుంచి యఖిల దేశంబులు
కుదిరించి వేగ ముకుందు చెంత

తే. నిజబలంబులతో వచ్చి నిలిచి మ్రొక్కి
'స్వామి ! రావణబలముల సంహరించి
వచ్చితిమి ప్రోవు ' మన విని వాసుదేవుఁ
డపుడు చక్రము చేపట్టి యజునిఁ జూచి. 113

ఆ. 'అజుఁడ ! నీవు చెప్పినటువలెఁ జక్రంబు
చపల దానవులను సంహరించె
జనులకొఱకు నీవు జాలినొందకు మింకఁ
బొ ' మ్మటన్న నజుఁడు పోకయుండె. 114

వ. ఇట్లున్న విరించినిఁ జూచి హరి మఱియు నిట్లనియె. 115

క. 'వనజజ ! నేఁ బొమ్మనినను
నెనరునఁ బోఁజాల , విపుడు నీ మదిలోఁ గో
రిన కోరిక యే ? ' మనినను
విని పద్మజుఁ డిట్టులనియె వినయముతోడన్. 116

సీ. 'దేవ ! మీరును రమాదేవి నా విన్నప
మాలింపవలె నదెట్లన్న వినుఁడు !
వేంకటగిరిమీఁద విఖ్యాతి నుండు మీ
కున్నతమైన రథోత్సవంబుఁ
జేయింపవలె నది చిత్తగింపుఁ ' డటంచు
విన్నవించిన మహావిష్ణుఁ డలరి
సిరితోడ సమ్మతించిన , బ్రహ్మ సంతోష
భరితుఁడై మునివరుల్ సురలు దాను

తే. నది మొదలుగాఁ బ్రయత్నంబు లచటఁ జేసి
విశ్వకర్మను రావించి ' వివిధ చిత్ర
పురము నచ్చట నిర్మింపు ! భూధరంబు
చుట్టుపట్లను రచియింపు ! పట్టణములు. ' 117

చ. అన విని విశ్వకర్మ విపులాద్భుత చిత్ర విచిత్ర రీతులన్
బెనుపుగఁ దప్తహేమపుటభేదనముల్ రచియించి , పిమ్మటన్
ఘనతర మేరుతుల్యముగఁ గాంచనరత్నరథంబుఁ దీర్చి యి
చ్చినఁ , గని పద్మజుండు నిజ చిత్తమునందు ముదంబు నొందుచున్. 118

క. ఘనుఁడగు విఖనసుఁడను మునిఁ
గనుఁగొని ' వైఖానసప్రకార సుసూత్రం
బున కనుకూలత గలిగిన
సునిశిత లగ్నంబు వెదకి చూడు మునీంద్రా ! ' 119

సీ. అని బ్రహ్మ పల్కఁగా నా విఖనసుఁ డిట్టు
లనియెఁ ' గన్యారాశియందు సూర్యుఁ
డమరఁ బ్రవేశించినట్టి మాసమునఁ జి
త్రాఖ్య నక్షత్రంబునందు శాస్త్ర
మభిమతంబుగ సధ్వజారోహణము చేసి ,
యుత్తరాషాఢ రథోత్సవంబు
గావించి, శ్రవణ నక్షత్రమందే తీర్థ
వారిఁ జేయింపఁగా వలయు ' ననుచు
తే. విఖనసుఁడు వల్క విని బ్రహ్మ వేగ లేచి
తక్క కపు డుత్సవ ప్రయత్నంబు చేసి
సకల దేశాధిపతుల నుత్సవముఁ జూడఁ
బిలువ నంపించెఁ జారులఁ బ్రీతి నెరయ. 120

వ. అప్పు డా చారులు వోయి హరిమహోత్సవ ప్రయత్నంబులు వినిపించిన ,
వారు సంతసించి , ద్రవిడ , కర్ణాట , కురు , కుకుర , కేకయ , కోసల ,
బర్బర, మహారాష్ట్ర , మగధ , మాళవ , శూరసేన , సుధేష్ణ , చోళ , నేపాళ,

మలయాళ, పాండ్య , బంగాళ , పాంచాల , కొంకణ , విదర్భ , టేంకణ సౌరాష్ట్ర , సౌవీర , శక, కిరాత , యుగంధ , రాంధ్ర , విదేహ , మత్స్య , పుళింద , చేది , త్రిగర్త , సింహ , సింధు , లాట , ఘోట , కాంభోజ , కాశ్మీరాది దేశదేశాధీశ్వరులు తీవ్ర గతుల రథ గజ తురంగాందోళికాది వాహనంబు లెక్కి సకుటుంబులై వచ్చు మార్గంబులయం దనేక జనంబు లన్నసత్ర , నీరాగారంబులును , జలువ చప్పరంబులును నిర్మించి , యన్నోదక వస్త్ర భూషణ ఛత్ర చామర పాత్ర పాదుకా వాహనాది దానంబులు చేయఁగా , గ్రహించి సంతసించుచు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర జనంబులం దనేకులైన భక్తులు గోవిందేతి నామంబు లుగ్గడించుచు వేంకటాచలారోహణంబు చేసి , యనేకంబులయిన విడుదులయందు నిలిచి, తదనంతరంబునఁ బుష్కరిణియందు స్నానంబు చేసి , శ్రీ వరాహస్వామి నీక్షించి మ్రొక్కి కానుకలు సమర్పించి , శ్రీనివాస దర్శనంబు చేసి , యనేక వస్త్ర భూషణ ధనరాసులు సమర్పించి మ్రొక్కి సేవించుచుండ , నంత నజుండు విష్వక్సేనునిఁ బిలిచి యిట్లనియె. 121

క. 'విను సేనాధిప ! మజ్జన
కునకు మహోత్సవము లిచటఁ గొనసాగింపన్
పను లన్నియు సమకూర్పను
జను మందలమెక్కి ' యనఁగ సంతస మొప్పన్. 122

సీ. అపుడు సేనాపతి హరి , కజునకు మ్రొక్కి
యందల మెక్కి సానందుఁడగుచుఁ
దన పరివారములను గూడి తిరువీధు
లందుఁ జరించుచు నందటికినిఁ
దగు పనుల్ నియమించి , ధాత చెంతకు వచ్చి
యంజలిఁ గావించి యచటఁ జేయఁ
దగు పనుల్ సేయింపఁ దా నాద్యుఁడై యుండె ;
నా విఖనసుఁడు దా నంతమీఁద

తే. నమర మృత్సంగ్రహంబు , పుణ్యాహవాచ
నంబుఁ గావించి , వర శరావంబు లమరు
పాలికల నవధాన్యముల్ పరఁగఁ గూర్చి
యొప్ప నాగమ విహిత మంత్రోక్తముగను. 123

వ. హస్తయం దంకురార్పణంబును , నైవేద్యాదికృత్యంబులు నెఱవేర్చి యమ్మఱునాఁ డుదయంబునఁ బుణ్యాహవాచన , వాస్తు హోమ గరుడప్రతిష్ఠా, గరుడ హోమ , భేరీ తాళ తాడన , కంకణధార , ణార్చక బహుమానాది కృత్యంబు లొనరించి , మఱియును. 124

సీ. హరికి భూమికి నీళ కబ్ధికన్యకు నూత
నాంబరాభరణంబు లర్పణములు
చేసి, శృంగారముల్ చేసి , హాటకరత్న
దీధితు లొప్పిన తిరుచయందు
వేంచేపు సేయించి , వివిధ మంగళ వాద్య
ములు భూనభోంతరములను నిండ
మ్రోయుచునుండఁగా , ముందఱ దిగ్బలి
తగఁ జల్లుచుండఁగా , ధ్వజపటంబు
తే. ప్రభలఁ జక్రము , సేనాధిపతియు నడువ ,
మునులు , సనకాది యోగులు మొనసి పొగడ
ఛత్ర చామరములఁ బూని సకల దేవ
వితతి గొల్వంగ నిటు తిరువీధులందు. 125

సీ. అఖిలవైభవముల నానంద నిలయంబు
నకుఁ బ్రదక్షిణముగా నళినభవుఁడు
శ్రీహరిన్ వేంచేపు చేయించి కొనిరాఁగ
విఖనసుఁ డటు శాస్త్రవిహితసరణిఁ
దప్పిపోనీక చిత్తను ధ్వజారోహణ
మొనరించి యా రాత్రి ఘనతరముగఁ
జక్కఁగా నవకలశ స్థాపనముచేసి
యష్టదిక్పాలుర, హరిని నచట

తే. బొసఁగ నావాహనము చేసి , పూతమైన
దీక్ష మెఱయఁగ నగ్ని ప్రతిష్ఠ చేసి
సకల దైవత్య పారమాత్మికము లనఁగఁ
దగిన హోమము లొనరించి తక్కకపుడు. 126

సీ. వాహన నక్షత్ర వరదిన వారాది
నిత్య హోమంబు లన్నియును నడపి
దిగ్బలితోఁగూడ దివ్య చక్రంబును
వేంచేపు సేయించి వేడు కలరఁ
దఱచుగా భేరీ మృదంగాది శుభవాద్య
ముల ఘోషణములు దిఙ్ముఖములందు
మ్రోయఁగా నా బ్రహ్మ ముఖ్య రథము
వెంట నతిశయ శేషవాహనముమీఁద

తే. శ్రీనివాసుని నుంచి విమానమునకుఁ
బూర్వరీతిఁ బ్రదక్షిణంబుగ ననేక
సేవకులతోడ వేంచేపు చేసి యజుఁడు
హరిని స్వస్థానమునఁ జేర్చి నంత మీఁద. 127

వ. ఇట్లు నవకలశ పాలికారాధన నైవేద్య హోమ చక్రబలి ప్రముఖ నిత్యకృత్యంబులు దినదినంబును నెఱవేర్చుచు , నలఘు శేషవాహనోత్సవంబైన మఱునాఁ డుదయంబునందు లఘు శేషవాహనోత్సవంబును , నా రాత్రి హంస వాహనోత్సవంబును , మూఁడవ దినం బుదయంబున సింహవాహనోత్సవంబును, నా రాత్రి పుష్పమౌక్తిక విమానోత్సవంబును , నాలవదినం బుదయంబున సర్వభూపాలోత్సవంబును, నా రాత్రి కల్పవృక్షోత్సవంబును , నైధవదినం బుదయంబున మోహినీ వేషధరుండైన హరికి నాందోళికోత్సవంబును , నా రాత్రి గరుడోత్సవంబును , నాఱవదిన ముదయమందు

హనుమద్వాహనోత్సవంబును , నా సాయంకాలము వసంతోత్సవానంతర మైరావతోత్సవంబును , సప్తమ దినోదయమందు సూర్యప్రభోత్సవంబును, నా రాత్రి చంద్రప్రభోత్సవంబును , నెనిమిదవ దినం బుదయంబున షోడశమహాదానాది విహితకృత్యంబులు నడిపించి, మఱియును. 128

సీ. ఘనతరోన్నతముగాఁ గనకాద్రి తుల్యమై
రంగు నిగ్గుల నొప్పు రథమునందు
నెలవుగా శ్రీ భూమి నీళలతోఁ గూడ
హరి నుంచి బ్రహ్మాదు లలఘురథము
సాగించుచుండఁగా , సకల దిక్పాలకుల్
గరుడ గంధర్వ కిన్నర గణములు
సిద్ధ విద్యాధరుల్ సేవింప , దేవ దుం
దుభులు మ్రోయఁగ మహాద్భుతముగాను

తే. బారిజాత సుమంబు లా బ్రహ్మ రథము
పైన రంభాదు లటఁ జల్లి పాడి యాడి
కనులపండువుగాఁ జూడఁగా , ధరిత్రి
యందుఁగల మానవులు వేంకటాద్రిమీఁద. 129

సీ. ధీరయతుల్ వాసుదేవుని విజ్ఞాన
సురుచిర భక్తులఁ జూడఁగాను
నుపనిషత్తులు చెప్పుచొగి స్మార్తు లా హరిఁ
జిత్స్వరూపముగ లక్షింపఁగాను
దత్త్వవాదులును భేదశ్రుతిసార మీ
దేవతోత్తముఁడని తెలియఁగాను
మొనసి వేదాంతంబు లొనరంగఁ జదువు వై
ష్ణవులు మాధవ భక్తి సలుపఁగాను

తే. జెలఁగి హరికీర్తనలు కవుల్ చెప్పఁగాను
పండితులు విని శ్లాఘించుచుండఁగాను
బ్రాహ్మణ స్త్రీలు పాటలు పాడి హరికి
నెయ్యమున మంగళారతు లియ్యఁగాను. 130

సీ. పరమ భాగవతులు భక్తితోఁ బాడుచు
నుప్పొంగి యాడుచు నుండఁగాను
గరములు ద్రిప్పి భోగస్త్రీలు ముందఱ
జతలుగా నృత్యముల్ సలుపఁగాను
గ్రమముగా వంది మాగధ సూత బృందముల్
పురుషోత్తమ ఖ్యాతిఁ బొగడఁగాను
శిరములఁ గలశముల్ జేర్చి కొందఱు భక్తు
లొక్కెడఁ బ్రేరణుల్ ద్రొక్కఁగాను

తే. మొనసి కొందఱు 'గోవింద !' యనుచు భక్తి
పరవశత్వముచే మించి పలుకఁగాను
రథముపైఁ దండులము లనురాగ యుక్తి
సతులు మేడలపై నుండి చల్లఁగాను. 131

వ. ఇట్లనేకు లనేక ప్రకారంబులుగా వినోదించుచు వినుతించుచు భక్తి సల్పుచుండఁగాఁ గనకకమలసుగంధ పుష్ప మౌక్తికహారంబులతోడఁ దులఁ దూగుచు మేరు సమానంబైన తే రానందనిలయంబునకుఁ బ్రదక్షిణంబుగా వచ్చి, యథాస్థానంబునందు నిలిచె ; నంత శ్రీవేంకటేశ్వరుండు శ్రీ భూమి నీళా సమేతంబుగా రథంబు డిగ్గి , బ్రహ్మ రుద్రాదులతోడఁ గల్యాణమంటపంబుఁ బ్రవేశించి , నిత్యహోమాది కృత్యంబులు నెఱవేర్చి, సకల దేవగణంబులచేతఁ బూజితుండై ధ్వజారోహణంబు మొదలుకొని యారగించిన ప్రకారంబుగా ఘృతసూపాన్న , ముద్గాన్న , తిలాన్న , శాల్యన్న,

మరీచాన్న , మాషాన్న , గోధూమాన్నంబులును , బుళియోగిరము , గుడాన్న, పరమాన్న , దధ్యన్నములు, నతిరసంబులు , వడలు , మనోహరంబులు మొదలయిన వివిధ భక్ష్యంబులను సమర్పించిన నారగించి తృప్తుండయ్యె. బ్రహ్మాదులును నారగించి పరితృప్తిం బొంది శ్రీనివాసుని నుచ్చైశ్శ్రవంబునం దుంచి విమాన ప్రదక్షిణంబు సేయించి, కల్యాణమంటపంబునందు వేంచేపు సేయించి యథాస్థానమం దుంచి , చూర్ణాభిషేకంబు చేసి , క్రమ్మఱం జక్రత్తాళ్వారులను , హరిని , శ్రీ భూమి నీళలను దిరుచయందు విమాన ప్రదక్షిణంబుగా స్వామిపుష్కరిణీ తీరంబున వేంచేపు సేయించుకొని వచ్చి వరాహస్వామి ముందఱి మంటపంబులో నునిచి, పంచామృత స్నపనంబును , దిరుమంజనంబును , జక్రస్నాన , నైవేద్య క్రమంబులును నాచరించి బ్రహ్మాదు లవభృథస్నానంబులు చేసి ; రప్పుడు వారలం జూచి శ్రీనివాసుండు చేయెత్తి యిట్లనియె. 132

సీ. 'బ్రహ్మరుద్రాది దిక్పాలకు లందఱు
నా మాట వినుఁడు నిర్ణయముగాను
శ్రవణంబునందు నా చక్రంబుతోఁగూడ
స్వామిపుష్కరిణిలో స్నానములను
సల్పువారలు పూర్వజన్మంబులను జేయు
పాపంబులను బాసి భాగ్యవంతు
లై యిహ పరములయందు సుఖింతురు
నా పల్కు నిజముగా నమ్ము ' డనిన

తే. శంకరుఁడు పద్మజుం ' డిది సత్య ' మనుచుఁ
బల్కి ; రటుమీఁద సకలవైభవము లెసఁగ
శ్రీనివాసుఁడు కోవెలఁ జెంది యచటఁ
బొసఁగు కల్యాణమంటపంబున వసించె. 133

వ. మఱియు విఖనస ప్రముఖులు ప్రసూన యాగ , నిత్యహోమాది కృత్యంబు లొనరించి , పత్నీసమేతంబుగా హరిని విమాన ప్రదక్షిణంబు సేయించి క్రమ్మఱ నిజస్థానంబునం దుంచి , బ్రహ్మాది దిగ్దేవతా బలియు , నుద్వాసనంబును , ధ్వజావరోహణంబును , నంకురాక్షతారోపణంబును , సంపూర్ణ హోమంబును , గలశోద్వాసనంబును , శ్రీస్వామియందుఁ బ్రధానకలశావాహనంబును గావించి ; రప్పుడు శ్రీనివాసుండు విఖనసునకు బహుమానంబు చేసి , కనకరత్న స్థగితంబైన సభామంటపంబునందు శ్రీ భూ నీళా సమేతంబుగా సకల దివ్య భూషణ కనకాంబర పరిమళ గంధపుష్ప మాలికాలంకృతుండై , బ్రహ్మరుద్రేంద్ర ముని యోగీశ్వర ప్రముఖులును , సకలదేశాధీశ్వరులైన రాజులును బరివేష్టించి కొలువ సకలవైభవంబు లంగీకరించుచుఁ , గరదీపికా సహస్రంబులు ప్రకాశింప , హేమసింహాసనాసీనుండై కొలువుండి బ్రహ్మను జూచి సంతసించి యిట్లనియె. 134

క. 'కమలజ ! నీ సంకల్పము
క్రమముగ ఫలియించె , మోదకలితుఁడ నైతిన్
సుమహితముగ నీ యుత్సవ
మమరఁగ బ్రహ్మోత్సవాఖ్య నవనిన్ వెలయున్. 135

చ. స్థిరమతితోడ నీ విచటఁ జేసిన దివ్యరథోత్సవంబు భా
స్వరమగు భక్తి నిచ్చటికి వచ్చుచుఁ జూచుచునుండువారు దు
స్తర భవ ఘోరవారినిధి దాఁటి సుఖింతురు, వారినెల్ల నేఁ
గరుణను బ్రోచుచుందు నిది గట్టిగ నమ్ము విధాత ! నీ మదిన్. 136

శా. నా రూపంబు మనంబునం దలఁపుచు న్నా కీర్తనల్ పాడుచున్
వేఱే చింతలు లేక నాయెడ మహావిశ్వాసమున్ నిల్పుచున్
శ్రీరమ్యంబగు భక్తి పెంచి నను నర్చించే విధానంబుచే
నారాధిన్ దగు పూజసేయు జనులం దాసక్తి నే నుండెదన్. 137

సీ. వారి యాపదల నివారింతు , భక్తితో
వారిందుఁ గోరిన వరము లిత్తు
ధన రత్న వస్తు వాహన ధాన్య సంతాన
ముల నిత్తు , నదిగాక మోక్ష మిత్తు
నా మీఁద సద్భక్తి నాటించు జనులకుఁ
దోడునీడై యిట్లు తుదను జేర్తు
నెంత నమ్మిన వారి కంత ఫలమ్మిత్తు
నమ్మఁజాలనివారి నెమ్మిఁ జెఱుతు
తే. నీ స్థలంబున భక్తితో నెవ్వరైన
నన్న వస్త్రార్ధ గృహ పాత్ర లార్యజనుల
కొనరఁగా దానములు సేయుచున్న ధన్యు
లనుభవింతురు భాగ్యంబు లవనియందు.' 138

వ. అని పల్కి , రుద్రేంద్రాదులఁ జూచి మఱియు నిట్లనియె. 139

సీ. 'అమరఁ గన్యారాశి కబ్జమిత్రుఁడు వచ్చి
నప్పు డిట్లుత్సవం బాచరింప
వలయు , మీ రందఱు వచ్చి వేడుకగాను
బ్రతివత్సరంబును భక్తి మెఱయ
నీ మహోత్సవ మంద ఱిచ్చట నడిపింపు
చుండుఁడీ ! యిచ్చట నుందు నింక '
నని రాజులను బిల్చి ' యవనీశులార ! మీ
రేడాది కొకమాఱు నీడఁ జేరి
తే. ధరణిపై మీకుఁ గల్గిన ద్రవ్యమందు
నాలుగవ పాలు గొనితెచ్చి నాకు నిచ్చి
భూరి సామ్రాజ్యముల మీరు పొందుచుండుఁ '
డనుచు హరి భూమిపతుల కిట్లానతిచ్చె. 140

సీ. మఱియు నిట్లయె ' నిర్మల పుణ్య కర్మముల్

వెలయ సల్పుఁ 'డటంచు విప్రులకును

' మఱువ కెల్లపుడు బ్రాహ్మణ కుటుం

బముల సంరక్షింపుఁ 'డని మహారాజులకును

' ద్విజుల ననుసరించి విహిత వాణిజ్యముల్

వసుధ సల్పుఁ 'డటంచు వైశ్యులకును

'విప్రులనెల్ల సేవించుచు దాసులై

సుఖియింపుఁ ' డనుచును శూద్రులకును

తే. నియమములు చేసి , ' యందఱు నిరత మిచట

వరుసగాఁ బుష్ప,తులసికా వనము లమర

నిర్మితంబులు చేయుఁడీ ! నిఖిల ధర్మ

సరణులను దప్పకుండుఁడీ ! శాంతులగుచు.' 141

వ. అని యిట్లు చాతుర్వర్ణ్యంబువారికిఁ దగిన సకల ధర్మంబుల నుపదేశించి, వస్త్ర భూషణ చందన తాంబూలంబులు సన్నిధియందు బహుమానంబుగా నిప్పించి , ' మీ మీ స్థలంబులు చేరి మగిడి మదీయోత్సవంబునకు రావలయు ' నని నియమించిన , వా రందఱును హరికిఁ బ్రణమిల్లి తదాజ్ఞాధారులై వేంకటాచలంబు డిగ్గి తమ తమ దేశంబులఁ జేరి ; రంత హరి విరించి ప్రముఖులఁ జూచి మఱియు నిట్లనియె. 142

## శ్రీహరి బ్రహ్మాదుల వీడుకొల్పుట

సీ. 'బ్రహ్మాదులార ! నా పలు కాలకింపుఁడీ !

యీ వేంకటాద్రియం దెవ్వరైన

ధరణీసురుల కన్నదానంబు చేసిన

నేఁ దృప్తిఁ బొంది మన్నింతు వారి.

నదిగాక సకల విద్యాదానములు సేయు
వారును, మఱి వారి వంశజులును
వారి వంశజులును, వారి వంశజులును
బుణ్యలోకంబులఁ బొందఁగలరు

తే. మొనసి బృందావనముఁ దీర్చి ముఖ్యమైన
తులసి యందుంచి , తద్దళంబులను నాకు
భక్తితో నర్పణము సేయు ప్రజల కెల్ల
స్వర్గసామ్రాజ్య మిత్తు నిశ్చయముగాను. 143

వ. ఈ ప్రకారంబుగా నొక్క తులసీదళంబునకు ఫలం బర్బుద దివ్యవత్సరంబులు స్వర్గభోగం బనుభవించిన యనంతరంబున వారికి మత్పదం బిత్తుం గావున , నీ వేంకటాద్రియందు సకల దివ్య పుష్పవనంబులు నిర్మించి , తత్పుష్పంబులు సద్భక్తిపూర్వకంబుగా నా కర్పించుచు , నహంకార విముక్తులై యుపశాంతు లైనవారికి మోక్షంబు నిత్తు ; నదియునుంగాక ప్రత్యహంబును భక్తి పూర్వకంబుగా షడ్రసోపేతాన్నంబు యథోచితంబుగా నాకు సమర్పించిన సకల లోకంబులు తృప్తిఁ బొందు 'నని యిట్లనేక ప్రకారంబులఁ గర్మ జ్ఞాన భక్తి ధర్మ సూక్ష్మంబులు బ్రహ్మాదుల కానతిచ్చి , బ్రహ్మ కిట్లనియె. 144

సీ. 'జలజసంభవ ! నీవు సత్యలోకము వాసి
నా కొఱ కిచట నిన్నాళ్ళు నిలిచి
బ్రహ్మోత్సవాఖ్యచేఁ బ్రబలు మహోత్సవ
మిచటఁ జేయించితి, విందువలన
వనధిజా భూ నీళలును నేను సంతోష
భరితులమైతి ; మీ ఫణినగమున
నిలిచియుండెద , మింక నీకు వరంబు లే
మిత్తు ?' నన్నను భారతీశుడనియె

తే. 'జనక ! నను మున్నె మన్నించి సద్వరంబు
లిచ్చియున్నారు, నా కిప్పుడేమి కొదువ ?
యిఁకఁ దిరోధాన మొందక యిచట నెపుడు
నిలిచియుండుఁడి ! నన్ను మన్నించి తండ్రి ! 145

క. నరకంబులఁ బడనీయక
నరులను మీ రిచట రక్షణము చేసినదే
వర , మింతకన్న వేఱొక
వర మేలను నాకు ? భక్త వరద! ముకుందా ! ' 146

సీ. అన విని హరి యిట్టు లనియె ' నీ మాట స
మ్మతమె ; నా కింకను మతము గలదు
వినుమది నాయందు విశ్వసించుచు భక్తి
సల్పుచు నున్నట్టి సాధువులను
బాధించువారు మద్బాహు సమానులై
నను నిగ్రహింతు నిర్ణయముగాను
నన్నెవ్వ రేమి యన్నను నే సహింతు , భ
క్త జనంబు నన్న నేఁ దాళలేను
తే. జయుఁడు విజయుండు సనకాది సంయములకు
మించి చేసిన యపకృతి కొంచెమైన
గొప్పయై వారలను నేలఁ గూల్చినట్టి
సరణి నే నన్నమాటకు సాక్షి గాదె ! 147

ఉ. భాగవతాపచార మతిపాపము గావున నట్టి ద్రోహమున్
లోఁగక చేయువాని యమలోకములోఁ బడఁద్రోతు , వాని నే
నే గతిఁ బ్రోతు ? నింక మఱి యెన్ని యఘంబులఁ జేసి వచ్చి ' నీ
వే గతి ' యంచు నన్నిచట వేఁడిన దీనునిఁ బ్రోతుఁ బద్మజా ! 148

క. వరభక్తుల నిందించిన
నరులను , గురు దూషకులను, నమ్మినవారిన్
జెఱచిన పాపాత్మకులను
నరకంబులఁ ద్రోతుఁగాని , నాపద మియ్యన్. 149

సీ. అతిశయ దంభ దర్పాద్యభిమాన దు
రాచార ఘోర దురాగ్రహముల
ననుసరించిన మర్త్యు లసురాంశజులును గా
వున సురాంశజులైన జనులనెల్ల
బాధింతు , రటువంటి పాపకర్ముల నేనె
శిక్షింపఁదగు పని సిద్ధ మిలను
దుష్టుల మర్దించి దుర్బలులైనట్టి
శిష్టుల నెల్ల రక్షించుకొఱకు
తే. నేను శేషాచలమునందు నిలిచియుందు
సత్యలోకమునకుఁ బోయి సకల సృష్టి
నీవు గావించుచుండుము నిన్ను నేను
బ్రోచుచుండెద నిఁక లేచి పొమ్ము బ్రహ్మ !' 150

వ. అని బ్రహ్మ కా నతిచ్చి , యింద్రునితో నిట్లనియె. 151

ఉ. 'పాకవిరోధి ! నీవు సురపంక్తుల నెల్లను గూడి వేడుకన్
నాకముఁ జేరి యచ్చట ఘనంబగు బాహుబలంబుఁ బెంచి ము
ల్లోకము లేలు ! దైత్యులకు లోఁగి చలింపకు మింక మీఁదటన్
నీకు జయంబు నిచ్చెదను ; నెమ్మది నుండు సురాధినాయకా !' 152

ఆ. అనుచు విష్ణుదేవుఁ డనిమిషపతి కిట్టు
లానతిచ్చి , నెయ్య మలర శివునిఁ
గాంచి మందహాసకలితాస్యుఁడై , స్నేహ
మెనయు బావ మెసఁగ నిట్టు లనియె. 153

శా. 'గౌరీనాయక ! నా మహోత్సవములన్ గల్పించి మీ రందఱిం
దారూఢంబుగఁ జేరి చూచితిరి ; నే నానందమున్ బొందితిన్
నీ రౌప్యాద్రికి నీవు పోయి యచటన్ నీ భక్త బృందంబులన్
ధారాళంబుగఁ బ్రోచుచుండు మతి సద్ధర్మస్థితిన్ శంకరా ! 154

సీ. వైకుంఠమునకంటె వరసుధాంబుధికంటె
లలి దివాకర మండలమునకంటె
ధన్యమైనట్టి శ్వేతద్వీపమునకంటె
శేషాచలంబు విశేషమగుచు
వాసిగా భూలోక వైకుంఠమన నొప్పు
చున్నది గనుక నే నుందు నిందు ;
నిచటికిఁ దూర్పున నెచ్చియున్న సువర్ణ
ముఖరి తీరంబున మొనసి నీవు
తే. నొనర భూలోక కైలాసమనఁగ నొప్పు
చున్న పుణ్యస్థలంబునం దుండు 'మనుచుఁ
జెప్పి , యప్పు డగస్త్యు నీక్షించి యిట్టు
లనియె శేషాచలేశ్వరుఁ డాదరమున. 155

తే. 'పరమపావన ! కుంభసంభవ ! మహాత్మ !
నీకు సమ్మతమగు చోట నిష్ఠ మెఱయఁ
జిరతరంబుగఁ దపమొప్పఁ జేయు ' మనుచుఁ
జెప్పి , సనకాది మునుల లక్షించి పలికె. 156

తే. 'యోగివరులార ! మీరు విరాగమహిమ
నరసి జ్ఞానామృతము గ్రోలి , యెపుడుఁ దృప్తి
నొంది యిచ్ఛావిహారులై యుండుఁ ' డనుచు
సమ్మతంబుగఁ బల్కె యా చక్రధరుఁడు. 157

వ. అపుడు బ్రహ్మేంద్ర రుద్ర-కుంభసంభవ సనకాదుల కివ్విధంబున నానతిచ్చి శ్రీ భూ నీళా సమేతంబుగా నంతర్విమానంబునందుఁ బ్రవేశించె ; నంత బ్రహ్మ హంసవాహనం బెక్కి సత్యలోకంబుఁ జేరె. ఇంద్రుఁ డైరావతం బెక్కి స్వర్గంబున కరిగె. రుద్రుండు నందివాహనం బెక్కి శేషగిరికిఁ బ్రదక్షిణంబుగాఁ గపిలతీర్థ మార్గంబున నరిగి కైలాసంబు చేరె. అగస్త్య ప్రముఖులైన మునులును , సనకాది యోగులును స్వామి పుష్కరిణికి నుత్తరభాగంబునం దుండు పాపవినాశనతీర్థంబు మొదలయిన సకల పుణ్యతీర్థంబులందుఁ గ్రుంకుచుఁ , బాపవినాశనోత్తర భాగంబునందు ఫాల్గుణశుద్ధపౌర్ణమి నతిముఖ్యంబగు తుంబురుకోన తీర్థసమీపంబున లక్ష్మినిఁగూర్చి యరుంధతి తపంబొనరించి వరంబు గైకొన్న పుణ్యసరోవర తీరంబునందుఁ దపంబు సేయుచుండిరి. అందుఁ గొందఱు మునులు మఱియుఁ గొన్ని పుణ్యతీర్థంబు లాశ్రయించి తపంబు లొనరించుచుండి ; రిది బ్రహ్మోత్సవ క్రమంబగు. ఈ బ్రహ్మోత్సవ ప్రకారంబు వ్రాసినఁ జదివిన వినిన వారలకు నాయు రారోగ్యైశ్వర్యాభివృద్ధి కలుగు ' నని చెప్పిన సూతుం జూచి శౌనకాదు లిట్లనిరి. 158

## ఆశ్వాసాంతము

క. సుందర విగ్రహ ! ఘనతర
మందర గిరిధర ! సమస్త మౌని హృదబ్జా
నందకర ! వేంకటాచల
మందిర ! సురరాజ వినుత ! మాయాతీతా ! 159

మాలిని :

సురుచిర గుణహారా ! శుభ్రకీర్తి ప్రచారా
వరజలధి గభీరా ! వాసవారి ప్రహారా !
దురితచయ విదారా ! దుఃఖ సంసార దూరా !
గురుతర గిరిధీరా ! క్రూరగర్వాపహారా ! 160

గద్య :

ఇది శ్రీతరిగొండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలితకవితావిలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ వెంగమాంబాప్రణీతంబైన శ్రీవేంకటాచల మాహాత్మ్యంబను వరాహపురాణంబునందు దేవేంద్రాదులు క్షీరాబ్ధి ప్రముఖ స్థలంబులయందు హరిని వెదకుటయుఁ, దదనంతరంబున నారదప్రేరితులై బ్రహ్మలోకంబున కరుగుటయు, బ్రహ్మతోడ దేవేంద్రాదులు హరిని వెదకుటకు వేంకటాచలారోహణంబు సేయుటయు, దశరధుండు వశిష్ఠ యుక్తుండయి వేంకటాద్రికి వచ్చుటయుఁ, బుష్కరిణీతీరంబున బ్రహ్మాదులు తపంబుసేయుటయు, శ్రీవేంకటేశ్వరుండు విమానంబుతోడ బ్రహ్మాదులకుఁ బ్రసన్నుండగుటయు, స్వామిని బ్రహ్మాదులు వినుతించుటయు, బ్రహ్మాదులకు హరి ప్రసన్నుండై భాషించుటయు, దశరధుండు హరిని స్తోత్రంబు సేయుటయు, శ్రీనివాసుండు దశరధునకు వర మిచ్చి యయోధ్యకుఁ బనుపుటయుఁ, బ్రహ్మోత్సవ ప్రకారంబును నను కధలం గల ద్వితీయాశ్వాసము.



# శ్రీవేంకటాచల మాహాత్మ్యము

## చక్రరాజ దిగ్విజయము

క. శ్రీ కర ! నిర్జర మౌని ప్ర
శీకర ! సద్భక్త బృంద చిత్త విహారా !
రాకేందు వదన ! శుభకర !
ప్రాకట తరిగొండ నృహరి ! పాప విదారీ !

సీ. 'ఓ సూత ! మేము బ్రహ్మోత్సవ క్రమము న
త్యాశ్చర్యముగ వింటి , మపుడు విష్ణు
చక్రంబు బహు చోర సంఘంబులను నిగ్ర
హించె నంటివి , వారి నెట్లు ద్రుంచె
నా రీతి విన వేడుకైనది తెల్పు నీ '
వనిన సూతుండు సంయములఁ జూచి
' మునులార ! వినుఁడి ! యా ఘన చక్ర మాహాత్మ్య
మెఱిఁగి చెప్పుటకు నే నెంతవాఁడ ?

తే. నైనఁ జెప్పెద నొక కొంత 'యనుచుఁ బల్కి
మరల నిట్లనెఁ ' జక్రంబు మాధవాజ్ఞఁ
దాను శిరసావహించి సంతసముతోడ
నరిగి ఘన రాజవేషంబు నపుడు దాల్చి.

సీ. పటిమ మీఱ సహస్రబాహుఁడై మకుటాది
రత్నభూషణములు , రక్త వర్ణ
చేలంబులను దాల్చి కాలాగ్ని సదృశుఁడై
దంష్ట్రా కరాళ వక్త్రంబు మెఱయ

విపుల రథంబెక్కి , వివిధ సాధనముల
ధరియించి వెడలి , గంధర్వ గణము
లలఘు ముద్గర పట్టసాద్యాయుధములు గై
కొని తనవెనువెంటఁ గూడి నడువఁ

తే. గుముదుఁడనువాఁడు, జ్వాలాముఖుండు సకల
సైన్య పంక్తుల నడిపింప , సామజాశ్వ
వారములతోడ ఘన రణ భేరి మొఱయ
నిఖిల వాద్యరవంబులు నింగి కెగయ. 3

వ. ఇట్లనేక వైభవంబుల సంగరోన్ముఖుండై చక్రరాజశేఖరుండు , శేషాచలంబు మొదలుకొని పూర్వసముద్ర పర్యంతంబు వన,పర్వతంబుల నాక్రమించుకొని సకల సాధుజనుల బాధించుచున్న చోర సమూహంబుల వెదకి వెదకి కుటుంబంబులతోడ సంహరించి, దేశబాధ నివారించినఁ , జక్రరాజు సాన్నిధ్యంబునకు వచ్చి తద్దేశవాసులైన సాధుజనులు వినుతించి యిట్లనిరి.4

తే. ' ఓ మహారాజ ! యీ భూమి కొక్క ప్రభువు
లేని కతమున బహు సాధు మానవులను
జాల వేధించు చోరులఁ జంపి నీవు
ప్రోచితివి మమ్మునెల్ల నో పుణ్యపురుష ! 5

క. ఎక్కడనుండియొ యిచటికి
మక్కువతో వచ్చి నీవు మా జీవనముల్
దక్కించిన పుణ్యాత్ముఁడ
విక్కడనే నిల్చియుండు మెపుడు మహాత్మా ! ' 6

సీ. అని పల్కు సుజనుల నాదరించుచుఁ జక్ర
రాజు తద్భూమికి రాజు నొకని
వెదకి పట్టము గట్టి , ' విప్రులు మొదలైన
మంచివారలను రక్షించు ' మనుచు

వానికి నియమించి, శ్రీనివాసాద్రికి
మనుజులు రాఁదగు మార్గములను
దగ నేరుపఱిచ్చి, యా దారులయందు ధ
ర్మాత్ముల నుంచి మహాద్భుతముగ

తే. నచట జయభేరి వేయించి యపుడు వెడలి
కరులు హయములు రథములు కాల్బలములు
మొనసి కొల్వఁగ వాద్యముల్ మొఱయుచుండ
శౌర్య కార్య ధురీణుడై చక్రరాజు. 7

సీ. సంతోష భరితుఁడై సరభసంబుగ మించి
వివిధ దుర్మార్గుల వెదకికొనుచుఁ
బఱిమ నాగ్నేయ దిగ్భాగంబునకు వచ్చి
చోరులు విన రణభేరి నచట
మొఱయించుచును, మున్ను మూర్ఖులై విప్రుల
బాధించుచున్నట్టి పాపమతుల
పై దాడి వెడలి యార్భాటము సేయఁగ
దైత్యాంశజులు గాన ధైర్య మెసఁగ

తే. నాయుధంబులు పూని ఘోరాట్టహాస
కలితులై నిల్చి మించి సంగరము సేయఁ
బూని, రుభయ బలంబు లుప్పొంగి యార్వఁ
బోరుచుండిరి యప్పు డద్భుతముగాను. 8

క. జ్వాలాముఖ కుముదాదులు
నాలో నెడ తాఁకి యట్టహాసముతోడన్
కాలాంతక సన్నిభులై
యాలం బొనరించి త్రుంచి రసురాంశజులన్. 9

క. తక్కిన యా దనుజాంశజు
లక్కడఁ బడియున్న శవము లటు ద్రొక్కుచుఁ బో
నిక్కుచుఁ జని గంధర్వులఁ
గక్కసమునఁ గొట్టి రమిత గదల ఘటకులై. 10

క. అప్పుడు గంధర్వ జనుల్
తప్పక శస్త్రా స్త్రములను ధరియించి చలం
బుప్పొంగఁగ రిపు బలముల
ఔప్పుచుఁ బడఁగూల్చి రధిక రోషోద్ధతులై. 11

వ. అప్పుడు హతశేషులైన చోరులు తమ దొరలకుఁ దమ బలంబులు పడిన క్రమంబు చెప్పినఁ, జోర ప్రభువులు స్థలదుర్గ, వనదుర్గ, జల దుర్గంబులయందుండి త్రిపురంబులందున్న రాక్షస బలంబుల కైవడి ననేక మాయలఁ బన్నుచు విడివడి యార్చుచుఁ గరవాల శూల ముద్గర భిండివాల పరశు పట్టస శర చాప పరిఘాద్యనేక సాధనంబులు గొనివచ్చి గంధర్వ బలంబులపైఁ గవిసిన, గంధర్వులు నొక్కుమ్మడిఁ జోర ప్రభు సంఘంబుల నెదిరించి నడచి యధిక చిత్ర విచిత్రంబుగా ఘోర యుద్ధంబు సేయుచుండి; రప్పుడు భేరీ ప్రముఖ రణ వాద్య ఘోషణంబులును, గంధేభ ఘీంకారంబులును, దురంగ హేషా రవంబులును, రథ నేమి భీకర శబ్దంబులును దుములంబై దిక్కులు పిక్కటిల్ల నప్పుడుభయ బలంబులయందు నొండొరులు శూలంబులఁ గ్రుచ్చియు, ఖడ్గంబుల నఱికియు, గదల నడిఁచియు, ముసలంబుల నెత్తి నడినెత్తు లదరఁ గొట్టియు నివ్విధంబునఁ బోరుచున్న ధరణీతలంబున రక్తంబు ప్రవహించుచుండె; నప్పుడు చోర నాయకులు విజృంభించి గంధర్వులఁ దఱుము సమయంబున జ్వాలాముఖుండు చక్ర రాజేంద్రునకు నా వృత్తాంతంబు చెప్పిన విని యతండు రోషభీషణాకారుండై త్రిపురాంతకుండైన కాలరుద్రునికైవడి నాగ్రహోదగ్రుండై యేనూఱు చేతులఁ నేనూఱు కార్ముకంబులు పూని, తక్కిన యేనూఱు కరంబులఁ జండకాండంబులు

గ్రహించి, ప్రత్యాలీఢ పాదుండై నిలిచి ధనుర్జ్యాఘోషణంబులు చేసి శత్రుసమూహములమీఁద ననేక ఘోరబాణవర్షంబులు గురియించిన, నలిగియుఁ దునిగియు నష్టంబులునై పడిన బలంబుల విడిచి చోర నాయకులు మొనకు నిల్వక పాఱిపోయి తమ తమ దుర్గ స్థలంబులందు దాఁగి రంత. 12

ఆ. చలము వీడ కపుడు చక్ర రాజేంద్రుఁ డా
గ్నేయ నామధేయ సాయకంబు
వింటఁ గూర్చి వేగ విమత జనంబుపై
విడువఁ దచ్ఛరంబు విపినములను. 13

క. విడివడి కాలిచి మును తడఁ
బడి డాఁగిన చోరవీర పంక్తుల నెల్లన్
తడయక భస్మము సేసినఁ
బుడమియు నవ్వేడిచేతఁ బొగలుచునుండెన్. 14

వ. ఇవ్విధంబున నిర్బీజంబుగా శత్రు నాశనంబు చేసి , యమిత వృష్టిఁ గురియించి భూమిని శీతలత్వంబు నొందించి , ధర్మాధ్యక్షుండనువాని నమ్మహికి రాజునుగాఁ జేసి , ‘ ధర్మస్థితిఁ బ్రజలఁ బాలింపు ’ మని నియమించి , తదనంతరంబున. 15

సీ. చతురంగ బలములు సందడించుచుఁ గొల్వ
ధీరుఁడై దక్షిణ దిశకు మఱలి
వనదుర్గములయందు వరుసగా వెదకుచుఁ
జిక్కిన చోరుల మొక్కపఱిచి
వచ్చుచునుండఁగా నచ్చట నుండిన
సజ్జనులెల్ల నా చక్రరాజు
నీక్షించి తమపాలి యీశ్వరుం డీ రీతి
వసుధను రక్షింప వచ్చె ననుచు

తే. వారు ముదమందుచుండఁగా , బోరఁ దలఁచి
లేచి యపు డంక వంక పుళిందులనెడు
వారు ముగురు , బిడాలుఁడన్ వాఁడొకండు
చాలుకుం డనియెడువాఁడు సరభసమున. 16

వ. నానా విధంబులయిన గదా కుంత ముసల ముద్గర శర చాప ఖడ్గ ప్రముఖ సాధనంబులు గొని యనేక చోర బలంబులతోడఁ జక్రరాజున కెదురు నడుచుచుఁ దమలోఁ దా మిట్లనిరి. 17

సీ. 'ఈ రీతిగా మన కెదిరించి నిలిచిన
యరుల నేనే త్రుంతు ' ననియె నొకఁడు
'గంధేభములఁ దురంగ సమూహముల నెల్ల
నవనిపై నేఁ గూల్తు ' ననియె నొకఁడు
'గములుగా వచ్చిన కాల్బలంబుల నెల్ల
మొనసి నేనే త్రుంతు ' ననియె నొకఁడు
'ప్రబల రథంబెక్కి ప్రభువు చందమున వ
చ్చిన వాని మడియింతు ' ననియె నొకఁడు

తే. 'కరుల , హయముల , మితిలేని కాల్బలముల ,
రథముపై నుండి నిక్కెడి రాజుతోడ
నిపుడు నేనొక్కఁడన సమయింతు ' ననుచు
మూఢుఁడై చాలుకుఁడు మించి మొనసి పలికె. 18

వ. ఇట్లు పంచమహాపాతకులైన యంక వంక పుళింద బిడాల చాలుకు లనియెడి దైత్యాంశ సంభవులు ప్రచండోద్దండ బలంబునఁ జక్రరాజు బలంబున కెదురు నడిచినఁ , జూచి హుంకరించి స్ఫులింగాక్షుండును బలాధ్యక్షుండును జ్వాలాకేశుండును గాలాంతకుండును రణఘ్నుండును జక్రరాజానుమతంబునఁ గరవాల శూల ముద్గర భిండివాల కాండ కోదండ ప్రముఖాయుధంబులు పూని నిజబలంబులఁ బరబలంబులపైఁ బురికొల్పుచు , నంతఁ బ్రముఖులైన పంచ మహాపాతకులం జూచి యిట్లనిరి. 19

సీ. 'పాపాత్ములార ! సద్బ్రాహ్మణోత్తములను
జెఱిచి , యాచారముల్ చెఱిచి , వారి
జీవనంబుల నెల్లఁ జెఱిచి , యజ్ఞంబులు
చెఱిచి , ధర్మము నిట్లు చెఱిచినట్టి
మీ కంతకాలంబు మెండొడ్డి వచ్చె ; నిం
కెక్కడ డాఁగెద? రిపుడు మిమ్ము
ఖండించి మీ మేని కండలు కంక గృ
ధ్రములకు సకల భూతంబులకును

తే. బొసఁగ నాహారముగ నిచ్చి భూసురులను
మేము రక్షింతు , మిఁక మీఁద మీ బలంబు
సాగ , దెదిరించి ర ' మ్మని శౌర్య మెసఁగఁ
బలికి విడివడి యట వారిపైనఁ గవిసి. 20

వ. అతి భీషణాకారులై యస్త్రశస్త్రంబుల నొప్పించినఁ దలంగిపోక నంక వంకాది రాక్షసాంశ సంభవులు ముసల గదాద్యాయుధంబులు గొని స్ఫులింగాదుల మీఁదఁ బడి యతిఘోర యుద్ధంబు చేసి ; రందు స్ఫులింగాక్షుం డంకుండనువానిఁ బరిమార్చె. బలాధ్యక్షుండు వంకుఁడనువానిం ద్రుంచె. జ్వాలాకేశుండు పుళిందుఁడనువాని వధించె. కాలాంతకుండు బిడాలుండనెడి శూరుని ఖండించె. రణఘ్నుండు చాలుకుండను శాత్రవుని సంహరించె. ఇవ్విధంబునఁ దెగిపడిన యంకాదుల బలంబులు విఱిగి పాఱి వనదుర్గంబులం డాఁగె ; నంత వారి భటు లార్భటించుచుఁ గ్రమ్మఱఁ జక్రరాజ బలంబులపైఁ గవిసినఁ జక్రరాజానుమతంబున హయశిరుండు తద్బలంబులపై నర్ధచంద్ర బాణప్రయోగంబు చేసి యందఱిని రెండేసి ఖండంబులు గావించె ; నపుడు హతశేషులు వెఱచి పఱచి పోయి గుహారణ్యంబులం డాఁగినం జూచి చక్ర రాజేంద్రుఁడు చిత్రబాణ

ప్రయోగంబు చేసినఁ, దద్బాణంబు గిరి వన దుర్గ స్థలంబుల డాఁగియున్న రిపుబలంబుల నిర్మూలనంబు చేసివచ్చె ; నంత దక్షిణ భూమి నిష్కంటకంబయ్యె , నప్పుడు చక్రరాజు శీర్షంబునఁ గుసుమ వర్షంబులు గురియించి యనేక ప్రకారంబుల వినుతించి యిట్లనిరి. 21

సీ. 'చక్రరాజోత్తమ ! సకల పాపాత్ముల
సమయించి , యిచ్చటి సాధువులను
రక్షించితివి; నీ పరాక్రమం బింతని
శేషాహియైనను జెప్పఁగలఁడె ?
పరఁగ శేషాద్రికిఁ బశ్చిమోత్తరములఁ
జోరులు క్రూరు లున్నారు , నీవు
వారిని ఖండించి వసుధామరాది స
జ్జనుల రక్షింపుమో చక్రరాజ ! '

తే. యనుచు బ్రార్థించి దేవత లరిగి ; రిట్లు
చక్ర మచ్చోట శత్రు శేషమును నిలుప
కంత మొందింపఁగాఁ జూచి సంతసించి
బ్రాహ్మణులు వచ్చి యా చక్రరాజుఁ గాంచి. 22

సీ. వినుతించి పలికి ' రో విమలాత్మ ! యీ దేశ
మందు ధర్మాత్ముఁడైనట్టి రాజు
గలుగని కతన దుష్కర్ములై చోరులు
బాధించుచుండిరి బ్రాహ్మణులను
నీవు మా పాలిటి దేవుఁడవై వచ్చి
సకల పాపాత్ముల సంహరించి
మమ్ము రక్షించితి మమ్మహిని బాలింపఁగాఁ
దగినట్టి రాజు నిద్ధరను నిలుపు '

తే. మనుచు వారెల్లఁ బ్రార్థింప నపుడు చక్ర
రాజు తద్ధారుణికిఁ దగు రాజు నొకని
నిలిపి ' ధర్మంబు దప్పక నీవు జనులఁ
బాలనము సేయు ' మని చెప్పి బ్రాహ్మణులను. 23

తే. కాంచి యిట్లనె ' మీరు సత్కర్మ నిష్ఠు
లగుచు సవనము లొనరింపుఁ డయ్య ! ' యనుచుఁ
జెప్పఁగా వారలంద ఆశీర్వదించి
వీడుకొల్పఁగ నా రాజవీరుఁ డపుడు. 24

వ. దక్షిణప్రాంత గహనంబుల మధ్యంబులయందు వేంకటాద్రికి జనులు వచ్చుటకు మార్గంబు లేర్పఱిచి , యా మార్గంబులందు సుజనులైనవారినిఁ బాలింపుమని యచటి రాజునకు నియమించి, తదనంతరంబున. 25

సీ. అందుండి సకల సైన్యావళులను గూడి
జయభేరి వేయించి సంతసించి
పయనమై నైరృతి ప్రాంత దేశములందుఁ
గదలి పోవుచును దుర్గ స్థలముల
శోధించి శోధించి చోరుల నెల్లను
బాధించి చంపుచుఁ , బశ్చిమమున
కరిగి మహోన్నతుఁడై నిజ గంధర్వ
బలములతో నందు నిలిచి కదన

తే. భేరి వేయించి యప్పు డభేద్య విపుల
విపిన దుర్గ స్థలంబుల వెదకి వెదకి
చోరులను ద్రుంపఁగాఁ, జోరచారు లదరి
చెదరి తమ దొర యగు వాని చెంతఁ జేరి. 2(

క. ప్రొక్కుచు నిట్లని ' రధిపా !
ఎక్కడ నుండియొ దళంబు లీ ప్రాంతములన్
క్రిక్కిఱిసి చోరవరులను
దక్కక ఖండించె ' ననఁగ దష్టోష్ఠుండై. 27

సీ. శివునిఁగూర్చి తపంబుఁజేసి తా నెవరిచేఁ
గూలని వరముఁ గైకొనినవాఁడ
బహు చోరులను గూడి పర్వతాగ్రములందుఁ
జేరి సాధువుల హింసించువాఁడు
బలమదోపేతుఁడై బాటసారులఁ గొట్టి
యమిత విత్తముఁ గూర్చినట్టివాఁడు
కాలకింకరులనఁగాఁ దగిన కిరాత
బలములఁ జేపట్టి ప్రబలువాఁడు

తే. వనములందు రిపుఘ్నుఁడన్ వాఁడు గన్న
కొడుకు వనకర్త యనువాఁడు క్రోధ మెసఁగ
నిక్కి పొంగుచు నక్షోహిణీ బలంబుఁ
గూడి విడివడి వచ్చి యాక్రోశ మెసఁగఁ. 28

క. పలకలు కొమ్ములు తుడుములు
బలముగ వాయించికొనుచుఁ ' బ్రతివీరులపై
నులుకక పడి పోరుం ' డని
సెలవీయఁగఁ దద్బలములు చెదరక గుమియై. 29

వ. తలంగక గదా కుంత ముసలాద్యాయుధంబులు గొని చక్రరాజ బలంబున కెదురు నడచె ; నప్పు డనేక సాధనంబులు గొని చక్రరాజ భటులు వనకర్త దళంబులపైఁ గవిసి యతి ఘోర యుద్ధంబు చేసి యక్షోహిణి కిరాత బలంబు నతిత్వరితంబుగా సంహరించి ; రంత రక్తంబు వెల్లివిరిసి యేఱులై పాఱుచున్నం; జూచి వనకర్త క్రోధరక్తాక్షుండై నిజసేనాధిపతియైన జ్వాలాపాతుండనువాని నీక్షించి యిట్లనియె. 30

సీ. 'అసహాయ శూరులైనట్టి యక్షోహిణి
భటులను జంపిరి పరుని భటులు
కావున నీ వేఁగి కరవాల శూలాది
సాధనంబుల వారిఁ జంపు ' మనుచుఁ
దన దొరయైన కాననకర్త చెప్పఁగా
నపుడు జ్వాలపాతుఁ డాయుధములఁ
గైకొని యుష్ట్రాళి గట్టిన రథమెక్కి
సరభసుఁడై వచ్చి చక్రరాజు

తే. బలముపైఁ బడఁగా, బడబాముఖాఖ్యుఁ
జూచి యా చక్రరా ' జహో ! శూరవర్య !
రయముననను నీవు వోయి కిరాత విభుని
దళపతినిఁ గొట్టి కూల్పు మిద్ధరణియందు. 31

క. సరిగాని నీచ జనముల
సరిగా నెంచికొని పోర సహ్యముగా , దీ
వరిగి మహా త్వరితముగాఁ
బొరిగొనుమీ పాపమతులఁ బుణ్య చరిత్రా ! ' 32

క. అని చక్రరాజు పలుకఁగ
వినియెన్ బడబాముఖుండు విపులాయుధముల్
గొని యా జ్వాలాపాతా
ఖ్యుని రథమును విఱిచి వానిఁ గూల్చె ధరిత్రిన్. 33

ఆ. అపుడె విష్ణు చక్రమను నామధేయంబు
గల్గు చక్ర మెత్తి గహనకర్త
'యేనెడువానిమీఁద కనుపఁగా , నా చక్ర
మతని శిరముఁ దఱిగి యవనిఁ గూల్చె. 34

వ. ఇవ్విధంబున బడబానలంబు సముద్రోదకంబును ద్రావిన చందంబునఁ గాననకర్త సైన్యంబును జక్రరాజ శస్త్రాస్త్రసంఘాతంబు సంహరించెఁ, దద్భూమి నిష్కంటకంబై ప్రకాశించె; నప్పుడు చక్రరాజేంద్రుఁ డరణ్య కంటక వృక్షంబుల నఱికించి సకల భక్త జనంబులు శేషాచలంబునకు వచ్చుటకుఁ దగిన మార్గంబుల నేర్పరించి, తన్మార్గ ప్రాంతంబులఁ బుణ్యాత్ములైన జనంబుల నునిచి, తజ్జనంబులఁ బాలింపఁదగిన రాజునకుఁ బట్టంబు గట్టి 'ధర్మ పరిపాలనంబు సేయు' మని నియమించి తదనంతరంబున.35

సీ. చక్రరాజేంద్రుఁడు జయభేరి వేయించి
చతురంగ బలములు జతను గొలువ
ధీరుఁడై వాయవ్య దిశ నుండు చోరుల
సమయించుచును వచ్చి శౌర్య మెసఁగఁ
గంటక రాక్షస గాఢాంధకారంబు
దట్టమైనట్టి యుత్తరపు దిశకు
నప్పుడె మఱలి సహస్రార్క కరముల
కరణి దీర్ఘ సహస్ర కరము లమరు

తే. చుండు, రెండవ చండ మార్తాండుఁ డనఁగ
నొప్పుచును వేంకటాద్రికి నుత్తరముగ
నుండు కొండల నడుమ మహోగ్రుఁడగుచు
సరభసంబుగ నిల్చె నా చక్రరాజు. 36

వ. అప్పుడా చక్రరాజు నీక్షించి భీతినొంది కొందఱు రాక్షసులు తమ దొరయైన భేరుండుని చెంతఁ జేరి యిట్లనిరి. 37

సీ. 'చండప్రతాప! భేరుండప్రభుస్వామి!
విను మద్భుతంబుగా వీరుఁ డొకఁడు
చతురంగ బలముల జతగూడి యున్నాఁడు
కాలాగ్ని రుద్రులఁ బోలినాఁడు

ఖ్యాతిగా నొక వేయు చేతులు గలవాఁడు
ఘనరక్త చేలముల్ గట్టినాఁడు
హార కిరీట కేయూరముల్ ధరియించి
యెక్కువ తేరుపై నెక్కినాఁడు

తే. మించి భానుని గతిఁ బ్రకాశించినాఁడు
వాఁడు భయదాంగుఁడగుచు నున్నాఁ'డటంచుఁ
జెప్పఁగా విని భేరుండుఁ డప్పు డటకు
రక్కసులతోడఁ జని మహా రౌద్ర మెసఁగ. 38

క. ఆ చక్రరాజుఁ గనుఁగొని
యా చోటికిఁ దానె రాజనను భేరుండుం
డేచిన కిన్కను మించి ని
శాచరులం జూచి పల్కె శౌర్యోద్ధతుఁడై. 39

శా. 'ఓ రక్షోవరులార ! చూచితిరె వీఁ డుత్పాతియై మించి న
న్నారూఢాహవమందు గెల్చుటకు నేఁ డాసన్నుఁడై వచ్చినాఁ
డీ రాజున్ బరిమార్చి రావణున కే నిష్టంబు గావించి , నా
భేరుండాఖ్యను ధారుణీతలమునన్ బెంపొందఁగా జేసెదన్ .' 40

వ. అని ప్రతాపంబులు వలికి నిజ చతురంగ బలంబులఁ జక్రరాజు చతురంగ బలంబులపైఁ బురికొల్పె , నప్పుడు చక్రరాజ బలంబులు ఘోరంబుగా రణభేరి వేయించి , యట్టహాసంబున నట్టిట్టు చెదరక మిట్టిపడుచుఁ గొట్ట వచ్చిన భేరుండ బలంబులపైఁ గవిసి , తొడిఁబడక విడివడి కడు వడిఁ గయ్యంబుఁ జేయుచుఁ , గరవాల శూల కుంత ముసల భిండివాల పరశు తోమర పట్టస పరిఘాద్యనేక దివ్యాయుధ పాణులై యొండొరుల నఱుకుచుఁ బాయుచు డాయుచుఁ - దఱుముచు నుఱుముచు హుంకరించుచు బింకంబులు పలుకుచుఁ గొట్టుచుఁ దిట్టుచుఁ బెదవులు గఱచుచు

మీసంబులు వడివెట్టుచుఁ గోరలు గీటింపుచుఁ బండ్లు గొఱుకుచుఁ గన్నులు బిక్కరించుచుఁ గొక్కరించుచు ధిక్కరించుచుఁ గక్కసించుచు నొండొరుల నగ్గించుచుఁ దగ్గించుచు నార్భటించుచుఁ గిలారింపుచు నిట్లనేక ప్రకారంబుల దక్షిణోత్తర సముద్రంబుల భంగిఁ బొంగి పోరి మీఱి తొడలు మెడలు నొడలును గరంబులు నురంబులును నరంబులు శిరంబులును నడుములు దెగిపడినవారును మొఱవెట్టువారును బొరలువారును బ్రాణంబులు విడిచిన వారును విడువఁజాలక యేడ్చువారును గలిగి రణక్షోణి పూచిన మోదుగు చందంబునఁ దోఁచుచుండె ; నప్పుడు రక్త ప్రవాహంబు వెల్లివిరిసి భోరని పాఱుచుండె ; నందు దెగిపడిన కరంబులు మీనంబులు , పదంబులు గర్కటంబులు , పగిలిపడిన తలపుఱ్ఱెలు కమఠంబులు , చెదరిపడిన చర్మ ఖండంబులు భేకంబులు , కూలిన గజతురంగంబులు దీవులు , భగ్నంబులై పడిన చామరంబులు జలపక్షులు , శ్వేతచ్ఛత్రంబులు డిండీర ఖండంబులు , తునిఁగిపడి రక్తంబులోఁ దేలుచున్న శిరోజంబులు శైవాలంబులు గాఁగ నొప్పుచున్న రక్త ప్రవాహంబును గాక గృధ్రాది ఖగంబు లావరించియున్నం జూచి యనేక భూత భేతాళ పిశాచంబులు ' చక్రరాజు చేసిన సమారాధనంబునకు రండు రం 'డని యొండొరులఁ బురికొల్పుకొని పోయి తద్రణభూమి నీక్షించి , సంతసించి తమలోఁ దా మిట్లనిరి. 41

సీ. 'చక్రరాజేంద్రుఁ డిం దీ క్రమంబున సమా
రాధన మొనరించె రారొ ! ' యనుచుఁ!
బిల్చుచుఁ గండలుం బ్రేవులు మెదటితో
భుజియించుచుండెడి భూతములును
బలుమాఱు రక్తంబు తలపుఱ్ఱెలను ముంచి
పొంచి పానముసేయు భూతములును
గడుపులు నిమురుచు గఱ్ఱునఁ ద్రేఁపుచుఁ
బొరలియాడుచునుండు భూతములును

తే. గలిగి రణభూమి యద్భుత క్రమముగాను
విపులమై యుండునప్పుడు విష్ణు చక్ర
రాజు భేరుండు చూచి యాగ్రహముఁ జేసె
నప్పు డాగ్రహోదగ్రుఁడు నగుచు మించి. 42

వ. క్రమ్మఱ యుద్ధసన్నద్ధుండై హతశేషబలంబుతో వచ్చినం జూచి చక్రరాజేంద్రుఁడు గనుబొమ్మలు ముడివెట్టి కన్నుల విస్ఫులింగంబులు చెదర భేరుండునిఁ జూచి హుంకరించె ; నప్పు డా హుంకార ధ్వనికి ధరణి గంపించె, నా సమయంబున. 43

సీ. ఆకాశ మగలె, దిగంతముల్ గ్రుంగెను
ఘన శైలములు గడగడ వడంకెఁ
దపన చంద్రుల గతుల్ దప్పె , ఘోరాకారు
లైన దైత్యుల గుండె లదరసాగె
బ్రహ్మాండ భాండంబు పగిలినయట్లుండె
విపరీత వాయువుల్ విసరసాగె
నప్పుడు చక్రమహారాజు పావకుఁ
డనువానిఁ బుట్టించి యరులపైకిఁ

తే. బంపెఁ , ద త్పావకుఁడు శత్రుబలముమీఁద
నతిరయమ్మున సమ్మోహనాస్త్ర మేసె
నపుడు మేనులు మఱచుచు నసురవరులు
తాము తమలోనె పోరాడి ధరను బడిరి. 44

తే. చక్రరాజా విధముఁ జూచి జాలి నొంది
' యిది యధర్మము గనుక నీ వీ శరమును
మించనీయక యుపసంహరించు 'మనినఁ
బావకుఁడు దాని మఱలించి ప్రజ్ఞ మెఱయ. 45

క. దనుజులపైఁ గ్రౌంచాంబక
మును విడునఁగ నదియు వారి ముక్కులఁ జెవులన్
మునుకొని తఱిగిన , రోషము
పెనఁగొన భేరుండుఁ డపుడు భీకరవృత్తిన్. 46

సీ. పావకుండనువానిపైఁ బడవచ్చిన
నప్పావకుఁడు మారుతాస్త్ర మేసె
మూఁడు యోజనముల మొనయు దేహముతోడ
నమర భేరుండు నయ్యనిల శరము
గొనిపోయి వేంకట కుధగంబు చుట్టు ము
మ్మాఱుగాఁ ద్రిప్పించి మహిని వేసెఁ
గుళ్ళియున్నటువంటి కూష్మాండ మవనిపైఁ
బడిన కైవడి రాక్షసుఁడును నలిఁగి

తే. పోయె , నా చక్ర మా బలంబులను ద్రుంచి
వైచె ; నట దేవతలు పుష్ప వర్షములను
జక్రరాజు శిరంబుపైఁ జాల నించి
వచ్చి యా చక్రరాజును మెచ్చి యనిరి. 47

తే. ' చక్రరాజ ! నీవు సకల దుర్మార్గుల
సంహరించి సాధుజనుల నెల్లఁ
బ్రోచినందువలనఁ బురుషోత్తమస్వామి
సంతసించె , నింక శాంతిఁ బొందు. 48

వ. మహాత్మా ! నీ ప్రభావంబు పొగడ బ్రహ్మాదులకు శక్యంబు గాదు. కావున దుష్టుల నిగ్రహించి శిష్ట సంరక్షణంబు చేసితి ; వింకఁ గదన సన్నాహంబుఁ జాలించి శాంతిఁబొంది శ్రీ వేంకటేశ్వర స్వామి సన్నిధానంబున కరుగు ' మని చెప్పి దేవతలు చని ; రంత చక్రరాజు యుద్ధంబునఁ బడిన చతురంగ

బలంబుల నిజయోగ ప్రభావంబునఁ గ్రమ్మఱ జీవితులం జేసి కరుణా కటాక్ష వీక్షణామృత బిందు సందోహంబుల వారియందుఁ జిందించిన , వారు శాంతిఁ బొంది పూర్వ ప్రకారంబునఁ జక్రరాజు ననువర్తించి కొలిచియుండి ; రప్పు డుత్తర దిగ్భాగంబునందు శ్రీ వేంకటాద్రికి భక్తులు రాఁదగిన మార్గంబు లేర్పఱిచి , తన్మార్గంబులయందుఁ బుణ్యాత్ములైన జనుల నిలిపి, వారల సంరక్షించుటకు నందొక్కని రాజుఁ జేసి 'శ్రీవేంకటాద్రికి వచ్చు భక్త జనుల నాదరించు చుండు ' మని నియమించి, యీశాన దిగ్భాగంబునఁ జిక్కి చెదరియున్న చోరుల నిర్జించి , యష్ట దిక్కుల నిష్కంటకంబులఁ జేసి దేశంబుల శాంతిఁ బొందించి , క్రమ్మఱ సకల బలంబులతోడ శ్రీ వేంకటాద్రికి వచ్చి స్వస్వరూపంబున నంతర్విమానంబులోఁ బ్రవేశించి , హరిదక్షిణకరంబునందు నిలిచియుండె.

నిట్లు దేశంబులు సురక్షితంబులైన వెనుక స్వామికి మహోత్సవంబులు సాగుచుండె ' నని చెప్పిన సూతుం జూచి క్రమ్మఱ శౌనకాదు లిట్లనిరి.49

సీ. 'శ్రీనివాసస్వామి చిత్ర చారిత్రముల్
సలలిత కర్ణ రసాయనములు
గనుక మే మెంత విన్నను తృప్తి లేదు , శ్రీ
వేంకటేశ్వరుఁ డిట్లు వెలసి శేష
గిరిమీఁద నుండి యే క్రియ లందు నడిపించె
నెవ్వరెవ్వరికి నేమేమి యొసఁగెఁ
దెలియఁగా గృతయుగ త్రేతాయుగ ద్వాప
రములయం దచట నే క్రమముగాను

తే. జెలఁగి వర్తించుచుండును , కలియుగమున
నే విధంబుల నుండు ? నా యీశ్వరుండు
సల్పుచుండిన చరితముల్ సమ్మతముగఁ
దెల్పవే సూత ! సత్పూత ! ధీ సమేత ! 50

మత్తకోకిల :

అని ముదంబున శౌనకాది మహాఋషీశ్వరు లందఱున్
వనజనేత్రు చరిత్రముల్ విను వాంఛతోడను బ్రశ్నచే
సిన , వినీతుఁడు సూతుఁ డిట్లనె శ్రీరమేశుఁ దలంచుచున్
' వినుఁడు సంయములార ! చెప్పెద వేంకటేశు వినోదముల్. 51

పంచచామరము :

పరాపరస్వరూపుఁడైన పంకజాక్షుఁ డాద్యుఁడై
యరాతివీరులన్ వధించి యద్భుత క్రమంబుగాన్
సురేంద్ర మౌని ముఖ్యులెల్లఁ జోద్యమంది చూడఁగాన్
ధరామరాది భక్తులన్ ముదంబు మీఱఁ బ్రోచుచున్. 52

ఉ. భూతలమందు నిల్చి , పరిపూర్ణుఁడు తా నగుచుండియున్ , జన
వ్రాతము చూడ శేషగిరివాసుఁ డనంగ జగంబులందు వి
ఖ్యాతినిఁ బొంది , భక్తజనులందఱు గొల్వఁగ వారికెల్ల సం
ప్రీతి వరంబు లిచ్చి , బలు బెట్టుగ నుండు రమాసమేతుఁడై. 53

సీ. ఆ వేంకటేశ్వరుఁ డరుదుగాఁ గలియుగం
బున ఘన మౌనముద్రను ధరించి
యచట నర్చావిగ్రహంబు కైవడిగాను
గర్మ నేత్రములకుఁ గానవచ్చు
భక్తులతోనైనఁ బ్రత్యక్షముగ మాటట
లాడఁడు , స్వప్నంబులందుఁ దగిన
మాట లొప్పుగఁ జెప్పు , మఱి యదేమను వేళ
కవ్వల జునుఁగు మాయావి యగుచు

తే. మానవులకెల్లఁ దనయందు మరులు గలుగఁ
జేసి , వారల విత్త మార్జించుకొఱకు
వారి కొక భీతిఁ బుట్టించి , వారిచేత
రూక లొప్పించికొని , వారిఁ బ్రోచు నవల. 54

క. మోక్షముఁ గోరుచు , దేహా
పేక్షను మది రోసి విడిచి పెట్టుచుఁ , దననే
వీక్షించుభక్త జనులకు
సాక్షాత్కారముగఁ జూపు సద్విగ్రహమున్. 55

సీ. వైకుంఠముననుండి వచ్చియున్న విమాన
మెక్కు వగా వారి కొక్క వేళఁ
దగఁ జూపునప్పు డంతర్ధాన మొందించు,
నానందనిలయంబునందు నిలిచి
మొనసి యున్నటువలె జనులకుఁ గనుపించు
నంతర్విమానంబునందె యుండు
నా విమానము దేవతావళులకుఁ జూపు
దీపించు నరులకుఁ జూపకుండుఁ

తే. బొసఁగ మనుజులచే బాహ్యపూజ లందు
గుప్తముగ దేవపూజఁ గైకొనుచునుండు
నరులు దనుఁ జేరి కోరిన , వరము లిచ్చి
మహిమములఁ జూపుచుండు రమావిభుండు. 56

ఆ. అల్పదానమైన నధికంబుగాఁ జూచి
స్వల్ప పూజనైన సంతసించి
పుణ్య మోక్షములను బొందించు భక్తుల ,
నెన్నవశమె వేంకటేశు మహిమ ! 57

క. ఘన వేంకటగిరి మహిమం
బును దలపుచు వచ్చి మ్రొక్కు పుణ్యాత్ములకున్
మనమలరఁగఁ గనిపింపుచు
నెనసిన దయతోడ వరము లిచ్చుచు నుండున్. 58

సీ. అప్రాకృతుండు దానై ప్రాకృతుని రీతి
దేశ ప్రజల వెంటఁ దిరిగి తిరిగి
తనమీఁద మోహంబు జనియింపఁగాఁ జేసి
ప్రేమఁ జూపుచు వారిఁ బిలిచి పిలిచి
'నయ భయంబులతోడ నా కొండ కిపుడు మీ
సొమ్ములు, ముడుపులు దె' మ్మటంచుఁ
బలుకుచు వారి వెంబడి నంటి ముల్లెలు
దెప్పించి, కొనుచుండు ధీరుఁడగుచు

తే. వారపుడు వచ్చి సకలోత్సవములు వేంక
టాద్రి మీఁదను నడిపింతు రాఢ్యులగుచు,
నపుడు వారిని మెచ్చి భాగ్యంబు లిచ్చి
మఱలఁ బంచుచునుండు నమ్మదన గురుఁడు. 59

తే. అట్టి యుత్సవ కాలంబులందు సకల
నిర్జరులు వచ్చి పుష్కరిణీ జలమున
స్నానములు చేసి, వేంకటేశ్వరుని నఖిల
పుష్పములఁ బూజసేతు రద్భుతముగాను. 60

ఆ. సొరిది భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, జలంబు
లర్పణంబు సేయ నేర్పు మెఱయ
నారగించు; నెవరికైనను గనిపింప
నియ్యఁ డా క్రమంబు నీశ్వరుండు. 6

తే. మానితంబగు మాయా విమానమందుఁ
దాను నిజరూపమున నుండి , ధరను గృతక
కాంచనానందనిలయమం దంచితముగ
ఘన శిలావిగ్రహము రీతిఁ గానుపించు. 62

సీ. స్వల్ప దానమునకె సంతుష్టుఁడై వారి
కాయు రారోగ్య భాగ్యాది వివిధ
వరముల నిచ్చుచు వారిని రక్షించు ,
నతినీచజాతివారైనఁ గాని
భక్తితో శరణని పర్వతంబును జూచి
నిలిచి మ్రొక్కినను మన్నించి ప్రోచుఁ ,
గర్మాధికారులు గాని యోషిజ్జన ,
శూద్రులకును భక్తి సుస్థిరముగ

తే. వేంకటేశుని చరణారవిందయుగళి
యందు విస్తారముగఁ బుట్టు , నందువలన
మూఢ భక్తులఁ గలియుగమున విశేష
కరుణతోఁ బ్రోచుచుండు వేంకట విభుండు. 63

క. సాధువు కలియుగ మిలపయి ,
సాధువు లంగనలు , శూద్రజనతతి గనుకన్ ,
బోధ మనంబున వారికి
మాధవుఁ డొడఁగూర్చి ప్రోచు మచ్చిక మీఱన్. 64

క. కావునఁ గలియుగమునయం
దేవిధముననైన వేంకటేశ్వరు చెంతన్
భూవలయమున జనింపను
దేవతలే కోరుదురు సుధీయుతు లగుచున్. 65

వ. కృత త్రేతా ద్వాపరంబులయందుఁ బెక్కు వేల యేండ్లు తపంబులు చేసిన శ్రీహరి ప్రసన్నుండగుట దుర్లభంబుగా నుండుఁ ; గలి యుగంబున నెవ్వఁడేని ముహూర్త మాత్రంబు నిశ్చలుండై ధ్యానించిన శ్రీస్వామి సులభంబుగాఁ బ్రసన్నుండగుచుండు ; నటుగనుకఁ గలియుగం బుత్తమంబని ద్వీపాంతరముల నుండువారున్ను సకల దేశవాసులును గలియుగంబునఁ బ్రకాశమానుండైన శ్రీవేంకటేశ్వరునియందు భక్తి సలుపుచుండుదురు. అటుగనుక , శ్రీవేంకటేశ్వరునకు సమానుండైన దేవుండు లేఁడు ; పుష్కరిణీ తీర్థ సమానంబైన తీర్థంబును లే దిది సత్యంబు. కృతయుగాది మూఁడు యుగంబుల వేంకటాద్రి కనకమయంబుగా నుండి కలియుగంబున శిలామయంబుగా జనులకు గనిపించు చుండుఁ ; దద్గిరియందు వసించియున్న శ్రీనివాసస్వామి లీలావినోద విహారంబు లనంతంబులై యుండుం గావున మీకు సంక్షేపంబుగాఁ జెప్పితి ; నట్టి వేంకటాద్రియందు నిలిచి యాచార్య సమాశ్రయణంబు గలిగి విష్ణుభక్తులైన వైష్ణవులం జూచి వైమానికులు సంతసించుచుండుదు ; రన్య మతస్థులైనను శ్రీ వేంకటేశ్వరునియందు భక్తి సల్పు చుండుదు , రందున వారును గృతార్థులగుదురు. కలియుగంబునందు జను లతిశయ విత్తార్జనపరులై యనేక దుర్గుణంబుల నాశ్రయింతురు గాని , హరిని నిశ్చలులై యేకాగ్ర చిత్తంబున ధ్యానింపఁజాలరు. ధ్యానించిరేని శ్రీనివాసుండు ముక్తి కరతలామలకంబుగాఁ జూపుచుండు ; నంతటికి వైష్ణవ ధర్మం బుత్తమం' బని చెప్పిన సూతుం జూచి శౌనకాదు లిట్లనిరి. 66

## శ్రీవైష్ణవ ధర్మము

ఉ. 'ఖ్యాతిగ శ్రీనివాసుఁ డతి గౌరవ మొప్పఁగ వేంకటాద్రిపై
భూతల వాసులన్ గృపను బ్రోచిన సత్కథ వింటి , మిందుచే
మా తపముల్ ఫలించినవి ; మంచిది ! వైష్ణవ ధర్మమంటి వో
సూత ! తదీయ ధర్మములఁ జొప్పడఁ జెప్పుము సమ్మతంబుగన్ .' 67

మ. అనినన్ సూతుఁడు సమ్మతించి , మునివర్యాళిన్ విలోకించి యి
ట్లనియెన్ ' ధాత్రిని శుభ్రఘోణి ఘనదంష్ట్రాగ్రంబుతో నెత్తి తె
చ్చిన మీఁదన్ ధరణీ సమేతుఁడగుచున్ శేషాద్రియందుండఁగా
నొనరం దత్కిటిఁ జూచి భూమి యపు డత్యుత్సాహముప్పొంగఁగన్. 68

తే. ఇట్టు లనియెను ' కిటిరూప ! యీశ్వరేశ !
నిర్మలములైన వైష్ణవ ధర్మములను
జెప్పు ' మన్నను భూమి నీక్షించి యజ్ఞ
పోత్రి యిట్లని పల్కె సంపూర్ణ దయను. 69

సీ. ' వైష్ణవ ధర్మముల్ వరుసగా నన్నియుఁ
జెప్పలే నిపుడు , సంక్షేపముగను
జెప్పెద నెట్లన్న శ్రీ వైష్ణవాచార
ధర్మంబు లిల గోప్యతరము లరయ
విశ్వాసహృదయులై వినిన వారికిఁ బర
గతులు సిద్ధించు నిష్కర్షగాను
గురుఁడె ధర్మంబు , సద్గురువె పరమగతి
గురుఁ డాత్మ యని నమ్మికొనినవారి

తే. భూరిదురితము నశియించిపోవుఁ గనుక
నే విధమునను గురుమర్మ మెఱిఁగి , భక్తి
సలుపఁగాఁదగువారు వైష్ణవు లటంచుఁ
జెప్పఁ దగియుండు లోకప్రసిద్ధిగాను. 70

తే. ఎన్ని పాపము లొనరించియున్నఁగాని
సద్గురునిఁ జేరి శరణన్న సమయమందె
భూరి దురితము నశియించిపోవు ; గురుని
శిష్యుఁడై పాప మావలఁ జేయ రాదు. 71

వ. అదెట్లనిన గురు కటాక్షంబు లేకయున్నప్పుడు తెలియక చేసిన పాపంబులను గురుండు పరిహారంబు చేయనేర్చు ; నాచార్యానుగ్రహంబు గలిగిన వెనుకఁ దెలిసి తెలిసి చేసిన పాపంబుల గురుండు నిగ్రహింపలేఁడు గావునఁ , దత్పాపంబులు గురునిఁ బొందునని తెలిసి , బుద్ధిమంతులైనవారు పావభీతులయి యుండవలయు. సాక్షాద్విష్ణుండె గురుండని తెలియవలయు. మనుజ మాత్రుండని చూచిరేని యుత్తమగతి సిద్ధింపనేరదు. సంసార సముద్రంబులో దిగఁబడిపోవుచున్న సమయంబున నుత్తమ శాస్త్ర ధర్మంబను హస్తంబునఁబట్టి వాని లేవనెత్తి , మోక్షమార్గంబనే తీరంబున నిలిపి తన కుపకారంబు చేసిన గురునికిఁ దాను పాపంబు సేయకుండుటయ ప్రత్యుపకారంబగుచుండు. ఆచార్యు లెట్టివా రనినఁ జెప్పెద విను ' మని వరాహస్వామి భూదేవి నీక్షించి మఱియు నిట్లనియె.
72

సీ. 'న్యాయమార్గమునందె నడవడి గలవార,
లెలమి ధర్మ మధర్మ మెఱుఁగువారు
పుణ్య సత్కర్మ తపోనిష్ఠులగు వార,
లతి శాంత హృదయు లౌనట్టివారు
మదియుం దహంకార మమకార దంభ ద
ర్పాది దుర్గుణముల నడఁచువారు
ప్రారబ్ధ కలితాఘ ఘోర సంసార దా
వానల కీలల కళుకువారు

తే. నవని నిందాస్తుతులకు , మానావమాన
ములకుఁ దగ్గక హెచ్చక, భూతదయయు
ముఖ్య గుణము , సుహృద్భావమును , బరోప
కారమును గల్గు గురువులే ఘను లటండ్రు. 73

సీ. అట్టి యాచార్యుల కనుగుణులగు శిష్యు
లెట్టివారనిన నీ వింక వినుమి !
విశ్వాసమును భక్తి వినయంబు శాంతియుఁ
గమనీయ సుగుణముల్ గలుగువారు
సకల మంత్రాంతర , సాధనాంతరములు
యందుఁ బరాఙ్మఖులైనవారు,
సర్వభారంబు లాచార్యుల పాదంబు
లందుంచి నిశ్చలులైనవారు

తే. ననిశమును బాపభీతులైనట్టివారు
గురువులే హరియని నమ్మికొనినవారు
మాయలను వీడి శుశ్రూష సేయువారు
ధరను సచ్ఛిష్యులని చెప్పఁదగినవారు. 74

వ. ఎవ్వరేనియు ముముక్షువులయినవారికి నజ్ఞానంబను సంసారబీజంబు నశింపవలె ; నది నశించినను నహంకార మమకారాదులు విడువవు. అవి విడిచినను దేహాభిమానంబు వదలదు. అది వదలినను స్వస్వరూప జ్ఞానంబు పుట్టదు. అది పుట్టినను నైశ్వర్యభోగాపేక్ష మానదు. అది మానినను నర్థ కామాది రాగాద్వేషాదులు వీడవు. అవి వీడినను బారతంత్ర్య ప్రకాశంబు గలుగనేరదు. అది గలిగినను శ్రీ వైష్ణవత్వంబు చేకూరదు. అది చేకూరినను సాత్త్వికపరిగ్రహుండు గాడు. సాత్త్వికపరిగ్రహుండైనను భాగవతపరిగ్రహుండు కాడు. భాగవత పరిగ్రహుండైనను ననన్యార్హ ప్రయోజకుఁడు కాఁడు. అనన్యార్హ ప్రయోజకుఁడైనను ననన్యార్హ శేషభూతుఁడు గాఁడు. అనన్యార్హ శేషభూతుఁ డైనను ననన్యార్హ శరణుండు కాఁడు. అనన్యార్హ శరణుండైనను నధికార పురుషుఁడు గాఁడు. అధికార పురుషుఁడైన నష్టాక్షరి కధికారి యగును. 75

సీ. అట్టి సచ్ఛిష్యుల కాచార్యు లుపదేశ
మిచ్చి రక్షించు రీ తెట్టులనిన
శ్రీవైష్ణవాచార చిహ్నానుసరణంబు
గా నుపదేశించి,కరుణఁ బెంచి
'యష్టాక్షరీ మంత్ర మతిశయం , బంతక
న్నను మంత్ర మెందు లే' దనుచుఁ జెప్పి
'నారాయణుఁడె మహోన్నతుఁ , డతనిని మించి
నట్టి దేవుండు లేఁ' డనుచుఁ బలికి

తే. పట్టుగా ద్వయ , చరమ , ప్రపత్తి , భక్తి
నిష్ఠలను జెప్పి , హరిని ధ్యానించు విధము
జెప్పి , యొప్పు భరన్యాస చిత్సుఖంబు
నందుఁ బొందింతు రాచార్యులైనవారు. 76

సీ. చక్కఁగా నాచార్య సంశ్రయణంబైన
వెనుకఁ గామాదుల విడిచిపెట్టి
తలఁపులో నెపు డహంతా మమతలు లేక
విజన స్థలములందు విమలులగుచు
మిత భోజనంబును , మిత సుషుప్తియు , మిత
సంభాషణంబు , లాచార్య భక్తి
యతి శాంత , మపరిగ్రహంబు , నారాయణ
విగ్రహ ధ్యాన వివేక గుణము

తే. లభ్యసింపంగ మానసం బమలమగుచు
నిలుచు హరియందె ; మది యిట్లు నిలిచెనేని
యున్నతంబగు విష్ణు సాయుజ్య పదవి
నొందుదురు వైష్ణవ శ్రేష్ఠు లుర్వియందు. 77

తే. వేంకటేశుఁడనగు నాకు వేడ్క మీఱ
వివిధ పరిచర్య లొనరించి విశ్వసించి
చెలఁగి యాచార్య శుశ్రూష సేయునట్టి
నిర్మల శ్రద్ధ వైష్ణవ ధర్మ మతివ ! 78

సీ. వరగురువులఁ గన్న వస్త్ర భూషణములఁ
ప్రీతి రెట్టింప నర్పించువారు
నాసక్తితోఁ దదీయారాధనంబులు
నంచితంబుగ నడిపించువారు
దేశిక శ్రీపాద తీర్థ ప్రసాదముల్
హెచ్చుగా నెంచి గ్రహించువారు
పట్టైన శేషత్వ , పారతంత్ర్యంబు జీ
వాత్మ ధర్మములని యలరువారు

తే. తగని తామస రాజసద్వయము నడఁచి
యొనర సాత్త్విక నిష్ఠులై యుండువారు
శాంతియును , భూతదయయును , సత్యవాక్య
ములును గలవారు వైష్ణవుల్ మొనసి చూడ. ' 79

వ. అనిన విని భూదేవి వైష్ణవధర్మంబునకు సంతసించి , ' జ్ఞాన భక్తి వైరాగ్యంబులు గలవారు కర్మంబుల నే క్రమంబున నాచరింపవలయు ?' ననిన వరాహస్వామి యిట్లనియె. 80

సీ. 'భాసుర విజ్ఞాన భక్తి వైరాగ్యముల్
గలిగిన వారును గర్మములను
విడువఁగాఁ దగ , దది వేదోక్త మార్గంబు
గాన సల్పందగుఁ గ్రమముగాను

స్నాన సంధ్యాదులు , సవనముల్ నిజశక్తి
కొలఁది సల్పందగుఁ ; గోర్కి విడిచి
హరి కర్పితంబని యాచరించిన , హరి
సంతుష్టుఁడగు నదే సత్ఫలంబు

తే. గనుక విప్రులు వేదమార్గక్రమమున
జన్నములు చేయుచున్న నీశ్వరుఁడు మెచ్చి
యిష్ట ఫలములఁ దా వారి కిచ్చుచుండు
నందుచే యజ్ఞములు చేతు రార్యు లెల్ల. 81

వ. ఇవ్విధంబున మదాజ్ఞాధారులయి నిష్కామసత్కర్మంబుల నాచరింపవలయు; నట్లాచరింపక మదాజ్ఞోల్లంఘనంబు చేసినవారు దోషయుక్తులగుదురు గావున, సద్బ్రాహ్మణులు యజనాది షట్కర్మంబుల నాచరింపుదురు. అందుఁ గొందఱు బ్రహ్మచర్య , గార్హస్థ్య , వానప్రస్థ ధర్మంబు లాచరించి, తత్త్వజ్ఞులై సన్న్యసించి , కర్మముక్తులై ప్రణవోచ్చారణంబు సేయుచు నీశ్వరధ్యాన నిష్ఠాగరిష్ఠులై మఱువక నారాయణ స్మరణంబు సేయుచు, నివ్విధంబున సన్న్యాసవిధిఁ గొన్ని యబ్దంబు లాచరించి , పరిపూర్ణ జ్ఞానోదయంబైన పిమ్మట విధివత్తుగా దండ కమండలువులు విడిచి యవధూతాశ్రమం బంగీకరించి , శీతోష్ణ సుఖ దుఃఖాది ద్వంద్వాతీతులరై సచ్చిదానంద నిత్య పరిపూర్ణ బ్రహ్మానుసంధానంబుఁ జేయుచుండవలయు ; నట్లు చేసినవారు బ్రహ్మసాయుజ్యంబు నొందుదు 'రని చెప్పి వరాహస్వామి మఱియు నిట్లనియె. 82

## జీవ బ్రహ్మ ప్రశంస

సీ. 'వెలది ! బ్రహ్మము రెండు విధములై యుండుఁ బ
రాపరంబులనంగఁ బ్రబలు , నందుఁ
బర మక్షరంబు నపరమౌ క్షరం , బీక్ష
రంబు జీవుం , డక్షరంబు విమల

కూటస్థుఁ డనఁబడుఁ, బాటింపఁ బరమాత్ముఁ
డతఁడె పరేశ్వరుం డతఁడె గురుడు
పురుషోత్తముఁడు సర్వ పూర్ణుఁ, డా బ్రహ్మాంశ
జుండనఁ దగిన జీవుం డవిద్య

తే. నంటి పరిమితి లేని దేహంబులందుఁ
జొచ్చి వెడలుచు బహు మోహ శోక వార్ధు
లందు మునుఁగుచుఁ దేలుచు నహముఁ బెంచి
భూరి కర్మము లొనరించి పుట్టు గిట్టు. 83

వ. అట్టి జీవుం డవిద్యోపాధిచేత భిన్నుండగుచు ననేక దేహంబు లెత్తుచుండు; నందుఁ గొన్ని దేహంబులందుండి మిక్కిలి పాపకర్మంబులు చేసి యధోగతులం బడుచు, నిష్కామ పుణ్య కర్మంబులు చేసి యూర్ధ్వ గతిఁ బొందుచుఁ, బుణ్య పాప మిశ్ర కర్మంబులు చేసి సుఖదుఃఖంబు లనుభవించుచు మర్త్య లోకంబునఁ బుట్టుచు గిట్టుచు నుండు ; నందుఁ గొందఱు కామ భోగాసక్తులై మఱియును. 84

ఉ. కామముచేఁ గ్రతు ప్రముఖ కర్మము లొప్పుగ నాచరించి సు
త్రామపురాది లోకములఁ దక్కక చేరి సుఖంబు లొంది యం
దేమఱియున్నఁ, బుణ్యతతు లెప్పుడు నాశము నొందు నప్పుడే
భూమినిఁ బుట్టి క్రమ్మఱను బోవుచు వచ్చుచు నుందు రెప్పుడున్. 85

వ. అందుఁ గొందఱు యోగాభ్యాస నిష్ఠులై సత్పదంబు నొందుదు 'రనిన విని భూదేవి యిట్లనియె. 86

తే. 'ఘనతరములైన యోగ ప్రకారములను
దేవ ! సత్కృపతో నాకుఁ దెలుపవలయు '
ననుచుఁ బ్రార్థింప ముదమంది యా వరాహ
దేవుఁ డిట్లనె నా భూమిదేవి కపుడు. 87

## అష్టాంగ యోగములు

వ. 'యోగమార్గక్రమం బెట్లనిన గురూపదేశ క్రమంబుగా యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులనియెడి యష్టాంగ యోగంబు లభ్యసింపవలయు ; నందు యమం బెట్టి దనిన. 88

సీ. జగతి నహింసయు , సత్య , మస్తేయంబు ,
బ్రహ్మచర్యం , బార్జవంబు , క్షమయు ,
నతిదయ , ధృతి , మితాహారముల్ , శౌచంబు
నీ పది యమము లవెట్టులనిన
సకల జీవులకుఁ గ్లేశంబు పుట్టింప కు
న్నట్టి చంద మహింస యనఁగఁ బరఁగు
నవని నందఱి కిష్టుఁడై దబ్బఱాడకు
న్నట్టి చందము సత్య , మన్య ధనముఁ

తే. గోరి మాయలఁ బన్ని గైకొనఁ దలంప
కుండు టస్తేయ మనఁబడు , నొరుల సతుల
మాతృ భావనగాఁ జూచు మతము బ్రహ్మ
చర్యమన నొప్పుచుండు నో సరసిజాక్షి ! 89

తే. సార దయ భూతమైత్రి , యార్జవ మనంగ
నకుటిలత్వ మగున్ , క్షమయనఁగ నోర్పు ,
ధృతియనఁగ ధైర్యమనఁదగు , మితసుభుక్తి
యనఁగ మిత భోజనము , శౌచమనఁగ శుద్ధి. 90

వ. యమం బీ పది విధంబులన్ జెప్పందగు ; నింక నియమంబు లెయ్యవి యనిన యోగ శాస్త్ర రతియు , సత్పాత్ర దానంబును , సంతోషంబును , లజ్జయు, వ్రతంబును , మతియును , ఆస్తిక్యంబును , ఈశ్వరార్చనంబును, దపంబును, జపంబు నన నొప్పు నీ దశవిధంబులైన నియమంబులందు

వాదాస్పద శాస్త్రంబు లుదర పోషణార్థంబని నిరసించి, మోక్షప్రద శాస్త్రంబు లభ్యసించుట యోగ శాస్త్ర రతి యగుఁ ; దనకుఁబ్రాప్తంబైన ధనంబు గురు ద్విజార్థులకు సమర్పించుచుండుట పాత్ర దానంబగు ; లాభాలాభ శుభాశుభ సంయోగ వియోగ మానామాన స్తుతి నిందాదుల మోదఖేదంబులు లేక యుండుటె సంతోషంబగు ; సుజన సాంగత్యంబువల్లఁ దన దుర్గుణంబులఁ దలఁచి తన్నుఁదా నిందించుకొని దుర్గుణంబుల మాని సుగుణంబు లభ్యసించుటె లజ్జ యగుఁ ; దా సంకల్పించి సేయు మోక్ష సాధనంబు విడువక యాచరించుటె వ్రతంబగుఁ ; దాఁ జేయు యోగంబునకు రోగ దారిద్ర్య సంశయ శాస్త్రవాద రసవాద దుర్జన సహవాసాది విఘ్నంబులు వచ్చినను జలింపకుండుటే బుద్ధి యగు ; మత భేద పురాణేతిహాసాది సద్గ్రంథంబులను శ్రద్ధతోఁ జూచి సారార్థ గ్రహణంబు సేయుటయె యాస్తిక్యంబగు ; నతితేజోమయంబైన యీశ్వర స్వరూపంబును గురుముఖంబుగా నెఱిఁగి హృత్కమలమందు మనంబున ధ్యానించి పూజించుటే యీశ్వరార్చనంబగు; గురు వాక్యంబు సత్యంబుగా నమ్మి , చెప్పిన నియమంబు తప్పక కష్టంబున కోర్చి నడపుటె తపంబగు; జప్యాజప్యంబులయందుఁ దనకు గురుం డుపదేశించిన మంత్రంబు నిశ్చలుండై విడువక జపించుటే జపంబగు ; నీ పదియు నియమంబులగు; నిట్టి యమ నియమంబు లిరువదియు నంతశ్శుద్ధి ప్రదంబులగుం గావున వీని నభ్యసించి యంత శ్శుద్ధి నొంది కీటాది జంతువులు మెదలకుండునట్టి విజన స్థలంబునందుఁ జేలాజిన కుశోత్తరంబుగా సుఖాసనంబు నిర్మించి, యందు నాసనంబు లభ్యాసంబు సేయ వలయు ; నవ్విధం బెట్లన్నను.91

సీ. పద్మాక్షి ! విను మెనుబదినాల్గు లక్షలై
నట్టి యాసనములం దతిశయములు
నలువొప్ప నెనుబదినాల్గాసనంబు లం
దధికంబు లష్టాదశాసనంబు

లటువంటి యష్టాదశాసనంబులలోన
నతిశయించినవి సిద్ధాసనంబు
భద్రాసనంబును పద్మాసనంబును
సింహాసనంబు నాఁ జెప్పఁదగిన

తే. నాలుగాసనముల యందుఁ జాల మేటి
యనఁగ నొప్పుచునుండు సిద్ధాసనంబు
పొలఁతి ! యష్టాదశాసనంబుల విధములు
వినుము వేర్వేఱఁ జెప్పెద విశదముగను. 92

వ. స్వస్తికాసన , గోముఖాసన , వీరాసన , కూర్మాసన , కుక్కుటాస , నోత్తాన కూర్మాసన , ధనురాసన , మత్స్యేంద్రాసన , పశ్చిమ స్థాణ్వాసన (పశ్చిమోత్తానాసన), మయూరాసన , సిద్ధాసన , మతాంతర సిద్ధాసన , భద్రాసన, పద్మాసన , మతాంతర పద్మాసన , బద్ధ పద్మాసన , సింహాసన, శవాసనంబు లనునీ యష్టాదశాసనంబులందు స్వస్తికాసనం బెట్లన్నను.93

తే. తరుణి ! విను జాను జంఘికాంతరములందుఁ
బదము లొదికిలఁగా నుంచి పదిలపఱచి
యున్న నది స్వస్తికాసనం బొనరు ; గోము
ఖాసనం బెటులన్నఁ బద్మాక్షి ! వినుము. 94

వ. ఎడమకాలి మడమ కుడి వీపు ప్రక్కగాఁ గుడికాలి మడమ యెడమ వీపు ప్రక్కగా మోకాటిమీఁద మోకాలు కదియ నుంచి కూర్చున్న నిది గోముఖాసనంబగు. ఒక పాదము తొడక్రింద నొక పాదము తొడమీఁద నునిచి కూర్చున్న నిది వీరాసనంబగు. ఆధారమున కుభయ పార్శ్వముల రెండు కాళ్ళ మడమలు కదియ హత్తించి చక్కగాఁ గూర్చున్న నది కూర్మాసనంబగు. పద్మాసనంబుగా నుండి మోకాళ్ళ తొడల సందులఁ జేతులను దూర్చి హస్తములు నేల నూని పద్మాసనంబు పైకెగసినట్లుండుట

కుక్కుటాసనంబగు. ఇట్లు కుక్కుటాసనస్థుఁడై యుండి రెండు చేతులను మెడను బట్టుకొని కూర్మమువలె వెల్లకిలఁ బడియున్న నుత్తాన కూర్మాసనంబగు. పాదాంగుష్ఠముల రెంటిని రెండు చేతుల ధనురాకృతిగా వీపు వెనుకగాఁ జెవులకు సరిగాఁ బట్టియుండుట ధనురాసనంబగు. ఎడమ తొడ మొదటఁ గుడి పాదము నిడి , మోకాళ్ళ వెలుపలగా నెడమ చేయి చుట్టినట్టుగాఁ గుడిపాదము పట్టుకొని పెడమరలఁబడియున్న నిది మత్స్యేంద్రాసనంబగు. దీని వల్లను జఠరాగ్ని ప్రకాశించి కుక్షిరోగములు నశించును. అభ్యాసమువల్లఁ గుండలిని మేలుకొల్పును. పురుషునకు దండ స్థిరత్వంబు కలుగును. భూమి నానునట్టుగా రెండు కాళ్ళు చక్కగా సాఁచి నడుము వంచి మోకాళ్లమీఁద లలాటం బుంచి , రెండు చేతులు సాఁచి రెండు కాళ్ల బొటనవ్రేళ్లు రెండు చేతులఁ బట్టియున్న దీనివల్ల వాయువు పశ్చిమ మార్గముగా నడుచును. జఠరాగ్ని పుట్టి కడుపు పల్చనై రోగములు నశించును. ఇదే పశ్చిమ స్థాణ్వాసనంబగు ·(పశ్చిమోత్తానాసనంబగు). హస్తములు రెండు నేల నూని , మోచేతులు రెండు నాభి యిరుప్రక్కల నుంచి , ముఖము మీఁది కెత్తి రెండు కాళ్లు సాఁచి నెమలితోఁకవలెఁ బైకెత్తుకొని యున్న దీనివల్ల నుదర గుల్మాది రోగములు నశించి , జఠరాగ్ని ప్రకాశించి విషమునైన జీర్ణము చేయును. ఇది మయూరాసనంబగు. ఎడమకాలి మడమ మూలాధారమందును గుడికాలి మడమ లింగస్థానమందు నుంచి యేకాగ్ర చిత్తముగా శిరో గ్రీవా భుజంబులఁ జక్కగా నునిచి నడుము నిక్కించి భ్రూమధ్యావలోకనంబు సేయుచున్న దీనివల్ల మోక్షద్వార కవాట భేదనంబగు. ఇది సిద్ధాసనంబగు. లింగస్థానోపరి నెడమ మడమ నునిచి దానిపైఁ గుడి మడమ నునిచిన నిదియ మతాంతర సిద్ధాసనంబగు. ఇదియ వజ్రాసనంబు. ఇదె ముక్తాసనంబు , నిదె గుప్తాసనంబగు. మడమలు రెండు నండాధఃప్రదేశ లింగ పార్శ్వముల నుంచి , రెండు పార్శ్వములు రెండు చేతులఁ బట్టి కదలకుండిన దీనివల్ల విషములు , సమస్త వ్యాధులు హరించును. ఇది భద్రాసనం, బిదె గోరక్షాసనంబగు. ఎడమతొడమీఁదఁ

గుడిపాదము , కుడితొడమీఁద నెడమ పాదము నునిచి , వెన్నుగుండఁ గుడిచేత నెడమతొడమీఁద నున్న కుడి పాదము బొటనవ్రేలినిఁ బట్టి యటువలెనే వెన్నుగుండ నెడమచేతఁ గుడితొడ మీఁద నున్న యెడమ పాదము బొటన వ్రేలినిఁ బట్టి , హృదయమందుఁ జుబుకంబు నునిచి నాసికాగ్రంబు చూచుచున్న దీనివల్ల వ్యాధులు నశించును. ఇది పద్మాసనంబగు. ఎడమతొడనడుమఁ గుడిపాదము వెల్లకిల నునిచి , కుడితొడ నడుమ నెడమ పాదము వెల్లకిల నునిచి , హస్తములు రెండును రెండు తొడల మీఁద వెల్లకిలఁగా నునిచి , నాసాగ్రమందు లక్ష్యంబు నునిచి దంతమూలమున నాలుక హత్తించి , వక్షమందుఁ జిబుకంబు నుంచి మెల్లనె వాయువును నిలిపియున్న దీని వల్ల సర్వవ్యాధులు నాశనమౌను. ఇది మతాంతర పద్మాసనంబు. ఇదె ముక్త పద్మాసనంబగు. హస్తములు రెండు హత్తించి పద్మాసనముగా నుండి చుబుకము వక్షమందు హత్తించి , చిత్తమందు ధ్యానంబు సేయుచు నపాన వాయువు నూర్ధ్వముగా నడుపఁ గాఁ గుండలినీశక్తియుక్తమయి నిలిపిన ప్రాణవాయువును విడువఁగా నతిశయమైన జ్ఞానబోధ కలుగును. దీనివల్ల నాడీద్వారములందు వాయువు నిల్చును. ఈ విధముననె మరణము నొందిన ముక్తులగుదు , రిది బద్ధ పద్మాసనంబగు. లింగాండోభయ పార్శ్వములయందు నెడమ కాలిమడమ దక్షిణ పార్శ్వమునఁ గుడి కాలి మడమ యెడమ పార్శ్వమున నునిచి , చేతులు రెండు మోకాళ్ళ మీఁదుగా సాఁచి , వికసింపఁబడిన వ్రేళ్ళుగా నునిచియున్న దీనివల్ల మూలోద్యాణ జాలంధర బంధత్రయానుసంధానంబు కలుగు , నిది శ్రేష్ఠమైన సింహాసనంబగు. భూమి యందు శవమువలె వెల్లకిలఁగాఁ గాళ్ళు రెండు బొటనవ్రేళ్ళు సరిగాఁ గూర్చినట్టుగా సాఁచికొని , హస్తములు రెండు వక్షమందుఁ గదియ నుంచి పండుకొని యున్న దీనివల్ల సమస్తాసనములు వేసియున్న బడలిక తీఱు ; నిది చిత్త విశ్రాంతి సాధనమై యుండు , నిది శవాసనంబగు. ఈ క్రమంబుగా నాసనాభ్యాసంబులు చేసిన నాడులు వశీకృతంబులై దేహంబునకు జవ లఘుత్వంబులు గలిగి

సర్వరోగహరణంబగు. శరీరంబు వశవర్తియగుం గావున , దీని సాధించిన యనంతరంబునఁ బ్రాణాయామంబు సేయవలయు ; నదెట్లన్నను బ్రాణవాయువును రేచించి చంద్రనాడిచేతఁ బూరించి యధాశక్తిగా నిలిపి , తిరుగా సూర్యనాడిచేత మెల్లనె విడిచి , తిరిగి ప్రాణవాయువును సూర్యనాడిచేత మెల్లనె యుదరమునఁ బూరించి శాస్త్ర ప్రకారంబుగాఁ గుంభకమును ధరియించి తిరుగాఁ జంద్రనాడిచేతను విడువవలెను. ఏ మార్గమున విడుచునో యా మార్గముననే పూరించి ధరింపవలెను. మొదటి మార్గమునకంటె రెండవ మార్గమునఁ ద్వరపడక మెల్లనె విడువవలెను. ఇడయందుఁ బూరించి కుంభించి పింగళ నాడిని విడిచి , తిరిగి పింగళ నాడినిఁ బూరించి కుంభించి యిడయందు విడువవలెను. ఈ క్రమంబుగా సూర్య చంద్ర నాడులచేత వాయువును ఎంత యుక్తమో యంత విడిచి , యెంత యుక్తమో యంత నిండించి , యెంత యుక్తమో యంత నిలుపవలెను. ఈ క్రమంబునఁ జేయు రేచక , పూరక , కుంభక త్రయంబు నొక్క ప్రాణాయామంబగు. ఉదయ మధ్యాహ్న సాయంకాలార్ధ రాత్రములఁ గాలమున కిరువది చొప్పున కుంభకములు మెల్లమెల్లనే యెనుఁబది దనుక దినము నభ్యసింపవలెను. ప్రాణనిరోధమగు చుండఁగాను జెమట పుట్టినట్టాయెనా కనిష్ఠంబగు. వడఁకు పుట్టినట్టాయెనా మధ్యమంబగు. మాటిమాటికిఁ బద్మాసనం బెగసినట్టాయెనా యుత్తమంబగు. ఇట్టి యభ్యాసమునఁ బుట్టిన చెమటను మర్దనంబు చేయఁగాఁ దనువునకు దృఢత్వ లఘుత్వంబులు పుట్టును. ఈ ప్రాణాయామముచేతను మూఁడు నెలలమీఁదట నాడీ శుద్ధి గలుగును. ఇది ప్రాణాయామంబగు , నింకఁ బ్రత్యాహారం బెట్లన్నను. 95

సీ. శ్రీ గురుబోధా విశేషత గల బుద్ధి
 చే మానసమును సుస్థిరముఁ జేసి
యా మదియం దింద్రియ వ్యాప్తు లడఁగింప
 నందొప్పుగా నిల్చు ననిల గతులు

కమఠ మంగములను గదలనీయక కుక్షి
యందు దాఁచిన రీతి నఖిల విషయ
కరణానిలములఁ జక్కఁగఁ బట్టి నిల్పఁగా
నదియె ప్రత్యాహార మనఁగఁ బరఁగు

తే. దాన దేహంబు సుస్థిరత్వంబు నొందు
దీపితంబుగ నేకాగ్ర దృష్టి నిలుచు
దీని సాధించి, యటమీఁద ధ్యానయోగ
మెలమి సాధింపవలె నది యెట్టులనిన. 96

తే. రోష, దుర్భావ, వైకల్య దోషములను
గపట, వంచనముల వీడి, గర్వ మడఁచి
సద్గురూక్తులు వినుచును శాంతుఁడగుచు
నెపుడుఁ గరువలి నూని సర్వేంద్రియముల. 97

చ. అపు డుపసంహరించి గురుఁ డానతి యిచ్చిన లక్ష్యముద్రలం
దుపముగ మానసంబు నిడి, యొండొక చింతయు లేక చిత్తముం
జపలతఁ బొందనియ్యకను షడ్వనజంబుల నూని, లోనఁ దా
నెపుడుఁ జలింపకున్న మతి కింపొనరించెడి ధ్యానయోగమై. 98

వ. ఇది ధ్యానయోగంబగు ; నింక ధారణాయోగంబుఁ జెప్పెద నెట్లనినఁ జరణాది జానుపర్యంతంబు పృథ్వీతత్త్వంబగుఁ, దదధిదైవతంబైన బ్రహ్మను లకార యుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింపఁ బృథ్వీ జయంబు గలుగు. జాన్వాది నాభీపర్యంతంబు జలతత్త్వంబగుఁ, దదిధిదైవతంబైన విష్ణుని వకార యుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింప సలిల జయంబు గలుగు. నాభ్యాది కంఠపర్యంతం బగ్నితత్త్వంబగుఁ. దదధిదైవతంబైన రుద్రుని రవర్ణయుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింప నగ్ని జయంబు గలుగు. కంఠాది భ్రూమధ్య పర్యంతంబు వాయుతత్త్వంబగుఁ, దదధిదైవతంబైన మహేశ్వరుని యకారయుక్తంబైన

వాయుధారణాభ్యాసంబున ధ్యానింపఁ బవన జయంబు గలుగు. భ్రూమధ్యాది బ్రహ్మరంధ్ర పర్యంతం బాకాశ తత్త్వంబగుఁ, దదధిదైవతంబైన బిందుమయ గగనశరీరుండైన సదాశివుని హకార యుక్తంబైన ప్రాణ పవన ధారణాభ్యాసంబున ధ్యానింపఁ దన్మయత్వంబును, గగన జయంబును గలుగు. ఇట్లు ధారుణియు, వారుణియు, నాగ్నియు, మారుతియు, వ్యోమియు ననఁ బంచ ధారణా ధ్యానాభ్యాసంబునఁ బంచభూత జయంబు గలుగు; నివ్విధంబున. 99

తే. ధ్యాన మభ్యాస మొనరింపఁ దలఁగ కపుడు
మానసము నిల్చు, మది నూని మతియు నిల్చు
బుద్ధి నిలిచిన నానంద పూర్తి గలుగు
నదియె ధారణ యండ్రు యోగాఢ్యు లవని. 100

వ. ఇది ధారణాయోగంబగు; నింక సమాధి యెట్లన్నను ఆసన జయంబునను, గుంభకసిద్ధిచేతను నిర్మలంబైన జ్ఞాన భాను ప్రకాశంబుచేత మాయాంధకారంబు నడంచి ప్రకాశించు మానసంబు నాత్మాకాశంబునందుఁ గూర్చి, తన్మయత్వంబు నొంది శాంతవర్తనుండై సంయోగ వియోగ సుఖదుఃఖంబుల మఱువ, బ్రహ్మపదప్రాప్తి భావనవలన నిశ్చలానందభరితంబైన స్వానుభవ బోధయే సమాధి యగు. ఈ యష్టాంగ యోగాభ్యాసంబుఁ జేయువారికి నీ సమాధియే ఫలితార్థంబగు. అట్టివారు బ్రహ్మపదంబు నొందుదు; రివి స్థూలాష్టాంగయోగంబులగు. ఇంక మంత్ర, లయ, హఠ, రాజయోగంబులు గల' వనిన వరాహస్వామికి మ్రొక్కి భూదేవి యిట్లనియె. 101

తే. 'దేవ ! యష్టాంగ యోగముల్ తెలియ వింటి
రమ్యతర మంత్ర, లయ, హఠ, రాజయోగ
ములను నామీఁద దయయుంచి తెలుపు' మనిన
శ్వేతకిటి భూమిదేవి నీక్షించి పలికె. 102

వ. 'ఇంక మంత్ర యోగ విధానంబుఁ జెప్పెద నెట్లనిన. 103

## మంత్ర యోగ , లయ యోగములు

సీ. పూని విసర్జన స్థానంబునందుండు
నాధార కమలంబునందు వ శ ష
సలు నాలుగైన ఱేకులయందు దీపించి
విఘ్నేశుఁ డచ్చట వెలుఁగుచుండు ,
దానికి నంగుళ ద్వయముపై నుత్పత్తి
కైన స్వాధిష్ఠానమందు బ భ మ
య ర ల కారము లుండు నది యాఱు దళములం
దజుఁడుండు నుత్పత్తి కాధ్యుఁడగుచు ,

తే. మెఱసి యష్టాంగుళములకు మీఁద డాది
ఫాంత వర్ణావళినిఁ గూడి పది దళముల
నొప్పు మణిపూరకము నాభి నుండు విష్ణుఁ
డచటఁ దా స్థితికర్తయై యమరుచుండు. 104

సీ. పది యంగుళములకుఁ బై హృదయస్థాన
మం దనాహత పద్మ మమరుఁ గాది
రాంతవర్ణంబు లుండఁగఁ బదిరెండైన
దళములచే నొప్పు దానియందు
నధికుఁడై లయకర్త యైన రుద్రుండుండు ,
నావలఁ బదియురెం డంగుళముల
పై విశుద్ధంబుండు భావింపఁ గంఠంబు
నందు అఆలు పదాఱు దళము

తే. లందు వెలుఁగు సదాశివుం డచట నుండు ,
దానిమీఁదట నాజ్ఞాభిధాన చక్ర
మున హకార క్షకారంబు లొనరు నచట
నున్నతంబుగఁ బరమాత్మ యొప్పుచుండు. 105

సీ. అట దానిపైన సహస్రార కమలంబు
శీర్షంబునందు భాసిల్లుచుండు
నది యమృత స్థానమగు , దేహవృక్షంబు
నకు మూలమై గురునకు నివాస
మగు నిడా పింగళలం దేకవింశతి
సాహస్రములు మఱి షట్ఛతంబు
లైన శ్వాసములు ప్రాణాపాన కలితంబు
లై హంసలై యజపాఖ్య నొందు

తే. నట్టి శ్వాసలు గణపతి కాఱు నూఱు
జలజ సంభవ , విష్ణు , రుద్రులకు సంఖ్య
దప్ప కాఱేసి వేలు , సదాశివునకు
నొగిఁ బరాత్మకు గురున కొక్కొక్క వేయి. 106

వ. ఈ క్రమంబుగా సప్త కమలంబులందు హంసలు ద్రొక్కుచున్నప్పటి కాల ఘటికాక్రమం బెట్లన్నను. 107

సీ. ఆధారమున హంస లాఱునూ ఱర్పితం
బగు వేళ కొకటి యర్ధైన గడియ
పది వినాడులు నగుఁ , బరఁగ స్వాధిష్ఠాన
మం దాఱువేలైన హంస లొనర
నర్పితంబగు వేళ కగును షోడశ ఘటి
కలు నర్ధ ఘటిక విఘటికలు పది ,
క్రమముగా మణిపూరకమున కార్వేలైన
హంస లర్పితమగు నపుడు పదియు

తే. నాఱు నరగడియ విగడియలును బదియు
నగు , ననాహతమున హంస లాఱువేలు
నర్పితంబగు తఱిఁ బదియాఱు నరయు
గడియ లొక పదియైన విగడియ లగును. 108

సీ. ప్రకట విశుద్ధంబునకు వేయు హంసలు
నర్పితంబగు వేళ కగును రెండు
గడియలు సగమైన గడియ పదాఱు వి
గడియలు హంస లక్కడికి నాల్గు,
నాజ్ఞయందు సహస్ర హంస లర్పితమగు
నపుడు రెండ్నర గడియలు విగడియ
లును బదాఱును హంసలును నాలుగగు, సహ
స్రారంబునందు సహస్ర హంస

తే. లర్పణముగాఁగ రెండున్నరైన గడియ
లల విగడియలు పదియాఱు హంస లొక్క
నాలు గగుచుండు, నీ రీతి ననుదినంబు
జరుగు నఱువది గడియలై జనుల కెల్ల. 109

వ. ఇవ్విధంబున నుదయాద్యుదయ పర్యంతము నడుచుచున్న యిరువదియొక్క వేయిన్నాఱునూఱు హంసలు నజప యనందగు; నిట్టి యజపాగాయత్రీ మహామంత్రంబు గురుముఖంబుగా నెఱిఁగి యరుణోదయంబున శుచియై, పద్మాసనాసీనుండై కూర్చుండి నాసాగ్రావలోకనుండై సప్త కమలాధిదేవతలకు న్యాస ధ్యాన పూర్వకంబుగా నజపాగాయత్రీ మహామంత్రంబు నర్పణంబు సేయుచుండుట మంత్ర యోగంబగు; నింక లయ యోగం బెట్లన్నను విజనస్థలంబునఁ బద్మాసనాసీనుండై కూర్చుండి దిగువ నాసికాగ్రమును జూచుచుఁ బైనున్నది సాధించుచుఁ, బై నాసికాగ్రంబును జూచుచు దిగువనున్నది సాధించుచు, రెండు తర్జనులచేత రెండు కర్ణద్వారంబులును, రెండనామికలతో రెండు నాసికాద్వారములును బంధించి, శిరంబు వంచి, యేకాగ్రమనస్కుఁడై తెలివితో నూర్ధ్వంబుగాఁ జూడ నది రాధా యంత్రంబను ముద్ర యగుఁ; దన్ముద్రాభ్యాసంబుఁ జేయుచున్న బ్రహ్మరంధ్రంబునందుఁ బ్రణవనాదంబు దశవిధంబుగా మ్రోయుచుండు, నది యెట్లన్నను మొదట శింజినీ గతియు,

రెండవది తరంగ ఘోషంబు , మూఁడవది ఘంటారవంబు , నాల్గవది వేణునాదంబు , నైదవది వీణాస్వనంబు , నాఱవది భేరీధ్వని , యేడవది తాళ ధ్వని , యెనిమిదవది శంఖారవంబు , తొమ్మిదవది మృదంగ శబ్దంబు, పదవది మేఘనాదంబుకరణి వినంబడు. ఇట్లు క్రమక్రమంబుగా నాదానుసంధానంబు సేయ, నందు నవనాదంబులు లయించు. దశమంబైన మేఘనాదంబున శ్రవణ సహితంబుగా మనంబు నునిచి నిర్వ్యాపారంబుగా నిలిపి బాహ్యంబు మఱచునేని యమ్మానసంబుతోడఁ బవనంబందు లీనంబగు. ఇది నాదలీనానందకరంబైన లయయోగంబగు ; నింక హఠ యోగం బెట్టిదనిన.

## హఠయోగము

రాజ పరిపాలితంబైన సుభిక్ష రాజ్యమందు హఠయోగమంటపంబు నిర్మించి, యందుండి యభ్యాసంబు సేయవలయు ; నదెట్లన్నను సుగంధ పుష్ప ఫల భరితంబైన వనమధ్యంబున గాలి చొరకుండ సూక్ష్మద్వారయుక్తంబైన మంటపంబు నిర్మించి దినదినంబును గోమయంబున శుద్ధి చేయించుచు నందు వసియించి , యతిశయించిన యుప్పు , పులుసు , కారములును , జేదు , నొగరు వస్తువులును , నవతలఁ దిల తైలంబును , నజాది మాంస మద్య మీనంబులును , రేఁగు పండ్లును , మిక్కిలి పసరాకు కూరలును , దధి , తక్ర కుళుత్థములును , ఇంగువ , లశునంబు మొదలైన తామస మందాహారంబులు విడిచి , యవ , గోధుమ , శాల్యన్నంబులును , ముద్గ సూపమును , గోఘృతమును , పొళ్ళకాయలు , పొన్నగంటి , చక్రవర్తికూరలును , శర్కర , ఖండ శర్కర మొదలైన సాత్త్వికాహారంబులను గ్రహింపవలయుఁ ; దా భుజింపఁదగిన యన్నంబు నాల్గు పాళ్లు చేసి యొక పాలు విడిచి , మూడుపాళ్ళీశ్వర ప్రీతిగా భుజించుచుఁద్రిఫలంబు లౌషధంబుగా గ్రహించుచుఁ బ్రాతస్స్నా , నోపవాస , వ్రత , స్త్రీసాంగత్యాది దేహప్రయాసంబులు విడిచి , యనలార్కోదితంబులైన కాఁకలం బడక ,

శీత వాతంబులలం దుండక , యోగ షట్కర్మంబు లాచరింపవలయు ; నవి యెయ్యవి యనిన ధౌతికర్మ , వస్తి కర్మ ; నేతి కర్మ , త్రాటక కర్మ , నౌళి కర్మ , కపాల భాతి కర్మంబులన నాఱు గలవు. అందు ధౌతికర్మం బెట్లన్నను. 110

తే. వినుము మృదువస్త్ర మొక నాల్గువ్రేళ్ల వెళుపు
పొసఁగఁ బదియైదు చేతుల పొడవు గలిగి
నట్టి వస్త్రంబు తేటనీళ్లందుఁ దడిపి
మెల్లమెల్లఁగ లోనికి మ్రింగవలయు. 111

సీ. అటు మ్రింగి యీవల నతివేగమునఁ దీసి
యటుమీఁద వింశతి హస్త సంఖ్య
గల వస్త్రమును మెల్లఁగా దిగమ్రింగుచుఁ
దీయుచు నుండఁగా దీపనంబు
గలుగు , నపానమ్ముఁ గంఠనాళముగుండ
వెడలింపఁ బైత్యంబు వెడలిపోవు
నది యభ్యసింపఁగా నక్షి రోగములు , కా
స , శ్వాసముఖరోగచయము లడఁగు

తే. గురు ముఖంబుగ నీ మర్మ మరసి ధౌతి
గజ కరణి యన నొప్పు నీ కర్మ మొనర
నభ్యసింపఁగ వాయువు లన్ని తనకు
వశములై నిల్చుచుండు నో వారిజాక్షి ! 112

వ. ఇఁక వస్తికర్మం బెట్లన్నను నాభిపర్యంతంబుగా నీళ్లయందుఁ జొచ్చి యధోద్వారమందుఁ గ్రోవి యుంచి కుక్కుటాసనస్థుండై కూర్చుండి యపాన వాయువు చేతను జలమును మీఁదికి నెగయఁ బీర్చి , తిరుగ నధో ద్వారమున నా జలమును విడుచుచున్న , దీన శూలలు , గడ్డలు , మహోదరాలు ,

వాత పిత్త శ్లేష్మములవల్లఁ బుట్టిన సమస్తవ్యాధులును బోవును . సప్తధాతు, చక్షురాదీంద్రియాంతఃకరణ ప్రసన్నతయు , శాంతియు , క్షుత్తునుం గలిగి సర్వ దోష భయములను బోఁగొట్టు నిది వస్తి కర్మంబగు. ఇంక నేతి కర్మం బెట్లన్నను జానెడు పొడవు సూత్రము మలినములేని నేతిలోఁ దడిపి ముక్కు గోళములచేఁ బీల్చి నోట వెడలఁదియ్యఁగా దీనం గఫశోధనమై దివ్య దృష్టియుఁ గలుగునిది నేతి కర్మంబగు. ఇంకఁ ద్రాటక కర్మం బెట్టిదనినఁ గదలని చూపుచేత సూక్ష్మమైన గుఱిని నేకాగ్ర చిత్తము గలవాఁడై కన్నీరు పొడమిన దనుకఁ జూడఁగా దీన నేత్ర రోగములు పోవు , నిది బంగారుపెట్టె వలె గోప్యము సేయఁదగినది. ఇది త్రాటక కర్మంబగు. ఇంక నౌళికర్మం బెట్టిదనినఁ దీవ్రమైన వేగమునఁ గడుపును గుడియెడమలుగాఁ ద్రిప్పఁగా దీనఁ గడుపులో మందాగ్ని విడిచి దీపనంబు గలిగి, పాచనాదులు చక్కఁగా నేర్పడి యానందమిడి నమన్త రోగ దోషములను బోగొట్టును. హఠయోగమునకెల్ల శ్రేష్ఠమైయుండు నిది నహుళీ కర్మంబగు. ఇంకఁ గపాల భాతి కర్మం బెట్టిదనిన లోహకారకుఁడు కొలిమితిత్తు లూదినట్లు రేచక పూరకంబులు చేయఁగా దీనఁ గఫ దోషములు పోవు , నిది కపాల భాతి కర్మంబగు. ఈ క్రమంబుగా ధౌతి , వస్తి , నేతి , త్రాటక , నహుళి , కపాల భాతి యను నీ షట్కర్మంబులు క్రమంబుగా నభ్యసింప రోగ రహితంబులై నాడులు వశవర్తు లగుచుండు. అప్పుడు సిద్ధాసనాసీనుండై కూర్చుండి రేచక పూరక కుంభకయుక్తంబైన ప్రాణాయామ పూర్వకంబుగా షణ్ముఖీ ముద్రాభ్యాసంబుఁ జేయుచుండునది. తదనంతరంబున సుషుమ్నానాడికిఁ గారణమైన మూలాధార బ్రహ్మ రంధ్రమందొక రంధ్రంబు గలదు. ఆ రంధ్రమే భూతత్త్వమనియు , నిడా పింగళ నాడులు ముఖమనియుఁ జెప్పుదురు. తత్కారణంబుచే నమృతంబు స్రవించు. అయ్యమృతంబు స్రవించి పోవుటచే మనుష్య శరీరమునకు మృత్యువు గలుగును. తదమృతమును నిల్పుటకై మడమచేత యోనిస్థానంబును లెస్సగా నొత్తిపట్టి , గుదము నూర్ధ్వముగా

నెగయ నొత్తి యపానవాయువును మీఁది కాకర్షించి , బలాత్కారంబున నూర్ధ్వంబుగా నాకుంచనంబుసేయ నది మూలబంధంబగును. దీనిచేతఁ బ్రాణాపాన వాయువులును నాద బిందువులును నైక్యమై యోగసిద్ధిప్రదంబగు. అపాన వాయువు మీఁది కెగసి యగ్నియందుఁ బొందుచుండఁగా నప్పు డగ్ని జ్వాల వాయువుతోఁ గూడి పొడవుగా వృద్ధింబొందు , నప్పు డగ్నిపురుషాపాన వాయువులు ప్రాణ వాయువును బొందు ; నివ్విధంబున దేహంబునఁ బుట్టిన యగ్ని మిక్కిలి ప్రజ్వరిల్ల నందు నిద్రించిన కుండలినీ శక్తి తపింపఁబడి మేల్కొని, కట్టెచేతఁ గొట్టఁ బడిన భుజంగస్త్రీవలె నిశ్వాసంబు పుచ్చి చక్కఁగా సుషుమ్నా ద్వారమును బ్రవేశించి శాంతమై బ్రహ్మనాడినడుమఁ బొందుఁగనుకఁ , దదభ్యాసంబుఁ జేయుచున్న మూలశక్తి యాకుంచితంబగు ; మధ్య శక్తి మేల్కొనును. ఊర్ధ్వశక్తిపాతంబు నొదవు. పవనుండు మధ్యమార్గంబునం జననోపు. అదియునుంగాక మూలం బాకుంచితంబై నాభి నొత్తిన నది యోడ్యాణ బంధంబగు. కంఠంబు సంకుచితంబై చుబుకంబు ఱొమ్ము నొత్తిన నది జాలంధర బంధంబగు. మూలం బాకుంచితంబైనప్పు డపాన వాయు వెగయునంతలో హృదయమందున్న ప్రాణంబు దిగి నాభియం దపానునిఁ గలయునప్పుడు కుంచితంబైన నాభిని వెనుక కొత్తిన ప్రాణాపానంబులు కలసి వెన్నంటిపోవునంతలో గంఠనికుంచనం బడఁచిన యమ్మారుత మందద్దంబైన కుండలినిం బడనూకి మధ్య బిలంబునం జొరఁబడి చిన్మయత్వంబు నొందు ; నప్పు డంతరాళ నాళంబు నిశ్శబ్దంబగు. కంఠముద్ర పవనంబున నాఁగి నిల్వఁగా సర్వ పరిపూర్ణ పరిభావన సిద్ధించు. ఈ ప్రకారంబుగా నాకుంచిత కంఠ నిరోధం బొదవినప్పు డమృతం బగ్నిలోఁ బడక స్వానుభూతికి లోఁకువై ప్రాణిని నిశ్చలానందంబు నొందించు ; నదియునుంగాక.

సీ. వరయోగి యగువాఁడు వజ్రాసనము నుండి
నయమొప్పఁగా వామనాడిచేత
నాలోనఁ గుంభించినట్టి మారుతమును
మెల్లనె విడిచి , యా మీఁద మరల
దక్షిణనాడిచేతను వెలుపలి వాయు
వును మెల్లనే లోని కొనరఁ దీసి
యప్పుడు కేశనఖాగ్ర పర్యంతంబు
నరికట్టి కుంభకం బచటఁ జేసి

తే. వామనాడిని విడువ నవ్వలఁ గపాల
శోధనంబగుఁ , గ్రిమి ,వాత బాధ లడఁగుఁ
గొమ్మ ! యిది సూర్యభేదన కుంభకంబు
కోరి వినుమింక నుజ్ఝాయి కుంభకంబు. 114

సీ. తగ నోరు బంధించి తన ముక్కుఁ గ్రోవుల
నుంచి వాయువును బూరించి , కంఠ
మున ధ్వనిఁ బుట్టించి మొనసి హృదబ్జంబు
దాఁక లోనికిఁ దీసి తనువునందుఁ
బ్రాణునిఁ గుంభించి , పరఁగ నిడానాడి
చేతను విడువఁగా శ్లేష్మ హరము
నగు , జఠరాగ్ని మహావృద్ధియగు , ధాతు
గత రోగములు సెడుఁ గ్రమముగాను

తే. నడచుచుండినఁ గూర్చుండినను దినంబు
గోప్యముగ నిట్టి యుజ్ఝాయి కుంభకంబు
క్రమముగాఁ జేయఁదగును ; సీత్కారమనెడి
కుంభకం బేను చెప్పెదఁ గొమ్మ ! వినుము. 115

తే. వనిత ! నాసాపుటములచే వ్యావరింపఁ
బడిన సీత్కారమనెడు కుంభకము ముఖము
నందుఁ జేయఁగ నిద్రయు నాఁకలియును
దెలియకుండును, స్వచ్ఛందదేహుఁ డగును. 116

వ. అది యెట్లనిన నాలుకచేతను జెక్కిళ్లచేతను వాయువును సదా పానము సేయఁగా , నతఁ డాఱు నెలలకు సకల రోగరహితుఁడై యోగినీ చక్ర సమాన శక్తి గలవాఁడై , రెండవ వామదేవుం డనఁదగియుండు ; నిది సీత్కార కుంభకంబగు. ఇంక సీతళి యను కుంభకంబుఁ జెప్పెద నెట్లన్నను 117

తే. యోగి రసనంబుచేత వాయువును మెల్లఁ
గాను బూరించి పూర్వ ప్రకారముగను
గుంభకముఁ జేసి నాసికా గోళములను
విడువ బహురోగ బాధలు వీడిపోవు. 118

వ. ఇది సీతళీ కుంభకంబగు ; నింక భస్త్రికాకుంభకంబుఁ జెప్పెద నెట్లనినఁ బద్మాసనాసీనుండై యుదరగ్రీవంబులఁ జక్కఁగా నిలిపి , నోరు లెస్సగా మూసి ప్రాణవాయువును ముక్కుచేత వ్యాపింపఁజేసి వేగ విడిచి బ్రహ్మరంధ్ర పర్యంతంబు వ్యాపించిన మేఘధ్వనితోడఁ గూడిన వాయువును హృదయపద్మపర్యంత మించుకించుక నిండించి విడిచి తిరుగా నా ప్రకారంబుగానే పూరించి విడిచి , మఱియు నా రీతినే పూరించి రేచించుచుఁ గమ్మరి కొలిమి తిత్తు లూఁదినట్లు రేచించి పూరించుచు దేహమందున్న వాయువును బుద్ధిచేతఁ జలింపఁజేయుచుండగా నెప్పుడైన బడలిక పుట్టిన, గాలిచేతఁ గడుపు నిండిన , సూర్య నాడిచేత వాయువును విడువఁగా బడలిక దీరును. కడుపును జులుక నగు. అప్పు డంగుష్ఠానామికలచే ముక్కు బిగఁ బట్టి వాయువును గుంభించి యిడానాడిని విడిచిన వాత పిత్త శ్లేష్మములు నశింపఁగా జఠరాగ్ని ప్రకాశించును. సకల నాడీ మల విమోచనం బగును. బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులు భేదింపంబడు ; నిది సుఖప్రసంబైన భస్త్రికా కుంభకం ; బింక భ్రమరికా కుంభకంబుఁ జెప్పెద నెట్లంటేని. 119

క. పురుష మిళింద ధ్వనివల
నఱిముఱిఁ బూరించి , భృంగి యానందముతో
నరుదుగఁ జేసిన నాదము
కరణిని రేచింపవలయుఁ గ్రమముగఁ నెపుడున్. 120

క. ఈ రీతి నభ్యసింపఁగ
వారల కానంద మూర్ఛ వర చిత్తమునం
దారూఢిగఁ జనియించును
గౌరవముగ నిదియె భ్రమరికా కుంభకమౌ. 121

వ. ఇంక మూర్ఛా కుంభకంబుఁ జెప్పెద నెట్లన్నను. 122

తే. రహినిఁ బూరించి జాలంధరంబు నొనరఁ
బెట్టియుండ లసద్భోధ పుట్టి లోన
నిలిచి జీవునిఁ జొక్కించి నిండుచుండు
నది మనోమూర్ఛయను కుంభకాఖ్య నొందు. 123

వ. ఇంకఁ గేవల కుంభకంబుఁ జెప్పెద నెట్లన్నను రేచక పూరక కుంభకంబులు విడిచి స్వభావంబుగా మారుత ధారణంబుఁ జేసి నిజ బోధానందమగ్నుఁడై చొక్కి యున్నది కేవల కుంభకంబగు. ఇట్టి కుంభకం బభ్యసించి సిద్ధుఁడైన వానికిఁ ద్రిలోకంబులందుఁ దుర్లభంబైన కార్యంబు లేదు. సర్వస్వతంత్రుఁడై యుండు. ఇట్టి హఠయోగంబు యమ నియ మాసన ప్రాణాయామాద్యష్టాంగయోగ త్రిబంధాష్ట కుంభక ముద్రాది సాధనంబులచేత ద్వాదశాబ్దంబు లభ్యసింప సిద్ధి యగు. అది యెట్లంటేని ప్రధమాబ్దంబందు రోగరహితుండగు. ద్వితీయాబ్దంబునఁ గవిత్వంబుఁ జెప్పు. తృతీయాబ్దంబున విషజయుండగు. చతుర్థాబ్దంబున క్షుత్తృష్ణా నిద్రాలస్యంబుల జయించు పంచమాబ్దంబున వాక్సిద్ధి నొందు. షష్ఠాబ్దంబున ఖడ్గాభేద్యుండగు. సప్తమాబ్దంబున భూమి నంటకుండు అష్టమాబ్దంబున నణిమాద్యష్టైశ్వర్య

సంపన్నుఁడగు. నవమాబ్దంబున నభోగమనుండగు. దశమాబ్దంబున మనోవేగుండగు. ఏకాదశాబ్దంబున విశ్వవశత్వంబు గలవాఁడగు. ద్వాదశాబ్దంబున సాక్షాదీశత్వంబు నొందు , నిది హఠయోగంబగు. ఇంక రాజయోగంబుఁ జెప్పెద , నది సూక్ష్మష్టాంగ యోగ పూర్వకంబుగా నభ్యసింపవలయు నెట్లనిన. 124

## రాజయోగము

సీ. ఆహారనిద్రాదు, లా దశేంద్రియ వ్యాప్తు
లడఁచి శాంతత నొంద నది యమంబు
నిశ్చల గురుభక్తి నిస్సంశయమును యో
గాసక్తి తృప్తి యేకాంతవాస
పరతయు వైరాగ్యభావంబు కరణ ని
గ్రహమును నియమంబు , సహజ సుఖము
నొసఁగు నాసనమునం దుండుట నిస్పృహ
త్వంబు నొందుటయు నాత్మను మనంబు

తే. నదిమి కుదిరించి నిల్పుటే యాసనంబు ,
ప్రకట రేచక పూర కుంభక సమేత
మైన శ్వాసలలో నప్రయత్నముగను
గుదురఁ జేసిన యనిరుద్ధ కుంభకమున. 125

వ. ప్రాణుని స్థిరంబుగా నిలిపి ప్రపంచం బనిత్యంబని తలంచుటే ప్రాణాయామంబగు. అంతర్ముఖంబైన నిర్మలచిత్తంబునఁ జైతన్య జాలంబుల నడఁచుటయు , బహుప్రకారంబులై జనియించు మనోవికారంబుల నేర్పరించి తద్వికార గ్రసనంబుఁ జేసి మనంబును నిర్వ్యాపారంబుగా నిలుపుటే ప్రత్యాహారంబగు. స్వస్వరూపానుసంధాన భావంబుచే ద్వితీయరహితాత్మాను భవంబున సర్వప్రపంచంబు నాత్మగా

నెఱింగి, సకల భూత దయా సమత్వంబున నిత్య తృప్తిం జెందియుండుట ధ్యానంబగు. అంతర్బాహ్య ప్రకాశం బేకంబుగా స్వతేజోమయంబుగాఁ బరతత్త్వంబు నుద్దేశించి తదీయ ధారణంబుఁజేయుచుఁ జిత్తంబును జునిఁ గిపోనీయక నిలుపుటే ధారణంబగు. తద్ధారణాభ్యాసంబునఁ జిత్తం బేకాగ్రం బగునప్పుడు జీవాత్మ పరమాత్మయందు జలశర్కరా న్యాయంబుగాఁ గలిసి యఖండ బోధ నొందుటే సమాధియగు. ఇట్టి సూక్ష్మాష్టాంగంబులఁ బ్రకాశించు నా రాజయోగంబునకు లక్షణంబు సంక్షేపంబుగాఁ జెప్పెద, నెట్లన్నను హంసాక్షర, సిద్ధాసన, కేవల కుంభక, నాదంబు లను నీ నాల్గింటి వలన రాజయోగం బొప్పు. అందు సాంఖ్య, తార, కామనస్కంబులనఁ ద్రివిధంబు లుండు; నందు సాంఖ్యం బెట్టిదనిన. 126

సీ. పంచ తన్మాత్రలు పంచ భూతంబుల
పంచీకృతంబులై ప్రబలుచున్న
సకలేంద్రియంబులు సర్వ విషయజాల
ములు గుణత్రయ కామముఖ వికార
ములుగాను దనువులు మూఁడునుగా నవ
స్థలుగాను దగ నన్ని తలఁచి యెఱుఁగు
నటువంటి యెఱుక నే నని నిశ్చయించి వి
క్షేపావరణములఁ జిదిమివైచి

తే. తాను దనలోనె తనుఁ దాను తఱచి తఱచి
యన్నిటికి మీఁద శేషించి యచల వృత్తి
నుండుటది సాంఖ్యయోగమై యొప్పుచుండు
గురుముఖంబున నీ యోగ మరయవలయు. 127

వ. ఇవ్విధంబున సాంఖ్యం బెఱింగి, తారకం బభ్యసింపవలయు, నదెట్లన్నను. 128

క. అరగన్నులతో నైనను
మురువలరఁగ రెండు కనులు మూసియునైనన్
పరమాత్మను లో చూపున
గుఱిగా నీక్షింపవచ్చు గురుభక్తుండై. 129

తే. చంద్ర సూర్యాంతరములందు , సహజముగను
వెలుఁగు తారకములయందు విమల బిందు
వమరఁ గూర్పఁగ నది తారకాఖ్య యోగ
మై ప్రకాశించు లక్ష్యత్రయంబు నగుచు. 130

వ. అది బాహ్య మధ్యాంతర్లక్ష్యంబు లన నొప్పు , నందు బాహ్యలక్ష్యంబెట్లన్న బహిర్నాసికాగ్రావలోకనంబు మనో మారుతంబులంగూడి స్థిరంబుగా నిల్ప , నందుఁ జతురంగుళ ప్రమాణంబున నైల్యంబును , షడంగుళ ప్రమాణంబునధూమ్రంబును , నష్టాంగుళ ప్రమాణంబున రక్తిమంబును , దశాంగుళ ప్రమాణంబునఁ దరంగ ప్రభయును , ద్వాదశాంగుళ ప్రమాణంబునఁ బీత ప్రకాశంబు నగు ; నీ యయిదుఁ బంచ భూత వర్ణంబులై యెదుటం దోఁచునప్పు డపాంగ దృష్టుల వెనుకఁ గూర్చి శీర్షంబు మీఁదికిఁ జొనుపుచు నిశ్చల చిత్తుండై చూడ నందుఁ జంద్రప్రభ గానవచ్చు నదియునుంగాక. 131

తే. కర్ణ నాసాపుటాక్షి మార్గముల వ్రేళ్ల
నమరఁ బీడించి చిత్తంబు నచట నిల్పఁ
బ్రణవనాదంబు వినవచ్చుఁ , బ్రకట దీప
కళలు నవరత్న కాంతులు గానవచ్చు. 132

వ. ఇది యాత్మప్రత్యయ ప్రకాశంబైన బహిర్లక్ష్యంబగు. ఇంక మధ్య లక్ష్య విధం బెట్లన్నను. 133

తే. కంటి పాపల రెంటినిఁ గదలనీక
మానసముతోడ భ్రూయుగ మధ్యమందుఁ
జొనిపి తన్మధ్యమున నుండు సూక్ష్మబిలము
లోఁ బ్రవేశించి చూడ నాలోన నపుడు. 134

క. మెఱుపులు నక్షత్రంబులు
తరణి శశిప్రభలు భూతతతి వర్ణములున్
గరువలి నెనయుచు లోపలఁ
బరిపరి విధములుగ మెఱయు భావములోనన్. 135

వ. మఱియు నిరవధిక శూన్యంబగు నాకాశంబును, గాఢాంధకారంబైన మహాకాశంబును, గాలాగ్నినిభంబైన పరాకాశంబును, నధిక ప్రకాశంబైన తత్త్వాకాశంబును, గోటిభాను సంకాశంబైన సూర్యాకాశంబును నను నీ యాకాశ పంచకంబు నవలోకించు నతండు తన్మయుండై నిరవకాశాకాశ సదృశుండగు ; నిది మధ్య లక్ష్యంబగు. ఇంక నంతర్లక్ష్యం బెట్లన్నను.136

క. ఆపావక చంద్రార్క
వ్యాపకమై పంచభూత వర్ణకలితమై
యాపోజ్యోతిరసం బిల
రూపాశ్రయమగుచు నుండు రూఢ ప్రజ్ఞన్. 137

క. చక్షుర్మధ్యంబునఁ బర
మాక్షర హైరణ్య సచ్చిదమృతాంకురముల్
సాక్షిగ బాహ్యాంతరముల
వీక్షించుచు నిత్య సుఖము నెనయుచునుండున్. 138

క. ఆ యమృతాంకుర యుగళము
నాయకమై స్ఫటిక రుచుల నైల్యంబుగ సు
చ్ఛాయల నెనయుచుఁ బవన
స్థాయికి నెలవగుచు జీవతారకమయ్యెన్. 139

వ. ఈ రహస్యంబు సద్గురూపదేశక్రమంబుగా నెఱిఁగి , బాహ్యాంతరములకు నడిమి శృంగాటకమునం దోంకారదీపిత తదగ్రనీవారశూకాణువగు సగుణ పంచకంబు వీక్షించుట తారకాంతర్లక్ష్యంబగు. అదియునుంగాక సరస్వతీనాడి చంద్రప్రభానిభంబై మూలకందంబునందుండి దీర్ఘాస్థిమధ్యంబున బిసతంతువు కైవడి విద్యుత్కోటి సంకాశంబై బ్రహ్మరంధ్ర పర్యంతంబు వ్యాపించి యూర్ధ్వగామినియై సర్వసిద్ధిప్రద యగు. తత్స్వరూపంబు నాత్మయందు భావించుచు ఫాలోర్ధ్వకోల్లలాట మండలంబున స్వస్వరూపమందు లక్ష్యంబుంచి చూచుటె పరమాంతర్లక్ష్యంబగు ; నివ్విధంబున. 140

మ. అనిశంబున్ భవతారకాఖ్య వర యోగాభ్యాసముం జేయఁగా
మనమున్ మారుత మంతరంగమున నిర్మగ్నత్వముం బొందు , నం
దనుకూలంబగు నంతరాత్మ పరమాత్మానందమున్ బొందు ; నిం
కొనరంగా నమనస్క యోగ విధము న్నుత్సాహినై చెప్పెదన్. 141

సీ. ఆత్మాశ్రయములగు నల హంసమార్గంబు
లకుఁ గుడి యెడమల లలిత నీల
కాంతులఁ దగు నుదక జ్యోతులందు భా
స్వరతర దర్పణచ్ఛాయ లమర
వెలుఁగఁగాఁ దన్మధ్యములయందు సూక్ష్మాతి
సూక్ష్మంబులైనట్టి సుషిరములను
మానసంబును నిల్పి , నూని యంతర్లక్ష్య
మును బాహ్య దృష్టు లిమ్ముగ ఘటించు

తే. నదియె ఘన శాంభవీ ముద్ర యగుచునుండు
రెండు జాముల దనుకఁ గూర్చుండి దీని
నభ్యసింపఁగ మానసం బనిల గతులు
నిలుచు , నేకాగ్ర భావమున్ నిలుచు నపుడు. 142

సీ. వినుకులం బలుకులన్ వివిధ చిత్రములైన
తలఁపులఁ దనయందె నిలిపికొనుచు
నటఁ బరమాత్మయం దంతరాత్మను గూర్చి
తా నందె లీనమై తగ నివాత
దీపంబుకైవడిఁ దేజరిల్లుచు నిస్త
రంగాబ్ధివలె నంతరంగమందుఁ
గనఁ డొక రూపంబు , వినఁ డొక శబ్దంబు
మొనసిన ఖేచరీ ముద్ర నంటి

తే. యచలితానందరసమగ్నుఁ డగుచుఁ జొక్కి
వర మనోన్మని యున్మన్యవస్థ లొంది
చలనరహితామనస్కం బజాడ్య నిద్ర
యోగనిద్రయు నా రాజయోగి పొందు. 143

వ. ఇట్టి రాజయోగికి జాగ్రత్ స్వప్న సుషుప్తి తుర్య తుర్యాతీతంబులను బంచావస్థలుం గల , వని యెయ్యవి యనినఁ జతుర్వింశతి తత్త్వాత్మకంబైన దేహంబు తాఁ గానని , పంచవింశకుండైన దేహి తానని తెలిసినది జాగ్రత్తగు. మనంబు నింద్రియ బృందంబుతోడ నాత్మయందుఁ బొందించి ధ్యానింపఁగా , నమ్మనంబు సర్వ విషయ వాసనాసంగ రహితమై బాహ్యాంతరంబుల మెలంగుచుఁ గేవల బహిర్ముఖంబుగాక తన్నుఁ దాను దరుచుచుండుటె స్వప్నంబగు. ఇది యభ్యసించుచున్న మనంబు బాహ్యమందు విస్తరిల్లక నుస్థిరంబయి , మాయాజాలం బనిత్యంబని సత్యవస్తువందుఁ బొందుచున్నప్పుడు బహిర్జ్ఞప్తి వచ్చినఁ దెప్పున నంతర్ముఖంబై జగం బనిత్యంబుగా నాత్మ సత్యంబుగా నెఱింగి నిత్యబోధ నొంది యుండుటే సుషుప్తి యగు. జీవేశ్వర భావంబుల నొందు నాత్మయందు నిలిచిన మనంబు బాహ్యాభావనా రహితంబై పరంబును భావించు ; నిట్లు పురుష

పురుషోత్తమ భావంబులన నుభయాత్మకంబైన చైతన్యంబునం బొంది యమ్మనంబు విషయవాసనా విముఖంబై సర్వేంద్రియవ్యాప్తులతోడ దేహాభిమానంబు విడిచి, విరక్తి మార్గంబున సంసారబంధ విముక్తమై యాత్మానుభవామృతపానంబునం జొక్కి తన్మయంబై స్వతంత్రతఁ బాసి యాత్మ పరతంత్రంబగుచుండు ; నంత జీవుం డస్వతంత్రుండై యీశ్వరాధీనుం డగుచుండగా నీశ్వర భావంబు సత్యంబగు , నప్పుడు సర్వమయుండైన పరమేశ్వరుని యందు మనం బుపరతంబగుచుండు ; నప్పు డాత్మ యెందాఁక మనోదృశ్యంబగు నందాఁక మనోన్మని యగు , నప్పుడు ద్రష్టృ , దృక్ , దృశ్యంబులు లేక తాను దానై ధ్యానవిరహితంబై చిన్మాత్రంబైన యెఱుక తానే సత్తామాత్రం బగుచుండు ; నప్పుడు మనంబు కలదు , లే దనరాకుండు నది యున్మన్యవస్థయైన తుర్యంబగు. అది స్వరాట్టను పరమపదంబగుచుండు , నందు సహజంబుగా మానసంబు సకలేంద్రియ ప్రాణానిలంబులతోడ లీనంబగు. ఇది యమనస్కంబైనఁ దుర్యాతీతంబగుచుండు. కలదు , లే దనరానిదై ఘటాకాశంబు మహాకాశంబునం బొందినట్లేకంబై దేశ కాల కార్య కర్తృ కారణ గురుత్వ లఘుత్వాద్యవస్థలు తోఁపకున్న నది సహజామనస్కంబగు. పట్టు విడుపు లేనిదై , చెప్పఁ జూపరాక సహజభావంబై యున్న నది యజాడ్యనిద్ర యగు. కడగానరాని నిస్తరంగ సముద్రంబు తెఱంగున , నాద్యంత రహితంబైన నభంబు కరణి నింతింతనరాక నంతట నిండి , మలయజమందు గంధంబును , వృక్షంబునం దనలంబును , నిక్షుదండంబునందు మాధుర్యంబును, క్షీరంబునందు ఘృతంబును , దిలలందుఁ దైలంబు నెట్లుండు నట్లు చరాచర ప్రపంచంబునందుఁ బరమాత్మ పరిపూర్ణుండై యిదమిత్థ మనరాకుండు టది యోగనిద్ర యగు. ఇది యంతంత సాధకున కనుభవంబు గాదు. అది యనుభవించిన యోగికి ననుభవైక వేద్యంబగుం గాని , వాక్కునఁ జెప్పఁగూడదు. అది యెట్లంటేని. 144

శా. బ్రహ్మం బద్వయవస్తువౌ ననెడి శాస్త్రం బెప్పుడున్ బల్కుచున్
బ్రహ్మాహమ్మను నంత మాత్రముననే బ్రహ్మంబు గా నేర్చునే ?
బ్రహ్మంబైన గురు స్వరూపము మదిన్ భావించి భావించి తా
బ్రహ్మంబైనటువంటి కాలమున నే బ్రహ్మంబనంగూడునే ? 145

వ. ఇ ట్లవాఙ్మానస గోచరంబైన బ్రహ్మానుభవంబె రాజయోగంబగు. ముందుఁ జెప్పిన మంత్ర లయాదియోగంబుల యనుభవ క్రమం బెట్లంటేని. 146

సీ. మంత్ర యోగంబుచే మారుత సంచార
దేహమర్మంబులఁ దెలియవచు
లయముచేఁ దనలోని లలిత ప్రణవనాద
సూత్రంబు మదినూని చొక్కవచ్చు
హఠముచే జరను రోగాళిని మృత్యువున్
గ్రేడించి ధీరుఁడై గెలువవచ్చు
సాంఖ్యయోగంబుచే సకలేంద్రియ వ్యాప్తు
లరయుచుఁ దన్నుఁ దా నరయవచ్చుఁ

తే. దారకముచేతఁ దనువులోఁ దాను వెలుఁగు
చున్న రీతినిఁ గనవచ్చు , నుచితమైన
రాజయోగంబుచేఁ బరబ్రహ్మమందుఁ
బొందియుండఁగవచ్చు సంపూర్ణుఁడగుచు. 147

సీ. విను మంత్రయోగికన్నను గొప్ప లయయోగి
లయయోగి కధికుఁ డుల్లాసియైన
హఠయోగి యగుచుండు , హఠయోగి కన్నను
సరస మానసుఁడైన సాంఖ్యయోగి
యధికుఁడ యగు , వానికన్నఁ దారకయోగి
యధికుండగుచునుండు , నతనికన్న
సాంఖ్య తారకముల సంగ్రహించుకొని వై
రాగ్య భావన నొప్పు రాజయోగి

తే. యుత్తమోత్తముఁడని చెప్ప నొప్పు, నతని
కన్న గొప్పైన యోగి లేఁ డవనిమీఁద
నతఁడు సంసారమందున్న నడవి నున్న
సకల నిర్లేపుఁడగుచుండు శాంతుఁడగుచు. 148

వ. అట్టి రాజయోగి లక్షణంబులు మఱియు నెట్లంటేని. 149

సీ. తనుకాంతియును మృదుత్వంబు వాఙ్మాధుర్య
మును, మిత భాషణంబులును భూత
దయ, వివేకంబు శాంతము మితాహారంబు
మానసస్థైర్యంబు మైత్రిగుణము
గలవాఁడు రాజయోగ సునిష్ఠుఁ డంబర
మధ్యస్థ కలశంబుమాడ్కి లోన
వెలి నెందు నంటక వెలుఁగు, నంబుధి మధ్య
గత కలశము రీతిగాను లోను

తే. వెలినిఁ బరిపూర్ణుఁడై నిండి వెలుఁగుచుండు
వాఁడు నొకవేళ సంసారివలె నటించు
నొ నొకవేళ వైరాగ్య మొందుచుండు
వాని యనుభవ మెఱుఁగ రెవ్వారు ధరణి. 150

క. ధర్మాధర్మము లొల్లక
కర్మాసక్తుండుగాక, కాదౌననకన్
నిర్మల భావుండగుచును
మర్మజ్ఞత నతఁడు మెలఁగు మనుజులలోనన్. 151

క. ప్రాజ్ఞుండై దేహముతో
నజ్ఞానులయందు మెలఁగు, నందున నా యో
గజ్ఞుని మదిఁ దెలియకయే
యజ్ఞానులు నిందఁజేతు రా గతి గనఁకన్. 152

తే. దూషణముఁ జేయువారికిఁ దొల్లి యతఁడు
చేసి యుండిన పాపము చెందుచుండు
భూషణముఁ జేయువారికిఁ బుణ్యఫలము
లపుడు పొందఁగ నిర్లేపుఁడగు నతండు. 153

సీ. పెద్దవన్న నహంతఁ బెంచి హెచ్చఁడు , చిన్న
వనినఁ దగ్గఁడు , భాగ్య మతిశయముగఁ
గలిగిన నుప్పొంగి గర్వింపఁ , డొక వేళఁ
దనకు లేవడియైనఁ దగ్గిపోఁడు
ప్రారబ్ధ మనుభవింపక తీరదని యస
హ్యముగ దుఃఖ సుఖంబు లనుభవించు
నబ్జపత్రంబులో నంటని జలబిందు
వట్ల సంసారమం దంటకుండు

తే. జగతిఁ గలబందమూలంబు తెగిన దాని
పచ్చి కొన్నాళ్లు నిలిచిన పగిది దేహ
మూలమగు కారణావిద్య మొదలు తెగిన
నాయువను పచ్చియున్నను నాళ్లంగ ముండు. 154

చ. అటువలెఁ గారణంబు తెగినప్పటికైనను గార్యజాల వి
స్ఫుట తనుయుగ్మ ముండుఁ , బరిపూర్ణ చిదాత్మ వికారిగాక త
ద్ఘటముల నాశ్రయించి , గుణ కర్మములం దెపుడంటి యంటకన్
సటలని రోసి , యన్నిటికి సాక్షిగ నుండు సుఖస్వరూపమై. 155

సీ. అల బుద్ధియును జిత్త మా యహంకృతి , మాన
సంబును బుత్విగ్గణంబు గాఁగఁ
బ్రణవ వర్ణంబు యూపస్తంభమునుగాఁగఁ
బ్రాణ దశేంద్రియ పంక్తి యచటఁ

బశు సమూహముగాఁగ , భాసురానాహత
నాదంబు విహితమంత్రంబుగాఁగఁ
బొసఁగఁ దత్పశువుల బోధాగ్నిలో వేల్చి
జ్ఞానామృతము సోమపానముగను

తే. ద్రావి చొక్కుచు మోక్ష కాంతా సమేతుఁ
డగుచు వేదాంత సూత్రంబు లనెడి కర్ణ
కుండలంబులు వెలుఁగఁ ద్రికూట మార్గ
మందు శాంత ప్రముఖ మిత్రు లలరి కొలువ. 156

సీ. ప్రకటితాచారముల్ బండికమ్ములు గాఁగఁ
శమ దమాదులు సుచక్రములు గాఁగఁ
బ్రాణ పంచకము నేర్పడఁ గాఁడి గాఁగ , న
నూనహృద్వనజంబు నొగయుఁ గాఁగ
వరకర్ణ నేత్రముల్ వాహనంబులు గాఁగ
రహి వివేకంబు సారథియుఁ గాఁగఁ
దగు నిస్పృహత్వమే త్యాగధ్వజము గాఁగఁ
బ్రబలు యోగరథంబుపైన నెక్కి

తే. పోయి నడిమి సరస్వతిం బొంది , గంగ
యమునయును నిల్చు నాల్గు మార్గముల నడుమ
నవభృథ స్నాన మొనరించి యాత్మ సోమ
యాజియన నొప్పుచుండు నీ యవనిమీఁద. 157

ఉ. ఇంతటి యోగపురుషుఁడు హెచ్చుఁడు తగ్గఁడు , సంతతంబు నే
కాంతమునన్ వసించుఁ , దనయందుఁ బరాత్మను జూచుచుండు , వి
భ్రాంతులు తన్నుఁ దిట్టినను బక్కున నవ్వును గాని , తిట్టఁ డీ
శాంతుఁడు రాజయోగి ఘన సద్గురుఁడంచు వచింపఁగాఁదగున్. 158

సీ. అటువంటి దేశికుం డిటువంటి యోగంబు
నింతంత శిష్యున కీయరాదు
శిక్షించి శాంతిఁ బరీక్షించి తన శిక్ష
కొప్పిన వారికే చెప్పవలయుఁ
దన శిక్ష కొప్పని తామసాత్మునకుఁ ద
త్త్వంబుఁ జెప్పిన , వాఁడు దంభుఁడగుచు
వేషభాషలచేత విఱ్ఱవీఁగుటె కాని
వాఁడు తత్త్వజ్ఞుండు కాఁడు గనుకఁ

తే. దొలుతనే శిష్యుఁడగువాని దుర్గుణములఁ
జూచి తిట్టుచుఁ గొట్టుచు , సుగుణములను
జెప్పఁగావలెఁ , దన శిక్ష కొప్పకున్న
నూరకయ శాంతిఁబొంది తా నుండవలెను. 159

తే. అంతియే కాని , దుర్గుణుండైన వానిఁ
దాఁ బరీక్షింప శిక్షింపఁ దలఁచెనేని
వాని దుర్మార్గములు తన మానసమున
నిలిచి కోపముఁ బుట్టించు నిక్కముగను. 160

క. కోపం బెవ్వరికైనను
దాపముఁ బుట్టించుఁ గనుకఁ దామస శిష్యుం
జేపట్టఁదగదు , పట్టినఁ
దాపత్రయహేతు వగును , దన శాంతి చెడున్. 161

క. దుర్గుణముల విడువక ష
డ్వర్గంబును గూడినట్టివాఁ డతిశయ దు
ర్మార్గుండగు ; వైరాగ్యము
భర్గుఁడు సెప్పినను వాఁడు పట్టుగ వినునే ? 162

## సచ్ఛిష్య లక్షణము

వ. ఇంక సచ్ఛిష్యుం డెవ్వఁ డనిన సాధన చతుష్టయ సంపన్నుండై , వంచనలేక, జార చోర క్రూర గుణంబులు విడిచి , పరమ శాంతి గలవాఁడై , మోక్షాసక్తుఁడై , గురుసేవ చేసి తద్గుర్వనుగ్రహంబునకుఁ బాత్రుఁడైనవాడు. అట్టి సచ్ఛిష్యుఁడు దేహాభిమానంబు విడిచి ప్రణవపూర్వకంబుగా వేంకటేశానుస్మరణంబుఁ జేయుచు నిజయోగ బలంబున సుషుమ్నాద్వారంబు భేదించుకొని యర్చిరాదిమార్గంబునం జని పరంబునం జెందు ; నట్టి యోగాభ్యాసంబుఁ జేయలేకున్నను నత్యంత గురుభక్తిగలవాఁడై తత్కటాక్షంబున భక్తి జ్ఞానవైరాగ్యంబుల నభ్యసించి యుపశాంతిఁ బొంది, జ్ఞానినని యహంకరింపక యుండవలయు ; నదెట్లన్నను. 163

క. జ్ఞానాహంకారం బే
మానవులను జెఱుచుఁగాన , మతిమంతులు తద్
జ్ఞానాహంకారంబును
మానుచు నుపశాంతు లగుట మంచిది గాదే ?

క. ఉపశాంతి లేని మనుజుల
జప తపములు , యోగవిధులు , సవనాదు లిలన్
గపటములై చెడుఁ గావున
నుపశాంతియ పరమధర్మ ముత్పలనేత్రా !

వ. ఇట్టి జ్ఞాన భక్తి వైరాగ్య యోగంబులకు ననేక విఘ్నంబులు గలుగుచుండు. తద్విఘ్న నివారణంబగుట కొక్క యుపాయంబు గల్గుటెట్లన్నను వేంకటాద్రి యందు సనక సనందన తీర్థం బతిగోప్యంబై యుండు. నరులకుఁ దెలియ రాకుండు. తత్సమీపమందుఁ బాపవినాశన తీర్థ తీరంబు సిద్ధస్థలంబై యుండు. మార్గశీర్ష శుద్ధ ద్వాదశీ దినం బరుణోదయ కాలంబున స్వామి పుష్కరిణీ స్నానంబు సేయుచుఁ, ద్రయోదశీ దినంబు మొదలుకొని సనక సనందన తీర్థంబునఁ గ్రుంకుచుఁ , బునఃపున ర్వేంకటేశ్వర దర్శనంబుఁ

జేయుచు , శ్రీ మదష్టాక్షరీ మంత్రజపంబుఁ జేయుచు , యోగాభ్యాసంబుఁ జేయుచున్న విఘ్నంబులు నశించు. యోగంబులు సిద్ధించు. పాపవినాశన తీర్థ సమీపంబున నతిగుప్తంబైన కాయరసాయనంబను పుణ్యతీర్థంబు గలదు. తత్తీర్థంబు పానంబుఁ జేసిన దేహంబు దివ్యంబగు. పరీక్షకుఁ బండుటా కా తీర్థంబులో వైచినఁ దత్పత్రంబు శ్యామవర్ణంబగు , నటుగనుకఁ దత్తీర్థ పానంబునఁ దేహంబు సిద్ధి వహించు ; నటువలె దృఢకాయుండైన వానికి శ్రీవేంకటేశ్వరుని కైంకర్యంబుఁ జేయుటే పురుషార్థంబగు. అట్టి కైంకర్యంబు శక్తి వంచకుండై చేయకుండిన స్వామి ద్రోహి యనందగుం గావున , సదా శ్రీ వేంకటేశ్వర కైంకర్యమే చేయుచుండవలయు ' నని వరాహస్వామి భూదేవి కుపదేశించిన క్రమంబు వ్యాసమునీంద్రుండు తెలిసి తదుపదేశ క్రమంబు నానతిచ్చె. ఆ వృత్తాంతంబు మీకుం జెప్పితి ' ననిన , సూతుం జూచి శౌనకాదు లిట్లనిరి. 166

ఉ. ' సూత ! మహానుబావ ! పరిశుద్ధములై తగు యోగమర్మముల్
ఖ్యాతిగ భూమిదేవికి నఖండ కృపన్ గిటి సెప్పఁగా మహా
ప్రీతిని బాదరాయణుఁడు పెంపు వహించి గ్రహించినట్టి వాగ్
వ్రాతము నీకుఁ జెప్పుటను , వాసిగఁ జెప్పితి వీవు మా కహో ! 167

## శ్రీవేంకటేశ్వరాష్టోత్తర శత స్తోత్ర ప్రభావము

సీ. సంతోషమయ్యె ! వేదాంతవేద్యుండైన
వేంకటేశార్చనా విభవములను
మాకుఁ దెల్పు ' మటన్న మది సంతసించి యా
సూతుఁ డిట్లనియె సంప్రీతి మెఱయ
' ననఘాత్ములార ! మీ రడిగిన విధముగా
ఘనుఁడైన శేషునిఁ గపిలగురుఁడు
ముదముతో నడుగ నిమ్మగ శేషుఁ డనె నిట్లు
'మునులార ! వినుఁడది ముఖ్యముగను

తే. గురుతరంబు , హరిప్రీతికరము , పరమ
గోపనీయము , పరితాప పాపహారము
రమ్య మష్టోత్తర శతంబు కామ్య ఫలద
మగుచు దీపించు నది యెట్ల యనిన వినుఁడి ! 168

తే. స్వర్ణదినిఁ బుట్టినట్టి సువర్ణ కమల
జాలమును దెచ్చి వేంకటేశ్వరుని బ్రహ్మ
దేవుఁడష్టోత్తర శతంబునై వెలుంగు
నామములఁ బూజచేసి సానందుఁడగుచు. 169

తే. స్వామిచే సర్వలోక పితామహుండు
సకల కామ్యార్థముల నంది సంతసించె
నట్టి యష్టోత్తర శతంబునైన నామ
ములఁ బఠించుట కెవరైన ముందుగాను. 170

వ. ప్రణవ పూర్వకంబుగా శ్రీ వేంకటేశాష్టాక్షరీ మహామంత్రంబు న్యాసయుక్తంబుగా జపంబుఁజేసి హరికి సమర్పించి , తదనంతరంబున ధ్యానావాహనార్ఘ్య పాద్యాచమన స్నాన వస్త్ర యజ్ఞోపవీత గంధాక్షతంబులు సమర్పించి , వేంకటేశాష్టాక్షరీ మంత్రంబు జపించి ' శ్రీవేంకటేశాయ నమః ' యని యష్టోత్తర శతనామంబుల నుచ్చరించుచుఁ బాదాది శీర్ష పర్యంతంబుగా సర్వాంగార్చనంబు చేసి , ధూప , దీప , నైవేద్య , తాంబూల, సువర్ణ పుష్ప , కర్పూర నీరాజన , మంత్ర పుష్ప , ప్రదక్షిణ నమస్కారంబులు సమర్పించుచుఁ దదేక ధ్యాన నిష్ఠుండైన భక్తునకు శ్రీవేంకటేశ్వరుండు ప్రసన్నుండై యైహికాముష్మిక ఫలంబుల నిచ్చు ; నీ యష్టోత్తరశతం బతిగోప్యంబగు. శ్రద్ధా భక్తులు గలవాఁడై , గురువిశ్వాసంబు గలిగి తద్గురుముఖంబుగాఁ దెలిసి పఠించినవాఁడు కృతార్థుండగునంచుఁ జెప్పె' నని సూతుండు శౌనకాదులతో మఱియు నిట్లనియె. 171

చ. ' కపిలమునీశ్వరుం డడుగఁగా మును శేషుఁడు సమ్మతించి ని
ష్కపటముగాను దత్క్రమము కర్దమపుత్త్రున కొప్పఁ జెప్పె , నా
కపరిమిత ప్రభావుఁడగు నా కపిలుం డుపదేశ మిచ్చె , మీ
కిపు డెఱిఁగించితిన్ వరమునీశ్వరులార ! తదీయ గోప్యమున్. 172

క. ఈ యష్టోత్తర శతమును
పాయని సద్భక్తితోడఁ బారాయణమున్
జేయు మహాసాత్త్వికులకు
నా యహిగిరివాసుఁ డిచ్చు నవ్యయ పదమున్. ' 173

## నైమిశారణ్య మునులు వేంకటాద్రికి వచ్చుట

చ. అన విని శౌనకాదులు మహాద్భుతమందుచు వేంకటేశ్వరున్
గనుఁగొన నిశ్చయించుచు నఖండతరంబగు భక్తిచేత నే
మనుటకుఁ దోఁపకున్న విధమప్పుడు సూతుఁడు సూచి యిట్లనెన్.
' మునివరులార ! మీ కిపుడు ముచ్చటగా నిఁక నేమి సెప్పుదున్ ? 174

తే. తెలుపుఁ 'డను సూతుఁ జూచి యా దివ్యమునులు
పలికి రిట్లని ' వేంకట పర్వతంబుఁ
జూడవలెనని మాకు బల్ వేడు కాత్మ
లందు జనియించె , శ్రీ వేంకటాద్రి మహిమ. 175

క. విని మా శ్రవణంబులు తృ
ప్తినిఁ బొందెను , నేత్రములకుఁ బ్రేమ ఘనంబై
జనియించెను వేంకటగిరిఁ
గనుఁగొని వచ్చెదము సూత ! కరుణోపేతా ! ' 176

మ. అని యమ్మౌనులు వల్క సూతుఁడు మునీంద్రాళిన్ విలోకించి యి
ట్లనియెన్ ' దాపసులార ! మీ రిచట నింకాలస్యముం జేయకన్
చని యా వేంకట శైల శృంగముల నాశ్చర్యంబుగాఁ జూచి , యం
దొనరన్ శేషగిరీశ్వరున్ గనుఁడు ! పొండుత్సాహ ముప్పొంగఁగన్.' 177

మ. అని యా సూతుఁడు వేంకటాద్రి విభవం , బా శ్రీనివాసోన్నతం
బును , స్వామిత్వము నొందు తీర్థ మహిమంబున్ , భూవరాహాఖ్య నొం
దిన నారాయణు చిహ్నముల్ , మఱియుఁ దద్దివ్య ప్రభావంబులున్
వినిపింపన్ విని సంయముల్ చెలఁగి యవ్వేళం బ్రయాణంబులై. **178**

సీ. గౌతమ జాబాలి కశ్యపాంగీరస
శ్రీవత్స కౌత్స మైత్రేయ పులహ
కణ్వ గార్గేయ మృకండు భరద్వాజ
కౌశిక దేవల క్రతు పులస్త్య
ముఖ్యులైనట్టి సన్మునులంద ఱా నైమి
శారణ్యమును వీడి యపుడు గంగ
సాన్నిధ్యమునఁ జేరి స్నానంబు లొనరించి
యటఁ జని గౌతమియందుఁ , గృష్ణ

తే. వేణియందును గ్రుంకి , యా విమల మార్గ
మందుఁ గల పుణ్యతీర్థంబు లందుఁ గ్రుంకు
లిడుచు సద్భక్తితో వేంకటేశుఁ జూచు
వాంఛతో వచ్చి యమ్మునివర్యులెల్ల. **179**

వ. శ్రీవేంకటాద్రికిఁ బ్రదక్షిణంబుగాఁ గపిలతీర్థంబునకు వచ్చి , తత్ప్రముఖంబులైన పుణ్యతీర్థంబులయందుఁ గ్రుంకు లిడుచు, వేంకటాచలారోహణంబు చేసి , మేరు గిరి సమానంబులై సువర్ణప్రభల నొప్పుచున్న శృంగసమూహంబులను , నవరత్నకాంతి స్థగితంబులైన సానుదేశంబులను , ఫలపుష్ప భరితంబులైన పుణ్య వృక్ష సమూహంబులను, గంగా సమానంబులైన యనేక పుణ్యతీర్థంబులను , శుక , పిక , కలకంఠ , మరాళ , మయూర ప్రముఖ విహంగసమూహంబులను , సింహ , వ్యాఘ్ర , వరాహ ప్రముఖ

మృగగణంబులను, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నర సమూహంబులను వినోదంబుగాఁ జూచుచు, నందందుఁ గల పుణ్య తీర్థంబులయందు స్నానంబులు సేయుచు, సామగానంబు లొనరించుచు వచ్చి, యప్రాకృత జలపూరితంబును, గనక కమల కల్హార పరివృతంబును నైన స్వామిపుష్కరిణిని దర్శనంబుచేసి, సభామంటపంబునందు నిలిచి శ్రీ వేంకటేశ్వరదర్శనంబు చేసి మ్రొక్కుచుఁ బులకాంకురిత శరీరులై, యానందబాష్ప ధారాపరిపూరిత నేత్రులయి, గద్గద కంఠులయి, వేద వేదాంత గుంఫితోక్తుల ననేక ప్రకారంబులుగా వినుతించి, తదనంతరంబున. 180

సీ. శ్రీనివాసునిఁ జూచి యానంద పరవశు
లయి జడల్ జీరాడ నాడి యాడి
యిదమిత్థ మననేర కెనలేని ముదముతో
నిందిరేశ్వరు చెంత నెగిరి యెగిరి
భగవదావేశ సంభరితాత్ములై నిల్చి
చక్కఁగాఁ జిందులు త్రొక్కి త్రొక్కి
ఘనపద క్రమ జటా కలిత స్వరంబుల
సకల వేదంబులు చదివి చదివి

తే. నిలిచి నిష్ఠాగరిష్ఠులై నిరుపమానుఁ
డైన శ్రీస్వామి సౌందర్య మాసచేతఁ
గనుల పండువుగాఁ జూచి మనము లచట
మగ్నములు సేసి, భక్తి నమ్మౌనివరులు. 181

క. అష్టోత్తర శత నామము
లిష్టముగా నుచ్చరించి హేమాబ్జములన్
సృష్టి స్థితి కారణు నా
శిష్టులు పూజించి రపుడు చిత్తము లలరన్. 182

సీ. అప్పుడు కోటి సూర్య ప్రకాశాంగుండు
నాజానుబాహుండు నచ్యుతుండు
పరిపూర్ణ చంద్రబింబ సమాన వదనుండు
మందస్మితాస్యుండు మాధవుండు
సలలిత మకరకుండలయుక్త కర్ణుండు
మణికిరీటోజ్జ్వల మస్తకుండు
శ్రీవత్సలాంఛనాంచిత దివ్యవక్షుండు
లలిత పీతాంబరాలంకృతుండు

తే. శంఖచక్రధరుండు సజ్జలజపత్ర
లోచనుండు పరాత్ముండు లోక కర్త
యైన నారాయణుండు దయాళుఁడగుచు
మౌనులను జూచి పలికె సమ్మతముగాను. 183

## మునులతో స్వామి భాషించుట

చ. 'మునివరులార ! మీ రిటకు ముచ్చటగా ననుఁ జూడ వచ్చినం
దున బహుభక్తిపూర్ణులని తోఁచెను , మీకు వరంబు లేమి యి
త్తును దగఁ దెల్పుఁ డందఱును దూరము వచ్చితి'రంచుఁ బల్కఁగా
విని ఘన తాపసోత్తములు వేంకటనాథునిఁ జూచి మ్రొక్కుచున్. 184

సీ. పలికి రిట్లని ' పరబ్రహ్మ స్వరూప ! వా
జ్మానసాతీతుఁడవైన నీవు
వైకుంఠమున నుండి వచ్చి వేంకటగిరి
యందున్న నిన్ను మే మనిశ మాత్మ
లందుఁ జూచుచునుందు , మాదివ్య మంగళ
విగ్రహం బిప్డు శ్రీవేంకటాద్రి
యందుఁ జూచితిమి చర్మాక్షులతో , నింతె
చాలు మాకు వరంబులేల? నింకఁ

తే. గరుణతో మాకు మోక్షమార్గమును జూప
వలసినదె కాని , మఱి వేఱె వరము లొల్ల '
మనిన నారాయణుఁడు దరహసితవదనుఁ
డగుచు మౌనులఁ జూచి యిట్లనియె మగిడి. 185

మ. 'మునులారా ! పరిపూర్ణ కాములు మహాముఖ్యుల్ జగత్పావనుల్
గనుకన్ మీరు వరంబు లొల్లమని నిష్కామత్వమున్ బొందినం
దున సంతోషముఁ బొందితిన్ ; పరమశాంతుల్ మీకుఁ గామ్యార్థముల్
పనిలే , దాత్మల మద్గుణానుభవమే పాటింపుఁ డశ్రాంతమున్. 186

క. మీ మనములు నేఁ దెలియుట
కై మేలు వరంబు లడుగుఁడంటిని , మీ ని
ష్కామత్వముఁ గంటిని ; మీ
కీ మీఁదట మత్పదంబు నిచ్చెదఁ బ్రీతిన్. 187

క. ఘనతర కామ్యార్థములను
మనుజుల కొసఁగుచును విపుల మహిమాఢ్యుఁడనై
యనుపమమగు బ్రహ్మోత్సవ
మొనరఁగ నంగీకరించుచుండెద నిచటన్. 188

సీ. మొనసి కన్యామాసమున మహోత్సవ మిందు
నా కజుఁ డొనరించినాఁడు గనుక
వాని సంకల్పంబు వరుసగా నే వృద్ధిఁ
బొందింపఁదలఁచి , యీ భూప్రజలను
కొండకు రప్పించి కోరు వరము లిచ్చి
యఖిల భోగంబు లిందనుభవింతు
నిట్టి నా లీలలఁ బట్టుగాఁ దలఁపుచు
భజనసేయుచునుండు భక్త జనులు

తే. దూరముగ నున్న , డగ్గఱఁ జేరియున్న
వారి కిష్టార్థముల నిచ్చి వారి వాఁడ
నగుచు రక్షించుచుందు ; దేహాంతములను
బుణ్యగతి నిత్తు వారి కో పుణ్యులార ! ' 189

క. అని హరి పలికిన పలుకులు
విని ముదమందుచును మౌనివిభు లందు హరిన్
వినుతించుచుఁ బంచాబ్దము
లొనరఁగ శేషాద్రిమీఁద నుండిరి వేడ్కన్. 190

క. అటు పిమ్మట మౌనుల వేం
కటగిరి నాయకుఁడు సూచి కరుణను ' మీ రి
చ్చట నుండనేల ? నాశ్రమ
మిటమీఁదటఁ జేరుఁ డో మునీశ్వరులారా ! ' 191

సీ. అని యప్పు డానతిచ్చిన వేంకటేశ్వరు
నకు , శ్రీకి , భూ నీళలకును మ్రొక్కి
వీడిపోవుటకుఁ గాళ్ళాడ కా హరిమోము
లోచనోత్సవముగాఁ జూచి చూచి
యానంద బాష్పంబు లక్షుల వెడలఁగా
నిగమాంత సూక్తులఁ బొగడి పొగడి
తనియ కా స్వామి సుందర రూపమును జిత్త
నీరజాతములందు నిలిపి నిలిపి

తే. తన్మయత్వంబు నొంది యా తపసు లప్పు
డా యనంతుని విశ్వమోహనునిఁ బాయ
జాల కందుండి యందఱు జాలి చా
నొందఁగా నిట్టులనియెఁ బద్మోదరుండు. 192

తే. 'పరమమునులార ! నిర్గుణబ్రహ్మమైన
నేను సగుణ విలాసముల్ మానవులకుఁ
జూపి రక్షింపఁదలఁచి యిచ్చోట నిలిచి
యుండినట్లుందు , నంతట నిండియుందు. 193

ఉ. కావున మద్వియోగ మిలఁ గల్గదు పూర్ణ వివేకి , కంతటన్
నా విమల స్వరూపమును నాటఁగఁ జూపుచునుందుఁ గాన స
ద్భావనచేత వాఁడు నను బట్టుగ నంతటఁ జూచుచుండు ; మీ
రా విధమున్ గ్రహించి చనుఁ డక్కడ నిక్కడ నేనె యుండుదున్. 194

తే. పుణ్య తమమైన నైమిశారణ్య భూమి
కరుగుఁ 'డని మౌనివర్యుల కానతిచ్చి
మౌనముద్రను ధరియించి శ్రీనివాసుఁ
డప్పు డర్చాకృతిని నిల్చె నద్భుతముగ. 195

తే. అప్పు డందు శిలా విగ్రహంబు కరణి
నమరియుండిన శ్రీవేంకటాద్రి విభునిఁ
జూచి మునినాయకులు చాలఁ జోద్యమంది
పూర్ణ భావనచే హరిఁ బొగడి రపుడు. 196

## పంచచామర శ్లోకములు :

సరోజ పత్ర లోచనం సుసాధు ఖేద మోచనం
చరాచరాత్మక ప్రపంచ సాక్షి భూత మవ్యయమ్ ,
పురారి పద్మజామరేంద్ర పూజితాంఘ్రి పంకజం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మ జేశ్వరమ్.
పురాణ పూరుషం సమస్త పుణ్య కర్మ రక్షణం
మురాసురాది దానవేంద్ర మూర్ఖజాల శిక్షణమ్ ,
ధరాధరోద్ధరం ప్రశాంత తాపసాత్మ వీక్షణం

స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరమ్.
శరాసనాది శస్త్రబృంద సాధనం శుభాకరం
ఖరాఖ్య రాక్షసేంద్ర గర్వకాననోగ్రపావకమ్ ,
నరాధినాథ వందితం నగాత్మజాత్మ సన్నుతం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరమ్.
సురారి శౌర్య నిగ్రహం సుపర్వరాట్ పరిగ్రహ
పరాత్పరం మునీంద్రచంద్ర భావగమ్యవిగ్రహమ్ ,
ధరామరాఘశోషణం సుధాతరంగ భాషణం
స్మరామి వేంకటేశ్వరం చ సాగరాత్మజేశ్వరమ్.

వ. అని యివ్విధంబున వినుతించి , హరికిఁ బునఃపునఃప్రణామంబులు చేసి
వేంకటాద్రి డిగ్గి , కపిలతీర్థ మార్గంబున గిరికిఁ బ్రదక్షిణంబుగా నరిగి ,
నైమిశారణ్యంబుఁ జేరి యచ్చట సూతుం జూచి యిట్లనిరి. 197

## మునులు నైమిశారణ్యమునకుఁ జని సూతుని నుతించుట

క. 'సూతా ! నీ కరుణను వి
ఖ్యాతిగ శ్రీ వేంకటాద్రి కరిగితి మచటన్
బ్రీతిని నీ వెఱిఁగించిన
రీతుల మే మెల్లఁ దద్గిరినిఁ గంటిమయా ! 198

శా. ఓహో ! నీ సకలజ్ఞ వాక్కులకు మా కుత్సాహముం బుట్టె , నీ
మాహాత్మ్యం బధికంబు చూడ నిల సామాన్యుండవే ! సూత ! మా
తో హెచ్చె తగినట్టి చిత్రములు సంతోషంబుగాఁ జెప్పిన
ట్లా హైరణ్య గిరీంద్రమందుఁ గల ; వీవందెట్లు గన్గొంటివో ! 199

సీ. భర్మాద్రి కరణి నప్పర్వతం బున్నది
చైత్రరథము రీతి సద్వనంబు
గనిపించుచున్నది , ఖగమృగాదులు జాతి
వైరముల్ విడిచి యవ్వనమునందుఁ

జరియించుచున్నవి , స్వామి పుష్కరిణి సం
పూర్ణమై యున్నది , భూవరాహ
దేవుఁ డా పడమట దీపించుచున్నాఁడు
తద్దక్షిణంబునఁ దప్తహేమ

తే. కుంభముల నొప్పుచుండెడి గోపురములు
మణులచే నొప్పు ప్రాకార మంటపములు
నమరియున్నవి ; తన్మధ్యమందు దివ్య
కాంతి నొప్పు విమానంబుఁ గంటిమయ్య ! 200

శా. మే మా దివ్య విమాన మధ్యమున లక్ష్మీకాంతు నీక్షించి , త
త్సామీప్యంబున నిల్చి మ్రొక్కుతఱి నాశ్చర్యంబుగా నంతలో
నేమో మేము శరీరముల్ మఱచి యందింతైన లక్షింప కా
స్వామిం జూచుచు నాడుచుండితిమయా ! సంతోష ముప్పొంగఁగన్. 201

క. అటువలె నాడితి , మా పి
మ్మట హరి నర్చించితిమి సమాధానమునం ,
గుటిలత లేకను శ్రీ వేం
కటపతి మాట్లాడె జలదగంభీరముగాన్. 202

క. ఆ మధురోక్తులు వినుచును
మే మచ్చట నుండ , మాకు మిత్రుని రీతిన్
' నైమిశమున కరుగుం 'డని
యా మాధవుఁ డానతిచ్చి , యర్చాకృతియై. 203

తే. మౌనముద్రను ధరియించి మగిడి మాట
లాడకుండినఁ , జక్రి మాహాత్మ్య మచటఁ
జూచి యా గిరి డిగ్గి యిచ్చోటి కిపుడు
వచ్చితిమి మేము సద్గుణవ్రాత ! సూత ! 204

క. నీ వెఱిఁగించిన చిహ్నము
లా వేంకటగిరినిఁ , గంటి మహహా ! యవి నీ
భావమునకుఁ గనిపించెనొ ,
నీవే చూచితివొ ? సూత ! నిఖిలఖ్యాతా ! ' 205

సీ. అని తాపసోత్తము లందఱు ప్రీతితో
నడుగఁగా సూతుఁ డిట్లనియె నపుడు
' మునులార ! మా వ్యాసముని కటాక్షము గల్గి
నది మొదల్గా సకలార్థములును
దోఁచు నా మదికి , నా దొడ్డతనము గాదు
బాదరాయణుని ప్రభావ మింత
గావున ననుఁ గొప్పగాఁ జూడఁ బని లేదు
మీరు ధన్యాత్ము లిమ్మెయిని నన్నుఁ

తే. గరుణ మీఱఁగ నడిగిన కతన నేను
చిత్తమం దిటు భావించి చెప్పినాఁడ
నంతియే కాని , శ్రీవేంకటాద్రియందుఁ
జూచి చెప్పితినని మీకుఁ దోఁచవలదు. 206

తే. తార , శీకర , సికతా వితానములను
గణుతి సేయఁగవచ్చు ; వేంకటగిరీంద్ర
నాయకుని లీలలన్ని నిర్ణయముగాను
శేషుఁడైనను లెక్కించి చెప్పఁగలడె ? 207

క. శ్రీకర వేంకటనాథుని
ప్రాకట చరితములు కొన్ని భవహరములుగా
నాకుం దోఁచిన రీతిని
మీకుం జెప్పితిని సంయమిప్రభులారా ! 208

సీ. ఈ కథ వ్రాయువా , రిది చదివెడివారు
విశ్వాసయుక్తులై వినెడువారు
నాయు రారోగ్య భాగ్యముల ననుభవించి
పుణ్యాత్ము లగుదురు భూతలమునఁ
గమలాప్త చంద్ర నక్షత్రంబు లున్నంత
కాల మీ కృతి శుభకరముగాను
దరిగొండహరియైన యురగాద్రిపతి కృప
భూలోకమున వృద్ధిఁ బొందియుండు

తే. భూవరాహప్రభునకు సత్పుణ్యనిధికి
లక్ష్మికిని , మఱి భూనీళలకును , హరికి
శేషగిరికినిఁ , దరిగొండ శ్రీనృహరికి
మంగళము గల్గవలయు నో మౌనులార ! ' 209

క. అని సూతుఁడు సద్భక్తిని
మనమలరఁగ వేంకటాద్రి మాహాత్మ్యంబున్
వినుటకుఁ గోరిన శౌనక
మునివరులకుఁ జెప్పె నధిక మోదము మీఱన్. 210

## ఆశ్వాసాంతము

క. శ్రీ విభ్రాజిత చరిత ! మ
హా విభవోన్నత ! జగత్త్రయ ప్రఖ్యాతా !
శ్రీ వేంకటగిరి నాయక !
పావన తరిగొండ నృహరి ! భవదురిత హరీ ! 211

**మాలిని :**

సరసిజదళనేత్రా ! సన్ముని స్తోత్రపాత్రా !
సురవన వరచైత్రా ! శోకవల్లీ లవిత్రా !
సురుచిర ఘన గాత్రా ! సూరిచిత్తాబ్జ మిత్రా !
దరహసిత సువక్త్రా ! ధారుణీ శ్రీ కళత్రా ! 212

గద్య :

ఇది శ్రీతరిగొండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలిత కవితావిలాస వసిష్ఠగోత్ర

శ్రీవేంకటాచల మాహాత్మ్యంబను వరాహపురాణంబునందుఁ జక్రరాజ దిగ్విజయంబును , శ్రీవైష్ణవ ధర్మ ప్రశంసయు , విహిత సత్కర్మ ప్రకారంబును , యమ నియమాది యోగాభ్యాస క్రమంబును , శ్రీవేంకటేశాష్టోత్తరశతనామ ప్రభావంబును , నైమిశారణ్య వాసులైన మహామునులు వేంకటాద్రికి వచ్చుటయు , శ్రీవేంకటేశ్వరుం డా మునులకుఁ బ్రత్యక్షంబై భాషించుటయు , నమ్మునులు వేంకటేశ్వరదర్శనంబు చేసి , తదాజ్ఞాధారులై క్రమ్మఱ నైమిశారణ్యంబుఁ జేరుటయు , నందు సూతుం గనుంగొని వినుతించుటయు , ముని సహితంబుగా సూతుండు శ్రీవేంకటేశ్వరస్వామివారికి మంగళాశాసనంబుఁ జేయుటయు నను కథలంగల తృతీయాశ్వాసము.



# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము

### ఇష్టదేవతా స్తుతి

శా. శ్రీనారాయణ మాత్మమూల మనఘం శ్రీవత్సవక్షఃస్థలం
నానాస్థావర జంగమాత్మక జగన్నాథం ప్రధానాశ్రయమ్ ,
ధ్యానధ్యేయ మచింత్య మద్వయపదం ధర్మస్వరూపం , సుపూ
ర్ణానందం తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేహం సదా. 1

ఉ. శ్రీరమణీమనోహరుని శేషశయానుని సర్వశత్రు సం
హారుని ధీరునిన్ నఖశిఖాహతరాక్షసవక్షునిన్ , సహ
స్రారసరోజహంసునిఁ బదానత దైత్యకుమారపాలకున్
కోరి భజింతు నేను తరిగొండ నృసింహుని శోషితాంహునిన్. 2

చ. కలశపయోనిధిం బొడమి కల్మల పంటల కాటపట్టునై
జలరుహనాభు వక్షమున సాంద్ర విలాసముననన్ వసించి , యు
జ్జ్వలతర శుభ్రతోయదనివాస తటిల్లతమాడ్కియౌ సిరిన్
వెలయఁ దలంతు మోక్షపదవీ పరిణామమతిన్ మదాత్మలోన్. 3

చ. విలసిత మౌక్తిక ప్రభల వెల్గు సితోత్పలమాలికా సము
జ్జ్వలత వహించు నాథునెద సత్కనకద్యుతులీను మేనితో
సలలితవృత్తిమై వికచచంపకమాలిక భాతి నుండు మే
ల్వెలఁదుక నాదిలక్ష్మి నిల వేమఱుఁ గొల్చెద మోక్షసిద్ధికై. 4

శా. సర్వజ్ఞుండగు మద్గురుం గొలిచి , భాస్వద్భక్తిచే నిత్యమున్
నిర్వాణప్రదుఁడౌ వినాయకుని , వాణి న్నెమ్మదిన్ నిల్పుచున్
గీర్వాణాంధ్ర కవీంద్రులం దలఁచి , యక్షీణాత్మబోధోల్లస
త్పూర్వాచార్యుల పాదపంకజములం బూజింతు వాక్సిద్ధికై. 5

క. పంకజహిత శశినేత్ర ! క
లంకరహిత ! మోక్షదక్ష ! లక్ష్మీరమణా !
శంకర విధి సన్నుతపద
పంకజ ! తరిగొండ నృహరి ! పాపవిదారీ ! 6

సీ. అని యిష్టదేవత నాత్మాబ్జమందు భా
వించి సేవించి , శ్రీవేంకటాద్రి
మాహాత్మ్యమం దా వరాహపురాణంబు
ముప్పది యధ్యాయములను దొలుత
మొనసి మూఁడాశ్వాసములు చేసి యా వరా
హస్వామి కర్పించి , యంతమీఁద
రహిని భవిష్యోత్తర పురాణమున శ్రీని
వాస విలాసముల్ వసుధమీఁదఁ

తే. బ్రజకుఁ దెలియుటకై పద్యఫణితిగాను
నేను రచియింతుఁ దరిగొండ నృహరి కరుణ
నిపుడు మీ రా కథాక్రమం బెట్ల యనిన
వినుఁడి ! నాయందు దయయుంచి విబుధులార ! 7

## శౌనకాదుల ప్రశ్న

ఉ. శ్రీకరనైమిశాటవిని శిష్టమునుల్ పరమాద్భుతంబుగాఁ
బ్రాకట భక్తి మీఱఁగ వరాహపురాణము విన్నమీఁద సు
శ్లోకుని సూతునే మరలఁ జూచుచు ' వేంకటశైల మిద్ధరన్
జోకగ నే యుగంబునను శోభితమై పొగడొందుఁ జెప్పవే ! ' 8

వ. అనిన విని సూతుం డిట్లనియె. ' మీరు నన్నడిగిన ప్రకారంబుగా జనకుండు శతానందు నడిగిన , నతని కతఁడు చెప్పి పూర్వేతిహాసంబుఁ జెప్పెద ' నని మఱియు నిట్లనియె. 9

సీ. ' వినరయ్య మునులార ! విశ్వాసమొప్పఁగా
ఘనతర త్రేతాయుగంబునందు
జనకుండు నిర్మలస్వాంతుఁడై , శాంతుఁడై
యిల మిథిలాపురం బేలుచుండి
తన తమ్ముఁడగు కుశధ్వజుఁ డనియెడివాని
సుతలకుఁ , దాఁ గన్న సుతల కొప్పు
పతులను దనలోనె భావించి వెదకుచు
' దొరకునే తగిన బంధుత్వ మిలను

తే. నలువురగు కన్యలకు నరనాథ సుతులు
నలువు రొకయింటఁ బుట్టియున్నను ముదమున
వారి కీ బాలికల నియ్యవచ్చు ' ననుచుఁ
జింతచేయుచునుండఁగా నంతలోన. 10

క. చనుదెంచె శతానందుం
డను సంయమివిభుఁడు , మోదమలరఁగ నపు డా
జనకుం డమ్మునిఁ గనుఁగొని
వినయంబున లేచి మ్రొక్కి విశ్వాసముతోన్. 11

తే. అచట నమ్ముని కర్ఘ్యపాద్యాది విధులఁ
బూజ గావింప , నమ్మునిపుంగవుండు
జనకుఁ గూర్చుండ నియమించి సంతసించి
చెలఁగి నృపుచింత భావించి పలికె నిట్లు. 12

తే. 'మానవాధీశ ! సీతకు మాండవికిని
నూర్మిళకు శ్రుతకీర్తికి నొగి వివాహ
యత్నములు సేయవలయు నింకతిరయమున
వెలఁదులకుఁ దగు భర్తలన్ వెదకవయ్య ! ' 13

సీ. అని ముని పల్కఁగా విని మిథిలేశ్వరుం
డైనట్టి జనకుఁ డిట్లనియె నపుడు
' సంయమీశ్వర! నేను సవనంబు గావింప
భూమిఁ ద్రవ్వింప నద్భుతముగాను
ధరలో జనించెఁగదా సీత లోకైక
మాత యటంచు నా మదికిఁ దోఁచి
యున్నది , యిపుడిట్టి యుర్వీతనూజ మా
నవునకుఁ దగునె ? యెన్నాళ్లకైనఁ

తే. సీత చిహ్నములన్ని లక్షించి చూడ
శ్రీరమాదేవి యంశజ సిద్ధ మిట్టి
సతికి హరియంశగలవాఁడె పతి రయమునఁ
గావలయు , నట్టి పురుషుండు గలడె ధరను. 14

క. హరి పూర్ణాంశను ధరపై
నరపతి జనియించియున్న నా మందిరమం
దిరవుగ నుండెడి శ్రీశం
కర చాపముఁ ద్రుంచు ముజ్జగంబు లెఱుంగన్. 15

చ. హరి యతఁడంచు నెంచఁదగునంచుఁ బరీక్షకునై ముదంబుతో
సరవిగ మీరలెల్ల విన శంకరకార్ముక మద్భుతంబుగా
విఱిచిన శక్తిమంతునకు వేడ్కగ భూమిజ నిత్తునంచు నే
నరుదుగఁ బల్కితిన్ , ధరను నట్టి మహాత్ముఁడు పుట్టియుండునే? ' 16

సీ. అనఁగా శతానందుఁ డా జనకునిఁ జూచి
పలికె నిట్లని ' మహీపాల ! వినుము
భూమిజ కనువైన పూరుషశ్రేష్ఠుండు
పుట్టినాఁ డీచింతఁ బొందవలదు

కరమొప్పుచున్న నల్వురు కన్యలకుఁ దగి
యొక రాజు కొమరు లీ యుర్విమీఁద
నలువు రున్నారు ; నిర్ణయముగా వారు నీ
బాలికామణులఁ జేపట్టుకొఱకు

తే. వేంకటాచల మహిమలన్ వినుము , కోర్కె
లన్ని నీకు ఫలించు ; బ్రహ్మాదులైన
దిక్పతులు నెల్ల వేంకటాద్రి ప్రభావ
మమలులై విని కృతకృత్యులైరి భూప ! 17

## జనక శతానంద సంభాషణము

వ. కావున నచంచల భక్తిపూర్వకంబుగా వేంకటాద్రి ప్రభావకథ వినిన వారి పాప రోగ దారిద్ర్యాది దుఃఖంబులు నశించు , సకల శుభంబులు సిద్ధించు. అప్పర్వతంబు కృతయుగంబున వృషభాద్రియనఁ బ్రసిద్ధంబైయుండు. త్రేతాయుగంబున నంజనాచలంబన విఖ్యాతిం బొందు. ద్వాపరయుగంబున శేషశైలంబన నొప్పుచుండు. కలియుగంబున వేంకటగిరియనం దగియుండు.' అనిన విని ' యా శైలంబునకు నిప్పుడు చెప్పిన నామంబు లెట్లు గల్గె?' నని నృపాలుం డడిగిన శతానందుం డిట్లనియె. 18

సీ. 'వృషభాసురుండను వీరుఁ డా కొండపైఁ
జేరి మౌనుల హింసచేయుచుండె
నట్టి బాధలు వరాహస్వామితోఁ జెప్ప
వలెనంచు వారెల్ల వచ్చి మ్రొక్కి
ప్రార్థించి పలికి ' రో పరమాత్మ ! యీ శైల
మున వృషభాసురుం డనెడువాఁడు
పాపాత్ముఁడై మమ్ము బాధించుచున్నాఁడు
గావున మీరు శీఘ్రముగ వాని

తే. సంహరింపు ' డటంచును శరణుఁబొంది
నట్టి తాపసులను గాంచి యాదరించి
' నిర్భయంబుగ మీరిందు నిలిచియుండుఁ
డసుర నీఁకఁ బట్టి శిక్షింతు నార్యులార ! ' 19

క. అని కిటి వారి నపుడు వీ
డ్కొనఁగా , మును లరిగి శైలగుహలందు భయం
బును విడిచి తపంబులు న
య్యనఘులు గావించుచుండి రచలాత్మకులై. 20

తే. దేవరిపుఁడును దుంబురు తీర్థమందు
మూఁడు కాలములను స్నానములను జేసి
చిత్తమలరఁ గరాళ నృసింహ మంత్ర
జపముఁ జేసి నృహరిపూజ సల్పుచుండి. 21

వ. తత్పూజాంతంబున నిజశీర్షంబు ఖడ్గంబుతో ఖండించికొని హరి కర్పించుచుండఁగా నా స్వామికరుణవలనఁ , దెగిన దానవశీర్షంబు క్రమ్మఱఁ గంఠమం దదుకుచుండు ; నివ్విధంబునఁ బంచసహస్రాబ్దంబులు చేసిన పూజ మెచ్చి వరాహస్వామి కరాళ నృసింహరూపంబున వానికిఁ బ్రసన్నుండైనం, జూచి వృషభాసురుండు నమస్కరించి కేశవానంత గోవింద శ్రీనివాసాది నామంబులఁ గీర్తించుచు ననేక విధంబుల వినుతించుచున్న నక్తంచరుం జూచి నారసింహుం డిట్లనియె. 22

క. 'విను దానవ ! నీ తపమును
గని మెచ్చితి , వరము లెవ్వి గావలె?' ననఁగా
విని వృషభాసురుఁ డపు డా
మనుజ మృగేశ్వరునిఁ జూచి మందత ననియెన్. 23

సీ. 'పరమాత్మ ! నాకంబు , బ్రహ్మలోకము , మోక్ష
మైన నేనొల్ల ; ఘోరాజిభిక్ష
నడిగెద , నీవు దశావతారము లెత్తి
నప్పటి బలము నీవిప్పు డిచట
నొక్క(డవే తాల్చి చక్క(గ నాతోడ
సమరంబుసేయుము మో స్వామి ! ' యనిన
విని , వాని యవివేకమునకు నవ్వుచు విష్ణు(
డనె నిట్లు ' కదనభి క్షడిగితీవు

తే. గాన నిచ్చెద ర'మ్మన్న , దానవుండు
నట్టహాసంబు(జేయుచు నార్భటించి
సిద్ధముగ వచ్చి యుద్ధసన్నద్ధు(డైన ,
గర్జనముచేసి వానిపై( గదిసె నృహరి. 24

వ. ఇవ్విధంబున వృషభాసురుండును విష్ణుదేవుండును సింగంబుల భంగి పొంగి నింగి కెగురుచు , నేల నిల్చుచు(, గాలాంతకోపమానులై యొండొరులం డాయుచు( , బాయుచు , గదా కుంత ముసల ముద్గర శూల భిండివాలాది వివిధాయుధంబులు గొని కరికరి హరిహరి గిరిగిరి పొరి( బొరి నొరసిబెరసి పోరుకరణి ననేక ప్రకారంబుల విడివడి పుడమి గడగడ వడంక నడుగు లిడుచు , వడి( జెడక , బడలక , కడువడి( జలంబుల( దడ(బడక పిడుగులు పడు వడువునం దొడరి పెడబొబ్బలు వెట్టుచు , నొక్క రొక్కరిని వెక్కిరించుచు( , గొక్కరించుచు , ధిక్కరించుచు( , గక్కసంబుల నిక్కి హుంకారంబులు సేయుచు , నహంకారంబులం బెంచుచు , డీకొని తా(కులాడుచు( , గేకలు వేయుచు , లోకభీకరంబుగా నురుముచు( , దఱుముచు , గండశిలలు బెండువడి తండోపతండంబులై బెడబెడ( బొరలివచ్చి మొండు బండలపై( బడి రెండేసి ఖండంబు లగుచుండ(గా( గొండకొండకు( జెంగున నెగిరి లంఘించుచు నిట్లనేక విధంబుల బహుకాలంబు భండనంబు సేయుచుండిరి. అంత నవసాన

సమయంబున మలఁగు దీపంబు మిక్కిలి వెలుఁగుఁ జూపిన చందంబున వృషభాసురాంగబలంబు ప్రచండోద్దండంబై నిండి నరకంఠీరవుని మించి కబళించుకై వడిం గానవచ్చినన్, గని వెఱఁగువడి సురలు నభోమార్గమందుండి నరహరివిజయంబును గోరుచుండిరి. అప్పుడప్పరమపూరుషుం డుప్పొంగి, కొప్పరించుచున్న రక్కసునిఁ గనుంగొని రొప్పుచుఁ దెప్పున గరుడవాహనారూఢుండై సహస్ర కరంబుల సహస్రాయుధంబులు ధరించి వానిపైఁబడి పట్టి కొట్టవచ్చినన్ జూచి రాక్షసుండు మిట్టిపడి పట్టువడక నట్టిట్టు జునుఁగుచు, నాఖండలాది నిర్జర భ్రాంతికరంబైన తన మాయాబలంబున ఖగవాహనారూఢుండై సహస్రభుజుండై సహస్రాయుధధరుండయిన కృత్రిమ విష్ణురూపధారిని నిర్మించి నారసింహునిపైఁ బురికొల్పె. అప్పుడమ్మాయావిష్ణురూపంబు మహావిష్ణువు నెదిరించి పోరవచ్చినం, గాంచి చక్రి యది రాక్షసమాయగా నెఱింగి నిజమాయం బెంచి దనుజమాయానిర్మిత విష్ణురూపంబును మాయంబుచేసి నవ్వుచు నిట్లనియె. 25

సీ. 'చపలరాక్షస ! నిన్ను సరిఁజేసి కొనిపోర
వలసి పోరితి, నెంతవాఁడ వీవు?
ననుఁగూర్చి జపము మున్నొనరించుటను జంపఁ
జాలక దయ నింతకాల మిట్లు
గడుపుచునుంటి, నింక సహింప, నదియేల
యనిన, మాయావిష్ణువును సృజించి
పురికొల్పితివి, వాని పొడవెల్లఁ జెడిపోయె
నెక్కడ డాఁగెద వింకమీఁదఁ?

తే. జూడు! నా సాహసంబైన నేఁడు సకల
శత్రుభీకరమైన నా చక్రవహ్ని
కిచట నీ శీర్ష మాహుతి నియ్యకున్న
నుర్విపై నేను నారసింహుఁడనుగాను. 26

తే. అని ప్రతినఁజేసి చక్రంబు నందికొనినఁ
జూచి వృషభాసురుఁడు పరిశుద్ధమైన
భక్తి నా నారసింహుని పాదయుగళ
మందుఁ బడి శరణాగతుండై నుతించి. 27

వ. క్రమ్మఱ నిట్లనియె 'దేవా! నీ చక్ర ప్రభావం బింతంతని చెప్ప బ్రహ్మాదులకు శక్యంబు గాదఁట ! కీర్తిమదంబరీషాది రాజప్రముఖులకు విజయంబు లిచ్చునఁట ! అదియునుంగాక భవచ్చక్రతప్తులైనవారలకుఁ బునర్జన్మంబులు రావఁట ! కావున నిట్టి చక్రంబుచేఁ దెగి ముక్తిఁ బొందెద. ఇప్పర్వతంబునకు నా నామధేయం బిడుం ' డని ప్రార్థింపఁగా , నా స్వామి సమ్మతించి వానిని మెచ్చి యాలింగనంబిచ్చి మోక్షం బొసంగి , ' యిప్పర్వతంబు కృతయుగంబున వృషభాద్రి యను పేరఁ బ్రకాశించుంగాక ! ' యని పలికె. అప్పు డా స్వామిశీర్షంబున దేవతలు పుష్పవర్షంబులు గురియించి వినుతించి నాకంబున కరిగిరి. అంత గుహాంతరంబులందున్న మునులు వచ్చి సన్నుతింపఁగా ' మీరు నిర్భయంబుగా నుండు'ండని యానతిచ్చి , యద్దేవుండు తిరోధానంబు నొంది భూదేవీ సహితుండై యిచ్ఛావిహారియై యుండె'నని చెప్పిన , శతానందుం జూచి జనకుం డిట్లనియె. 28

సీ. 'మునినాథ ! వృషభాద్రి యనుదాని కంజనా
చలమను పేరెట్లు గలిగె ? ' నవఁగ
నా శతానందుఁ డిట్లనియెఁ ' గేసరియను
వనచరోత్తము భార్య తనకు సుతులు
గలుగకుండఁగ మతంగఋషీశ్వరునిఁ జేరి
మ్రొక్కి యిట్లనియె ' నో మునివరేణ్య !
పుత్రహీనుల కెందుఁ బుణ్యగతులు గల్గ
వను వేదపూరుషుఁ డందువలన

తే. వరకుమారుఁడు నాకుఁ గావలయు , నందు
కెటు తపముఁ జేతు మీ రానతీయుఁ ' డనుచు
నంజనాదేవి ప్రార్థించి యడుగఁగాను
విని కరుణ నతఁ డప్పు డా వెలఁది కనియె. 29

తే. 'పొలఁతి ! యిచ్చటి పంపకుఁ బూర్వముగను
జనఁగ నేఁబదియైన యోజనములంత
మార్గమందు నృసింహాశ్రమ స్థలంబు
గలదు , దానికి యామ్యదిగ్భాగమందు. 30

వ. ప్రకాశించుచున్న నారాయణాద్రి ప్రదేశంబునందుఁ బరమపావనియై యొప్పుచున్న స్వామిపుష్కరిణికి నుత్తరంబుగాఁ గ్రోశమాత్ర దూరంబునం దాకాశగంగా ప్రవాహం బున్నది. నీవందుఁ జేరి త్రికాలస్నానంబు లాచరించుచు ద్వాదశాబ్దంబులు తపంబుఁజేయుచుండు,మంత సుతుండుదయించు' ననిన , మహాప్రసాదంబని మ్రొక్కి యమ్ముని యాజ్ఞాధారిణియై నారాయణాద్రిఁ జేరి , స్వామిపుష్కరిణిలో స్నానంబుఁ జేసి తత్తీరాశ్వత్థవృక్షంబులకుఁ బ్రదక్షిణంబులు చేసి వరాహస్వామికి మ్రొక్కి, చని యాకాశగంగ కరిగి యందున్న మునులకు నమస్కరించి వారి యాజ్ఞ వడసి , త్రికాల స్నానంబులు సేయుచు నిరాహారిణియై యొక్క సంవత్సరంబు తపంబుఁ జేయుచుండె ; నంత వాయుదేవుండు ప్రసన్నుండై ప్రతిదినంబు నొక్కొక్క మధుర ఫలంబు నిచ్చుచుండ, నది భక్షించుచు నత్తపస్విని ద్వాదశ వర్షంబులు పూర్తిగాఁ దపం బాచరించె. అంత నొక్కనాఁడు పవనుండు సద్వీర్య గర్భితంబైన ఫలంబు నియ్యఁగా దాని భుజించి యత్తరుణీమణి గర్భంబు ధరియించె నంత. 31

తే. అంజనాదేవి గర్భమం దనిలదేవుఁ
డొక్కనాఁడు ప్రవేశించుచుండినటుల
సంయమీంద్రుల కచ్చోట స్వప్నమయ్యె
నందుచే వారు నిస్సంశయాత్ములైరి. 32

తే. దశమమాసంబు వచ్చె నత్తఱి ధరిత్రి
నంజనాదేవి గర్భమం దనఘుఁడైన
పుత్త్రుఁ డుదయింపఁగాఁ జూచి పుష్పవృష్టి
సురలు గురియించి సంతోషభరితులైరి. 33

మ. ఘన వజ్రాంగము దీర్ఘవాలము లసత్కాంతుల్ బలస్థైర్యముల్
మునులెల్లం గని ' యాంజనేయుఁడు మహాముఖ్యుండగున్ ధాత్రిపై '
నని దీవించుచు మారుతాత్మజునకం దాసక్తితో నందఱున్
హనుమంతుండను నామధేయమిడి రత్యాహ్లాద మువ్పొంగఁగన్. 34

వ. త్రేతాయుగంబునం దంజనాదేవి యివ్విధంబున దపంబుఁజేసి పుత్త్రవతియైన నిమిత్తంబుచేత నగ్గిరి యంజనాద్రియనఁ బ్రసిద్ధంబయ్యె ; నదియునుంగాక. 35

తే. ఉరగపతి శేషుఁ డనిలున కోడి ధరను
కనకగిరి పుత్త్రుఁడైన వేంకటునితోడ
ద్వాపరమునందుఁ బడి శైలరూపమొందె
నందుచే నది శేషాద్రి యనఁగవలసె. ' 36

తే. అనఁగ విని జనకుం డిట్టులనియె ' శేషుఁ
డెందు కా పవనుని కోడె ? నెఱుఁగఁ జెప్పుఁ '
డన శతానందుఁ డిట్లనె ' హరినిఁ జూడ
ననిలుఁ డొకనాఁడు వైకుంఠమునకుఁ బోవ. 37

## శేష మారుత సంవాదము

సీ. హరిమందిరద్వారమందుఁ గావలియున్న
శేషుఁ డా పవను నీక్షించి పలికె
' వాతూల ! నీవు పోవలదు లోనికి , నిందె
నిలువు 'మంచు వచింప నిష్ఠురముగ

ననిలుఁ డిట్లనియె ' నే నబ్జాక్షు నీక్షింపఁ
బోవుచుండఁగ నన్ను నీవు నిలుప
వచ్చితి విపుడు నీ హెచ్చేమి , నా తక్కు
వేమి ? రమాపతి నిపుడె చూడ

తే. వలయు ; నా కడ్డమిపుడు రావలవ'దనుచు
మీఱి లోఁ జొరఁబడఁగ , నమ్మారుతమును
గాంచి బుసపెట్టుచును లేచి కన్ను లెఱ్ఱఁ
జేసి మెడఁబట్టి త్రోసె నా శేషుఁ డతని. 38

చ. తను మెడఁబట్టి నెట్టుటకు దారుణరోషముఁ బెంచి మించి యం
దనిలుఁడు నట్టహాసమున నాదిఫణీంద్రునిఁ జూచి యిట్లనెన్
' నను మెడఁబట్టి త్రోసితివి నాగకులాధమ! ( నిన్ను నేను ద్రో
సిన నిలువంగనోపుదువె ఛీ ! యటుపొ 'మ్మన శేషుఁ డిట్లనెన్. 39

క. 'అనిలుఁడ ! విను మంతఃపుర
మున కన్యుఁడవైన నిన్ను ముందుగఁ బోని
య్యను , నీ రాకడ చక్రికి
వినిపించెద , నటకు నిన్ను విష్ణుఁడు దయతోన్. 40

సీ. తోడ్కొని రమ్మన్నఁ , దోడ్కొనిపోయెద
నంతియెగాని మున్నటకు నేను
నినుఁ బోవనీ'నన్న విని పవనుం డిట్టు
లనియె ' నంతఃపురమందె యెపుడు
మార్జాల ముండును , మదకరి వీధిలోఁ
దానుండు , నందుచేఁ దక్కువగునె ?
పాలుపొందు మందిరంబున నుండు పిల్లి యా
యేనుఁగకన్నఁ దా నెక్కువగునె ?

తే. యిపుడు లోనికి నన్ను రానియ్యనంటి ,
వటకు నేనింక రాను , నీ వచట నుండు
మిచట నేనుందుఁ ; గొదువ నాకేమి లేదు
పోర ! భుజగాధమా ! నీవు పొంగవలదు. ' 41

మ. అనుచున్ దన్నుఁ దిరస్కరింప విని రోషావేశ ముప్పొంగ ని
ట్లనియెన్ శేషుఁడు ' మారుతా ! యెపుడు నా కాహారమైనట్టి నీ
వును గర్వించుటెగాని , నా యెదుట నీ యుత్కర్షమున్ సాగునే ? '
యనఁగా నప్పవనుండు నిట్లనియెఁ గోపాటోపమున్ బెంచుచున్. 42

క. శేషా ! గర్వముతో దు
ర్భాషలు భాషించి నీవు పట్టుగ నాకున్
రోషముఁ బుట్టించితి విఁక
శేషత్వ విశేషమహిమ చెందునె నిన్నున్ ? 43

వ. అయినను నా బలంబునకు నీ బలంబునకు గజమశక న్యాయంబైయుండు;
నెట్లన్నను నేను సర్వజీవాంతర్యామినై జగదాధారుండనై యుందుఁ గావున,
నీకన్న నే నధికుండ ' ననిన విని శేషుం డిట్లనియె. 44

సీ. 'విను ప్రభంజన ! నేను విపులాద్రిగణముతో
మొనయు భూమిని శిరమున భరింతు
బహువిధ బ్రహ్మాండ భాండోదరుండైన
నీరజాతాక్షు నేనే భరింతుఁ
గాన నీకన్నను నేనె గొప్పగుచుందుఁ
జులుకఁదనంబుగాఁ జూడవలదు
పొ'మ్మని పల్కఁగా భూరి కోపంబుతోఁ
బవనుఁ డిట్లనియె ' నో పన్నగేంద్ర !

తే. నేను నీలోన నుండఁగా నీకుఁ బలము
గలిగియున్నది , లేకున్న ఘనతమీఱ
నీ బలంబేడ నిలుచురా ! నేను మూల
తత్త్వమును , నీవు నాకన్నఁ దక్కువేర ! ' 45

సీ. అని యివ్విధంబున ననిలుండు వచియింపఁ
బన్నగేంద్రుఁడు విని పలికె నిట్లు
' వాతూల ! విను వృథా వాగ్వ్యయంబేటికి?
నీవు నేనొక దిక్కు నిలిచి హెచ్చి
మల్లయుద్ధముఁ జేత , మెల్లవారికిని నీ
బలము నాబలమును దెలియు నపుడు
రార'మ్మనఁగ , వారి రభసంబు విని చక్రి
వారి చెంతకు వేగ వచ్చి నిలిచె

తే. నపుడు శేషుండు పవనుండు హరికి మ్రొక్కి
తమ వివాదోక్తు లిరువు రత్తఱినిఁ జక్ర
ధరునితోఁ జెప్పి ' దేవ ! యుద్ధంబు మేము
సేయవలయును దీవించి సెలవొసంగు.' 46

మ. అని వాతూలుఁడు శేషుఁడాహవముఁ జేయంబూను వాక్యంబులన్
విని యోజించి వినోదముల్ గనుట కావేళన్ రమేశుండు వా
రిని వారింపక , కారణంబొకటి వేరే యుండఁగా వీరలి
ట్లనుచున్నా ; రిది మంచికార్యమని రోషావేశమే పెంచుచున్. 47

సీ. కార్యార్థియై రమాకాంతుండు నవ్వుచుఁ
బవన శేషులఁ జూచి పలికె నిట్లు
' వినుఁడు మీ రిరువురు వీరాగ్రగణ్యులు
కావున నొక్క రొక్కరిని గెలువ

వేఱు యుద్ధంబు మీ రూరక చేసినఁ
గకవిక నొంది లోకములు మనవు
గాన , మీ కొక యుక్తి నేను చెప్పెద శేష !
వినుమది యెట్లన్నఁ గనకనగము

తే. నందుఁ బుట్టిన వరవేంకటాద్రి చుట్టు
చుట్టుకొని ఫణముల బిగఁబట్టి యదుము
చుండు , మీ వాయు వా పైఁడికొండ నెగుర
మీఁటఁగా దొడ్డవాఁడె సమీరుఁ ' డనుచు. 48

ఆ. పలికి ' పవన ! నీవు పన్నగేంద్రుఁడు చుట్టి
పట్టియున్న గిరినిఁ బట్టి పైకి
నెగుర మీఁటఁగానె హెచ్చు ; నీ వటు మీఁట
లేకయున్న హెచ్చు లేదు నీకు.' 49

వ. అని విష్ణుం డానతిచ్చిన , విని మహాప్రసాదంబని మ్రొక్కి , పవనశేషు లిద్దఱు చని వేంకటాద్రిఁ జేరి , రందుఁ బన్నగేంద్రుఁ డప్పర్వతంబు చుట్టునుం జుట్టుకొని సహస్ర ఫణంబుల నడుమన్ బిగ్గంబట్టియుండె ; నంత వాయుదేవుండు నిజ శక్తిఁ బెంచి యగ్గిరిపై వీచుచుండె నివ్విధంబున. 50

క. తొడిఁబడ కనిలుఁడు మొరయుచు
విడివడి వీవఁగను శైలవితతు లపుడు బల్
గడగడ వడఁకుచు నంతటఁ
బెడఁబెడఁ బొరలాడఁ జూచి భీతాత్మకులై. 51

క. అప్పుడు బ్రహ్మేంద్రాదులు
తప్పక గుమిగూడి మారుతము చెంగటికిన్
దప్పటడుగు లిడుచుం జని
తెప్పున నిట్లనిరి చాల దిగులున్ బడుచున్. 52

సీ. 'ఓ వాయుదేవ ! నీ వుత్పాతహేతువై
విసరుచుండుట కిది వేళ గాదు
చాలించు కల్పాంత సమయమం దిటు సేయ
వలయు , నిప్పుడు వీవవలదు నిలువు
మని వారు ప్రార్థింప , ననిలుఁ డా రోషంబు
విడువక మఱి మఱి విసరఁ , జూ
పవనుని రోషస్వభావంబుఁ గని చని
శేషాహి చెంగటఁ జేరి వినుతి

తే. చేసి యిట్లని పలికి ' రో భాసురాత్మ !
నీ బలం బెక్కువైనది నీరజాక్షుఁ
డెఱుఁగు , గౌరీమనోహరుం డెఱుఁగు , మేము
నెఱుఁగుదుము ; నీ ప్రభావంబు నెన్నఁదరమె ? ' 53

వ. అని బహువిధంబులఁ బ్రార్థించిన శేషుండు పట్టిన పట్టు విడువకుండినం
జూచి బ్రహ్మేంద్రాదులు మఱియు నిట్లనిరి. 54

క. 'విను మో భుజగకులాధిప !
కినిసి మహాశక్తి హేమగిరివరతనయున్
ఘనముగ బిగఁబట్టిన ని
న్ననిలుఁడు గదిలింపనోపఁడయ్య ! మహాత్మా ! 55

క. అనిలుఁడు నీ కోడఁడు , నీ
వనిలున కోడవు ; జగంబు లదరి నశింపం
బనివచ్చెను గావున నీ
ఘన రోషము నడఁచి జనులఁ గావు మహీంద్రా ! 56

చ. అనుజులు మూర్ఖులంచు విడనాడుచు , సాత్త్వికమూర్తియైన వి
ష్ణుని పద మాశ్రయించి పరిశుద్ధుఁడవైతివి ; నీకుఁ గ్రోధమే
లను ? నిజశుద్ధ సాత్త్విక బలంబున నీవు చలంబడంచి నీ
ఘన ఫణమెత్తి మా కొఱకు గాలికి గెల్పు నొసంగ మేలగున్.' 57

వ. అని యనేక ప్రకారంబులఁ బ్రార్థింపఁగా , శేషుండు కరుణార్ద్రచిత్తుండై లోకరక్షణంబుఁ జేయుటకై యొక్క ఫణంబెత్తినప్పు డప్పవనుం డుప్పొంగి తెప్పున నప్ఫణంబు సందునఁ బ్రవేశించి నిజబలంబు కొలఁది వీచుచు నంగుష్ఠం బక్కొండ పాఁతునం గ్రుచ్చి యెత్తి పైకెగురమీఁటె;నప్పుడు వేంకటాద్రి గాలిపటంబుచందంబున నెగిరి గంగానదికి దక్షిణంబుగా ద్విశతయోజన దూరంబునను దూర్పు లవణాబ్ధికి నైదు యోజనంబుల దూరంబునను సువర్ణముఖరీనద్యుత్తరతీరంబునకు సార్ధక్రోశదూరంబున నొప్పు పుణ్యకాననంబునందుఁ దన్నుఁ జుట్టియున్న శేషునితోడన్ బడియె, నివ్విధంబున శేషు నోడించితినని సంతసించుచుఁ బవనుండు నిజేచ్ఛం జనియె. జగంబులు కుదిరియుండె ; నంత శేషాహి తా నోడుటకుఁ జింతించుచుండఁగా బ్రహ్మేంద్రాదులు వచ్చి శేషు నాదరించి , రందు బ్రహ్మ యిట్లనియె. 58

సీ. 'విను శేష ! మారుతంబున కోడితినటంచుఁ
జింతింపవలదు నీ చిత్తమందు
వేంకటగిరిని నీ వంకితంబుగఁ గూడి
యవనిపై నుండు,నీయందుఁ జక్ర
పాణి వసించి నిన్ బాలించు ' నని పల్క
విని ఫణీంద్రుఁడు చాల విన్ననగుచుఁ
బలికె నిట్లని ' నేను పవనునితోఁ బంత
మాడి యోడుటను నాయందుఁ దప్పు

తే. గలిగె , గర్వం బడంగె నా కర్మ మంత
సేసె , నిఁక నేల నాయందు శ్రీధరుండు
నిలుచు? ' నని పల్కి చాల కన్నీరు నింపఁ
జూచి శేషునితోఁ దమ్మిచూలి పలికె 59

క. 'విను ఫణివర ! నీపై నా
వనజదళాక్షుండు కృపను వచ్చి వసింపన్
బని నే వెదకెద , నిఁక నీ
మనమునఁ జింతింపవలదు మరుదశనేంద్రా ? 60

మ. హరి నీయందు వసించియుండఁడని నీ కా చింతనంబేల? మున్
దర చక్రాయుధుఁ డిందు రాఁదగు ప్రయత్నంబేను గావించెదన్
గిరిరూపంబున నుండు ; మోడితిని నా ఖేదంబు వర్జింపు ! పం
కరుహాక్షున్ మదిలోఁ దలంచుచును సౌఖ్యంబొందు నాగాధిపా ! 61

క. హరి నిచటికి రప్పించుట
కరయఁగ నేఁ బూఁటకాఁపునైతి'నటంచున్
సరసిజగర్భుఁడు శేషుని
శిరములపై నిమిరి నమ్మఁజెప్పెఁ గరుణతోన్. 62

వ. అప్పుడా శేషుని కివ్విధంబుగా నభయంబిచ్చి వీడ్కొని , యింద్రాదుల నిజస్థానంబులకుఁ బంపి , విరించి సత్యలోకంబుఁ జేరె ; నంత శేషుండు సాఁగిలఁబడి వైకుంఠపతికి సాష్టాంగ దండప్రణామంబుఁ జేయుచుఁ బర్వతాకారంబు నొందె ; నప్పర్వత ప్రమాణంబుఁ జెప్పెద నెట్లన్న దశయోజన విస్తీర్ణంబై ముప్పది యోజనంబుల నిడివి గలిగియుండు ; నట్టి శేషాఖ్య నొందిన మహాగిరి ఫణాప్రదేశంబు వేంకటాద్రియు , మధ్య ప్రదేశం బహోబలంబును , బుచ్ఛప్రదేశంబు శ్రీశైలం బగుచుండఁగా సర్వక్షేత్ర , సర్వతీర్థమయంబగుచు , సకల ఫల ద్రుమ పుష్పలతా శోభితంబై , నానావిచిత్ర ధాతు ప్రకాశంబగుచుండు ; నయ్యద్రియందు సురబృందంబులు తరుబృందంబులై , ఋషిసమూహంబులు మృగసమూహంబులై , పితృగణంబులు ఖగగణంబులై , యక్షకిన్నరులు పాషాణంబులై యుండఁ గా , శేషునకు వరంబిచ్చిపోయిన పరమేష్ఠి ' శేషాద్రియందు

వేంచేసియుండుం'డని వరాహస్వామినిఁ బ్రార్థింపఁగా నద్దేవుండు వైకుంఠపురమందున్న క్రీడాద్రిని గరుడనిచేతఁ దెప్పించి శేషాద్రియందుంచి, తానందు వసించియుండఁగా , నా స్వామికిఁ బూర్వభాగమందున్న శ్రీస్వామిపుష్కరిణి గంగాది పుణ్యతీర్థంబులకు జన్మస్థానంబై , మకర మత్స్య కచ్ఛపాది జలచరావాసంబై , కమల కుముదాది పుష్పశోభితంబై , సరస్వతీ సరోవరంబని చెప్ప నొప్పుచుండె ; నప్పుష్కరిణియందుఁ గ్రుంకులిడిన జనులు పాపరహితు లయ్యెద ; రదియునుంగాక ధనుర్మాసంబున శుద్ధద్వాదశీదినం బరుణోదయంబు మొదలుకొని యాఱుగడియల పర్యంతంబు గంగాది నదులా పుణ్యపుష్కరిణియందుఁ గలసియుండు ; నట్టి పుణ్యకాలంబునం దా తీర్థంబులో శ్రద్ధాపూర్వకంబుగా స్నానంబులు చేసినవారు మోక్షార్హులయ్యెద ; రదియునుంగాక తత్తీర్థ తీరంబున శ్రాద్ధంబులు చేసినవారి పితృదేవత లమృతపానంబుఁ జేసినంత తృప్తింబొంది స్వర్గంబున నృత్తంబులు చేయుచుండుదు ; రదియునుంగాక నారాయణుండను బ్రాహ్మణుం డా తీర్థంబునఁ గ్రుంకులిడుచుండి హరిదివ్యధామంబునం బొందె , నిది శేషాద్రి ప్రభావం ; బింక వేంకటాద్రి ప్రభావం బెట్లంటేని. 63

## మాధవుండను విప్రుని చరిత్రము

సీ. చెప్పెద వినవయ్య శ్రీకాళహస్తిలోఁ
జూడఁ బురందరసోమయాజి
తనయుఁడైనట్టి మాధవనామధేయుండు
తన కర్మవశమునం దనకు భార్య
యగు చంద్రరేఖను బగలు రతికిఁ బిల్వ
నయ్యింతి భీతితో 'నకట ! పెద్ద
లింటనుండంగఁ బగ లీ రతి తగ'దంచు
బహు విధంబులఁ జెప్పి , ఫట్లువడక

తే. తలఁగిపోవుచునుండఁగాఁ దాళఁజాల
కతఁడు ప్రార్థింపఁగాఁ బతియాజ్ఞ మీఱఁ
దగని ధర్మంబెఱింగియు, ధవుని మోముఁ
జాలితోఁ జూచి పల్కె నా చంద్రరేఖ. 64

వ. 'దేవతార్చనాగ్నిహోత్రాది సత్క్రియ లాచరించు సమయంబున దివాక్రీడ కూడునే ?' యని యనేకవిధంబుల నది చెప్పిన వినక బలాత్కారంబుఁ జేయు పతినిఁ జూచి సతి 'మీరు సమిత్కుశతులసీ పుష్పార్థంబుగా నదీతీర వనంబునం దుండుఁ, డేనచ్చటి కుదకంబు దెచ్చుటకై కలశంబుఁగొని వచ్చెద, నచ్చట మీ సంకల్పపూర్తియగుంగాక' యని సమ్మతిపఱచి పంపింపఁగా, నతం డరిగి సువర్ణముఖరీ నదీతీరంబునందున్న పుష్పవనంబుఁ జేరె; నచ్చటి కంతకుమున్నుగా వచ్చి స్వర్ణభూషణ శ్వేతాంబరాలంకృతయై, యొక్క కాలు ముడిచికొని యొక్కకాలి బొటనవ్రేలు నేలఁగ్రుచ్చి యెత్తుచు, మోఁకాలిమీఁదఁ జుబుకంబు నుంచుకొని దీర్ఘనీలకుంతలంబులు మెఱయఁగాఁ గూర్చుండియున్న పద్మినీజాతి చండాలస్త్రీనిఁ జూచి యవ్విప్రుండు మోహించి, యట్టి సమయంబునఁ దన భార్య వచ్చినం గాంచి, 'నీ గుణపరీక్షకై రమ్మంటి నంతియే కాని, దివాక్రీడకు నే నొప్పుదునే?' యని చెప్పి దాని నంపించి, యా చండాలస్త్రీ సమీపంబునకుఁ బోవుచుండఁగా, బ్రాహ్మణుఁజూచి లేచి మ్రొక్కి యది దూరంబుగాఁ బోవుచున్న, వాఁడును దాని వెంబడించి పోవుచుండఁగా, నా భూసురుంగాంచి యది వెఱచి యిట్లనియె. 65

సీ. 'ధరణీసురేంద్ర ! నే దవ్వుగాఁ జనుచున్న
నీ వంచు కిటు రాను నీతిగాదు
నన్నెవ్వరని యెంచినావు ? నే నెఱుఁగఁ జం
డాలి'నంచు వచింప జాలినొంది

యా మహీసురుఁ డిట్టులనియె ' నీ పేరేమి ?
సెప్పవే ' యనఁగ నా చేడె వానిఁ
గని ' నన్నుఁ గుంతల యని పిల్తు , రిట్ల నీ
వడుగుచు ననుఁ జేర కవలఁ బొమ్ము

తే. నీవు నాదగ్గఱకు రాకు , నీచజాతి
దాన ' నని పోవు చుండఁగాఁ దాను దాని
విడిచి పోలేక మఱిమఱి వెంట నంటి
భ్రాంతితో నిట్టులనియె నా బ్రాహ్మణుండు. 66

తే. 'భామ ! నీవంటి సుందరి బ్రహ్మదేవుఁ
డంత్యజాతినిఁ బుట్టించి యడవియందుఁ
గాచినటువంటి వెన్నెలకరణిఁ జేసె
నిందు కా విధి నేమందు నిందువదన ! 67

క. లవణాబ్ధిజ రత్నములను
దివిజులు శిరముల ధరించు తెఱఁగున నేని
న్నవనిని వరియించెద ' నని
వివరించి భయంబు విడిచి విప్రుండనఁగన్. 68

## చండాల స్త్రీ బ్రాహ్మణ సంవాదము

చ. విని యది భీతినొందుచు వివేకముతో ద్విజుమోముఁ జూచి యి
ట్లనియెను ' జారకాంతను , మహావిషసర్పమునంటి యెవ్వరై
నను గడతేఱినారె ? నిను నమ్మిన భార్యను వీడి నన్నుఁ బొం
దిన నిహముం బరంబు చెడు ధీరతతోఁ జను బ్రాహ్మణోత్తమా ! 69

వ. మహాత్మా ! స్త్రీ పురుష జాతిద్వయంబును నిర్మాణంబు చేసి నాలుగు జాతులు నిశ్చయించి , యే జాతి పురుషుఁ డా జాతిస్త్రీనిఁ బాణిగ్రహణంబుఁ జేసి , స్వభార్యయందు సంతానంబువడసి పరస్త్రీసంగమంబు నపేక్షింపక

యుండవలయునని ధర్మశాస్త్రంబులు బోధించుచుండఁగా , నీ వట్టి ధర్మంబులు దెలిసియును జండాలస్త్రీ సంగమంబున కొప్పవచ్చునే ? బ్రాహ్మణుఁడవై పుట్టి గర్భాధానాది షోడశకర్మంబుల నాచరింప నర్హుండవైయుండి నీవు నన్నంటుట దగ , దది యెట్లన్న నీ దేహంబు వేదపూతంబైనది ; నీ శ్రోత్ర ; నేత్రనాసాపుట ; జిహ్వా , పాణి , పాదంబులు పుణ్యకథా శ్రవణ , భగవద్దర్శన , హరిపాదార్పిత తులసీ పుష్పాఘ్రాణ , వేదాధ్యయన,దాన,తీర్థయాత్రాది సత్క్రియలచేతఁ బవిత్రములైనవి ; మదీయ శ్రోత్ర ప్రముఖేంద్రియంబులు దుష్కథా శ్రవణాది దుష్క్రియలచేత నపవిత్రంబులైనవి. కావున నా దేహసమాగమంబు నీవు గోరవల' దని కోకిల స్వరంబుతో ధర్మశాస్త్ర వివేక ప్రకారంబులుగాఁ బలుకుచున్న కుంతలను జూచి తాళఁజాలక యవ్విప్రుండు దానిం గదియంబోవఁగాఁ , బాపభీతిచే నది రోదనంబుసేయుచు దిగ్దేవతాదుల నుద్దేశించి ' యీ బ్రాహ్మణుండు పాపజాతినైన నన్నుఁ బొంది కులహీనుండై నరకంబులోఁ బడ నుద్యుక్తుండగుచున్నాడు. నావలన దోషంబు లేదు. మీ రంద ఱిందులకు సాక్షు ' లని తలఁగిపోవుచుండఁగా , నెఱిఁగి దాని సమీపంబున నిలిచి యా ద్విజుం డిట్లనియె. 70

తే. 'భామ ! వెఱవక విను నాతపంబు చాల
నేఁడు ఫలియించె నటుగాన నిన్నుఁ జూడఁ
గలిగె , నందున మన్నించి కామసుఖము
నియ్యవే ! ' యన్న నది భీతి నిట్టులనియె. 71

చ. ' కటకట ! బ్రాహ్మణోత్తముఁడ ! కామసుఖంబును గోరి లేని సం
కటపడనేల ? మీ గృహముఁ గ్రక్కునఁ జేరి స్వకీయ భార్య నే
పటు ముదమొప్పఁ గూడు ; ననుఁ గూడిన దోషము వచ్చుఁ గాన ,న
న్నెటువలె నంటఁగోరితి ? విదేమి యపభ్రమ పుట్టె నిచ్చటన్. 72

క. చండాలస్త్రీ నెనయుట
పండిత ! నీకేల తగును ? బ్రాహ్మణకులమున్
బెండువడఁ జేయనేటి ? క
టుండుము ! నన్నంటరాకు మోహో విప్రా ! ' 73

క. అని యది వెనుకకుఁ జనఁగాఁ
గని విప్రుఁడు కులము మించి కామాంధత్వం
బొనరఁగఁ దట్టంబగుచును
గనులకు నెగఁదట్ల దానిఁ గదియంబోవన్. 74

వ. అప్పు డా కుంతల యతనిఁ జూచి ' నీ జననీ జనక గురు దైవంబుల తోడె నన్నంటరాకు ' మనుచుండఁగా వాఁడు వినక దానిఁబట్టి కలిసె ; నంత నది యతనిఁ జూచి ' విప్రా ! నీవు కులభ్రష్టుండవైతి , వింక యజ్ఞోపవీత పరిత్యాగంబుచేసి చండాలజాత్యాహారుండవై నన్నుఁ గూడియుండు'మనిన, వాఁ డందుల కొప్పి కృష్ణవేణీతీరంబునఁ జేరి ద్వాదశాబ్దంబులు కామోపభోగంబు లనుభవించె ; నంతఁ గుంతల మృతిఁ బొందఁగా , మాధవుండు దుఃఖాక్రాంతుండై యొంటిగాఁ దిరుగుచుండి తన మనంబున నిట్లని వితర్కించె. 75

సీ. 'గురుతరంబగు బ్రహ్మకులమునందుఁ జనించి
కోరి చండాలినిఁ గూడి ఘోర
పాపంబుఁ జేసితిఁ , బతిత పావనుఁడైన
శ్రీహరి నన్ను రక్షింపవలయు'
ననుచుఁ బశ్చాత్తాపమునఁ బొందుతఱి , భక్తు
లైన రాజులు వేంకటాద్రియాత్ర
పోవుచుండఁగ వారితో వాఁడు సని , వారు
భక్షించి యందందుఁ బాఱవైచి

తే. నట్టి యెంగిలిఁ దినుచు దేహాభిమాన
దంభముల వీడి , కపిలతీర్థమున కరిగి
గగనగంగో యనఁగ శేషనగమునుండి
క్షితిని దుమికెడి జలము నీక్షించి మ్రొక్కె. 76

వ. అప్పుడా పుణ్యక్షేత్రంబునం దా రాజులు క్షౌరంబు సేయించుకొనినప్పుడు తానును వపనంబుఁ జేయించుకొని , వారు పిండ ప్రదానంబులు చేయుచుండఁగా జూచి తానును మృత్తికతోఁ బిండప్రదానంబుఁ జేసిన , వాని పితృదేవత లా మృత్పిండంబులచేఁ దృప్తింబొంది' రనిన విని జనకుం డిట్లనియె. 77

క. 'చండాలాంగన నెనయుచు
నుండిన కులహీనుఁ డూఱకుండక , తా వి
ప్రుండనటంచును బెట్టిన
పిండంబులు గొనిరె ? వాని పితృదేవతలున్.' 78

క. అనఁగశతానందుం డి
ట్లనె ' జనకా ! కపిలతీర్థమందు మొదటనే
మునిఁగిన పుణ్యముచేఁ గై
కొని రా పిండముల వారు కొంకక నచటన్. 79

సీ. ఆ పుణ్యమటులుండె , నదిగాక మఱియొక్క
మహిమఁ జెప్పెద , వాఁడు మఱుదినంబు
పరుషతో వేంకటగిరి యెక్కుచున్నఁద
త్పర్వతస్పర్శచే బ్రాహ్మణుండు
చేసిన పాపంబు శిథిలమై వడఁకుచు
వానియందుండక వాంతమయ్యె ,
నప్పుడా ఘోరపాపారణ్యమును వేంక
టాద్రి ప్రభావమం దగ్ని యగుచుఁ

తే. గాల్చుచుండఁగ గగన దిగ్భాగములను
బొగలు మంటలు నెగసె ; నప్పుడ యజుండు ,
వామదేవాదు లీక్షించి వచ్చి దివిజ
మార్గముననుండి యాశ్చర్యమగ్నులగుచు. 80

ఉ. అప్పుటు వేంకటాచల మహామహిమంబు దవాగ్నిరూపమై
తప్పక విప్రు పాపమును దగ్ధముఁజేసెనటంచు మాధవున్
గొప్పగ నెంచి , శీర్షమునఁ గొల్లగఁ బువ్వుల వాన నించి యం
దొప్పుగఁ జూచుచుండి ; రజుఁ డుర్వికిఁ దా దిగివచ్చి నవ్వుచున్. 81

ఉ. వాని శిరంబు మూర్కొనఁగ , వాఁడు కృతార్థుఁడనైతినంచు నం
దానళినోద్భవుం బొగడి , యంజలిచేసి భయంబు మీఱఁగా
దీనతనుండి యిట్లనియె ' దేవ ! వివేకములేక పాపమున్
నే నలనాఁడు చేసి యతినీచుఁడనైతి , నిఁకేమి చెప్పవే ! ' 82

తే. అనుచు వాఁ డార్తిఁ బొంది యిట్లడుగ , నజుఁడు
పలికె నిట్లని ' విప్ర ! నీ పాపమెల్ల
భస్మమైపోయె , సంశయపడకు మింక
వేంకటాద్రికి నీవు వేవేగఁ బోయి. 83

సీ. స్వామి పుష్కరిణిలో స్నానంబుఁ జేసి యా
భూవరాహస్వామి పూజసలిపి
మ్రొక్కి , నీ వీ దేహమును విసర్జింపుము
తదనంతరమున భూతలమునందు
ధన్యతఁ బాండవదౌహిత్రవంశజుఁ
డగు సువీరుని సుతుఁడై జనించి
నట్టి సుధర్మున కాత్మసంభవుఁడవై
వసుధ నారాయణవర పురమున

తే. నిలిచి , హరిభక్తి నెదనుంచి నిర్మలతను
తొండమండలదేశ మఖండధర్మ
మార్గమున నేలుచుండు , రమావిభుండు
పెండ్లియాడును నీ సుతన్ బ్రేమ మెఱయ. 84

తే. లక్ష్మియంశను ధరలో సలక్షణాంగి
యైన సుత నీకుఁ గల్గు , శ్రీహరికి దానిఁ
బ్రీతితో నిచ్చి ముదమునఁ బెండ్లి చేసి
యవల వైకుంఠపురిఁ జేరు ' మనుచు నపుడు. 85

వ. బ్రహ్మ మాధవున కివ్విధంబున వరంబు లిచ్చి , వాని వీడ్కొల్పి , యీ పర్వతంబునకు వేంకటాఖ్య సార్థకంబయ్యెనని సంతోషించె ; నంత నా బ్రహ్మరుద్రాదులు నిజస్థానంబుల కరిగి ' రని చెప్పఁగా విని ' వేంకటాఖ్యాక్షర త్రయార్థంబుఁ జెప్పు'మనిన జనకుం జూచి శతానందుం డిట్లనియె. 86

క. ' విను వేమ్మను పాపేంధన
మును గటయుగళాక్షరాగ్ని ముఖ్యంబై కా
ల్చెను గావున , వేంకటగిరి
యనుపే రా యద్రి కొప్పె నవనీనాథా ! 87

సీ. మొనసి ప్రాతఃకాలమున లేచి వేంకటా
ద్రి స్మరణముఁ జేయు ధీరు లవనిఁ
గ్రమముగా నూఱు గంగాస్నానములు , మఱి
సేతుయాత్రలు వేయి చేసినంత
పుణ్యఫలంబులన్ బొంది సుఖింతు ; రీ
కథ మద్గురుండగు గౌతముండు
నాకుఁ జెప్పిన రీతి నీకుఁ జెప్పితి , నిది
వినిన వారికి శుభవితతు లొదవు

తే. వసుధ నిహపర సుఖములు వలసినట్టి
వార లీ కథ వినవలె వాంఛచేత '
నని శతానందముని చెప్పినందువలన
జనకుఁ డా వేంకటాద్రికిఁ జనఁ దలంచి. 88

వ. హితమంత్రి ప్రముఖులం దోడ్కొని శతానందునితోడ వేంకటాద్రికి వచ్చి, స్వామిపుష్కరిణిలోఁ గ్రుంకులిడుచు భూవరాహ శ్రీనివాసస్వాముల సాన్నిధ్యంబునఁ గొన్నిదినంబులు వసియించి, క్రమ్మఱ మిథిలాపురంబుఁ జేరె ; నివ్విధంబున వేంకటాద్రి దర్శనంబుఁ జేసిన పుణ్యంబుచే నట రామచంద్రుండు శంకర ధనుర్భంగంబుఁ జేసి సీతను బరిగ్రహించె, నంత సౌమిత్రి యూర్మిళను, భరతుండు మాండవిని, శత్రుఘ్నుండు శ్రుతకీర్తినిఁ బరిగ్రహించి ; రప్పుడు వేంకటాద్రిమాహాత్మ్యంబు విన్నందునఁ గోర్కె ఫలించెనని జనకుండు సంతసించుచుండె. శతానందుండు తపోవనంబున కరిగె'నని చెప్పిన సూతుంజూచి శౌనకాదు లిట్లనిరి. 89

క. 'కమలాసనుఁడు రథోత్సవ
మమరఁగ శ్రీవేంకటాద్రియం దా హరికిన్
విమలుండై చేసెఁగదా
కమలాక్షుం డచట నెంత కాలంబుండెన్ ? ' 90

క. అన విని యా సూతుండి
ట్లనియెను ' శ్రీవేంకటాద్రియం దాధ్యుండై
వనజాక్షుఁడు కలియుగ మణఁ
గిన దనుకన్ విపులశేషగిరిపై వేడ్కన్. 91

## వేంకటేశ్వరుఁడు మరల వైకుంఠముఁ జేరుట

సీ. ప్రాకృతజనులలోపల మెలంగుచు భూవి
యందున్న శ్రీవేంకటాద్రివిభుఁడు
పరఁగ నప్రాకృత ప్రభలచే దీపించి

మిహిరాబ్జ కాంతుల మెచ్చకుండు
బహురత్న గోపుర ప్రాకార సౌధముల్
మొనయు చతుర్ద్వారములును గలిగి
మహనీయ మరకత మణితోరణములచేఁ
గొమరొప్పుచున్న వైకుంఠపురముఁ

తే. దలఁచి, యచ్చటి నిత్యముక్తులను దానుఁ
జూడఁగోరుచు 'శేషాద్రి శుభ్రఘోణి
కొప్పుగా నేలు' మని చెప్పి యొప్పగించి
మంచి మాయానిగూఢ విమాన మెక్కి. 92

వ. శ్రీభూనీళా సమేతుండై హరి వైకుంఠపురంబుఁ జేరి, యందున్న నిత్య, ముక్తులఁ జూచి యాదరించి, యప్రాకృత మణిమయాంతఃపురంబులో శేషతల్పంబునందు వసియించియుండె ; నంత శేషాద్రియందున్న వరాహస్వామి విశ్వకర్మనిర్మితపట్టణం బంతర్ధానంబు నొందించి యిచ్ఛావిహారంబుగా వర్తించుచుండెఁ ; బిమ్మట వృషభాసురునితో యుద్ధంబుఁజేయం జనియె ; నివ్విధంబునఁ గొన్నియబ్దంబులు జరిగినవెనుక నొక్కనాఁడు నారదుండు వేంకటాద్రికి వచ్చి శ్రీనివాసుఁడు వైకుంఠంబుఁ జేరిన వృత్తాంతం బెఱింగి, సత్యలోకంబునకుం బోయి బ్రహ్మదేవునకు నమస్కరించి యిట్లనియె. 93

తే. 'తండ్రి ! విను చక్రి శేషభూధరము శుభ్ర
ఘోణి కొప్పించి, తాను వైకుంఠపురముఁ
జేరె' ననఁగా నజుం డతిచింతనొంది
యేమియును దోఁప కతనితో నిట్టులనియె. 94

క. 'విను నారద ! భూలోక
బున శేషాచలమునందుఁ బురుషోత్తముఁడు
డిన కాలంబునఁ దద్భూ
జను లతిపుణ్యాత్ములైరి సాత్త్వికులగుచున్. 95

సీ. ఆ స్వామి వైకుంఠమందుఁ గ్రమ్మఱఁ జేరి
నందుచే శ్రీవేంకటాద్రిమీఁద
నేను సంకల్పించి నెనరుతోఁ గావించి
నట్టి రథోత్సవం బా వరాహ
దేవుఁ డొక్కఁడు సమర్థింపలేఁ, డా శ్రీని
వాసుఁ డందుండఁగావలయుఁ గనుక
వసుదేవ దశరథ వరతేజములఁ దింత్రి
ణీవృక్షముగఁ దీర్చి నిలుపుదు నట

తే. సరసదేవకికళను గౌసల్యకళను
బుట్టగాఁ దీర్చి యుంతు ; నాపుట్టలోన
శ్రీనివాసుఁడు వేగఁ జేరే యుపాయ
మీవు గావింపు మెట్టైన దేవమౌని ! 96

క. వనజాక్షుం డా గిరిఁ జే
రిన పిమ్మట హరికి నాఁటి రీతినిఁ దిరుగా
నొనర రథోత్సవ మచ్చట
జనహితముగ నేనుఁ జేతు శాశ్వతగతులన్. 97

సీ. క్షితిమీఁద నిప్పుడు శ్రీనివాసుఁడు లేని
కతన మానవులు దుష్కర్ములగుచుఁ
గలిమాయ నొంది, సత్కర్మముల్ శ్రద్ధతోఁ
జేయలే ; రిఁకమీఁద శేషగిరికి
మరల శ్రీహరి వచ్చి మనుజులనెల్ల ర
క్షించు నుపాయంబుఁ జేయకున్న
జనుల పాపంబుల శమనుండు గని 'నార
కములందుఁ ద్రోయించుఁగాన, భూత

తే. దయ మనంబున నుంచి మాధవుఁడు శేష
పర్వతముఁ జేరునట్టి యుపాయ మీవు
సేయు'మన విని సురమునిశ్రేష్ఠుఁ డలరి
యజుని పాదంబులకు మ్రొక్కి యాదరమున. 98

సీ. శరదభ్ర శుభ్ర లసత్కాంతి నిజదేహ
మందు దీపింపఁగా నరుణవర
కలిత జటాజూట కళ లుప్పతిల్లఁగా
లలిఁ బూర్ణచంద్ర కళంకమనఁగ
నొనరు కృష్ణాజిన మురుకటియందొప్ప
మధ్యభాగమునందు మౌంజి వెలుఁగ
మెఱుపుఁదీఁగెను దాను మెచ్చక యురమందుఁ
దగిన బంగరు జన్నిదంబు మెఱయ

తే. నారదుఁడు లేచి యప్పుడా నళినభవుని
యనుమతిని జాహ్నవీతీరమందుఁ జేరి
క్రతువు లచ్చట నొనరించు కశ్యపాది
సంయములనెల్ల నీక్షించి సాదరముగ. 99

తే. వీణె మీఁటుచు గానధురీణుఁడైన
వరమునీంద్రుఁడు ఘనయజ్ఞవాటమునకు
రాఁగఁ, గశ్యపముఖులు నారదునిఁ జూచి
విహితరీతినిఁ బూజించి వినుతిఁ జేసి. 100

క. నెనరున వారిట్లని ' రో
యనిమిషముని ! నీవు వచ్చినందున మాకున్
ఘనతర సంతోషం బొద
వె'ననంగా నారదుండు వేడుక ననియెన్. 101

తే. 'మౌనివరులార ! మీరెల్ల మఖము లిచట
లలినిఁ గావించి యజ్ఞఫలంబు లెవరి
కర్పితంబులు గావింతు ? రా విధంబుఁ
దెలుపుఁ'డన్నను మునులు సందియమునొంది. 102

వ. అప్పుడా భృగుమునీంద్రునితోడఁ దమలోఁ దాము వితర్కించుచు, యజ్ఞఫలభోక్తయైన దేవుని నేర్పఱించి చెప్పుటకుఁదోఁపక యూరకుండిన, నారదుండు వారలం జూచి. 103

సీ. మానితాష్టాక్షరీ మంత్రార్థమును వీణె
యందుఁ బల్కించి సానందుఁడగుచుఁ
బలికె నిట్లని ' ప్రజాపతులార ! మీరు స
త్క్రతువులు చేసి లోకములయందు
విలసితముగఁ బ్రజావృద్ధిఁ జేసితిరి , మే
లయ్యె ; మోక్షప్రదుఁడైన దేవుఁ
డజుఁడొ , పద్మాక్షుఁడొ , హరుఁడో విచారించి
ముక్తిప్రదుండైన మూర్తియందు

తే. సవనఫలముల నర్పించి సంతసింపు '
డనుచు హితమొప్పఁ జెప్పి వీడ్కొనె విపంచి
తంత్రులను మీఁటుచును , బరతత్త్వ మాత్మ
యందుఁజూచుచు నిచ్ఛావిహారి యగుచు. 104

వ. అమ్మునీంద్రుండు త్రిలోకసంచారంబుఁ జేయుచుండె , నజుండు శేషాద్రియందు వల్మీక తింత్రిణీవృక్షంబుల నిర్మాణంబు సేసియుంచెఁ ; దదనంతరంబ. 105

## భృగుఁడు త్రిమూర్తి పరీక్షఁ జేయుట

మ. ఘనుఁడై నారదుఁడన్న వాక్యముల నాకర్ణించి భావించి య
మ్మునులెల్లం గుమిగూడి తాము తమలో మూర్తిత్రయంబందు మి
చిన మోక్షప్రదుఁడైన వేల్పును బరీక్షించే యుపాయంబు లె
ట్లని యోజించి 'భృగుండు నేర్పుఁ గన నింకా మూర్తిచందంబులన్.' 106

వ. అని నిశ్చయించి 'త్రిమూర్తులయందు ముక్తి ప్రదుండైన మూర్తిని విచారించికొనిర'మ్మని భృగుమునీశ్వరు నంపఁగా నప్పుడమ్ముని సత్యలోకంబునకుం బోయి తపోజనపరివృతుండై కొలువున్న బ్రహ్మ నీక్షించి మ్రొక్కి, యా బ్రహ్మ కూర్చుండుమనక మున్న కూర్చుండినం , జూచి యజుని మనంబునఁ గోపంబు పొడమె , నప్పుడా కోపంబు నడంచికొని విధాత మాట్లాడకుండినం జూచి యీ బ్రహ్మరజోగుణస్వరూపం బిట్టిది. ఇట్టి రజోగుణప్రధానుండైనవాడు మోక్షప్రదుండుగాఁడు గావున , నితనికి భూలోకంబునం దాలయంబు లేకుండు ' నని నిశ్చయించి , యా భృగుమునీంద్రుండు దిగ్గున లేచి కైలాసంబునకుం బోయి , పార్వతీసమేతుండై క్రీడించుచున్న శివుని ముందఱ నిలిచినం గని పార్వతి లజ్జించె ; నప్పుడా శివుండు ' గానితఱి నిట్టి రహస్య స్థలంబున కిమ్ముని రావచ్చునే ? ' యని క్రోధరక్తాక్షుండై చూచుచు మాట్లాడకున్నఁ , ద్ర్యంబకు నీక్షించి ' యీ రుద్రుని తమోగుణస్వరూపం బిట్టిది. ఇట్టి తమోగుణప్రధానుండైనవాఁడు ముక్తిప్రదుండుగాఁ , డీతనికి శరీరపూజ లేక, లింగపూజయగుంగాక ! ' యని నిశ్చయించి , యందుండి వైకుంఠంబున కరిగి , యమ్మునీంద్రుండు శేషతల్పంబునందు రమాసమేతుండై శయనించియున్న శ్రీనివాసుని వక్షఃస్థలంబునందు నిజపదంబెత్తి తన్నె ; నప్పుడా హరి దిగ్గున లేచి యమ్మునికిఁ బ్రణామంబుఁ జేసి , యర్ఘ్యపాద్యాది విధులం బూజించి కూర్చుండి , తనుఁ దన్నిన యమ్మునిపాదంబుఁ దన తొడపై నిడికొని యొత్తుచు మందస్మితవదనుండై యా భృగు నీక్షించి యిట్లనియె. 107

సీ. ' వరమునీశ్వర ! మీరు వచ్చుట తెలియక
యూరకె పవళించియుంటిఁ గనుక
నపచారినైతి , నాయందు మీ రలుగక
యురుకృప నామీఁద నుంపవలయు
నాయపచారంబునకుఁ దగు శిక్షకై
యెఱిఁగి తన్నితిరి ; నా కిష్టమయ్యెఁ
గఠినమైనట్టి వక్షమునందుఁ దన్న మీ
పదమెంత నొచ్చెనో ? యెదను దాఁకి

తే. యిందులకు నేమి సేయుదు ? నిప్పదంబు
కోమలంబైన చిగురుటాకునకు మించి
యధిక మృదువైన కతన , మీ రదరఁదన్ని
నప్పు డురమున కింతైన నొప్పి లేదు. 108

క. వనజము దాఁకిన చందం
బున మీ పదఘాత మెదను భూషణమయ్యెన్
ఘనకరినతరోరఃస్థల
మెనయఁగఁ దాఁకిన పదాబ్జ మెట్లుండెనొకో ! ' 109

వ. అని పలికి యమ్మునీంద్రుని పాదప్రక్షాళనంబు చేసి , తత్తీర్థంబు శిరంబున
వహించి మఱియు నిట్లనియె. 110

క. ' వరవిప్రుల పదరేణువు
లిరవుగ శిరమున ధరింతు, నీనాఁటికి మీ
చరణం బురమున సోఁకఁగ
ధరణీసురవర్య ! నేఁడు ధన్యుఁడనైతిన్.' 111

చ. అని హరి పల్కఁగా భృగుమహాముని సంతసమంది, మానసం
బున భయభక్తులుం బొడమ భోగిశయానుని మోముఁ జూచి , ల
జ్జను దలవాంచి యిట్లనియె ' శాశ్వత సద్గుణమూర్తివీవు గా
వునఁ బ్రోచితిందు నిఖిలోన్నత ! నిన్ను నుతింప శక్యమే ? ' 112

వ. అని వినుతించి , హరిని వీడ్కొని చని గంగానదీతటంబునఁ గ్రతువు లొనరించుచున్న కశ్యపాదిమునివరుల చెంతఁజేరి , యజరుద్రుల రజస్తమోగుణ స్వరూపంబులను, హరి శుద్ధసత్త్వగుణ స్వరూపంబును దాను పరీక్షించి వచ్చిన వృత్తాంతంబు లమ్మునులకు వినిపింపఁగా, వారు సంతసించి నారాయణుం డొక్కఁడె మోక్షప్రదుండని నిశ్చయించి, సకలక్రతు పుణ్యఫలంబు లా స్వామికి సమర్పించి, విష్ణు ధ్యానంబె సేయుచుండిరంత. 113

సీ. వనజాక్షు నా భృగుముని దన్నినప్పు డా
హరియురమం దుండినట్టి లక్ష్మి
తన నివాసమునందుఁ దన్నిన భృగునిపై
నలుక రెట్టింపఁగా హరికి మ్రొక్కి
పలికె నిట్లని ' పరబ్రహ్మ స్వరూపుఁడ
వని నమ్మి నీ వక్షమందు నిలిచి
యిరవుగా నుంటి ; నేఁడీ పరపురుషుఁడై
నటువంటి ముని దన్నె నద్భుతముగ

తే. నతఁడు దన్నుట సంతోషమయ్యె నీకు,
నాకు కోపము పుట్టియున్నది , మునీంద్రు
నేమి నేనన నీమది కింపుగాదు
గానఁ దపమాచరించెదఁ గమలనాభ ! 114

క. మానసమున మీ పదములు
ధ్యానింపుచు నెచటనైనఁ దపమొనరింపన్
జ్ఞానము నాకిపు డొసఁగుము
నే నీ పదమందె నిలుతు నిర్మలమతినై.' 115

క. అనుచు రమాసతి రోషం
బున శిరమరవాంచి పల్కఁ , బురుషోత్తముఁ డా
వనజాలయను గనుంగొ
మనమలరఁగ నిట్టులనియె మచ్చిక మీఱన్. 116

క. 'సిరి ! నీ వా ముని దన్నుట
కరమరగాఁ జూడవలవ దమ్ముని పాదం
బురమున సోఁకుట బహుశుభ
కరమ్మగు నీ వలుగవలదు కమలదళాక్షీ !' 117

చ. అన విని లక్ష్మి యిట్లనియె 'నాత్మల కాత్మవు , విశ్వకారణుం
డని నినుఁ బూజసేయ కిపు డక్కట! యీడకు వచ్చి తన్నె , న
మ్మునికి గతెట్లు గల్గు? నతిమూర్ఖుఁడు వానిఁ దలంప నింక నా
మనమున కింపుగాదు , బహుమానముఁజేసితి వీవు కేశవా ! 118

సీ. తనతండ్రియైన విధాత నీకు సుతుండు
తా నా విధాతకుఁ దనయుఁడయ్యెఁ
దనకుఁ బితామహుండని యెంచి పిన్న పె
ద్దంతరమును జూడ కదరఁ దన్నె ,
నది యటులుండని , మ్మదిగాక పరమాత్మ
వని తెలియంగ లే కజ్ఞుఁడయ్యె
నటువంటి మునిపాద మిటు నీ యురంబుపై
సోఁకినకతన నిచ్చోట నిలువఁ

తే. దగదు , నిన్నెడనైనఁ జిత్తంబునందు
నిలిపి పూజింపుచుండుటే నీతి నాకు
సెలవొసంగుము జగదీశ ! చిత్ప్రకాశ !'
యనుచు సిరి వల్క హరి యిట్టులనియె నగుచు. 119

సీ. ' సుదతి ! విరించి నా సుతుఁ, డా భృగుఁడు పౌత్రుఁ
డంటివి , బిడ్డ బిడ్డైన వాఁడు
తన్నిన , నెఱుఁగడు చిన్నవాఁడని నేను
గూర్మిఁ దలంపక కొట్టఁదగునె ?
కడుపులోపలి బిడ్డ కాలఁ దన్నెనటంచుఁ
దల్లి గ్రమ్మఱ వానిఁ దన్నవశమె ?
జీవకోటులను గుక్షిని నుంచికొనిన నే
నిట్టి దోషముల సహింపకున్న

తే. నెవరు సైరించి ప్రోచెద ? రిదియుఁగాక
బ్రహ్మపుత్త్రుఁ డతండు సద్బ్రాహ్మణుండు
తాపసోత్తముఁ , డదిగాక తత్త్వవేది
నిజముగా భక్తి నాయందె నిలిపినాఁడు. 120

ఉ. భక్తుఁడు నా కతిప్రియుఁడు , భక్తున కేను ప్రియుండఁగాన , నా
భక్తుఁడు నన్నుఁ దన్నుటకుఁ బాపుఁడటంచును నిందసేతురే ?
ముక్తుఁ డతండు , మౌనిజనముఖ్యుఁడు మూర్ఖుఁడుగాఁడు గాన , భే
దోక్తులు మాని శాంతమతి నుండుము నా యురమందు భామినీ ! ' 121

క. అని విష్ణుం డనుటకు సిరి
కనుఁగవఁ గెంపెసఁగఁ గోపకలితాననయై
మనమున నసహ్యపడుచును
దన పతి కిట్లనియె వినుము తామరసాక్షా ! 122

క. ' పరపురుష పదస్పర్శం
బరుదుగ నిటు సోఁకుచోట హరి ! నేనిఁక నం
దొరయుచునుండితినైనను
వరపాతివ్రత్య ధర్మవర్తన చెడదే ? 123

సీ. ఇఁక నేల , నీకు నా కెగ్గుఁబాపినటువంటి
వాని వంశజులైనవారలెల్ల
ననిమిషారుల కాప్తులై నిర్జరాహితు
లగుచుండవలయుఁ , బ్రాహ్మణులు గలి
దారపుత్త్రాదులఁ దాము పోషించుట
కొదిఁగి యాచకులు నయ్యెదరుగాక !
నిత్యకర్మములఁ గొన్నిటి వీడి నీచులఁ
బొదువుగా నాశ్రయింపుదురుగాక !

తే. పేదలై చాలఁ గడుపులఁ బెంచి సకల
విద్య లమ్ముచు ధరను జీవింతు రెన్న'
ననుచు విప్రుల కీ రీతి నాదిలక్ష్మి
పరఁగ శాపము నిచ్చి , యా హరినిఁ జూచి. 124

సీ. తన్నిన విప్రుని దండింప కంపితి,
వటుగాన పిఱికివాఁడనుచు నెంచి
చులుకఁదనంబుగాఁ జూచి ని న్నెందైన
గొల్లవాఁడైనను గొట్టఁగలఁడు
ధర నాఁడువారైన ధట్టించి నీమీఁద
నవ్వుచు ఱాళ్లతో రువ్వఁగలరు
విను మ్లేచ్ఛు లీ రీతి విని సడ్డసేయక
మించి నిన్నిల నాక్రమించఁగలరు

తే. తొలుతఁ బుట్టిన నీ శాంతి తుదకు నన్ను
నిన్ను నెడఁబాపె , నెందైన నిన్నుఁ జిత్త
మందుఁ బూజించుచుండెద నంతెగాని
నీ యురంబున నే నెట్లు నిల్తు నదిప ! ' 125

సీ. అని పల్కి కిలికించితాపాంగయై , కించి
దానమితానన యగుచు లక్ష్మి
నిజపదాంగుష్ఠంబు నేల వ్రాయుచుఁ జింత
నెనయుఁచుండఁగఁ , జూచి నెనరు దాఁచి
కారణ మూహించి క్రమ్మఱ మాట్లాడ
కున్న విష్ణునిఁ జూచి యుదధికన్య
' హరి తను మన్నింప కఱమఱఁ జేసినాఁ
డీ జాలిమాలి నాకేల యింక ? '

తే. నని తలంపుచు వైరాగ్య మగ్గలింపఁ
గమలనాభుని హృదయపంకజమునందుఁ
జక్కఁగా నుంచికొని మ్రొక్కి చని రయమున
రమ్యతరమైన కొల్లాపురంబుఁ జేరె. 126

క. ఆ కొల్లాపుర వాసుల
శ్రీకమలాదేవి నచటఁ జిరతరభక్తిన్
బ్రాకటముగఁ బూజింపఁగ
జోకగ నందుండె లక్ష్మి సుస్థిరమతియై. 127

వ. ఈ క్రమంబుగా లక్ష్మీనారాయణులకుఁ బొడమిన ప్రేమకలహంబను వ్యాజంబున లక్ష్మి కొల్లాపురంబుఁ జేరె ' నని చెప్పిన విని శౌనకుండు పశ్చాత్తాపంబు నొంది సూతుం జూచి యిట్లనియె. 128

శా. ' శ్రీనారాయణుఁ డీప్రకారముగ నా క్షీరాబ్ధిజన్ బాసి యా
భూనీళాసతులందు మోహ మతిసంపూర్ణంబుగా నుంచి యం
దానందించుచునుండెనో , సిరిని నెయ్యంబొప్ప భావించుచున్
దీనత్వంబునఁ బొందుచున్ వగచెనో , ధీరాత్ముండై యుండెనో ? ' 129

క. అని యా శౌనకుఁ డడుగఁగ
విని సూతుం డిట్టులనియె ' విష్ణుఁడు సిరిపై
నెనరు మనంబునఁ బెనఁగొనఁ
దనలో నిటు దలఁచె విరహతాపము మీఱన్. 130

సీ. 'ఆ దేవముని వేంకటాద్రిపై నే లేని
తప్పు విరించితోఁ జెప్పనేల ?
యజుఁడు నారదునంప నతఁడు మౌనుల చెంతఁ
జేరి మూలప్రశ్న చేయనేల ?
తత్పరీక్షకు భృగు తాపసేంద్రుఁడు వచ్చి
ధైర్యంబుతో నన్నుఁ దన్ననేల ?
యది చూచి నాకు నిత్యానపాయినియైన
భామ నన్నిపు డెడఁబాయనేల ?

తే. కటకటా ! యేమి సేతు నీ కర్మ గతికిఁ ?
గాల మెంతటివారైనఁ గడవలేరు
పద్మమందిర నన్నెడఁ బాయుకొఱకుఁ
గలిగె నద్భుతముగ నిన్ని కారణములు. 131

తే. మంచిదిది యొక కొదువగా నెంచనేల ?
చంద్రబింబమునందుండు చంద్రికవలె
విమలయై లక్ష్మి నాయందె వెలుఁగుఁగాని
పరఁగ నను వీడదెందు సౌభాగ్యలక్ష్మి. 132

క. సిరి హృదయములో నే నిపు
డిరవుగ వసియించియుండి , యిందిర నమరన్
మరలన్ నా హృదయముపైఁ
దిరముగ నుంచికొని ప్రోతుఁ ద్రిజగము లొప్పన్. 133

సీ. తోయధికన్యకా స్థూలదేహం బిప్పు
డెందున్నఁగాని నాయందు సూక్ష్మ
తను వొప్పుచున్నది , దానిచేఁ జింతలే
దైనను లోకవిడంబనార్థ
ముగను సర్వజ్ఞత్వమును దాఁచి , శ్రీరమా
వనితను వెదకఁగావలయు నిపుడు
నే నూరకుండిన నిర్దయుండని కొంద
అందురు గాన , నెయ్యమునఁ జేరి

తే. కొలువరని పార్షదులకు వైకుంఠపురము
నొప్పుగా రక్షణముసేయుచుండు'డనుచుఁ
జెప్పి , భూ నీళలకు వారి నొప్పగించి
మరల నిట్లని తలఁచె నమ్మాధవుండు. 134

వ. 'ఇవ్విధంబునఁ గొంతకాలంబు జరిగినపిమ్మట నమ్మహాలక్ష్మిని మద్వక్షంబునం దుంచికొందు'నని నిశ్చయించి , భూనీళలం జూచి బుజ్జగించి ' రమాదేవిని వెదకి చూచి క్రమ్మఱ నిచ్చటికిఁ దోడ్కొని వత్తు' నని వారితోఁ జెప్పి సమ్మతపఱచి , వైకుంఠంబు విడిచి మరల వేంకటాద్రికి వచ్చె'నని చెప్పిన సూతుంజూచి శౌనకాదు లిట్లనిరి. 135

' శ్రీవనితామణి నరయుచు
శ్రీవైకుంఠంబు విడిచి క్షితిపై నుండే
శ్రీవేంకటగిరిఁ జేరిన
శ్రీ విష్ణుం డచట నేమి సేయుచునుండెన్ ? ' 136

సీ. అని మును లడుగఁగా నా సూతుఁ డిట్లనె
' వినుఁ డాది విష్ణుండు వేంకటాద్రిఁ
జేరి యచ్చటనుండు శ్రీ వరాహస్వామి
కినిఁ బుష్కరిణికి దక్షిణముగాన

విలసిల్లు తింత్రిణీ వృక్షమూలమునందు
మెఱయుచున్నట్టి వల్మీకవివర
మందుఁ బ్రవేశించి యయుత వత్సరములం
దెవరికిఁ గనిపింప కిరవుగాను

తే. పుట్టలో వెల్గుచుండఁగా , భూతలమునఁ
దప్ప కిరువది యెనిమిదో ద్వాపరాంత
మందుఁ గలియుగ ముదయించె ; నపుడు చోళ
రాజు భువి నేలుచుండె ధర్మంబు మెఱయ. 137

వ. అట్టి కాలంబునందుఁ బర్జన్యుఁడు కాలవర్షంబు గురియించుచుండు ; భూమి సకల సస్యంబులఁ బండించుచుండు;గోవులు బహుక్షీరంబు లిచ్చుచుండుఁ; బతివ్రతలైన స్త్రీలును,సతీవ్రతులైన పురుషులును,మాతాపితృభక్తిగల పుత్త్రులును గలుగుచుండుదు ; రట్టి కలియుగాది కాలంబునందుఁ గొల్లాపురంబుఁ జేరియున్న లక్ష్మి శ్రీహరి వైకుంఠంబు విడిచి శేషాచలంబుమీఁదఁ దింత్రిణీ వృక్షమూలస్థ వల్మీకంబునందు వసియించియుండు చందంబు భావించి తెలిసి, జాలినొందుచుఁ దన మనంబున నిట్లని వితర్కించె.138

క. 'నాకొఱ కంబుజనాభుఁడు
వైకుంఠము విడిచిపోయి వల్మీకములో
నేకాకియగుచు నందిపు
డాఁకొనినాఁ డేమిసేతు నకటా ! ' యనుచున్. 139

క చింతించుచు ' నే నాహరి
చెంతం జేరినను నన్నుఁ జేఁకొను , నైనన్
పంతము విడువందగ ' దని
స్వాంతంబున నిశ్చయించి జాలి విడువకన్ 140

తే. వేగఁ గొల్లాపురంబును విడిచి , గొల్ల
పొలఁతికైవడి నొంటిగాఁ బోయి చోళ
రాజసతియున్న మణిమందిరంబుచెంతఁ
జేరి ' హరి కిఁక నెటు తృప్తిఁజేతు ? ' ననుచు. 141

## బ్రహ్మ రుద్రులు ధేను , వత్సకంబు లగుట

వ. మనంబునఁ దలంచుచున్న సమయంబున , మహాలక్ష్మి భావం బజుండు తెలిసి , రుద్రుం దోడ్కొనివచ్చి యచ్చట ధేనురూపంబు ధరియించె ; నది యెట్లన్నను. 142

సీ. కపిలవర్ణంబుతోఁ గరమొప్పు దేహంబు
మంగళకరమైన శృంగయుగము
కాటుక కనులు , సింగారంపుఁ జెవులును
నల్లనై మెఱసెడి నాసికయును
గురుతర కంఠంబు , గోపుర , ముదరంబు
తగు దీర్ఘవాలంబు , తళుకుఁజూపు
ద్విరద తుండములట్ల దీపించు తొడలును
పూర్ణకుంభాభమై పొసఁగు పొదుఁగు

తే. బటువులైనట్టి కదళికా ఫలములట్ల
నునుపుగా నొప్పు నాల్గు చన్నులును గలిగి
క్షీర వారిధిలోఁ బుట్టి చెలఁగునట్టి
కామధేనువువలె లక్ష్మికడను నిలిచె. 143

తే. వామదేవుఁడు నటు దాని వత్సమగుచు
ధవళరూపంబు మెఱయ నా తల్లిచెంతఁ
బాలు ద్రావుచు , నెగురుచు బాల్యలీల
లరుదుగాఁ జూపఁగాఁ జూచి యాదిలక్ష్మి. 144

చ. కమలజ శంభు లీ క్రమముగా హరి కిష్టముఁ జేయు కోర్కెతో
నమలిన ధేను వత్సకములైన విధంబు మనంబులోపలన్
గ్రమముగ నందుఁ దా నెఱిఁగి గ్రక్కున రెంటినిఁ దోలి తెచ్చి , పెం
పమరఁగ ' దూడ , నావు నిపు డమ్మెద ' నంచు వచించుచుండఁగన్. 145

క. విని చోళనృపాలుని స
తన బిడ్డకుఁ బాలు దాను ద్రావించుట కా
వనితకుఁ గోరిన విత్తం
బనుపమమతి నిచ్చి , కొనియె నావున్ దూడన్. 146

వ. ఇట్లు కొని , మున్ను తమకుండిన ద్విసహస్ర ధేనుగణంబులలోఁ దోలి గోపకున కొప్పగించె ; నంత మహాలక్ష్మి ' యిప్పుడీ యజ హరులు ధేను వత్స రూపంబులన్ ధరియించి వల్మీకవాసియైన వాసుదేవునిఁ బోషించెద; రింక నాకుఁ జింతలే , దీ స్వామి యెందైన సుఖించుచుండుటే నాకు సంతోషం ' బని తలంచి క్రమ్మఱఁ గొల్లాపురంబున కరిగె ; నంత బ్రహ్మస్వరూపంబైన ధేనువు దినదినంబును. 147

క. గోవులలో మేయుచుఁ జని
శ్రీవేంకటశైల మెక్కి క్షీరంబును దా
నా వల్మీకములోపలి
శ్రీ విష్ణున కర్పణంబుఁ జేయుచునుండెన్. 148

క. హరి యా క్షీరముఁ గ్రోలుచుఁ
బరమానందంబు నొంది బ్రహ్మను , రుద్రున్
మురియుచు మెచ్చుచు నుండిన
తఱిఁ జోళనృపాలు భార్య తన సుతుకొఱకై. 149

తే. మున్ను తాఁ గొన్న దూడతో మొదవు నపుడు
సదనమున కొప్పఁ దెప్పించి సాధ్వి గోవు
గాన మేనెల్ల నిమురుచుఁ దాను దానిఁ
బిండఁబోయినఁ బాలు లేకుండఁగాను. 150

తే. తాను దన మదిలో నిట్లు దలఁచె ' నావు
పొదుఁగు భావించి చూచినఁ బూర్ణకలశ
మట్ల మెఱయుచునుండి , యందద్భుతముగఁ
బాలు లేకున్న ; విది యేమి పాప ! ' మనుచు. 151

వ. ఇవ్విధంబునఁ జింతించి యా దివ్యధేనువందు లక్ష్యంబునుంచి కొన్ని దినంబులు పరీక్షించి , పిండఁబోయినఁ బాలు లేకుండె ; నందునఁ దద్గోపాలకునిఁ బిలిపించి యిట్లనియె. 152

## చోళరాజాంగన గోపకుని దండించుట

సీ. 'గోపాల ! యిపు డింత గొప్పావు పొదుఁగులోఁ
బాలు లేకుండెడి పాపమేమి ?
నీ వరణ్యములోనె త్రావినా ' వన విని
గొల్లఁ డిట్లనియె ' నీ గోవు పాలు
నేఁ ద్రావలేదు , దూడే త్రావఁగాఁబోలు '
ననఁగ ' మాయింట నున్నట్టి దూడ
త్రావునే ? నీవింత దబ్బఱాడితి ' వంచు
నయ్యింతి కోపింప , నదరి వాఁడు

తే. పలికె ' నియ్యావు పొదుఁగంది పట్టి త్రావె
నేమొ , నే నొక్కకర్మంబు నెఱుఁగ'ననఁగ
వే మహీపతిసతి వాని విఱిచి కట్టి
వేసి కొట్టించి యావల వెడలనంపె. 153

తే. అపుడు వాఁడేడ్చుచును జని యావుగముల
వెంటఁ దాఁ బోక , యా గోవు వెంట నంటి
పోవఁగా , నది ఫణిరాజ భూధరంబు
మీఁది కెగఁబాఱిపోయి వల్మీకమందు. 154

తే. పొదుఁగు దిగజాఱ విడిచి యా పుట్ట , క్రోవు
లందు క్షీరము నిండింప , నవ్విధంబు
గోపకుఁడు చూచి తనచేతి గొడ్డలెత్తి
గోవు నడినెత్తిపై మించి కొట్టఁబోయె. 155

ఉ. అప్పుడు విష్ణుదేవుఁ ' డహహా ! సురధేనువు నాకు నిత్యమున్
తప్పక దుగ్ధమిచ్చి ననుఁ దల్లి విధంబునఁ బ్రోచె , నట్టి గో
విప్పుడు గొల్లచే మడియు టెట్ల సహింపఁగ వచ్చు ' నంచుఁ దాఁ
దెప్పున నైజమస్తకము ధేనువు శీర్షముమీఁద నిల్పఁగన్. 156

సీ. గొల్లవాఁ డెత్తిన గొడ్డలి హరిమస్త
కంబులోఁ జొరఁగ , రక్తంబు లెడలి
తక్కకపుడు సప్తతాళవృక్షప్రమా
ణంబున నూర్ధ్వముఖంబుగాను
పొంగుచు దిగజాఱి భూమిపైఁబడఁ జూచి
గోపకుం డదరుచుఁ గూలి మడిసె
నది చూచి గోవు శేషాద్రి చెచ్చెర డిగ్గి
చని చోళభూపతి సభకుఁ బోయి

తే. నేలఁ బొరలుచు నఱచి కన్నీరు నింప
ధేనువునుగాంచి యా రాజు దిగులునొందె
నప్పుడా మొదవందుండ కరుగ , దాని
చారులను బంపె జనవిభుండు. 157

వ. అప్పు డా చారు లమ్మోదవువెంట నంటిపోవ , నా గోవు వేంకటాద్రికి వచ్చి వల్మీకంబుడగ్గఱ నిల్చె ; నంతలోఁ జారు లొదిఁగిపోయి పుట్టలోనుండి రక్తం బెగురుటయు , గోవందు నిల్చుటయు , గోపాలకుండు పడియుండుటయుం జూచి భీతిల్లి , చోళరాజును జేరంబోయి తద్వృత్తాంతంబు విన్నవింపఁగా , విని దిగ్గున లేచి యా రాజు పల్లకిలోఁ గూర్చుండి పరివారంబుతోడ వేంకటాద్రిమీఁదికి వచ్చి , యందు నడచిన విపరీతంబునకు వెఱఁగుపడి , తన మంత్రులం జూచి ' యీ వల్మీకంబునందిట్టి రక్తంబు వెడలుటకు , గోపకుండు పడుటకు , గోవు కన్నీరు నించుచుండుటకు హేతువే ? ' మని వితర్కించుచున్న సమయంబున. 158

సీ. వనజదళాక్షుఁ డా వల్మీకమందుండి
యపు డతిరక్తసిక్తాంగుఁడగుచుఁ
గన్నీరు వెడల గద్గదకంఠుఁడై శంఖ
చక్రముల్ చేపట్టి సరభసముగ
లేచి యా రాజును జూచి యిట్లని పల్కె
' నోరి ! పాపాత్మ ! నే నొదిఁగి పుట్ట
లో డాగియుండఁగా , నేఁడు మీ గోపాలుఁ
డీడకు వచ్చి ,నా కెపుడు పాలు

తే. నెనరుతో నిచ్చు సురగవి నెత్తిమీఁదఁ
గొట్టి చంపెదనని పొంచి , గొడ్డలెత్తి
క్రూరుఁడై నా శిరంబుపైఁ గొట్టినాఁడు
ఘోరపాపముచే వాఁడుఁ గూలినాఁడు. 159

సీ. విను రాజ ! దిక్కెక్కడను లేక , తల్లిదం
డ్రులు లేక , నాలుబిడ్డలును లేక
బంధువులును లేక బలుపేదవాఁడనై
పరదేశినై వచ్చి ఫణినగంబు

పైనుండు పుట్టలోపలఁ జేరియుండఁగాఁ
దల్లిచందమున నీ ధర్మసురభి
క్షీరంబు లిచ్చి రక్షించుచునుండఁగా
నీ పశుపాలుండు నేఁడు దీనిఁ

తే. బదటమునఁ జంపవచ్చిన పాపఫలము
వాఁడనుభవింప , వాఁడు నీవాఁడుగనుకఁ
దొడరి ననుఁ గొట్టినటువంటి దోషఫలము
నీ వనుభవింపు , మెట్లన్న నీచదశను. 160

తే. పొంది ధరను బిశాచమై పొ ' మ్మటంచు
శాపమిచ్చిన విని మదిఁ దాపమొంది
తా ముహూర్తంబు మూర్ఛిల్లి ధరణిమీఁద
వ్రాలి , యట మూర్ఛ దెలిసి భూవరుఁడు లేచి. 161

వ. అందు లీలామానుషవిగ్రహుండై నిలిచియున్న హరికి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి , ముకుళితకరకమలుండై , గద్గద స్వరంబునఁ గన్నీరు నించుచు నా స్వామినిఁ జూచి యిట్లనియె. 162

## చోళరాజు పశ్చాత్తాపము

చ. 'కటకట దేవ ! నే నెఱిఁగి కష్టము నీ కొనరింపలేదు , దు
ర్ఘటమగు శాపమిచ్చి ననుఁ గష్టములోఁ బడవేసితీవు ; నే
నెటువలె నోర్చియుందు జగదీశ్వర ! నా యెడఁ బ్రేమయుంచి , వి
స్ఫుటతరమైన శాపమిఁకఁ బోవ నుపాయము నీవు సేయవే ! ' 163

చ. అని నృపుఁ డార్తుఁడై పలుక సంబుజనాభుఁడు వానిఁజూచి బల్
నెనరున నిట్లనెన్ , ' నృపతి ! నీ యెడ నేరములేని రీతి నే
నొనర నెఱుంగకన్ భ్రమసి యూరక శాపము నీ కొసంగితిన్
దనరఁగ నాదు వాక్యమిఁకఁ దప్పదు గావున నేమి సేయుదున్. 164

చ. భుజగగిరీంద్రమం దొదిఁగి పుట్టమఱుంగున డాగియున్న నన్
గజిబిజిచేసి కాలగతి కష్టము నా కొనరించె ; నందుచే
నిజము నెఱుంగలేక యతినీచుఁడనై , సుజనుండవైన నిన్
గుజనునిఁగాఁ దలంచి యతిఘోరపు శాపము నీ కొసంగితిన్. 165

సీ. వసుధ నీ శాపంబు వారింపఁగా లేను
విపులవాత్సల్యంబు విడువలేను
గాన నీపై నుండు కరుణ మహోదుః
కరమయ్యెఁ , బైశాచగతినిఁ బొంద
లేక నావలననే నీకు దుఃఖము గల్గె
నిరువురకును ఖేద మేకమయ్యెఁ
గలియుగమున్నంత కాల మీ శాపంబు
ననుభవించుచునుండు మవనిమీఁద

తే. సరసుఁ డాకాశరాజను జనవిభుండు
దనకు సుతయైన పద్మావతిని ముదమునఁ
బ్రేమ మీఱఁగ నా కిచ్చి పెండ్లిసేయు
నపుడు మకుటము నా శీర్షమందు నిలుపు. 166

వ. అట్టి కిరీటం బెట్టిదనిన నూరు బారువుల కనకంబుతోఁ దీర్చి వెలలేని జీవమణులు హత్తించి యుండుఁ ; బ్రతి శుక్రవారంబును దప్పింప కమ్మకుటం బాఱు గడియలు శిరంబునం ధరింతు ; నప్పుడు మదీయాక్షులం దానందబాష్పంబు లుదయించు, నయ్యాఱుగడియలు నీవు సుఖియింపుచుండుదువు గాక ! ' యని యానతిచ్చిన , విని చోళరాజు శాపగ్రస్తుండై చనియెఁ ; నంత హరి పుట్టలోఁ బ్రవేశించి శిరఃస్ఫోటనాయాసంబునకు సహింపంజాలక బృహస్పతిని మనంబున స్మరింపఁగా నా గురుండు వల్మీకంబుకడకు వచ్చినఁ , జూచి దీనవదనుండై హీన స్వరంబుతోఁ దన కందు నడచిన వృత్తాంతంబంతయుం జెప్పి , హరి మఱియు నిట్లనియె. 167

సీ. 'ఓ దేవదేశిక ! సాదరంబుగ విను
కాలకర్మములును , గ్రహగతులును
గూడినందున గోపకుఁడు నడునెత్తిపై
గొప్పగొడ్డలి నెత్తి కొట్టెఁ గనుక
నొప్పి మెండైనది తెప్పున నౌషధం
బిప్పుడే భావించి చెప్పు ' మనిన
సురగురుం డది విని శోకాకుల స్వాంతుఁ
డగుచు నిట్లనియె ' మహాత్మ ! నీకుఁ

తే. గాలమును , గర్మమును , గ్రహగతులు గలవె ?
నీ మహిమ లన్యు లెఱుఁగరు ; నీకె తెలియు
నైన మంచిది నన్ను మం దడిగితీవు
గానఁ జెప్పెద నొక మందు కమలనాభ ! 168

తే. పట్టుగా విను జిల్లేడు పత్తి యెత్తి
పాలలో నద్ది నడునెత్తిఁ బట్టి గాయ
మందిడిన నొప్పి శాంతమౌ ' ననుచుఁ జెప్పి
హరికిఁ బ్రణమిల్లి సురగురుం డరిగె నంత. 169

సీ. హరి గురుఁ డెఱిఁగించినట్టి మం దా గాయ
మందుఁ బెట్టుచునుండె ' ననఁగ నవ్వి
శౌనకాదులు చాల జాలినొందుచు సూతు
నీక్షించి వెఱఁగొంది యిట్టులనిరి
ఘనరోమహర్షణముని పుత్త్ర ! తింత్రిణీ
భూజవృత్తాంతంబు , పుట్టవిధము
మొదలైన వృత్తాంతములు చెప్పు ! మీ కథ
విన వేడుకైనది , విశ్వమెల్ల

తే. లలినిఁ బుట్టించు రక్షించు లయమొనర్చు
నట్టి సర్వజ్ఞునకు లేని యాపదెల్లఁ
గలిగె ; నిది విన్న మది వెన్నకరణిఁ గరఁగు
చున్న , దిది తేటగాఁ జెప్పు మో మహాత్మ ! ’ 170

క. అని వా రడుగఁగ సూతుఁడు
విని యిట్లని పల్కె ‘ నాది విష్ణుచరితముల్
ఘనరస గూఢార్థంబులు
గనుక వివరించి చెప్పంగా వశమగునే ? 171

## వల్మీక , తింత్రిణీ వృక్ష ప్రభావములు

వ. అయిన నాకుఁ దోఁచినంత చెప్పెద నెట్లన్నను దశరథుండును గౌసల్యయు దేహవిముక్తులగు కాలంబులం దా రామచంద్రునియం దత్యంత మోహంబు నుంచికొని చనిన కారణంబులఁ బద్మసంభవుండు భావించి , తదృణానుబంధానుసారంబుగా రామకృష్ణ రూపంబులకుఁ గారణంబైన హరి కిరవుగా నుండుటకై దశరథు తేజంబు తింత్రిణీ వృక్షంబుగాఁ , గౌసల్యాదేవి తేజంబును వల్మీకంబునుగా వేంకటాద్రియందు నిర్మించెఁ ; దత్క్రమంబుగా వసుదేవ దేవకులును దేహవిముక్తి కాలంబుల శ్రీకృష్ణస్వామియందుఁ బుత్త్రవ్యామోహంబు నుంచికొని చనిన ఋణానుబంధంబుల నెఱిఁగి , దశరథ స్వరూపంబైన తింత్రిణీతరువందు వసుదేవుని తేజంబును , గౌసల్యాస్వరూపంబైన వల్మీకంబునందు దేవకీదేవి తేజంబును నిలిపె ; నందున రామకృష్ణాభిధానకలితుండైన విష్ణుం డా కాలంబున మాతృగర్భంబునందున్న శిశువుకరణిఁ బదివేల సంవత్సరంబు లా పుట్టలో వసియించియుండెఁగావున , దశరథుండే తింత్రిణీవృక్షంబు , కౌసల్యయే వల్మీకంబు , లక్ష్మణుండే శేషపర్వతం , బయోధ్యాపురంబే తద్భూధర పుణ్యకాననంబు , సరయూనదియే స్వామిపుష్కరిణి , రామచంద్రుండె వల్మీకవాసియైన శ్రీనివాసుండగుచుండుఁ ; దదనంతరంబున వసుదేవుండే

తింత్రిణీ భూజంబు , దేవకీదేవియే వల్మీకంబు , బలభద్రుండే పన్నగాచలంబు , మధురాపురంబే వేంకటనగరంబు , యమునానదియే శ్రీస్వామిపుష్కరిణి , యాదవులె మృగంబులు , గోపికలె ఖగంబులు , కృష్ణుండె వల్మీకవాసియైన వేంకటేశ్వరుండగుచుండఁగా , మఱియు శ్రీవైకుంఠంబే నిగమమయంబైన శేషాచలంబు , విరజానదియే సువర్ణముఖరి, నారాయణుండే లీలామానుషవిగ్రహుండైన శ్రీనివాసుండు గాఁగ , నచ్చట ననేక ముక్తబ్రహ్మ లనేక ఖగంబులై , యనేక ముక్తరుద్రు లనేకమృగంబులై , సనకసనందనాదులు వనచరోత్తములై వర్తించుచుండఁ గాఁ బరమపురుషుండైన వేంకటేశ్వరుం డందు విచిత్ర లీలావినోదంబులఁ గ్రీడించుచుండియుఁ , దనకు శరీరబాధ గలిగినట్లు మాయగా నటించినాఁ డింతియేకాని , యా మహానుభావున కా బాధ లేదు. మీరు నెమ్మదిగా వినుం , డా స్వామిదర్శనంబుఁ జేయనిచ్చగించినవారు సకల సత్కర్మసిద్ధులం బొందుదు ' రని చెప్పి మఱియు నిట్లనియె. 172

శా. 'వైకుంఠంబును వీడి శేషగిరిపై వల్మీక గర్భంబులో
శ్రీకాంతుండు వసించి చేసిన మహాచిత్రంబులన్ వింటి ; రిం
కా కంజాక్షుఁడు మర్త్యుఁడై నరులలో నాట్లాడిన ట్లెప్పుడున్
జోకన్ లౌకికుఁడై నటించిన కథల్ చోద్యంబుగాఁ దెల్పెదన్. 173

మ. వినుఁడా నిర్జరదేశికుండు హరికిన్ వే నొప్పి వారింపఁ జె
ప్పిన పాల్ , దూదియుఁ దెచ్చి గాయముపయిన్ బెట్టే హితుండొక్కఁడై
నను లేకుండఁగ , ' నేమిసేతు ? ' నని శ్రీనారాయణుం డార్తుఁడై
తనమం దప్పుడు తానె తెచ్చుటకుఁ బ్రాతఃకాలమందొక్కఁడే. 174

సీ. అరుగునప్పుడు వరాహస్వామి వృషభాసు
రునితోడఁ బోరాడి తునిమివైచి
యవల భూదేవితో నఖిలపర్వత గుహా
సాను శృంగములందు సంచరించి

బహు వత్సరములకుఁ బన్నగాద్రిఁ దలంచి
మరల వచ్చుచునున్న మార్గమందు
నరునిచందమున శ్రీహరి నిల్చియుండఁగాఁ
గని నరుకరణి రక్కసుఁ డొకండు

తే. హెచ్చి తనతోడఁ బోరాడ వచ్చెననుచు
సటలు ఝళిపించి యట్టహాసంబుఁ జేసి
దిగ్గజంబుల చెవులు భేదించుకరణి
ఘుర్ఘురారావ మొనరించె ఘోరముగను. 175

క. ఆ రభసంబున కళుకుచు
నారాయణదేవుఁ డుఱికి నగి యొక పొదలో
బోరున డాగినఁ, గని యా
దారినిఁ గిటిదేవుఁ డరిగి దర్పము మీఱన్. 176

క. ఘోరాకారుం డగుచును
గోరలు గీటించికొనుచు గొబ్బునఁ బొదలో
దూఱిన ఘోణిం గని యపు
డూరకె యొక మూల విష్ణుఁ డొదుఁగుచునుండెన్. 177

## వరాహ శ్రీనివాస సంవాదము

వ. ఇట్లొదుఁగుచుఁ గన్నీరునించుచుండఁగా నతని దీనదశంజూచి, దనుజుండు గాఁడు, దనుజాంతకుండని తెలిసి ' నిష్కారణంబుగా నితనియందుఁ గ్రోధించితి ' నని మనంబు గరఁగ వరాహస్వామి తానును బాష్పపూరితలోచనుండై, యందున్న లీలామానుషవిగ్రహుని చెంతఁ జేరి ' యోడకు'మని యిట్లనియె. 178

సీ. 'వైకుంఠ మెడఁబాసి వచ్చిన గతియేమి ?
సిరి యురంబున లేని చిత్రమేమి ?
మానవాకృతి నిందుఁ బూని యుండెడిదేమి ?
తలమీఁద గాయంబు తగులుటేమి ?
యుడిగిన బలముతో నొదుఁగుచుండుటిదేమి ?
కన్నుల బాష్పముల్ గారుటేమి ?
నే రొప్పినప్పుడు నిల్చి పల్కక నాకు
లోఁగిన ట్లడవిలో డాగుటేమి ?

తే. వింతగాఁ దోఁచుచున్న దీ విధము నాకుఁ
దెలుపు నిక్కముగా ' నంచుఁ గలఁకనొంది
యడుగ , నఱమఱలేక దీనాస్యుఁడగుచు
భూవరునిఁ జూచి పల్కె లక్ష్మీవిభుండు. 179

సీ. 'విను ఘోణిరూప ! నావృత్తాంతమంతయు
సిరి నురఃస్థలినుంచి శ్రీవికుంఠ
మందు నేనుండఁగా , నద్భుతంబుగ వచ్చి
భృగుఁడు దా నా ఱొమ్ము నెగిరి తన్నె
నా యురమందుండినట్టి రమాదేవి
' పరపూరుషుని పదం బొరయుచోట
నిలిచియుండ'నటంచు నలుకతోఁ గొల్లాపు
రంబున కరిగి వైరాగ్యమొందె

తే. గాన సంసారసౌఖ్యంబు నేను రోసి
నీకడకు వచ్చి విపులవల్మీకమందుఁ
గుదిరియుండఁగ , నిందొక్క గొల్లవాఁడు
గొడ్డటను నడినెత్తిపైఁ గొట్టినాఁడు. 180

క. ఆ గాయము మానెడి కొఱ
కా గీష్పతి మందు సెప్పె , నయ్యౌషధ మే
నీ గిరిమీఁదన్ వెదకుచు
వేగమె నినుఁ గంటి నిచట విమల శరీరా ! 181

క. తలగాయము నొప్పింపఁగ
బలహీనుఁడనైతిఁ గాన , బలవంతుఁడవై
చెలఁగుచు నను రొప్పిన ఎ
నలుకుచుఁ బొదఁ జేరి డాగియుంటి మహాత్మా ! 182

ఆ. కరుణమీఱ నీవు కలసి మాట్లాడి
వందువలన డెందమందుఁ బూర్వ
మున్న చింత దీఱె ; నన్ను నీవానిగాఁ
జెంత నుంచికొనుము శ్రీ వరాహ ! 183

క. ఆ వైకుంఠము నొల్లక
నీవె నేననుచుఁ జాల నెనరెనయఁగ నీ
తావున నుండితి , నెక్కడ
నీవుంటివి ? చూడలేదు నే నిం' దనుచున్. 184

సీ. హరి యపు డడుగఁగా నా వరాహస్వామి
పలికె నిట్లనుచు ' నీ పర్వతమున
వృషభాసురుఁడు చేరి విడివడి శ్యామాక
ధాన్య మెందుండినఁ దా గ్రహించి
కొనిపోవుఁ గనుక నా క్రూరాసురునితోడ
బహుదినంబులు ఘోరభండనంబుఁ
జేయుచునుంటి ; నమ్మాయరాక్షసుఁ డెందుఁ
జిక్కకనే యుండి చిక్కెఁగనుక

తే. వాని శిక్షించి , యిచటికి వచ్చి నిన్నుఁ
జూచితి , నన్నును నీవు నిపుడు
గాంచితివి ; నీకు నాకు సౌఖ్యంబు గలిగె
నిందుచే మోదమొదవె నో యిందిరేశ ! ' 185

ఆ. అని వరాహదేవుఁ డాప్తుఁడై పల్కఁగా
విని ముదంబునొంది విష్ణుఁ డనియె
' నవనిఁ గలియుగాంతమందాఁకఁ ' గిటిదేవ !
నే వసింపఁ జోటు నీవు చూపు. ' 186

సీ. అని చక్రి వలుకఁగా విని వరాహస్వామి
' ఇది యేమి ? ' యని సంశయించి పలికె
' హరి ! విను పేదల కాశఁ బెట్టఁగరాదు
వలనొప్పఁగా బలవంతులకును
తా వీయరా , దైన ద్రవ్య మిచ్చితివేని
కొలిచి నూఱడుగుల కుతల మిచట
నీ కిత్తు ' నని పల్క , నా కంజలోచనుం
డిట్లనె ' లక్ష్మి నన్నెనసియున్న

తే. ధనము నీకిత్తు , నిపుడు శ్రీతరుణి యలిగి
తాను కొల్లాపురముఁ జేరెఁగాన , ధరను
గొనుటకై రూక లెవరి నేఁ గొలిచి తెత్తుఁ ?
బ్రజల యాచించి తిని , యిందుఁ బ్రతుకవలయు. ' 187

చ. అని హరి పల్కఁగా విని మహామహుఁడైన వరాహదేవుఁడి
ట్లనియె ' నిదేటి మాట ? లిపు డర్థమొసంగక భూమి నియ్య ' న
న్నను గిటిఁజూచి మాధవుఁడు నవ్వుచు నిట్లనియెన్ ' ధరాతలం
బొనరఁగ నీ యధీనమగుచున్నది , కొంచెము నా కొసంగవే ! 188

సీ. ఎంతయు నిచ్చిన నంతలో నే నుండి
జీవనోపాయంబుఁ జేయుకొఱకు
నరుని చందంబుగా నటియించి , యిచటికి
నరుల రప్పించి నీ కిరవుగాను
బంచామృతస్నాన మంచితంబుగ దిన
దినము సేయింతు ; నీ తీర్థమందు
మునిఁగి , ముందుగ నీకు మ్రొక్కి కాన్కలొసంగుఁ
డని నియమింతు నా జనులకెల్ల ,

తే. నదియుఁగాకను దొలుత నీ కన్న మిచ్చి
యవల నేను భుజించెద ' ననిన సమ్మ
తించి కిటిదేవుఁ డా వాసుదేవుఁ డచటఁ
గుదుర నూఱడుగుల భూమి కొలిచి యొసఁగె. 189

వ. ఇవ్విధంబున వరాహస్వామి హరి నాదరించి శేషాద్రియందు నిలిపె ; నప్పు డయ్యిరువురి శీర్షంబులందు దేవతలు పుష్పవర్షంబులు గురియించి యనేక ప్రకారంబుల వినుతించి ; రప్పుడు కిటిదేవుండు తనచెంతఁ బాకకారిణియై యున్న వకుళమాలిక నవ్వాసుదేవునిచెంత నుంచి 'యన్నపానౌషధాది సర్వోపచారంబులు సేయుచుండు ' మని నియమించె ; నప్పుడా వకుళమాలిక హరికి శ్యామాకాన్నంబును దేనెయు భోజనంబు పెట్టుచు, గాయంబున కౌషధంబిడుచు నివ్విధంబునఁ బోషింపుచుండ , నంత సంతసించి మున్ను ధేనువత్సరూపంబుల ధరించి పుట్టలోనున్న చక్రికిఁ బాలిచ్చి తృప్తిఁబొందింపుచున్న బ్రహ్మరుద్రు లంతర్ధానంబు నొంది నిజస్థానంబులం జేరి ; రంత శ్రీనివాసుం డా గిరియందు సకలవినోదంబులు సేయుచు భక్తిహీనులకు మోహకుండై , పరమభక్తులకు సకలసిద్ధిప్రదుండై,, రాక్షసులకు భయంకరుండై , దేవతలకువినోదంబుఁ జూపుచు , శిరః స్ఫోటనాయాసవిముక్తుండై , దివ్యసౌందర్య లీలామానుషవిగ్రహుండై

తల్లిచెంత ముద్దులుచూపు బాలకుని విధంబున వకుళమాలికచెంత నటించుచుండె ' నని చెప్పిన విని శౌనకాదులు సూతుం జూచి యిట్లనిరి. 190

## వకుళమాలికా వృత్తాంతము

సీ. 'వకుళమాలిక యెవ్వ ? రకలంకచరిత ! మా
కెఱిఁగింపు'మన సూతుఁ డిట్టులనియె
' శ్రీయశోదాదేవి చిన్నికృష్ణునియందుఁ
బుత్త్రవాత్సల్యంబుఁ బొసఁగ నుంచి
కాలగతినిఁ జెందఁగాఁ దదృణానుబం
ధమును భావించి విధాత వకుళ
మాలిక యనెడి నామము నిచ్చి పుట్టించి
భూవరాహస్వామిపొంత నిలిపె

తే. నప్పు డా కిటిదేవుఁ డా యతివ నొనరఁ
జక్రధరుచెంత నిలుపఁగా , జననికరణి
నాదరించుచుఁ దెచ్చి తా నౌషధంబుఁ
బెట్టి తలగాయమును మాన్పెఁ బ్రేమమీఱ. 191

ఉ. శ్రీరమణీవిభుం డవల శేషగిరీంద్రముమీఁద నిల్చి వి
స్తారముగా వినోదముల సల్పుచు నొప్పుచునుండి , పూర్ణశృం
గార విశేషలీలల సుఖస్థితి నొప్పిన రాజకన్య నం
దారసి పెండ్లియాడె సురలందఱు మెచ్చఁగ ' నంచుఁ బల్కినన్. 192

సీ. విని మౌను లా సూతు నొనరంగ నీక్షించి
పలికి రిట్లని ' రమాపతికిఁ దగిన
కన్యకామణి యెందుఁ గలిగె ? దానికిఁ దల్లి
దండ్రులు నన్నలు దమ్ము లెవరు ?

నీ వా విధములన్ని సావధానంబుగాఁ
జెప్పు మా కిపుడు మచ్చిక ' నటంచు
నడుగఁగా సూతుఁడిట్లనె ' నిర్వదెనిమిదో
ద్వాపరాంతమున భూతలమునందు

తే. వెలయు కలియాదియం దొప్ప విక్రమార్క
ముఖ్యరాజులు జనియించి ముదముమీఱ
భూమి నొనరఁగఁ బాలించి పోయి , స్వర్గ
లోకమునఁ జేరి రొనర భూలోకమణులు. 193

## ఆకాశరాజు వృత్తాంతము

వ. తదనంతరంబునఁ జంద్రకులజపాండవదౌహిత్రవంశంబునందు సువీరుండను రాజుదయించి భూమినిఁ బాలించుచుండి , సుధర్ముండను పుత్త్రుం గాంచి కొంతకాలంబున కతనికిఁ బట్టంబుఁ గట్టి సద్గతింబొందె ; నంత సుధర్ముండు భూమిఁ బాలించుచుండె,నట్టికాలంబున మున్ను వేంకటాద్రికి వచ్చి పాపవిముక్తుఁడై బ్రహ్మచేత వరంబులఁ బడసిన మాధవనామధేయ బ్రాహ్మణుండు తత్పర్వతారోహణంబుచేసి స్వామి పుష్కరిణిలోఁ గ్రుంకు లిడుచు వరాహస్వామి సాన్నిధ్యంబునఁ దపంబుఁ జేసి యచ్చట శరీరంబు విడిచి , సుధర్మరాజునకు జ్యేష్ఠపుత్రుండై పుట్టి యాకాశరాజనఁ బ్రసిద్ధుండై యుండెఁ ; బూర్వం బా మాధవాఖ్య విప్రుని భార్యయైన చంద్రరేఖ పతిస్మరణంబుఁ జేయుచుఁ దద్దేహంబు విడిచి క్రమ్మఱ జనించి ధరణీదేవి యనుపేర నొప్పుచుండఁగా సుధర్ముఁ డాకాశరాజున కా ధరణీదేవిని వివాహంబుఁ జేసె ' నని చెప్పి సూతుండు మఱియు నిట్లనియె. 194

సీ. 'తక్కక యవలసుధర్మరా జొక్కనాఁ
డడవిలోపల వేఁటలాడి బడలి
యచ్చట నొక పంకజాకరంబున కేఁగి
సుకుమార నాగకన్యకను జూచి
మోహించి బహువిధముల దానిఁ బ్రార్థింప ,
నది యొడంబడక యిట్లనియె ' రాజ !
నీవు మానవుఁడవు , నే నాగకన్యకన్
గాన దాంపత్యమే కరణి నమరుఁ ?
తే. బొమ్ము నీ త్రోవ ' నని పల్కి పోవ , దాని
వీడఁజాలక మఱిమఱి వెంట నంటి
చాల వేఁడఁగ , నా కన్య జాలి నొంది
యవలఁ బోలేక ' నీ వెవ్వఁ ? ' డనఁగ నృపతి. 195

క. తన కులమును గోత్రము పే
రును దాఁ బ్రభువగుటయును నిరూఢిగఁ దెలుపన్
విని యా నాగకులాంగన
మనుజేశ్వరు మోముఁ జూచి మఱి యిట్లనియెన్. 196

సీ. 'భూనాథ ! నను నీవు పొందినఁ బుత్త్రకుం
డురగలోకంబునం దుదితుఁడగును
తన తండ్రి యెవ్వఁ డన్నను వాని కప్పుడే
మని చెప్పవలయునో జనవరేణ్య ! '
యనఁగ సుధర్ముఁ డిట్లనియె ' నీకు సుతుండు
గలిగి , నన్నడిగిన కాలమందు
నా పేరు చెప్పి నిర్ణయముగాఁ బంపింపు
మే నర్ధరాజ్యంబు నిచ్చి ప్రోతు '

తే. ననుచుఁ దన ముద్దుటుంగర మానవాలు
గా ముదంబున నా నాగకన్య చేతి
కిచ్చి , యానందమున దాని నెనసి చొక్కి
' పొమ్ము నీ ' వని యట రాజు పురముఁ జేరె. 197

తే. పట్టుగా నాగకన్య గర్భము ధరించి
నాగలోకంబునకుఁ బోయినను ఫణీంద్రుఁ
డా విధము తాను దెలిసి యేమనక , కార
ణంబు భావించి మది సంతసంబు నొందె. 198

క. ఆ కన్యక కందరుదుగ
శ్రీకరుఁడగు చక్రవర్తి చిహ్నంబులతోఁ
బ్రాకట శుభలగ్నంబున
జోకగ భుజగంబు లలర సుతుఁ డుదయించెన్. 199

తే. పూఁట పూఁటకుఁ దగు వృద్ధిఁబొంది బాలుఁ
' డమ్మ ! మా తండ్రి యెవ్వఁ ' డటంచు నడుగ
నాగకన్యక విని లోన నగుచుఁ దనయు
నెత్తి ముద్దాడి లాలించి యిట్టులనియె. 200

తే. 'తనయ ! నీ జనకుండు సుధర్మరాజు
ధారుణీతలమును బ్రసిద్ధంబుగాను
బాలనముసేయు , నటకు నిర్భయుఁడవగుచుఁ
బోవలసియున్న సుఖముగాఁ బొమ్ము పుత్త్ర ! 201

ఉ. అచ్చట నర్ధరాజ్యము మహాముదమొప్పఁగ నా ఘనుండు నీ
కిచ్చును , ధర్మపద్ధతిగ నేలుము , నన్నుఁ దలంపుచుండు మిం
కిచ్చటఁ గార్యమేమి ? యటకేఁగి సుఖంబున నుండు ; ' మంచు బల్
మచ్చికమీఱఁ జెప్పి , చనుమార్గము తేటగఁ జూపె సమ్మతిన్. 202

వ. అప్పు డబ్బాలకుండు మాతామహుండైన నాగరాజు మొదలుగాఁగల భుజంగంబులకు మ్రొక్కి దీవనలంది , తన తల్లికి దండప్రణామంబుఁ జేసి వీడ్కొని పాతాళబిలమార్గంబున వచ్చుచుండఁగా , నతని జనని పుత్త్రవాత్సల్యంబుచేత నబ్బాలకుం దోడ్కొనివచ్చి భూమిపైఁ జేర్చి , మున్ను సుధర్మరాజు తన చేతి కిచ్చియున్న ముద్దుటుంగరం బక్కుమారుని చేతికిచ్చిన , నతండు వ్రేలందొడిగి తల్లికిఁ బునఃపునఃప్రణామంబులు చేసిన, నది ' దీర్ఘాయుష్మంతుఁడవై , హరి భక్తుఁడవై , చక్రవర్తివై వృద్ధిఁబొందు ' మని దీవించి, శిరంబు నిమిరి , చెక్కిలి ముద్దుగొని వీడ్కొల్పి , తాను జాలినొందుచుఁ బాతాళలోకంబున కరిగె. బాలకుండు నారాయణవర పురంబుఁ జేరి సుధర్మరాజు సమీపంబునకుఁ బోయి మ్రొక్కఁగా , నయ్యర్భకుఁ జూచి నృపాలుం డిట్లనియె. 203

సీ. 'ముద్దు బాలక ! నాకు మ్రొక్కి నిల్చితివి , నీ
వెవఁడవు ? తలిదండ్రు లెవ్వ ? ' రనుచు
నడుగఁగా డింభకుం డళు కింత లేక ' యో
నరనాథ ! నాతల్లి నాగకన్య
తండ్రి సుధర్మభూధవు ' డని నిష్కర్ష
గాఁ జెప్పి ముద్దుటుంగరముఁ జూపె
నా ముద్రికను జూచి యతఁడు మంత్రిపురోహి
తాత్మజ బంధుమిత్రాదులకును

తే. నందనునిఁ జూపి , మునుఁ దాను నాగకన్య
నెనసి యుంగరమిచ్చి వచ్చిన విధంబు
లన్నియును దెల్పి , తన పుత్త్రు నాదరించి
ప్రేమతోఁ దొండమానుఁడన్ పేరు పెట్టె. 204

వ. తదనంతరం బా తొండమానునకు నుపనయన,వివాహంబులు చేసి , యప్పుత్త్రుల నిరువురంజూచి సంతసించుచుండి , కొంతకాలంబున కాకాశరాజునకుఁ బట్టంబుగట్టి , తొండమానుని యువరాజుఁజేసి సుధర్మ భూపాలుండు ముక్తిం బొందె ; నంత గగన నృపాలుండును దొండమానుండును భిన్నోదరులై యుండియు నేకోదరుల చందంబున నత్యంతమైత్రిగలవారై , నారాయణపరాయణులై , సుజ్ఞానయుక్తులయి యుండి ; రందు జ్యేష్ఠుండగు నాకాశరాజు తనకు సంతతిలేక చింతించి యొక్కనాఁడు బృహస్పతికి నమస్కరించి యిట్లనియె. 205

సీ. 'సద్గురువర ! నాకు సంతానలాభంబు
గలుగకుండుట కేమి కర్మములను
జేసితి నా రీతిఁ జెప్పుఁ ' డన్నను మహీ
పతి కిట్లులనియె గీష్పతి ముదమున
' నీవు పాపములెన్ని గావించియుండినఁ
బరిహారమగుట కుపాయ మొకటి
చెప్పెద నెట్లన్నఁ జిరభక్తితోఁ బుత్త్ర
కామేష్టిఁ గావింపు క్రమముగాను

తే. సుతులు పుట్టెద'రని చాల హితముమీఱఁ
బలుకఁగా , విని మ్రొక్కి భూపాలుఁ డచటఁ
జెలఁగి యజ్ఞ ప్రయత్నముల్ చేసి , కనక
హలముతో భూమి దున్నించె నాఢ్యుఁడగుచు. 206

## పద్మావతి యుదయించుట

చ. అటువలె భూమి దున్నఁగ సహస్రదళంబులు గల్గి యొప్పు వి
స్ఫుటతరపద్మ , మందుఁ బొడసూపినఁ , జూచి నృపాలకుండు ' నేఁ
డిటువలె నబ్జ మీ దరణి నెట్ల జనించె ? ' నటంచుఁ జూడఁ , ద
త్స్ఫుటుతర కంజమధ్యమున బాలిక గన్పడె నద్భుతంబుగన్. 207

ఉ. అప్పుడు దానిఁ జూచి నృపుఁ డార్యులనెల్లను బిల్చి , భక్తితో
నొప్పుగఁ బద్మమధ్యమున నుండెడి కన్యను వారి కేర్పడన్
తప్పక చూపుచుండఁగ , ముదంబున నం దశరీరి యిట్లనెన్
' మెప్పుగ దీనిఁ బెంపుమిఁక మేలు ఘటించును నీకు భూవరా ! ' 208

చ. అని యశరీరి వల్కఁగ , మహాద్భుతమంది నృపాలకుండు మె
ల్లనఁ గమలస్థకన్యకను లాలనచేయుచు గారవించుచున్
జని , తన మందిరంబునకు సంతసమొప్పఁగఁ బోయి భార్య కం
దొనరఁగ బిడ్డ నిచ్చి , బహుళోత్సవముల్ నడిపించి యిట్లనెన్. 209

తే. 'విను మయోనిజయైనట్టి తనయ నిపుడు
నీకు దేవుఁడు దయ నిచ్చె నెనరుగాను
సంతసించుచుఁ బోషింపు చంద్రవదన ! '
యనిన ముదమొంది మెచ్చె నయ్యతివ సుతను. 210

క. తద్దయు నది తలిదండ్రులు
ముద్దునఁ దగఁ బెంచుచున్న మురిపములారన్
ముద్దులు సూపుచు , జిలిబిలి
సుద్దులు సెప్పుచును వేడ్కఁ జూపుచునుండెన్. 211

సీ. ఆ కన్య తమ యింటి కరుదుగా వచ్చిన
ఘన లక్షణమున నాకాశరాజు
భార్య గర్భముఁ దాల్చె , నార్యులెల్లను మెచ్చ
నైదవనెలను శుభావహముగ
సీమంత మారాజు సేయించె ; నటమీఁదఁ
బొలుపొంది నవమాస పూర్తిగలిగె
దశమమాసంబునఁ దరణి కన్యారాశి
యందుఁ బ్రవేశించినపుడు శుక్ల

పక్ష దశమియు , రోహిణి , ప్రకట శుక్ర
వారమును గూడినటువంటి వరదినంబు
నాఁటి సంధ్యను గగనభూనాయకునకు
నందనుఁడు పుట్టె లోకు లానందమొంద. 212

వ. అప్పు డా రాజేంద్రుండు సంతోషమగ్నుండై స్నానంబుఁజేసి , యనేక బ్రాహ్మణులకు నవధాన్యంబులను , ధనంబును , సహస్ర ధేనువులను , బదివేల తురంగంబులను , ఛత్ర చామరాది సకల వస్తువులను శాస్త్ర ప్రకారంబుగా దానంబుఁ జేసి నిజగురుపూజ గావించి , తదనంతరంబున సుతునకు వసుదానుండను నామంబిడి , సుతకుఁ బద్మావతియను పేరుఁ బెట్టి యనేక సహస్ర బ్రాహ్మణ భోజనంబుఁ జేయించి , పుత్త్రుని , పుత్త్రికను గారవించి పోషించుచుండఁగా , దినదినప్రవర్ధమానులై క్షీరసాగరరాజ మందిరమధ్యంబున లక్ష్మియుఁ , జంద్రుండును బ్రకాశించుచందంబున నాకాశరాజుగృహమధ్యంబునఁ బద్మావతియును , వసుదానుండును వెలుంగుచుండి ; రంత నా నృపాలకుండు కొన్నియబ్దంబుల కయ్యిరువురకు సకల విద్యాభ్యాసంబుఁజేయించుచుఁ గుమారున కుపనయనంబుఁజేసి ' పద్మావతికిఁ దగిన విభుండు కలుగునే ? ' యని చింతించుచు గురునకు నమస్కరించి యిట్లనియె. 213

సీ. 'పుణ్యాత్మ ! గురుచంద్ర ! పుత్త్రకామేష్టి మీ
యనుమతితోఁ జేతుననుచు నేను
వసుధ దున్నింప నవ్వసుమతిలోఁ బద
మరుదుగాఁ బుట్టె , నయ్యబ్జమందుఁ
బాలిక దొరకఁగాఁ బద్మావతీనామ
ధేయంబు నిడితిరి దీపితముగ ,
నటువంటి భామిని కనురూపుఁడైనట్టి
పురుషుఁడు దొరకునే భూతలమున ? '

ననుచు నా రాజు చింతింప నపుడు గురుఁడు
పలికె నిట్లని ' నృపతి ! నీపట్టి కిలను
దగిన పురుషుఁడె కల్గు సిద్ధంబుగాను
సంతసించుచు నుండు మో జనవరేణ్య ! ' 214

మ. అని యా దేశికుఁ డానతిచ్చి చనె ; నం దారాజు పద్మావతిన్
గని సంతోషనిమగ్నుఁడై మురియుచున్ , గారాముగాఁ బెంచుచున్
ఘన దివ్యాంబర భూషణావళులు శృంగారించి ముద్దిచ్చి , య
త్తనయన్ సూనునిఁ జూచి చూచి మదిలోఁ దానెప్పుడుప్పొంగుచున్. 215

క. తనుఁ బుణ్యాత్మకుఁడనుచును
మనుజులు గొనియాడ నతఁడు మహి ధర్మముగా
మనమలరఁగ నేలుచు , నిజ
వనితామణితోడ సౌఖ్యవనధిం దేలెన్. 216

సీ. అపుడు పద్మావతి నానందముగఁ బెండ్లి
యాడెదనని వేంకటాద్రి విభుఁడు
భావించుచుండఁగా బద్మావతికి నవ
యౌవనకాలంబు నవతరించె
నంతలోపలన వసంతకాలము వచ్చె
శృంగార వనములు చిగురులెత్తెఁ
గోరకంబులతోడఁ గుసుమముల్ వికసించెఁ
దగిన శలాటుబృందములు వొడమె

తే. నంతలోనె ఫలింపఁగా , నచట నచట
గుములుగాఁ గూడి కోవెలల్ గూయసాఁగె
నతిశయించుచు నళులు ఝుంకృతు లొనర్చెఁ
గలికిచిలుకలు నుప్పొంగి పలుకసాగె. 217

సీ. చిగురుటాకులు మెక్కి చెలరేఁగు పికములు
మేలు పూఁదేనియల్ గ్రోలు నళులు
పరిపక్వ ఫలములఁ గొఱుకు కీరము , లబ్జ
నాళముల్ మెక్కు మరాళములును
నందగింపఁగ సదానందకరంబులై
వలనొప్పు శృంగారవనము లన్ని
మెఱయఁ , బద్మావతి మేడపై నుండి యా
సుమవనంబులనెల్లఁ జూచి చూచి

తే. వనవిహారము తాఁ జేయవలయుననుచుఁ
జెలులతో ముచ్చటాడి , మచ్చికలు చేసి
మేడ దిగివచ్చి తల్లి సమీపమందుఁ
జేరి యిట్లని పలికె నా చిగురుఁబోఁడి. 218

తే. 'జనని ! శృంగారవనము లాశ్చర్యముగను
గనకసౌధంబుమీఁదికిఁ గానుపించెఁ
గానఁ జెలులును నేను నక్కడికిఁ బోయి
తెచ్చెదము నీకుఁ బుష్పము లెచ్చుగాను. ' 219

చ. అన విని తల్లి యిట్లనియె ' నమ్మ ! సుమంబుల కీవు వోయినన్
గని జనులెల్ల నవ్వెదరుగాన , వనంబుల కేను నిన్నుఁ బం
పను ; చెలికత్తెలం బనుపు భాసురపుష్పము లింటి కిప్పుడే
ఘనముగఁ దెచ్చి యిచ్చెదరుగాని ' యటన్నఁ జలంబుసేయుచున్.220

క. రంతులు సేయుచు బాలిక
గంతులు వేయుచు , భుజింపకయ పానుపుపైఁ
జింతించుచుఁ బవళింపఁగ
నంతటఁ దనసుతను బిలిచి యాదరమొప్పన్. 221

## పద్మావతీదేవి వన విహారము

వ. అక్కుందరరదన మందస్మితవదనారవిందయై యా సుందరిని బుజ్జగించి యిట్లనియె. 222

సీ. 'వనమున కీవు వోవలదన్న నలిగితి
వైన మంచిది లెమ్మ ! ' యనుచు లేపి
చెలులను , బ్రాహ్మణ స్త్రీలను బిలిపించి
తొలఁగనీయక సుతతోడఁగూర్చి
చలిది కావళ్లను , సకల వస్తువులను
జెలుల కందిచ్చి , యందలములోనఁ
దనసుత నుంచి మోదంబుతో నంపఁగ
నయ్యింతి వనమున కరిగి , యచట

తే. రమ్యతరమైన కమలాకరంబుచెంత
నందలము డిగ్గి లేచి యందందుఁ దిరిగి
విరులు గోసెదనని చాల వేడ్క నొంది
వనవిహారముఁ జేసె నవ్వారిగాను. 223

వ. అవ్విధం బెట్లన్నను 224

సీ. చెలఁగి పువ్వులు గోసి చెలులపైఁ బడవేసి
కిలకిల నవ్వు నా కీరవాణి
మాటిమాటికిఁ గోసి మధుర ఫలంబులు
చెలుల కందిచ్చు నా చిగురుఁబోఁడి
లాలించి బేలించి నీలకంఠములతో
మేలంబులాడు నా నీలవేణి
రాయంచగమివలె నాయెడ నటియించి
సారెకు సోలు నా జలజపాణి

తే. కోరి కోవెలలట్లు దాఁ గూజితంబుఁ
జేసి చొక్కుచుఁ , బలుమాఱు చిలుకగముల
సరణిఁ బల్కుచు , భృంగినీచయమురీతి
గాన మొనరించు నందందు మీననయన. 225

క. మొల్లలు , పొన్నలు , పొగడలు
మల్లెలు , సంపంగి విరులు , మందారములున్
గొల్లలుగాఁ గోయుచు నం
దుల్లాసముమీఱ రాసు లుర్విన్ నించున్. 226

క. ఒయ్యారంబున నడచుచు
గయ్యాళించుచును , బుష్పఘనతరలతలన్
జయ్యన నొంచుచు , మురియుచు
నుయ్యాలలు చెలులతోడ నూఁగుచునుండున్. 227

క. వింతగ మోదుగుపూల వ
సంతముఁ జేయించి , చెలుల జతగూర్చుచు బల్
దంతపుఁ జిమ్మనగ్రోవులఁ
బంతంబునఁ జిమ్మి చిమ్మి పకపక నవ్వున్. 228

క. మెప్పుగ ధరపై రాలిన
పుప్పొడిఁ దెప్పించి , మించి పొలఁతులమీఁదన్
గుప్పుచు , రొప్పుచు , సుద్దులు
సెప్పుచుఁ గమలాకరంబుఁ జేరుచు వేడ్కన్. 229

తే. చెలఁగుచును విప్రసతులతోఁ , జెలులతోడ
వేడుకలు మీఱఁగా జలక్రీడ లాడి
తీరమునఁ జేరి యందఱిఁ జేరఁ బిలిచి
చీర లిప్పించె ; నటమీఁదఁ జెలియలెల్ల. 230

సీ. తరుణికి మృదుల వస్త్రంబుతోఁ దడియొత్తి
పట్టుపావడ మొలఁ గట్టె నొకతె
చలువైన వలిపెంపు సరిగపూవులచీర
పట్టుపావడమీఁదఁ జుట్టె నొకతె
మొలనూలు వడ్డాణమును దనుమధ్యమం
దంచితంబుగను బంధించె నొకతె
కొమరొప్పఁగా జంటగోటుచే నమరు చం
దురుకావి రవికఁ దాఁ దొడిగె నొకతె

తే. భాసురములైన నూతనాభరణములను
మొనసి సర్వాంగముల నుంచి మురిసె నొకతె
కుప్పె రేకణి , మొగలిరేకులను గూర్చి
పూసరులు చుట్టుచును జడవేసె నొకతె. 231

సీ. తిలకంబు నుదుటిపై దిద్ది , వాల్గన్నులఁ
దీరుగాఁ గాటుకఁ దీర్చె నొకతె
పరిమళగంధ మా బాలికామణి మేన
నానందకరముగా నలఁదె నొకతె
దిక్కుల వాసనల్ పిక్కటిల్లఁగ మల్లె
విరుల వీవనలతో విసరె నొకతె
గద్దెపై నపుడున్న కన్యముందఱఁ దేట
నిలువుటద్దముఁ దెచ్చి నిలిపె నొకతె

తే. సకియ కిటువలె సర్వోపచారములను
జెలులు చేయఁగ , బ్రాహ్మణస్త్రీలకెల్లఁ
బసుపు , [redacted]ుమ . విరిసరుల్ , ఫలము లొసర
మొనయు భక్తిని నర్పించి మ్రొక్కఁ గన్య. 232

వ. అప్పు డా సువాసిను లా పద్మావతిని దీవించి ; రచ్చటఁ దనతల్లి పంపించిన పంచభక్ష్య పరమాన్నంబు లందఱికి భుజియింపంబెట్టించి , తాను భుజియించి లేచి కరంబులు గడిగికొని వచ్చి , యా విలాసవతి శృంగారవనమధ్యంబునఁ జెలులు నిర్మించియున్న విరులపానుపుమీఁదఁ గూర్చుండి యందఱికి విడియంబు లిప్పించి , తాను విడియంబుఁ జేయుచున్న సమయంబున. 233

## పద్మావతితో నారదు[?]ఁడు భాషించుట

క. ఆ వనమున కద్భుతముగ
దేవమునీంద్రుండు రాఁగ , దిగులొంది చెలుల్
' నీ వెవ్వఁ ' డనఁగ మునివరుఁ
డా వెలఁదుల కిట్టులనియె నాదరమొప్పన్. 234

క. 'పరుఁడనుగా , నీ నృపతికి
గురుఁడను నే ' ననఁగ లేచి గురుతరభక్తిన్
సరగునఁ బద్మావతి యా
స్తరణము ముని కిచ్చి మ్రొక్కెఁ , దాపసుఁ డంతన్. 235

తే. 'వనజలోచన ! నీకు వివాహసిద్ధి
వేగఁ గల్గు ' నటంచు దీవింప , రాజ
కన్యకామణి సంతోషకలితయగుచు
నొదిఁగి సిగ్గున మాట్లాడకున్నఁ జూచి. 236

సీ. అమ్ముని పల్కె ' నో యమ్మ ! నా మీఁద నీ
కఱమఱ వలదు ర ' మ్మనుచుఁ బిలిచి
కూర్చుండ నియమించి కుస్తరించుచు , ' హస్త
మంది'మ్మనంగ ! నయ్యబ్జవదన

పలికె నిట్లని ' మునిప్రవర ! నా తండ్రివి
యరసి చూడిపుడు నా హస్త'మనుచుఁ
జేసాచి చూపఁగాఁ జిఱునవ్వు నగుచు న
త్రపసి యా కొమ్మ హస్తంబుఁ బట్టి

తే. కరుణ నిట్లని పలికె ' నీ కరమునందు
ఘనసులక్షణవిమల రేఖలు జనించి
యున్నవివి తేటగా విను గన్నతల్లి !
చెప్పి చూపెద'నని మునిశ్రేష్ఠుఁ డనియె. 237

తే. 'స్వస్తికము పద్మమును ఛత్ర చామరములు
యవ కులిశ రేఖలాదిగా నఖిల శుభద
రేఖ లున్నవి చూడు మీ రీతు'లనుచుఁ
జెప్పి , వేర్వేఱ సతికి మచ్చికనుజూపి. 238

తే. మరల నిట్లనెఁ ' గిసలయ మార్దవంబు
గలిగియుండెడి నీ వామకరమునందుఁ
గాంతి నొప్పుచు ఘనసుమాంగల్యరేఖ
మెఱయుచున్నది చూడుమో మీననయన ! 239

క. ఈ రేఖా బలమున శ్రీ
నారాయణదేవుఁ డింక నాయకుఁడగు , నీ
కోరిక ఫలియించును ; నీ
వా రమవలె సంతసమున నలరుము 240

సీ. అనుచుఁ బద్మావతి కమ్ముని సర్వాంగ
సౌందర్య కలితలక్షణములన్ని
గుఱుతుగాఁ జెప్పి వీడ్కొని చనె ; నాదినం
బంబుజాక్షుఁడు వేంకటాద్రిమీఁద

నుదయ కాలంబునం దొనరఁగా భుజియించి
కడువేడ్కఁ బసిఁడిచల్లడముఁ దొడిగి
కొనలందు ముత్యాల కుచ్చు లొప్పిన దట్టి
ముద్దు గుల్కఁగ నడుమున బిగించి

తే. కురులు సవరించి విరులతోఁ గొండె గట్టి
మేలు చందురుగావి రుమాలఁ జుట్టి
సరిగె కమ్ముల శుభ్రవస్త్రంబు వల్లె
వాటుగా వేసి భూషణావళులు దాల్చి. 241

క. తిరుమణి తిరుచూర్ణము తగ
మెఱయ లలాటమునఁ దీర్చి , మెచ్చగు గందం
బురమున నలఁది , యెపుడు బం
గరు జన్నిద మఱుత వెలుఁగఁగా ముదమొప్పన్. 242

గీ. కనకమయమైన సున్నపుకాయ , వక్క
లాకులును బట్టు వస్త్రమం దమరఁగట్టి
కక్షమందుంచి కోదండ కాండములను
జూచి చేపట్టె , నంతలోఁ జోద్యముగను. 243

## శ్రీనివాసుఁడు వేఁట కేఁగుట

సీ. దైవయోగంబునఁ దనసమీపంబున
కురుతరజవనాశ్వ మొకటి వచ్చి
నిలిచిన , దానిపై నీరజాక్షుండెక్కి
చని వనగిరులందు సంచరించి
సారంగ భల్లూక చమరీ శరభ సింహ
శార్దుల ముఖ మృగ సంఘములను
వేఁటాడుచుండె ; నావేళ నందొక మద
కరి శౌరి నెదిరించె గహనమందు

తే. హరి యపుడు దాని సమయింప నరుగ , గజము
పర్వతము డిగ్గి యుఱుక , వెంబడినిఁజక్రి
తఱుమఁగా నది యోజనార్ధంబు వోయి
చెలఁగి పద్మావతీదేవి మెలఁగు వనము. 244

తే. చెంగటనె చేరి ఘీంకృతిఁ జేయఁ జూచి
చెలఁగి పద్మావతీదేవి చెంతనున్న
చెలులు భీతిల్లి చెట్లచాటులను డాఁగి
పరఁగ నొండొరులను బిల్చి పలికి రిట్లు. 245

సీ. 'అతివలారా ! చూడుఁ డద్భుతంబుగ నాము
టేనుఁగు వచ్చె నింకెట్టులమ్మ !
కన్నులు దెఱచి చక్కఁగ దానిఁ జూడక
తలలు నేలకు వంచి తలఁగరమ్మ !
నడుమఁ బద్మావతి నిడికొంచుఁ జుట్టును
నెరసి తలంగక నిలువరమ్మ !
మన కెట్టులైన సమ్మతమె , పద్మావతి
మెలఁపుగా రక్షింపవలయునమ్మ ! '

తే. యనుచుఁ జూచుచునుండఁగా నంతలోన
ఘనతరంబైన గుఱ్ఱంబు గానవచ్చెఁ
దురగమును జూడ దానిపైఁ బురుషుఁ డొకఁడు
నెదుట నిల్చెను ; సతులెల్ల బెదరి చూడ. 246

వ. అంత నద్దంతి తననుఁ దఱుమవచ్చిన హరినిఁ జూచి మఱి యుఱుక వెరవు దోఁపక , తిరిగి కరంబు పైకెత్తి దండప్రణామంబు గావించినన్ జూచి కరుణించి యా చక్రి తఱుమక నిలిచె నంత. 247

క. హరి తను మన్నింపఁగ నా
కరివరుఁ డటుపోయి విపుల గహనంబులలోఁ
జొరఁబడె , నంతట నిచ్చట
సరసిజనాభుండు పొదల చాటున డాఁగెన్. 248

వ. అంత నవ్వనంబునందుండి చూచుచున్న కాంత లా దంతిని , హయంబును, దత్తురంగారూఢుండైన పురుషునిం గానక వెఱఁగుపడి తమలోఁ దా మిట్లనిరి. 249

సీ. 'అక్కలారా ! చూడ నిక్కడ గజ తురం
గములు పూరుషుఁడుండెఁ , గానమిపుడు
మాయగా నున్నది మహిమ యే ! ' మనువారు
' నది వట్టి కల్ల పొ'మ్మనెడువారు
' భ్రాంతిఁబొందితి'మంచుఁ బకపక నగువారు
' కలఁ గంటిమో ? ' యని పలుకువారు
' సొలసి నిద్దురవోక కలరా ' దనెడివారు
' నహహ ! యీ చిత్రమే ! ' మనెడువారు

తే. నంద అన్నివిధంబుల ననఁగ , నవ్వి
చెలఁగి పద్మావతీదేవి చెలులఁ బిలిచి
యొనర నెప్పటివలెనె గూర్చుండి జోడు
చేడెలనుగూడి చదరంగ మాడుచుండె. 250

సీ. శృంగారవని నిట్లు చెలులతోఁ జదరంగ
మాడు పద్మావతి నద్భుతముగఁ
గాంచి తద్రూపరేఖా విలాసములన్ని
పొదలమాటునఁ జూచి పొసఁగఁ జక్రి

తన మదిలోఁ దానె తలఁచె నిట్టులను ' నీ
తరళలోచన చక్కఁదనము చూడ
రతికన్న విమల భారతికన్న మఱియుఁ బా
ర్వతికన్న శ్రీరమావనితకన్న

తే. నతిశయించిన యందంపు సతిగదా ! యి
దెట్లు ననుఁ జూచి మోహించు నిపు ? ' డటంచుఁ
దలఁచి , యా యింతి యవయవములను జాలఁ
బొందుగాఁ జూచి మదిలోనఁ బొగడె నిట్లు. 251

సీ. 'పాద జంఘోరువుల్ పల్లవ కాహళ
కరికరంబుల భంగపఱచి మించుఁ
గటి మధ్య కుచయుగ్మ గౌరవంబులు చక్ర
మృగప కందుకముల నొగి హరించు
హస్త కంఠ మనోహరాననంబులు కంజ
కంబు సోములను దక్కక జయించు
భాసురాధర దంత నాసిక లా బింబ
ఫల కుంద తిలపుష్పముల హసించు

తే. నింత చక్కని లలితాంగి నెచట మున్ను
చూడలే , దీ వనంబులోఁ జూచినాఁడ
నిట్టి సుందరి నజుఁడు తా నెట్లు దీర్చె ! '
ననుచు మెచ్చుచు మఱియు నిట్లని తలంచె. 252

సీ. 'కర్ణ నేత్ర భ్రూయుగములు శ్రీకారాబ్జ
పత్ర కందర్పచాపములఁ గెల్చుఁ
గాంతి సౌరభ నీలకుంతలంబులు హేమ
పాటల బంభరప్రభల నడఁచు

గమన భాషణ నిరీక్షణములు కలహంస
కలకంఠ మదనాస్త్రముల నదల్చు
క్షాంతి సుస్మిత గానసరణు లిలా కౌము
దీ వీణలను జాల ధిక్కరించు

తే. నహహ ! యీ కాంతరూపంబు నవనిమీఁద
హాటకము మెత్తఁగా దంచి యమృతరసముఁ
బోసి మెదిచి మహాద్భుతంబుగ నజుండు
నేను మెచ్చుటకై దీర్చి నిలిపెనేమొ ? 253

క. అటుగాకుండిన నిజముగ
నిటువంటి శరీరకాంతు లింతుల కిలలో
నెటు గల్గును ? కల్గవు ; వి
స్ఫుట తపమిది చేసియున్న పుణ్యముచేతన్. 254

సీ. కమలాసనుఁడు సర్వకాంతిపుంజంబుతో
నతులిత సౌందర్యవతినిఁ దీరి
కమలమం దిడఁగ , నాకాశరాజున కిది
నా కొఱకై చిక్కినది నిజముగఁ
గావున , దీని శీఘ్రంబుగా నేఁ బెండ్లి
యాడెద ' నని మోహ మగ్గలింప
నంతఁ బద్మావతి చెంతకు మెల్లఁగాఁ
బోవుచు నందందుఁ బూలు గోసి

తే. 'పొలఁతి ! నీకిటు తలఁబ్రాలు పోతు ' ననెడి
సైఁగగాఁ బుష్పములు వెదఁజల్లుకొనుచు
సంతసించుచు రాచూలి చెంతఁ జేర ,
నపుడు దద్దిర్లి యా లేమ హరినిఁ జూచి. 255

తే. పసిఁడిచెఱఁగుల రవసెల్ల పైన వేగఁ
బొదువుగాఁ గప్పికొని పూలపొదమఱుఁగున
నిలిచి , యళుకుచు బెళుకుచుఁ జెలులఁ జూచి
చిలుకవలె ముద్దుగులుకుచుఁ బలికె నిట్లు. 256

చ. 'అఱమఱ లేక రాజసుత లాడుచునుండెడి చోటి కీ గతిన్
పరపురుషుండు రాఁ దగదు భామినులార ! భయంబునొంది తొం
దరపడనేల ? రావలదు దవ్వుగఁ బొమ్మనుఁ'డంచు మించి య
త్తరుణి వచింపఁగా నపుడు ధైర్యముతో హరిఁగాంచి రొప్పుచున్. 257

క. ఆ పద్మావతి కడ్డం
బా పొలఁతులు నిలిచి హరికి నగపడకుండన్
వ్యాపింపుచుఁ జలమున నా
శ్రీపతి నీక్షించి చాలఁ జిడిముడి పడుచున్. 258

సీ. పలికి రిట్లని ' రాచపట్టి యిందుండఁగాఁ
బరుఁడ ! నీ కింతైన భయములేక
వచ్చితి విప్పు , డావలఁ బొమ్ము పొ'మ్మని
తఱుమవచ్చినఁ జక్రధరుఁడు నవ్వి
' మీనలోచనలార ! మీ రాజకన్యను
వలచి నే మాటాడ వచ్చినాఁడ
మీకేల నీమాట లాకడఁ బొం'డన్న
నళికి పద్మావతి చెలులనెల్లఁ

తే. బిలిచి ' చుట్టమువలె మీకు బెదరు చూపి
పలుకుచున్నాఁడు శబరుఁ , డీ పాపమేమి ?
వీని బంధువు లెవ్వరో ? వీఁడెవండొ ?
వీని కులగోత్రములు మీరు విశదముగను. 259

తే. అడుగుఁ'డని రాజసుత వల్క నపుడు చెలులు
చక్రధరు దిక్కు దిరిగి ' యో శబర ! నీకుఁ
దల్లిదండ్రులు నెవరు ? గోత్రంబు , కులముఁ
జెప్పు'మని వార లడుగఁగా శ్రీధరుండు. 260

ఉ. వారినిఁ జూచి యిట్లనియె ' వారిజలోచనలార ! యిచ్చటన్
గూరిమి మీఱ నా కులము , గోత్రము చాలుగ నింకఁ జెప్పెదన్
సారెకు రొప్పకన్ నృపుని చక్కని బిడ్డకు నాకు సఖ్యమున్
మీరు ఘటింపఁజేయుఁ ; డిక మీకుఁ బ్రియంబులు నేను చేసెదన్.'261

సీ. అని చక్రి మరల నిట్లనె ' మాకులంబిల
శీతాంశుకులము , వసిష్ఠగోత్ర
మగుఁ దండ్రి వసుదేవుఁ డా దేవకియె తలి
యగు , హలపాణి మా యన్నగారు
లలితురాలైన చెల్లెలు సుభద్రాదేవి
పావనుండైన గాండీవి మఱఁది
ధర్మరాజాదులు తగ బంధుజను ' లన్నఁ ,
దెఱవలు నగుచు ' నీ దేహమెల్ల

తే. నలుపి దే ?'మన్న విష్ణుండు నవ్వి పలికెఁ
' గృష్ణపక్షము నడిరేయిఁ గినిసి కూడి
నపుడు పుట్టితిఁ గనుక దేహంబు నీల
మయ్యె , నందున ననుఁ గృష్ణుఁడనిరి బుధులు. 262

క. నా కుల గోత్రము లిప్పుడు
మీ కెఱిఁగించితిని గనుక , మెం దొడ్డక మీ
రీ కన్య కులము గోత్రము
నా కొనరఁగఁ జెప్పుఁ'డనఁగ నగి చెలులెల్లన్. 263

తే. అనిరి ' చంద్ర కులస్థుండు నత్రిగోత్ర
జనితుఁ డాకాశరాజను జనవిభునకుఁ
బుత్త్రికామణియై పుట్టి భూతలమునఁ
బెరిగి పద్మావతీ సంజ్ఞఁ బరఁగ నమరె. 264

తే. నీటుమీఱఁగఁ దన చిన్ననాఁటనుండి
యొనర మాతోడ నాటాడుచుండు , మాకు
సకలవస్తువు లిప్పించు సఖ్యమెసఁగ
నెపుడు నీసతి కృపను మమ్మేలుచుండు. ' 265

చ. అన విని విష్ణుఁ డిట్లనియె ' నంబుజలోచనలార ! మిమ్మునె
ల్లను గృపనేలుచున్న సువిలాసిని సఖ్యముఁ గోరి విచ్చితిన్
ఘనముగ నన్నుఁ గూడుమని గట్టిగ మీ దొరపట్టి కిప్పుడే
మన మలరంగఁ జెప్పుఁ , డనుమానముఁ జేయకుఁ'డంచుఁ బల్కఁగన్.
266

క. విని పద్మావతి రోషం
బునఁ జెలులం బిలిచి కోపమునఁ దిట్టుచు నా
వనజాక్షునిఁ గనుఁగొని యి
ట్లనియె ' నిషాదేంద్ర ! దూర మరుగుము వేగన్. ' 267

సీ. అనిన విష్ణుం డిట్టు లనియె ' నో లలితాంగి !
నిష్ఠురంబేలనే ! నీకు నాకు
మార్దవంబుగ మంచి మాట లాడుము , నేనుఁ
జెలఁగి కన్యాపేక్షఁ గలిగి యిటకు
వచ్చితి ; నను నీవు వరియించుటకుఁ దగు
పాత్రుఁడనే గాని , పరుఁడఁ గాను
పాత్రదానముసేయు ప్రభువున కిహపర
సౌఖ్యముల్ గలుగు , నీ జనకుఁ డొనర

తే. నేను కామించినప్పుడే నిన్ను నాకు
సమ్మతిగ దానమీఁదగుఁ ; జంద్రవంశ
సంభవుఁడ , నన్యుఁ డనియెడి సంశయంబు
వీడి ననుఁ గూడు'మనఁగ నవ్వేలఁది పలికె. 268

క. 'నీవు నిషాదుఁడవయ్యును
వావిరి ఘనచంద్రకులమువాఁడననుచు నన్
గావలసి పలికినా విపు
డావలఁ బొమ్మెదుట నుండ కతిమూఢాత్మా ! 269

సీ. తగవెఱుంగక తప్పుదారి సుద్దులు సెప్ప
కరుగు , మా తండ్రి నీ వనిన మాట
విన్నను సంకిళ్ల వేయించి కొట్టించు
నంతకుమున్నె నీ వరుగు ' మనిన
హరి యిట్టులనియె ' నాయం దధర్మంబేమి ?
నే బ్రహ్మచారిని నీవు కన్య
వటుగాన నిను వివాహముఁ జేసికొనుట ధ
ర్మమె కాని , యిది యధర్మంబు గాదు

తే. నీవు నాయందు దయయుంచి నిష్ఠురముగఁ
బలుక కిప్పుడె నన్నుఁ జేపట్టు'మనినఁ
గనుబొమలు ముడివెట్టుచుఁ గన్ను లెఱ్ఱఁ
జేసి యా భామ చక్రి నీక్షించి పలికె. 270

క. 'ఓరి ! నిషాదుఁడ ! నీ వీ
క్రూరపు మాటంటివైనఁ గొట్టింపక పో ,
నూరక నీ త్రోవం జను
మాఱడిఁబడనేల? ' యన్న హరి యిట్లనియెన్. 271

క. 'చుట్టపురాల దాన వటంచును
గుట్టుగ నే నిన్ను వేడికొనినందున నన్
గొట్టింపకు మన్యులచేఁ ,
గొట్టిన నను నీవె పట్టి కొట్టుము తరుణీ ! ' 272

సీ. అని చక్రి పలుకఁగా నతివ యిట్లనియె ' నీ
వీ లీల మోదుగుపూలు వేసి
పలుమాఱు నాకుఁ గోపంబుఁబుట్టించెద
విఁక జీవితేచ్ఛ లేదేమొ నీకు
ఛీ ! పొ ' మ్మనఁగ హరి చిఱునవ్వు నగుచు ని
ట్లనె ' జనించినవాఁడు చనుట నిజము
గనుకఁ జింతేమి నిన్ గలిసిన పిమ్మట
జగతి నుండిన మేలె , చనిన మేలె !

తే. రమణి ! నా కందుకై విచారంబు గలదె ?
వినుము తలఁచినపని యైనవెనుక నీవు
పట్టి కొట్టినఁ దిట్టిన భయము లేదు
నీ విపుడు వేగ దయఁజూడు నీరజాక్షి ! ' 273

వ. అనిన విని పద్మావతి యిట్లనియె. 274

క. 'నాకడ నీవిటు ప్రేలుట
యాకాశ నృపాలుఁ డెఱుఁగ , నంతట నిన్నీ
లోకములో మననీఁ డిపు
డా కష్టంబేల దూర మరుగుర ! కుమతీ ! ' 275

వ. అనిన విని హరి యిట్లనియె . 276

సీ. 'పుట్టిన వారెల్లఁ బోవుట నిజమైనఁ
దెఱుఁగుదు , నేను నిన్నెట్లనైన
విడువను , మీ తండ్రి విమల ధర్మాత్ముండు
గాన నన్ బాధింపఁ , డైనఁగాని

బాధింపనే చూడు భయములే ; దైన న
న్నేల బాధించు? నిన్నిచ్చి నాకుఁ
బెండ్లి సేయు'నటంచుఁ బ్రీతితోఁ బలుక న
వ్వనిత యిట్లనెఁ ' గంచి వరదరాజు

తే. వెలయఁ గావేటి రంగఁడు , వేంకటాద్రి
నాయకుం డుండఁగా నీకు నన్ను దాన
మీఁడు మాతండ్రి , నీకేల యిట్టి భ్రాంతి
పో నిషాదుఁడ ! నీ బాల్యబుద్ధి విడిచి. ' 277

వ. అనిన విని చక్రి యిట్లనియె. 278

క. 'పోపొమ్మని మొగమోటం
బీ పట్లను నీకు లేక , పెచ్చుగ నాపైఁ
గోపముఁ జేసితివని నినుఁ
జేపట్టక విడిచిపోను శీతాంశుముఖీ ! ' 279

క. అనఁగాఁ బద్మావతి యి
ట్లనెఁ ' దలిదండ్రులను విడిచి యకటా ! నీ వి
ట్లను రాగభాజనుఁడవై
చననేల ? నిషాద ! పోర ! జాలింబడకన్. ' 280

వ. అనిన విని శౌరి యిట్లనియె. 281

చ. 'విను సతి ! నీవు నా కిటు వివేకముఁ జెప్పితి ; వెంత సెప్పినన్
వనజభవుండు నా నుదుట వ్రాసిన వ్రాతఫలంబు దప్పునే ?
నిను వరియించి , పిమ్మటను నే నెటువోయినఁగాని సేమమే
గనుక , నిజంబుగాను నినుఁ గౌఁగిటఁ జేర్పకపోను మానినీ ! ' 282

**పద్మా**

వ. అని పల్కి యంచునకు వచ్చినం, జూచి పద్మావతి యాగ్రహించి కన్నులెఱ్ఱఁ జేసి ధిక్కరించి, యటు ముఖంబై చని తన చెలులం బిలిచి 'దుర్మార్గుండైన యీ నిషాదునిమీఁద ఱాళ్ళు విసరివేయుం'డని సెలవిచ్చె; నప్పు డప్పొలఁతు లుప్పొంగి తెప్పు తెప్పున ఱాళ్ళందికొని సూటి తప్పనీక తురగారూఢుండైన హరిమీఁదఁ గుప్పలు కుప్పలుగా శిలావృష్టిఁ గురియించి రొప్పుచున్న, నప్పద్మాక్షుండు తప్పుపని వచ్చెనని యుఱుకుచున్న నబ్బోఁటులు వేయు ఱాళ్ళ పోటులు నాట, ఘోటకంబు దాఁటిపోనేరక నేలంబడియె; నంత శ్రీకాంతుండు హయంబును విడిచి విభ్రాంతుండై చింతించుచు రివ్వు రివ్వున ఱాళ్ళవేటులు దప్పించుకొనుచుఁ, దల విరియఁ బోసికొని దశదిశలఁ జూచుచు, నిలువనేరక పరువెత్తుచు నుత్తరాభిముఖుండై వేంకటాచలంబున కెగఁబ్రాకి పోయి తనకు నివాసంబైన వల్మీకంబులోఁ బ్రవేశించి, వకుళమాలిక నిర్మించిన విరులపానుపు మీఁదఁ బ్రళయ కాలంబున మహాజలంబుపై వటపత్రంబుమీఁదఁ బవ్వళించిన పరమ పురుషుని చందంబున శయనించియుండె; నంత నిక్కడ వనమధ్యంబునందున్న చెలులం జూచి పద్మావతి యిట్లనియె. 283

సీ. 'చెలులార! మాతల్లి చెప్పిన మాట నే
వినక నేఁ డీ వనంబునకు వచ్చి
యనుభవించితిఁ గష్ట మమ్మమ్మ! నేఁజెల్ల!
నీ పుష్పవనముల కింక రాను
జాలు, నిచ్చోటను శబరుఁ డాడిన మాట
లిప్పు డమ్మకు మీరు సెప్పవలదు
చెప్పిన మనకెల్ల సిగ్గుపాట్లగు'నంచుఁ
బలికి యందలమెక్కి చెలులతోడఁ

తే. గుసుమ , ఫలములఁ బట్టించికొని రయమునఁ
బోయి మణిమందిరముఁ జేరి పువులు పండ్లు
తల్లి కందిచ్చి , యది తాను మల్లెపూల
పాన్పుపైఁ జాల నలయుచుఁ బవ్వళించె. 284

వ. అని చెప్పిన హరిచర్యలు విని నవ్వి , ‘ తదనంతరంబున హరి యేమి ప్రయత్నంబుఁ జేసె ? ’ నని శౌనకాదు లడిగిన సూతుం డిట్లనియె.285

చ. ‘మునివరులార ! మీ కిపుడు ముచ్చట మీఱఁగ నేనుఁ జెప్పెదన్
వినుఁడు పరాత్పరుండు హరి విష్ణుఁడు మర్త్యునిరీతిఁ గాముకుం
డనఁదగి మోహతాపముల నారటమొందుచుఁ బవ్వళించి , యే
మనక ముసుంగువెట్టికొని యార్తునికైవడిఁ జింతఁజేయుచున్. 286

## హరి విరహతాపంబు నొందుట

తే. వేఁడి నిట్టూర్పు విడుచుచు విమల పాన్పు
పైనిఁ బొరలుచు నిద్రించుపగిది నున్న
వకుళమాలిక యచటికి వచ్చి హరినిఁ
గాంచి యిట్లని పల్కె సత్కరుణ మెఱయ. 287

శా. ‘అన్నా ! వేంకట ! లెమ్ము లెమ్మిపుడు నీ వాకొంటి వాలస్యమే ?
మన్నంబున్ , బరమాన్న భక్ష్యములు నీ కర్పింప నేఁ దెచ్చితిన్
చెన్నొందన్ భుజియించు నీ ’ వనఁగ నా శ్రీస్వామి మాట్లాడకన్
గన్నీరూరక నించుచుండఁగ , రమాకాంతున్ విలోకించుచున్. 288

సీ. వికలత్వమునఁ బొంది వకుళమాలిక యిట్టు
లనియె ‘ నాతండ్రి ! నీ వార్తిఁ బొంది
కనుల నీరిటు నింపఁగాఁ గారణంబేమి ?
యీ రోదనమునకు హేతువేమి ?

పగలు నిద్దురవోవఁ దగదనియెడి నీతి
తెలిసియు నిపుడు నిద్రించుటేమి ?
విపుల.ధైర్యస్థైర్య వితరణంబుల నిందుఁ
బోవీడి దీనతఁ బొందుటేమి ?

తే. లేచి కూర్చుండి నాదిక్కు లెస్సఁ జూచి
నీ మనంబునఁ గల చింత నిశ్చయముగఁ
జెప్పు'మని బుజ్జగింపఁగా శ్రీధరుండు
మాఱువల్కక బుసవెట్టు చూరకుండె. 289

వ. ఇవ్విధంబున మాఱు మాటాడకయున్న హరినిఁ జూచి వకుళమాలిక భీతిల్లి మఱియు నిట్లనియె. 290

చ. 'అడవికి వేఁటఁ బోయి విపులాద్భుత ఘోరమృగాళి నచ్చటన్
బొడఁగని భీతినందితివొ ? భూతము సోఁకెనో ? లేక ఱాళ్ళపై
వడిచెడ జాఱి మ్రొగ్గితివొ ? వాగులలోఁబడి లేచి వచ్చితో ?
కొడుక ! నిజంబుఁ జెప్పుమిఁక గొబ్బున నొక్క చికిత్స చేసెదన్. 291

సీ. పడిలేచినదియే నిబద్ధియైనను మేనఁ
బొసఁగఁ దైలము వేసి పిసుకవలయుఁ
జత్రాతిమీఁదఁ గ్రచ్చుఱ జాఱి మ్రొగ్గినఁ
బొందుగా వేన్నీళ్ళు పోయవలయు
నదిగాక భూతమెందైన సోఁకిన , భూతిఁ
దెప్పునఁబట్టి మంత్రింపవలయు
మృగభీతి హృదయమం గొగి నాటినట్లైన
నెట్టన నడివీపుఁ దట్టవలయు

తే. నిట్టి నాల్గు చికిత్సలం దే చికిత్సఁ
జేతు ? నది నీవు నిజముగాఁ జెప్పకున్నఁ
దెలియునే ? నా మనంబులో దిగులు దీఱ
నున్న దున్నట్లు చెప్పు నన్ గన్న తండ్రి !' 292

తే. అనుచు నాపాదశీర్షపర్యంత మప్పు
డొనర నివురుచుఁ జెమటతో నుష్ణమైన
దేహమందున్న బలుఆాళ్ళ దెబ్బకదుము
లఱఁచి చూచి మహాభీతి నతివ పలికె. 293

సీ. 'ఓ తండ్రి ! నీమేన నుష్ణంపుస్వేదంబు
పొంగుచు నీరీతిఁ బుట్టుటేమి ?
మృదుశరీరమునందు మెండుగా ఆాళ్ళ దె
బ్బలు నాటియున్న వీ పాపమేమి ?
ధీరుండవయ్యును దీనదశను బొంది
నీ విట్లు కన్నీరు నించుటేమి ?
కలిగిన రీతి నిక్కముగఁ దెల్పుమటన్న
మాఱాడ విపు డింత మౌనమేమి ? '

తే. యనుచుఁ గప్పిన వస్త్రంబు నవలఁ దీసి
యొప్పుగా లేవనెత్తి కూర్చుండఁబెట్టి
వేగఁ గదుములఁ దాఁ దోమి , వేఱు వస్త్ర
మొకటి పైఁ గప్పి చందనం బొడల నలఁది. 294

క. చల్లని జలములఁ గన్నులు
మెల్లఁగఁ దా నిమిరి నిమిరి మేల్కొల్పుచు మేల్
మొల్లలు గ్రుచ్చిన మృదుతర
పల్లవముల విసరివిసరి బడలికఁ దీర్చెన్. 295

క. హరి కిటు బడలిక దీఱిన
తఱి వకుళాదేవి చాల దయఁ దళుకొత్తన్
' పరమాన్నము భుజియింపుము
వరసుత ! ' యని పిలువ శిరము వాంచి పలుకకన్. 296

క. పంకజలోచనుఁ డుండఁగ
సంకటపడి వకుళ చాల జాలినిఁ బల్కెన్
' మంకుతనముఁ జేసెద విటు
వేంకట ! నీమది నిదేమొ వింత జనించెన్. ' 297

మ. అని యా భామిని వెండియున్ బలికె ' నీ వా కానయందేడనై
నను సౌందర్య విలాస విభ్రమ కళానైపుణ్యముల్ గల్గు కాం
తను మోహంబునఁ జూచి వచ్చితివొ ? చిత్తంబందుఁ దద్రూపమే
ఘనమై నిల్చెనొ ? నీ యురఃస్థలమునన్ కామాస్త్రముల్ నాటెనో ? 298

సీ. నాతండ్రి ! నీవు గన్నది కిన్నరాంగనో ?
గీర్వాణ కాంతయో ? గిరులయందు
గమనించు చెంచెతో ? గంధర్వకాంతయో ?
వనదేవతయొ ? లేక వగలఁ గుల్కు
నూర్వశియో ? మేనకో ? సర్వగుణములఁ
దగిన రంభో ? తిలోత్తమొ ? ఘృతాచొ ?
పూని యీ పదిమందిలో నెవ్వరినిఁ జూచి
నీవు వచ్చితి వది నిక్కముగను

తే. జెప్పు'మని పల్కఁ, దలవంచి శ్రీధరుండు
పలుక కూరక కనుల బాష్పంబు లొల్క
ఖేదపడుచున్న చక్రి నీక్షించి వకుళ
మాలికాదేవి భీతిల్లి మరల ననియె. 299

తే. 'మోహినీ భూత మేమైన ముందు నిలిచి
కనులఁ బొడకట్టిపోయెనో ? గహనమందుఁ
గామినీభూత మెందైనఁ గదిసి నిన్నుఁ
బట్టెనో తెల్పు కొడుక ! నిబద్ధిగాను. 300

క. అ౦ుగాకుండిన నాతో
  వలె మాట్లాడకుండ నీవిధమున సం
కట౦ ౦వెన్నడు , దీనికిఁ
గటకట నే నే చికిత్సఁ గావింతునయా ?

క. ఒకమాట నాకుఁ జెప్పక
వికలాత్ముఁడవగుచు ఘనవివేకముగాఁ బ
ల్కక నీవుండఁగ నామది
కకవికఁ బొందినది నాకు గతి యేమింకన్ ?

సీ. మౌనివై నీ విటు మాటలాడకయున్న
నిక్కడ మనకు దిక్కెవ్వరింక ?
నా వరాహస్వామికైన నీ వృ౦౦ఁ౦
మెఱుఁగఁ౦ ర దింకమీఁద
నంత రట్టేల ? నా కాప్త౦ నీ
మదినిఁగలిగిన ౦౦ఁ దెలుపు మిపుడు
నానావిధంబుల నేను విచారించి
నీ చింతఁ దీర్చెద నిశ్చయముగ

తే. నన్ను నఱమఱగాఁ జూడకన్న ! నీవు
బ్రతికియుండిన నే నిందు బ్రతుకఁగలను
లేకయుండిన దేహంబు నాకు వలదు
నేను నీవున్నచోటనే నిలిచియుందు.

సీ. కన్యకాదీక్ష నిష్కర్షగాఁ బూని నే
గురునిష్ఠ నుండఁగాఁ బరమ౦రుఁడు
పుణ్యాత్మ ! నీవంటి పుత్త్రరత్నంబును
గనక పెంచక నిచ్చె ననుచు నిన్ను

నెఱనమ్మియుండఁగా , నేఁడు నీ విచ్చోట
శోకించువిధ మేను చూడలేను
నామీఁద దయనుంచి నీ మదిఁ గల కోర్కి
చెప్పు తీర్చెద మాటఁ దప్ప'ననుచుఁ

తే. జేతిలోఁ జెయివెట్టి మచ్చికను శిరము
నిమిరి , యా చక్రధరుని కన్నీరు దుడిచి
తాను కన్నీరు నింప , నత్తరుణి నెనరు
మదిని భావించి కరుణించి మాధవుండు. 304

## హరి వకుళతోఁ దన విచారమును గూర్చి వెల్లడించుట

చ. కనుఁగవ మెల్లఁగాఁ దెఱచి కామ వికారము మానసంబులోఁ
బెనఁగొన నిట్లనెన్ ' జనని ! ప్రేమను నీ వడుగంగఁ జెప్పెదన్
విను మొక వారణేంద్ర మటవిన్ బొడసూపఁగ , దానివెంబడిన్
జని గిరిడిగ్గఁగా నెదుటఁ జల్లని పుష్పవనంబు గన్పడెన్. 305

క. ఆ వనమం దొక సుందరి
లావణ్యవిలాసకలిత లక్షణవతియై
భావజుబాణము కైవడిఁ
దా విద్యుల్లతికరీతిఁ గన్పడె నెదుటన్. 306

సీ. ఆ కాంత పాదంబు లమలపల్లవములు
జంఘికల్ కాహళుల్ , సకియ తొడలు
కదళికా స్తంభముల్ , కటి సైకతంబు , మ
ధ్యము గగనంబు , హస్తములు శోణ
కమలముల్ , మెఱుఁగు నూగారు చీమలబారు ,
కలికి కుచములు బంగారు గిండ్లు
గళము శంఖంబు , చక్కని చెక్కు లద్దముల్
తేటైన కెమ్మోవి తేనెబావి

తే. దంతములు మొల్లమొగ్గలు , తళుకుఁజెవులు
శ్రీలు , నాసిక తిలపుష్ప , మా లతాంగి
కనులు బలుగండుమీనముల్ , కన్నుబొమలు
కళలచే సొగసైన సింగాణి విండ్లు. 307

తే. చంద్రబింబ సమానంబు సతిముఖంబు
మెఱుపు తుమ్మెదఱెక్క లమ్మెలఁత కురులు
జనని ! యా కామినీమణి చక్కఁదనముఁ
జెప్పలేఁ డజుఁడైన , నేఁ జెప్పఁగలనె ? 308

చ. తలఁపు నిజంబుగా వినుము దానికి నాకుఁ బ్రియానుబంధ మిం
కెలమినిఁ గల్గనేని సతి నేలుచునుండెద ; లేకపోయినన్
నిలువ సహింపదిందు జననీ ! తలగాయము మాన్పినట్టి ని
న్నిల నెడఁబాసి పోవుటకు హేతువు గల్గునటంచు నాత్మలో. 309

శా. నేఁ జింతించెద , సంతసంబొదవ నా నీరేజపత్రేక్షణన్
నేఁ జేపట్టక తాళలే నిపుడు నీవే దాని శీఘ్రంబుగా
నా చెంతం గృపమీఱఁ జేర్చు ; మెపు డానందించుచున్ దానితో
నీచోటన్ దగ నిల్చియుండెద మఱిం కెచ్చోటికిన్ బోవకన్ ' 310

చ. అని హరి వల్కఁగా వకుళ హాటకచేలుని మోముఁ జూచి యి
ట్లనియెఁ 'గుమార ! నీవు గనినట్టి లతాంగి కులంబు , గోత్రముల్
వినవలెఁ , దల్లిదండ్రుల వివేకము , దాని వివేక మొప్పుగాఁ
గనవలెఁ , బెండ్లియాడఁదగు కన్యకయైన వరింపఁగాఁదగున్. 311

తే. దాని పేరేమి ? యున్న సుస్థానమేది ?
చెప్పు మేర్పడ నేఁ బెండ్లిసేతు ' ననుచు
వకుళమాలిక పల్క నవ్వాసుదేవుఁ
డిట్టు లనియె మహామోహ మినుమడింప. 312

సీ. 'జనని ! తత్క్రమము నిశ్చయముగా విను సుధా
కరుని కులస్థుఁ డాకాశరాజు
తనకు సంతతిలేక ఘనపుత్ర కామేష్టి
దనరఁ గావింప నిద్ధరణి నొనరఁ
దున్నింప నవనిలోఁ దోయజం బుదయించె
నా తోయజంబునం దా మృగాక్షి
గనిపింపఁగాఁ దెచ్చి గగనాధిపుఁడు పెంచె
ధరను పద్మావతి దానిపేరు

తే. పరఁగ దానికి నాకు దాంపత్య మజుఁడు
నిశ్చయము చేసియుండెనా నేను బ్రతుకఁ
గలను , లేకున్న నిచ్చోట నిలువఁగలనె ?
వనిత ! వైకుంఠపురిఁ జేరవలయుఁగాక. 313

వ. అంబా ! విను మక్కన్యకామణి లక్ష్మీసమానయగుం గావున , జన్మ జన్మాంతర పుణ్యపరిపాకియైన పురుషునకే లభించునుగాని , తక్కినవారికి లభింపదు. అది యేమో మత్పుణ్యపరిపాకకాలంబునం దక్కన్యక నీక్షించి సంభాషింపం గలిగె ; నట్టి సుందరినిఁ జూచి విడిచివచ్చితి , నింక నా కన్నోదకంబు లాశింపందగ, దిట్టి కలికి నాకు లభించెనా జీవింపందగు ; లేకుండెనేని జీవింపందగ దిది సత్యం , బప్పద్మావతి నాయందు విరోధించి నా మీఁదఁ జెలులం బురికొల్పి శిలావృష్టిఁ గురియించె , నట్టి ఱాళ్ల దెబ్బలకు నిర్వహింపలేక తురంగంబు నేలంబడియె ; నప్పుడ నేను తెప్పునఁ బరువెత్తివచ్చి యీ పర్వతంబుఁ జేరి పునర్జీవితుండనైతి ; నజుం డిట్టి సౌందర్యవతినిఁ బుట్టించి కట్టిడిబుద్ధి నిచ్చి నా కింత కష్టంబు వెట్టె. మత్పాపం బింతకు లోఁజేసెఁ ; దదనుసారంబుగా బ్రహ్మయు నక్కాంతకును నా కప్పుడు ఘటనంబుఁజేసెఁ గావున నిప్పుడు నీవు నాకు సహాయంబుచేసి యక్కన్యక నాకు లభ్యయగు నుపాయంబుఁ జేసితివేని మజ్జననీ జనక

సహోదరాది బాంధవులును, మద్భక్తులైన ప్రహ్లాద నారదాది పరమ భాగవ తోత్తములును నీవ యని నిశ్చయించెద ; ననేక గోభూహిరణ్యాది సకల దానంబులు చేసినవారి కెంతపుణ్యంబు గలుగు నంతపుణ్యంబు మాంగల్యధారణంబుఁజేయించినవారికి సిద్ధించుంగావున, నీవు నాచేతఁ బద్మావతికి మాంగల్యధారణంబుఁ జేయింపు'మని మఱియు నిట్లనియె.
314

తే. 'తగిన శుభలగ్నమున నాకు దాని కీవు
పెండ్లి సేయించినప్పటి ప్రీతి నాకుఁ
గలుగ దే లోకమందైనఁ గనుక, వేగ
నా వివాహముఁ జేయింపు నీ' వటంచు. 315

మ. హరి వేడ్కన్ వచియింప, నవ్వకుళ నెయ్యంబొప్పఁగా 'బుత్రకా!
పరమాశ్చర్యముగా ధరాతలములోఁ బద్మంబునందట్టి సుం
దరి పుట్టందగు హేతువేమిపుడు మోదంబొప్పఁగా నాకు నీ
వర లేకన్ దగఁ జెప్పు'మన్న విని పద్మాక్షుండు తా నిట్లనెన్. 316

## రామకథ హరి వకుళకుఁ జెప్పుట

సీ. 'పొలుపొంద విను తల్లి! పూర్వకాలంబున
ఘనతర త్రేతాయుగంబునందు
దశరథేశ్వరునకుఁ దనయుండనై పుట్టి
గాధేయు సవనంబుఁ గాచి, శివుని
చాపంబు ఖండించి జనకాత్మజను బెండ్లి
యాడి సాకేతాఖ్య నమరు పురముఁ
జేరి, మజ్జనకాజ్ఞ శిరసావహించి సీ
తను లక్ష్మణునిఁ దోడుకొని వనముల

తే. కరిగియుండంగ నొక్క మాయామృగంబు
నచట జానకి చూచి నెయ్యమున దానిఁ
దెమ్మనుచు నన్ను లక్ష్మణదేవు నంపె
నపుడు రావణుఁడను దైత్యుఁ డటకు వచ్చి. 317

సీ. ధరణిజ నెత్తి రథంబుపై నిడికొని
చనఁగ 'రామా ! ' యని జనకపుత్త్రి
విలపింప , నెవరందు విడిపింప లేకున్న
నపుడు హవిర్భుజుం డనిమిషారిఁ
జేరి ' దశగ్రీవ ! సీతగా దీ కాంత ,
మఱి యెవ్వ ? రనిన సమ్మతిని వినుము
చెప్పెద రాముఁ డా సీతను నా చెంతఁ
జేర్చి , విప్రాంగనన్ సీతవలెనె

తే. చేసి యందుంచి చనియె ; నీ స్నేహమేను
గోరి చెప్పితి నిటువంటి గు'ట్టటంచు
శాంతముగఁ జెప్పి , సీతవేషంబు వేద
వతికిఁ గల్పించి తెచ్చి రావణున కిచ్చె. 318

క. ఆ మూఢుండగు రావణుఁ
డా మైథిలి నచట విడిచి , యా వేదవతిన్
కామించి తోడుకొని చని
యేమఱక యశోకవనిని హితముగ నుంచెన్. 319

క. రామా ! యని పేర్కొనుచును
దా మైథిలిరీతి నచటఁ దల్లడపడుచున్
నేమము విడువక యుంచుక
మానిని చెఱను నిల్పి యడలుచునుండెన్. 320

క. అనలుఁడు తన సతిచెంగట
నొనరఁగ జనకజను దాఁచియుండఁగ , నే నా
యనిమిషవైరినిఁ దునుముట
కనిమిషపతిసుతునిఁ ద్రుంచి యబ్జాప్తసుతున్. 321

సీ. చేపట్టి లవణాబ్ధిఁ జెచ్చెర బంధించి
కదిసి రావణ కుంభకర్ణ ముఖ్యు
లగు రాక్షసులఁ ద్రుంచి యందఱు మెచ్చుట
కై యందుఁ జెఱనుండినట్టి సతినిఁ
గాంచి ' నీ వగ్నిలోఁగాఁ బ్రవేశించి వ
చ్చినఁగాని నిన్నుఁ జేకొన'నటంచుఁ
బల్కితి , నయ్యింతి పావకముఖమందు
సురుచిరభక్తితోఁ జొచ్చియుండె

తే. నప్పు డిద్దఱు సీతలై యగ్నియందు
నిలిచి యుండఁగ , జనకజ నేనుఁ బిలిచి
' చేడె ! నీవలె నీ చెంతఁ జేరియున్న
కమలలోచన యెవతె నిక్కముగఁ దెల్పు. ' 322

సీ. అన విని సీత యిట్లనె ' దశాస్యుఁడు నన్నుఁ
దెచ్చునప్పుడు నేను దిగులునొంది
పరఁగ నిన్ బేర్కొని మొరవెట్టఁగా విని
యనలుండు దన చెంత నప్పుడున్న
వేదవతినిఁ దెచ్చి విబుధాహితున కిచ్చి
ననుఁ దనలో దాఁచికొనియె , వేద
వతి లంకఁ జేరి రావణునిచే హింసలఁ
బడియె నా కొఱ కిది , భాగ్యవతియు

తే. నిన్నుఁ గోరి తపముఁ జేసియున్న కన్నె
గనుక , యీ భామయందు సత్కరుణ నుంచి
ప్రేమ మీఱఁగ నిద్దానిఁ బెండ్లియాడు '
మనఁగ , నేనందు కొప్ప కిట్లంటి నప్పుడు. 323

తే. 'పడఁతి ! విను మేకపత్నీవ్రతుఁడను గనుక
నిపుడు నేఁ బెండ్లియాడ నీ యిందుముఖిని ,
రమణ నొప్పఁగ దేహాంతరమున దీని
వేడు కలరఁగ నేఁ బెండ్లి యాడవలెను. 324

వ. అదెప్పుడన్నను నిఱువదియెనిమిదవ ద్వాపరాంతకలియుగమం దనేక భక్త
సంరక్షణార్థంబుగా వేంకటాద్రియం దవతరించునప్పు డీ కన్యకను
బెండ్లియాడెద , నంత పర్యంతంబు బ్రహ్మలోకంబునందీ కాంత వసియించి
యుండవలయుఁ ; బిమ్మట నేను వేంకటాద్రియం దుదయించినప్పుడీ
భామ భూమియం దుద్భవించు , నప్పుడేను పరిగ్రహించెద. ' 325

క. అని పలికితి నీ గోప్యం
బనలునకును నాకుఁ దెలియు , నదియునుగాకన్
జనకజకును , వేదవతికి
ననువందఁగఁ దెలియు నీ రహస్యము జననీ ! 326

సీ. పరు లెందు వినని యీ పరమరహస్యంబు
నీకుఁ జెప్పితి నేఁడు నెనరుమీఱ
మది నుంచు , మఱుమీఁద మహిమమీఱఁగ నేను
వహ్నియం దా వేదవతిని నిలిపి
చిరతరకరుణ నా సీతను మెచ్చి చే
పట్టి , విభీషణు పట్ట మచటఁ
గట్టి , సౌమిత్రితోఁ గపులతో సాకేత
పట్టణంబును జేరి ప్రజలనెల్లఁ

తే. బాలనముఁ జేయుచుంటి నక్కాల మట్ల
జరిగె ; నటమీఁద నేనె ద్వాపరమునందు
మొనసి వసుదేవునకుఁ గృష్ణుఁడన జనించి
యుంటి ; వల్మీకమందీడ నుదయమైతి. ' 327

తే. అనుచు వకుళకుఁ బూర్వ వృత్తాంత మట్లు
శౌరి వినిపింప , నయ్యింతి సంతసించి
' వేదవతి పూర్వ వృత్తాంత మాదరముగఁ
జెప్పు'మన విని పల్కె నా శ్రీధరుండు. 328

సీ. 'విను వకుళాదేవి ! ఘనపూర్వకథ నీకు
వినిపింతు నెట్లన్న విప్రకన్య
యగు వేదవతి నన్ను మగనిఁగాఁ గామించి
తపముఁ జేయఁగఁ జూచి దనుజవిభుడు
తాఁ దానిఁ గామింపఁగా , దేహమందాశ
విడిచి యా లలితాంగి విశ్రవసుని
తనయునిఁ గాంచి ' సిద్ధంబుగా హరిచేత
నిను నేనె చంపింతు'నని ప్రతిజ్ఞఁ

తే. బలికి యనలంబులోఁ జొరఁబడఁగ , దానిఁ
బావకుఁడు దాఁచికొనియుండి , పంక్తిముఖుఁడు
సీతఁ గొనిపోవునప్పు డా చెలిని వేగ
సీతకన్నను సుందరస్త్రీనిఁ జేసి. 329

సీ. తా వేగఁ గొనివచ్చి దనుజాధిపతి కిచ్చి
పొమ్మని , మాయగా భూమిసుతను
నాదరం బెసఁగ స్వాహాదేవి కడ నుంచె
నా వేదవతి లంక కరిగి , పంక్తి

[illegible]ుని నా చేత వైపుగాఁ జంపించి
తన పంత మీడేర్చికొని , రయమున
వహ్నియందుఁండిన వసుమతీసుతను నా
కడఁ జేర్చి , బ్రహ్మలోకమున కరిగి

తే. ఘనతపముఁ జేయుచును గొంతకాలముండి
యవలఁ బద్మములోఁ జొచ్చి యవనిలోనె
చేరి యాకాశనృపతికిఁ జిక్కి , నాకు
మరులు పుట్టించి ననుఁ దాను మఱచె నబల. ' 330

మ. అని యమ్మాధవుఁ డాప్తతన్ తనదువృత్తాంతంబుఁ , బద్మావతీ
జననంబున్ వినిపింపఁగా , వకుళ శ్రీస్వామిన్ విలోకించి యి
ట్లనె ' నో దేవ ! మహానుభావ ! మును నే నజ్ఞానవై మానవుం
డని , బాలుండని యుంటి నేను నిను బ్రహ్మంబంచు సేవింపకన్. 331

శా. నీవే బ్రహ్మను గన్నతండ్రివి , మహానిర్వాణ సంధాత , నీ
వే విష్ణుండవు , రామచంద్రుఁడవు , నీవే కృష్ణదేవుండ , వీ
వే వేదాత్మవు , సర్వతోముఖుఁడ , నీవే కర్తవున్ భోక్త , నీ
వే విశ్వంబు , వరాహదేవుఁడవు నీవే శేషశైలాధిపా ! 332

కం. తోయజలోచన ! నే నీ
మాయను గనలేక నా కుమారుఁడ వనుచున్
నీయందుఁ బ్రేమ నుంచితి
నా యీశుఁడవనుచుఁ దెలియనైతి మహాత్మా ! ' 333

సీ. అన విని విష్ణుఁ డిట్లనియె ' నిచ్చట నీవు
తలగాయమును మాన్పి తల్లివలెను
బోషింప నీ ఋణంబును దీర్పుటెట్లకో
యని నేను చింతింతు'ననుచు వకుళ

మాలికపై విష్ణుమాయఁ దెప్పునఁ గప్పి
పుత్రవాత్సల్య సద్బుద్ధి నిచ్చి
మరల నిట్లనియె 'నమ్మా! వివాహము నాకుఁ
జేయు మీ'వనుచు మచ్చికలుచేసి

తే. 'తక్క కిప్పుడె పెండ్లిపెత్తనముఁ జేయఁ
బోయిర' మ్మని పలుక నా పొలఁతి హరినిఁ
గాంచి 'పుత్రక! యిప్పు డా కన్య యున్న
దివ్యపురమెట్టి దా రీతిఁ దెలుపవయ్య!' 334

## నారాయణవరపుర వర్ణన

తే. అనఁగ హరి యిట్టులనియె 'నీ యద్రిదిగువఁ
బొసఁగ నమరావతీపురంబో యనంగ
నున్నతంబై ప్రకాశించు నొక్క నగర
మట్టి పట్టణ మిపుడు నీ వెట్టిదనిన. 335

సీ. వేదవేదాంగ ప్రవీణులై, వేదాంత
వేత్తలై వెలసిన విప్రవరులు
ప్రబల బాహాశౌర్య పటిమాహతారాతి
పంక్తులై మెలఁగు భూపాలమణులు
మణికాంచనోజ్జ్వల మందిరాంగణ నటత్
వనజమందిరులైన వైశ్యఘనులు
ఘనధరామర పాదకంజాతసేవైక
శుభధురంధరులైన శూద్రజనులు

తే. గలిగి విలసిల్లి గోపురాకలిత లలిత
రత్నకాంతి పరిభ్రాంత రాజహంస
పథనిరోధక సాలవిభ్రాజమాన
మై ప్రకాశించు నారాయణాఖ్యపురము. 336

ఉ. అప్పుర మేలు మేలుగ మహామహుఁడై గగనక్షితీశ్వరుం
డెప్పుడు ధార్మికుం డితఁ డభీష్టసుఖప్రదుఁడంచు సజ్జనుల్
మెప్పుగ నెన్నుచుండఁగను , మీఱిన భక్తి విరక్తి యుక్తులం
దొప్పినవాఁ డటంచు సుర లున్నతి సన్నుతిఁజేయుచుండఁగన్. 337

సీ. సప్తాంగముల వెలి సవరించి , యాత్మయం
దష్టాంగసరణిపై నాసఁ బెంచి
బయటి శాత్రవకోటి పటిమంబు నిర్జించి
యంతర్విరోధుల నడఁగనొంచి
బాహ్యపుణ్యనదీ ప్రభావంబు నీక్షించి
యాంతరనదులపై నాత్మ నుంచి
వెలుపలి చక్రముల్ వేడ్కతోఁ బాలించి
సారిది లో చక్రముల్ చూడనెంచి

తే. దీనజనఘనమానసాధీన విష్ణు
చరణకంజాత సంజాత సారమధుక
రాయమానమనస్కుఁడై రహిని భువిని
నెమ్మదిగ నేలు నాకాశనృపవరునకు. 338

తే. తొండమానుండు పరమభక్తుండు ముద్దు
తమ్ముడగు ; పుత్త్రకుఁడు వసుదానుఁడనెడు
బాలకుఁడు , ధరణీదేవి భార్య , పుత్త్రి
సరసమానస పద్మసంజాత యగును. ’ 339

చ. అని గగనక్షితీశ్వరు మహావిభవోన్నతిఁ జక్రి దెల్పఁగా
విని వకుళాఖ్య భామ ‘ సరవిన్ గిరి డిగ్గుట కెద్ది మార్గమో
వనజదళాక్ష ! తెల్పు’మని వైపుగ నందదుగంగ , మాధవుం
డొనరఁగ నిట్లనెన్ ‘ జనని ! యొప్పుగఁ జెప్పెద నాలకింపవే ! 340

వ. మాతా ! యిమ్మార్గంబునఁ బర్వతంబు డిగ్గి , యచ్చటఁ బావనపదంబై ప్రవహించుచున్న పుణ్యతీర్థంబునందుఁ గ్రుంకులిడి తత్సమీపంబునఁ గపిలమునిచేతఁ బూజలందుచున్న శివలింగంబు నీక్షించి మ్రొక్కి , 'శ్రీనివాసునకు శీఘ్రంబుగా వివాహంబుఁ జేయు'మని యా శివునిం బ్రార్థించి, యవ్వలం బోయి శుకాశ్రమంబుఁ జేరి యందున్న శుకయోగీంద్రునకు నమస్కరించి , యగస్త్యాశ్రమంబుఁ జేరి యమ్మునికి వందనంబుఁ జేసి , యగస్త్య నిర్మితంబైన శివాలయంబునకుఁ బోయి శివునకు దండంబు సమర్పించి , యందున్న స్త్రీ జనంబు ననుసరించి తన్మూలంబున నారాయణవరపురంబుఁ జేరి , తద్రాజపత్ని సమీపంబున కరిగి నాకుఁ బద్మావతి యనుకూలయగునట్లు మాట్లాడు ' మనిన విని , వకుళమాలిక యిట్లనియె. 341

సీ. ' విను దేవ ! వారు నీవృత్తాంత మడిగినఁ
బొసఁగ నేనేమి సెప్పుదు?'నటంచు
వకుళమాలిక వల్క , వాసుదేవుం డిట్టు
లనియె ' నోయమ్మ ! వా రడిగిరేని
వరచంద్రకులులైన వసుదేవ దేవకుల్
ధరణిపై నా తల్లిదండ్రులనుము
బలభద్రుఁడన్న , సుభద్ర సోదరి యను
గోత్రమెన్న వసిష్ఠగోత్రమనుము

తే. సరసనక్షత్రమేమన్న శ్రవణమనుము
లలిత యౌవన సౌందర్య కలితుఁడనుము
మానధనుఁడను , విభవనిధానుఁడనుము
భువినిఁ బద్మావతికిఁ దగు పురుషుఁడనుము. 342

## వకుళ నారాయణవర పురంబున కరుగుట

వ. అని చెప్పి , పోయిర'మ్మనె , నపుడు దేవమాయానిర్మితతురంగం బా
హరిసన్నిధిం జేరె ; నంత వకుళమాలిక సంతసించి
హరియాజ్ఞాధారిణియై తత్తురంగారోహణంబుఁజేసి గిరి డిగ్గి , శ్రీనివాసుఁ
డాజ్ఞాపించిన ప్రకారంబుగా నందున్న పుణ్యతీర్థంబునఁ గ్రుంకి
కపిలేశ్వరుఁ బ్రార్థించి మ్రొక్కిపోయి , శుకునకు నగస్త్యునకు మ్రొక్కి
యగస్త్యనిర్మిత శివాలయంబుఁ జేరి శివునకు మ్రొక్కి కూర్చుండి
యుండి, తద్దేవాలయంబులో నిలిచియున్న కన్యకాజనంబులం దొక్క
కన్యకను బలిచి యిట్లనియె. 343

క. 'చెలి ! నీవెవ్వరిదానవు ?
చెలువొప్పఁగఁ జెప్పు'మనినఁ జింతించుచు నా
మెలఁతుక దాఁపక యపు డా
కలకంఠినిఁజూచి మెల్లఁగా నిట్లనియెన్. 344

సీ. 'ఆకాశరాజు గన్నట్టి పద్మావతి
చెలికత్తె'ననఁగ మచ్చికను వకుళ
మాలిక దానిఁ గ్రమ్మఱఁ జూచి ' నీమోము
చిన్నఁబోయిన దేమి ? చెప్పు'మనఁగ
నా భామ పలికె ని ' ట్లమ్మ ! నీతో నెట్లు
నెప్పుదు ? ' ననఁగ నా చెలినిఁ జూచి
వకుళ యిట్లనియె ' దాఁపక నీమదినిఁ గల్గు
చింత మెల్లఁగ నాకుఁ జెప్పు'మనఁగ

తే. నదియు మెల్లనె పల్కె ' నో యమ్మ ! నిన్న
వనవిహారంబుఁ గావింప వాంఛనొంది
మనుజపతిసుత మమ్ముఁ దోడ్కొని వనమున
కరుదుగా వచ్చె , నందు మే మందఱమును. 345

సీ. అట్లాడుచుండఁగా నంతలో నటకొక్క
శబరుండు వచ్చె నాశ్చర్యముగను
వాఁడెట్టివాఁడన్న వనదాభవర్ణుండు
లలిత సద్భూషణాలంకృతుండు
నాజానుబాహుండు , నబ్జపత్రాక్షుండు
పర్వేందువదనుండు , భాసురుండు
గంభీరవక్షుండు , ఘనకంబుకంఠుండు
మహనీయ మన్మథ మన్మథుండు

తే. ఘనతరంబైన వరఘోటకంబుమీఁద
నెక్కి శరచాపధరుఁడై యహీన శౌర్య
కలితుఁడై వచ్చి మా రాజకన్య చెంతఁ
జేరి యేమేమొ మాటలు చెప్పుచుండె. 346

వ. అప్పుడా శబరునిమీఁద నక్కన్యకామణి కోపించి శిలలు రువ్వింప , నతం డెక్కిన తురంగంబు నేలం బడియె. అతం డుత్తరాభిముఖుండై చనియె , నంతఁ బద్మావతి నిజమందిరంబుఁ జేరె. అక్కిరాతవిభుని దృష్టి దాఁకెంగాబోలు నిక్కన్యకామణికి మహాతాపజ్వరంబు వచ్చె ; నందునఁ బద్మావతి మాట్లాడక తపించుచున్నంజూచి తండ్రియైన గగనాధిపుండును , దల్లియైన ధరణీదేవియును సుతం దొడలపై నిడుకొని బహుప్రకారంబుల ఖేదపడుచుఁ దజ్జ్వరతాపనివారణంబుఁ జేయుటకై బృహస్పతిని రావింపఁగా , నమ్మహాత్ముఁడు వచ్చినం జూచి లేచి , యర్ఘ్యపాద్యాది విధులం బూజించి కనకాసనాసీనుం జేసి , యా బృహస్పతి కా పద్మావతిం జూపి కన్నీరు నించుచు నానృపాలుం డిట్లనియె. 347

సీ. 'దేశిక ! పద్మావతికి మహాతాపజ్వ
రంబు రాఁగా బిడ్డ రాత్రి నిదుర
పోక , తాపంబుచేఁ బొరలుచునుండె ; మీ
రిది మాన్ప నౌషధంబియ్యవలయు

నన విని గురుఁడిట్లనె ' నో నృపాల ! యీ
బాలావతికిఁ బ్రాణభయము లేదు
చింతింపవలవదు చెచ్చెర రుద్రాభి
షేకంబు విప్రులచేత నిపుడె

తే. నీవు చేయింపు'మని పల్క, భూవిభుండు
బ్రాహ్మణుల నిచ్చటికిఁ బంపి ఫల సుమములు
మొదలుగాఁగల వస్తువుల్ విదితముగను
మొనసి మాచేత నంపించె ముదిత ! నీవు. 348

క. ఎక్కడనుండీ ప్రొద్దున
నిక్కడి కేపని నిమిత్త మేతెంచితి వా
నిక్కముఁ జెప్పు'మనఁగ విని
మక్కువతో నిట్లు వకుళమాలిక వలికెన్. 349

సీ. 'వినుమో లతాంగి ! నే వేంకటేశ్వరు దాసి
నొక పని గల్గఁగా నుదయమందె
పైనమై వచ్చితిఁ, బట్టణంబిటకుఁ జేరి
యంతఃపురంబున కరిగి యచట
నా ధరణీదేవి కాప్తవాక్యముఁ జెప్ప
వచ్చితి'ననఁగ నవ్వనిత పలికె
నభవున కభిషేక మగునంత కిచ్చోట
నిలిచి యుండితివైన నేను నిన్నుఁ

తే. దోడుకొనిపోదు'నన దాని తోడుకొనుచుఁ
వకుళ యచ్చట నుండె ; నవ్వల ఫణీంద్ర
శైలపతి యప్పుడఁతిమీఁది బాళిచేత
ధీరుఁడయ్యును మదినిఁ జింతించుచుండె. ' 350

వ. అని చెప్పిన సూతుం జూచి శౌనకాదులు మఱియు నిట్లనిరి. 351

## ఆశ్వాసాంతము

క. సోమ దివాకర లోచన !
దామోదర ! శంఖచక్రధర ! భవహర ! సు
త్రామోద్ధర ! సద్గురువర !
శ్రీమద్వేంకటగిరీంద్ర ! జితదనుజేంద్రా ! 352

మాలిని :

సురుచిరగుణధామా ! శుభ్రసత్కీర్తి కామా !
మురదనుజ విరామా ! మోక్షకల్యాణ సీమా !
గురుతర శుభనామా ! ఘోరదేవారి భీమా !
ద్విరద కుముదసోమా ! దేవతాసార్వభౌమా ! 353

గద్య :

ఇది శ్రీతరిగొండలక్ష్మీనృసింహ కరుణాకటాక్ష కలితకవితావిలాస వసిష్ఠగోత్ర పవిత్ర కృష్ణయామాత్యతనూభవ వెంగమాంబాప్రణీతంబైన శ్రీవేంకటాచల మాహాత్మ్యంబను భవిష్యోత్తరపురాణంబునం దిష్టదేవతా ప్రార్థనంబును, శౌనకాదుల ప్రశ్నయు , జనక శతానంద సంభాషణంబును , శేష మారుత సంవాదంబును , శేషాద్రి ప్రమాణ భావంబులును , మాధవాఖ్య విప్రుని కథయును , వేంకటేశ్వరుండు క్రమ్మఱ వైకుంఠంబుఁ జేరుటయుఁ, జేరిన చందంబు నారదుం డజానకుఁ జెప్పుటయు , నారదుండు త్రిమూర్తిపరీక్షఁ జేయుమని చెప్పుటయు , భృగుండు త్రిమూర్తి పరీక్షఁ జేయుటయు , హరితో లక్ష్మి ప్రేమకలహంబుఁజేసి కొల్లాపురంబుఁ జేరుటయు , హరి వైకుంఠంబు విడిచి క్రమ్మఱ శేషాద్రియందు వల్మీకంబులోఁ

జేరియుండుటయు , నజ రుద్రులు ధేనువత్సకంబులై వచ్చి వల్మీక గర్భమందున్న హరినిఁ దృప్తిఁ బొందింపుచుండుటయుఁ , జోళరాజాంగన గోపకుని దండించుటయు, హరిశిరంబున గోపకుండు గొడ్డంట నేయుటయు, జోళరాజునకుఁ జక్రి శాపంబిచ్చి పంపించుటయు , గీష్పతి హరి కౌషధంబుఁ జెప్పుటయు, శౌనకాదుల. పశ్చాత్తాపంబును , వల్మీక , తింత్రిణీవృక్ష , పర్వత ప్రభావంబులును, వరాహ శ్రీనివాస సంవాదంబును, గిటి హరికి స్థలం బిచ్చుటయు, వకుళమాలికా వృత్తాంతంబును , నాకాశరాజు వృత్తాంతంబును , పద్మావతి భూమియందుదయించుటయు , వసంత ఋతు వర్ణనంబును బద్మావతివనవిహారంబును , పద్మావతితో నారదుండు భాషించి పోవుటయు, శ్రీనివాసుండు వేటలాడుటయు, గిరి డిగ్గి హరి కరిని రక్షించుటయు , వనమధ్యంబునఁ బద్మావతినిఁ జూచి హరి వర్ణించుటయుఁ, బద్మావతిచెల్లులతో హరి తన వృతాంతంబు జెప్పుటయు , హరి పద్మావతితో శృంగారోక్తులుగా సంభాషించుటయుఁ , బద్మావతి కలహించి చెలులచేత హరిమీఁద ఱాళ్ళు రువ్వించుటయుఁ , జక్రి పరువువాఱి శేషాద్రిఁ జేరి వల్మీకంబులోఁ జొచ్చుటయుఁ , బద్మావతి నిజగృహంబున కరుగుటయు, హరి విరహతాపంబు నొందుటయు , వకుళతో హరి విచారంబు చెప్పుటయు , రామకథ హరి వకుళకుఁ జెప్పుటయు , వేదవతీవృత్తాంతంబు వకుళకు స్వామి వినిపించుటయు, నారాయణవరపురవర్ణనంబును , వకుళ నారాయణవరపురంబునకుఁ బోవుటయు , వకుళ పద్మావతిచెలితో సంభాషించుటయు నను కథలంగల చతుర్థాశ్వాసము.



# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

## పంచమాశ్వాసము

క. విశ్వాతీత ! గుణాకర !
విశ్వోద్ధర ! విష్ణుదేవ ! వేదవిహారా !
విశ్వేశ్వర ! సురపూజిత !
శాశ్వత తరిగొండనృహరి ! జనహితకారీ ! 1

ఆ. 'సూత ! వకుళ దండశూకాద్రి దిగిపోయి
నపుడు విష్ణుదేవుఁ డద్రిమీఁద
నుండి యే ప్రయత్న మొనరఁ జేయుచునుండెఁ
జెప్పు'మనఁగ సూతుఁ డప్పు డనియె. 2

తే. 'వినుఁడు మునులార ! హరి చేయు వింతలన్ని
చెప్పెదను మీ , కదెట్లన్న శ్రీధరుండు
వేంకటాచలమందుండి వేడ్కగాను
దాను దనమదిలో నిట్లు దలఁచె నపుడు. 3

## హరి యెఱుకత యగుట

సీ. 'వకుళను నే నా వివాహప్రయత్నంబు
చేయనంపితి , వారిఁ జేరి యచట
నెళవుగా మాట్లాడ నేర్చునో , నేరదో
పురుషుల పనులౌనె పొలఁతిచేతఁ?
బడుచుఁ గల్గినవారు పట్టుగ నా మూల
మెఱుఁగరు గనుక , నా కీయమనుచుఁ
బొమ్మన్న , నటుమీఁదఁ బోఁగూడ దచటికి
మొదటి సంధానమే కుదురవలయు '

తే. ననుచు యోచించి సర్వజ్ఞుఁడయ్యు నరుని
కరణిఁ జింతించి , యవల శీఘ్రముగ లేచి
యప్పుడతిఁ జూడఁగోరి మోహంబుచేతఁ
దాళఁజాలక యొక విచిత్రంబుఁజేసె. 4

ఉ. అవ్విధ మెట్టులన్న వినుఁ డబ్జదళాక్షుఁడు జీర్ణవస్త్రమే
నివ్వటిలంగఁ గట్టికొని , నేరుపుగా నొక ప్రాఁతకుప్పసం
బవ్వల నొప్పఁగాఁ దొడిగి , యవ్వ విధంబున వంగిలేచుచున్
నవ్వుచుఁ గొండ డిగ్గి తన నాణెము లోకులకెల్లఁ జూపుచున్. 5

సీ. దంతంపు సొమ్ములు , తగు బండిగురిగింజ
దండ లొప్పఁగ మెడ నిండ మెఱయ
నీరజోద్భవు నేఁడు నెలల బాలునిఁ జేసి
యాదరించుచుఁ బ్రక్క నంటఁగట్టి
సంకుటుంగురములు పొంకంబుగాఁ బెట్టి
తనచేత నొక్క బెత్తంబు వట్టి
మునుకొని నవధాన్యములు నించి యొక బుట్టి
శిరమునం దిడికొని శీఘ్రముగను

తే. బోయి నారాయణాఖ్య సత్పురముఁ జే
చెలఁగి యా యూరి యమ్మలక్కలను జూచి
' యెఱుక ! యెఱుకో ! ' యనుచు నెలుఁగెత్తి పలుక
విని పురస్త్రీలు దాని బల్వింతగాను. 6

తే. మురిపమునఁ జూచి పలికి ' రో ముసలిదాన !
గద్దెఁ జెప్పుము మాకు నిక్కముగ ' ననుచు
బలుకఁగా , నంతలో రాచ చెలులు వచ్చి
యెఱుకతను జూచి వేడ్కగా నిట్టులనిరి. 7

క. 'దిట్టముగా నో యెఱుకత !
నెట్టన మా కోర్కిఁ జెప్పనేర్చితివైనన్
బట్టు పటావళు లిచ్చెద ,
మెట్టిది నీ యెఱుకఁ జెప్పు మెఱిఁగెద ' మనఁగన్. 8

క. ఎఱుకత యిట్లనియెను ' నా
యెఱుకే జీవనము జనులకెల్ల నెపుడు నా
యెఱుకే శుభదము , శాశ్వత ,
మెఱుకే సకల ప్రపంచ , మెఱుకే నేనున్. 9

సీ. వినుఁడు నా యెఱు కెట్టిదని యంటిరైన నీ
పంచభూతములఁ బుట్టించు నెఱుక
సరస జాగ్రత్సుషుప్తి , స్వప్నంబునకుఁ దుద
మొదలు తానై మూఁటఁ గుదురు నెఱుక
దండిగా బ్రహ్మాండభాండతండములందు
నిండి కుండలి నంటియుండు నెఱుక
మొనసి యాపోజ్యోతి నెనసి తాఁ దనలోనె
నిలిచి యానందించి వెలుఁగు నెఱుక

తే. ఇట్టి యెఱు కెవ్వ రెఱుఁగ , రా యెఱుక నిజము
ఎఱుఁగనేర్చిన వారి కా యెఱుక నేను
చెప్పెదనుగాని , మీకు నేఁ జెప్ప'ననినఁ
జెలులు విని ధరణీదేవి చెంత కరిగి. 10

తే. పలికి రిట్లని ' తల్లి ! యీ పట్టణమున
కొనర నెఱుకలసాని వచ్చినది , దాని
నిటకు రప్పించి సుత కష్ట మే విధమునఁ
దీరునో తద్రహస్యంబు తెలియ నడుగు. ' 11

మ. అని యా కాంతలు వల్క రాజసతి నెయ్యంబొప్పఁగా ' దానిఁ దో
డ్కొనిరాఁ బొం'డని పల్కఁగా , నరిగి యా కొమ్మన్ విలోకించి , ర
మ్మనుచున్ గొప్పగ నెంచి వారు పరమాహ్లాదంబుతో నందుఁ బి
ల్చిన వేరాకనె , బిడ్డఁ డేడ్చె ననుచుం జేఁదట్టి లాలించుచున్. 12

ఉ. ఆ కురవంజి యిట్లనియె ' నాడకు రమ్మని పిల్వవచ్చినా ,
రాఁకొనినాఁడు బిడ్డఁ డిపు , డమ్మల నక్కల నేడనైన నే
జోకగఁ జేరి వారలకు సోదె నిజంబుగఁ జెప్పకుండినన్
నా కడుపెట్ల నిండు?'నని నవ్వుచుఁ బల్కుచు మూల్గి యిట్లనెన్. 13

సీ. 'భాగ్యవంతులు వారు , బలుపేదరాల నే
నటుగాన నెటువత్తు నటకు నిపుడు
నా బొక్కినోరును , నరసిన వెండ్రుకల్
గొప్ప కడుపు , పెద్ద దొప్ప చెవులు
గూనివీఁపును , బండిగురిగింజ దండలు
దంతపు సొమ్ములు వింతగాను
గనుఁగొని , మణుల బంగారు సొమ్ములు వెట్టి
యున్నవా రందు నవ్వుదురు గనుక

తే. నాకు సిగ్గగు , మీ రాచనగరి కేను
వచ్చుటకుఁ గార్యమేమి ? నావలెనె పేద
తెఱవలైనట్టి వారి కే నెఱుకఁ జెప్పి
పొట్ట సాకుచునుండెద భూమిమీఁద. ' 14

తే అనిన వా రిట్టులనిరి ' మా యమ్మ కెఱుక
నిజముగా నీవు చెప్పిన నీకు రత్న
భూషణము లిచ్చి , బంగారు పుట్టమిచ్చి
పొమ్మనును , నీకవిప్పింపఁ బూఁట మేము. ' 15

## హరి ధరణీదేవి కెఱుకఁ జెప్పుట

మ. అని వారాసతి కాప్తలై పలికి , నెయ్యంబొప్పఁగా దానిఁ దో
డ్కొని యంతఃపురమందుఁ జేర్చి ; రచటన్ గూర్మిన్ ధరాకాంత దా
నిని బంగారపుఁబీటపై నునిచి మన్నింపంగ, నీక్షించి యి
ట్లనె నా సోదెలసాని నవ్వుచు మహాహ్లాదంబు దీపింపఁగన్. 16

ఆ. 'వనిత ! నీవు భాగ్యవతివి , నేఁ బలుపేద
దానఁగాన నాకుఁ, దనయునకును
బాలు బువ్వ వెట్టి , మేలైన విడెము నా
కిచ్చి యడుగు మెఱుక మెచ్చుగాను.' 17

క. అప్పుడు క్షీరం బన్నము
తెప్పున బిడ్డఁడును, దాను దిని లేచి ముదం
బొప్పఁగ ధరణీదేవినిఁ
గప్పురవిడె మిమ్మటంచు గ్రక్కున నడిగెన్. 18

సీ. ఆ యెఱుకలసాని కా ధరణీదేవి
విడెమిచ్చి పల్కె ' నో వెలఁది! మీది
యే దేశ మిలను , మీ యిండ్లేడ నుండు ? మీ
యూరి పేరేమి ? మా యూరి కేల
వచ్చితి? ' వనఁగ నవ్వనితను జూచి సో
దెలసాని నవ్వుచుఁ బలికె నిట్లు
' తరలాక్షి ! మావంటి యెఱుకువారల కిండ్లు
వాకిండ్లు గలవె ? యీ వసుధమీఁద

తే. గుడిసె లాడాడఁ గావించి కొన్ని దినము
లుండి పోయెడి వారల కూరు , దేశ
మేల ? మీ యూరి దయితల కెఱుకఁ జెప్ప
వలసి వచ్చితి మిచటి కో వారిజాక్షి ! 19

సీ. ఎఱుకవారలకెల్ల గుఱికట్టుగా నిల్వ
నొక్కచోటున్నది నిక్కముగను
నది యేడనన్న నాల్గాఱును బదియుఁ బం
డ్రెండుఁ బదాఱును రెండునైన
శృంగపంక్తులచేత నింగి కెగురుచుండు
నాఱుకొండలకు మీఁదైన కొండ
వేయు శృంగము లొప్ప వీక్షింపఁదగు కొండ
మూఁడేఱులను గూడి మొనయు కొండ

తే. నాల్గు త్రోవలకును నట్టనడిమి కొండ
పాము తనలోన నుండఁగాఁ బ్రబలు కొండ
కరువలినిఁ దనలో నిల్పి మెఱయు కొండ
తొంటి మా పెద్ద లున్నట్టి దొడ్డ కొండ. 20

క. ఆ కొండమీఁద నిక్కము
మా కాఁపుర మెపుడు సెలఁగ , మఱి జీవికకై
లోకుల కెఱుకలు సెప్పుచు
జోకగ బ్రతుకుదుము, నీవు సోదె లడుగుమీ ! 21

క. చెప్పెద ముంతెడు ముత్తెము
లిప్పుడు దెప్పించు'మనుచు నెఱుకత తనతో
నొప్పఁగఁ బల్కఁగ, నాసతి
యప్పుడు ముత్యములు దెచ్చి యచ్చట నుంచెన్. 22

ఆ. పసిఁడి చేటలోని పండుమౌక్తికము లా
గద్దెపాలఁతి సూచి కరము సాఁచి
ముత్యములను బిసికి మూఁడు రాసులు చేసి
మధ్య రాశియందు మదిని నిలిపి. 23

అప్పుడు ముమ్మాఱు చెయ్యెత్తి మ్రొక్కి, మనంబున గంగాది పుణ్యతీర్థంబులను , కాశీ గయా ప్రయాగ ప్రముఖ పుణ్యక్షేత్రంబులను , హరిహర బ్రహ్మాది దేవతలను, పరాశక్తి ప్రముఖానేక శక్తులను దలంచి పిలిచి మ్రొక్కి , మఱియు నిట్లనియె. 24

. 'విను ధరణీసతి ! యిచటికి
నెనవుగ దేవళ్లు వచ్చి నిలిచిరి ; నీవిం
కను దక్షిణ తాంబూలం
బు నొసంగుము , మ్రొక్కు గద్దెబుట్టను తరుణీ !' 25

వ. అనిన విని దక్షిణ తాంబూలంబుఁబెట్టి , గద్దెబుట్టికి మ్రొక్కి యెఱుకలసానితో ధరణీదేవి యిట్లనియె. 26

తే. 'కొమ్మ ! నా మదిలో నేను గోరినట్టి
కోర్కి నిజముగఁ జెప్పు నీ కొడుకున కిట
నందె లిచ్చెద, నీకు దివ్యాంబరంబు
లిచ్చెదను దబ్బుఱాడ కో యెఱుకలమ్మ !' 27

క. అని పలికిన ధరణినిఁ గనుఁ
గొని యెఱుకత యిట్టులనియెఁ ' గొడుకా ! మదిలో
ననుమానింపకు మిప్పుడు
ఘనముగ నీ కోర్కిఁ జెప్పఁగలనే సుమ్మీ !' 28

వ. అని పలికి , తన కెదురుగా ధరణీదేవినిఁ బసిఁడి గద్దె మీఁద గూర్చుండుమని, తనచేతి బెత్తంబుకొన నయ్యింతిచేతి కిచ్చి , 'విఘ్నేశ్వరా ! వీరభద్రా ! మలయాళ భగవతీ ! మధుర మీనాక్షీ ! యామ్నాయాక్షీ ! కామాక్షీ ! కనకదుర్గాంబా! చౌడాంబా ! జ్ఞానాంబా! కొల్లాపురలక్ష్మీ ! మీ రందఱు వచ్చి వా కియ్యరే ! వాకియ్యరే!' యని ప్రార్థించి , మఱియు నిట్లనియె 29

క. 'దిక్కులు చూడక సతి ! నా
దిక్కే నీ విపుడు చూడు ! దేవరతోడే !
నిక్కముఁ జెప్పెద నీ ' కని
మక్కువ నా యెఱుకలమ్మ మఱి యిట్లనియెన్. 30

వ. 'అవ్వో ! యవ్వ ! నీవు తలంచిన తలంపు మే లౌతుందంట ! దేవళ్ళు బలుకుతుండారు. తలంచిన తలం పేమంటివా ? చెప్పే వినవే ! దైతమ్మ! బిడ్డంటే కడుపు సూపుదు ; తోడఁబుట్టంటే భుజంబు సూపుదు. అట్లా తోడఁబుట్టు కడుగలేదు, ఇట్లా బిడ్డ కడుగు తుండావె ! దుండి ! ఆ బిడ్డ ఆడబిడ్డో , మగబిడ్డో అంటడుగుతుండావె ! కొడకా ! యిది ఆడబిడ్డంటే చెవి సూపుదు ; మగబిడ్డంటే గడ్డంబు సూపుదు. ఇదిగో అట్లా మొగబిడ్డ కడుగలేదు , ఇట్లా ఆడబిడ్డ కడుగుతుండావే దుండమ్మా ! అవ్వో ! యవ్వ! ఇప్పుడు మీ యాడబిడ్డ కొక్క చింత పుట్టివుండాది. ఆ చింత యేమంటే చెప్పే వినవే ! దుండి ! నిన్నటి దినంబు నీ బిడ్డ పుష్పవనంబులో నొక్క తురగారూఢుండైన నల్లనయ్యను జూచి మోహించియుండాదే ! దుండి ! ఆ నల్లనయ్య యెక్కడ వుండాఁడు ? యే వూర వుండాఁడంటడుగవే కొడకా! ఇదిగో ! యీ మూల వుండాడు. ఈ మూల వుండాఁడంటే తెలియలేదంటే కొడకా ! తెలియలేదంటే ! దుండి ! ఇదిగో ! యిక్కడికి వాయవ్య భాగమందు పడగలతో మెఱయుచున్న బంగారు కొండమీఁదనే వుండాఁడే ! యవ్వ ! వాఁ డెవఁ డంటె , బొల్లినామంబులు పెట్టుకొని బొల్లిపిట్టమీఁద నెక్కి కొల్లకాఁడై యెల్లదిక్కులు దిరిగే నల్లనయ్యే తల్లి ! వాఁడు నిబద్ధిగాను సీమన్నారాయణుండె కాని , నరుండు కాఁడె ! కొడకమ్మ ! వాఁడు నీ బిడ్డను పెండ్లియాడవలె నంటావుండాఁడు. నీ బిడ్డయును వాణ్ణి పెండ్లియాడవలె నంటావుండాది. కాఁగా వానికి దీని నిచ్చి పెండ్లిచేసితే నీ బిడ్డ సుఖముగా వుంటుండాది. లేకుంటే దానికి బలు కష్టము వస్తుండా ' దని చెప్పిన విని ధరణీదేవి యెఱుకతను జూచి యిట్లనియె. 31

క. 'ఓ యెఱుకత ! నీ మాటలు
మాయగఁ దోఁచినవి మనుజమానినులను నా
రాయణుఁడు పెండ్లియాడిన
దీ యిలలోఁ గలదె ? చూడ నెచ్చటనైనన్. ' 32

సీ. అని వింతగా నవ్వి యా సతి పల్కఁగా
విని యెఱుకలసాని వేడ్క ననియె
' నా స్వామి మదకరి నదలించి తఱుముచు
వచ్చి నీ సుత యున్న వనముఁ జేరి
తన కులగోత్రముల్ , తన కోర్కి నీ ముద్దు
చిన్నారి బుడుతకుఁ జెప్పినాఁడు
నీ కూఁతు రది విని నిష్ఠురోక్తులు వల్కి
యతఁడెక్కి వచ్చిన హయముమీఁద

తే. ఱాళ్ళు రువ్వింప, నేల గుఱ్ఱంబు వడియె
నతఁడు మన్నించి యా వేంకటాద్రిఁ జేరె
ముగ్ధ కటుమీఁద ఘనకామమూర్ఛ దాఁకె
విరహతాపజ్వరంబుచే వేఁగసాఁగె. 33

తే. ఆ జ్వరము మాన్ప వేఱె లే దౌషధంబు
కమలనయనుని మోము నీ కన్య కిచటఁ
జూపుఁ , డటు చూపినపుడె మీ సుతకు వచ్చి
నట్టి తాపజ్వరంబు చల్లాఱిపోవు. 34

తే. అనుచుఁ బల్కిన కొఱవంజి నతివ చూచి
' కమలలోచనుఁ డేడ ? మా కన్య యేడ ?
నతని నిది చూచుటేడ ? మోహజ్వరంబు
పోవుటేడ ? యిదేమొ నీ బూటకములు ? 35

క. విన విన దబ్బఱగాఁ దోఁ
చిన , దిల నెందైన నిట్టి చిత్రము గలదే ? '
యనఁగా నెఱుకలసాని
ట్లనియెను ' నా మాట దప్ప దవ్వో ! యవ్వా ! 36

సీ. ఇఁకఁ గొంత తడవున కిచటికిఁ బెండ్లి పె
త్తనముఁ జేయుటకు మోదంబుమీఱ
నా వేంకటేశ్వరుఁ డంపఁగా నొక్క క
న్యక వచ్చు నప్పుడు నా నిజంబు
తెలియు , నీ కిపు డెంత తెలియఁజెప్పినఁగాని
తెలియలే దో ధరాదేవి ! నీకుఁ
దెలిసినప్పటికి నన్ బిలిపించి బహుమాన
మిప్పించు , మిప్పు డేమీయవలదు

తే. నా కిపుడు నీవు సెలవిమ్ము , నీ కుమార్తె
పెండ్లి కిచటికి వత్తు నా బిడ్డతోడ
మగువ ! నే నీకుఁ జెప్పిన మాట నిజమొ
దబ్బఱో నీవె నీ ముద్దుతనయ నడుగు. 37

వ. అవ్వో ! యవ్వ ! కడుపుకూటికొఱకు దబ్బ ఱాడితినని సంశయించినా ; యిది కల్ల గాదు , కైలాటకము గాదు , తరకటము బురకటము గాదు ; తబ్బిబ్బు గాదు , తసుకు గాదు , బుసుకు గాదు , తాటోటు గాదు , ఆడంబరము గాదు. నా మాట నా గద్దె బుట్ట తోడె ! నా బుడుతని తోడె ! నిజమౌ నిది ' యని నమ్మఁజెప్పి , దిగ్గున లేచిపోయి పరమపురుషుండైన శ్రీనివాసుండు నిజరూపంబున వేంకటాద్రిఁ జేరె ; నంత ధరణీదేవి యాశ్చర్యంబు నొందుచుఁ బద్మావతి చెంతఁజేరి యిట్లనియె. 38

## పద్మావతి తల్లికి హరివృత్తాంతంబుఁ జెప్పుట

ఉ. 'అమ్మ ! యిదేమి పద్మ ! యిపు డారటమొందుచుఁ బవ్వళించి బల్
సొమ్మసి లింతప్రొద్దునకు జోకగ లేవవు ; నిన్నుఁ జూచి నే
నెమ్మది నెట్టులుందు ? నిఁక నీ మదిలోపలఁ గల్గు చింత ని
క్కమ్ముగఁ దెల్పు ; నీ కలికికన్నుల నీరిటు నించనేటికిన్ ? 39

క. నే వలదన్నను నిలువక
యా వనమున కరిగి నిన్న నాట్లాడఁగ , నిన్
భావించుచుఁ గని రెవ్వరు ?
నీ వెవరినిఁ గంటి వచట నీరజనేత్రా ! 40

తే. నేను తల్లిని , బిడ్డవు నీవు నాకుఁ
గాన నరమరవల , దందుఁ గలిగినట్టి
వింత దాఁపక యిఁకఁ జెప్పు ! వెఱవనేల ? '
యనినఁ గన్యక మాట్లాడ కడలుచుండె. 41

క. ఆ కన్యక యివ్విధమున
శోకింపఁగఁ జూచి ధరణి చోద్యపడుచు ' నీ
కీ కరణిగ నతిదుఃఖము
రాకకుఁ గతమేమి? దెల్పు రాకేందుముఖీ ! 42

తే. అమ్మ ! నిజముగ ధరమీఁద నాప్తు లింక
నా కెవరు లేరు , నాకన్న నీకు లేరు
నన్ను నరమరగాఁ జూడ,కున్న మాట
దాఁపకను జెప్పు నాకు నీతండ్రి తోడె ! ' 43

చ. అని యిటు లానఁబెట్టి సుత నప్పుడు మెల్లగ లేవనెత్తి తా
ననుపమమైన ప్రేమను నిజాంకతలంబున నుంచి , శీర్షమున్
నెనరునఁ జేత దువ్వుచును నేర్పుగ లాలన మెంత జేసినన్
దన తలవంచి పల్కని సుతన్ ధరణీసతి చూచి క్రమ్మఱన్. 44

ఆ 'పట్టి ! నీవు సేయు పాపంబుగా దిది
పరఁగ నేను చేయు పాప మింత
చేయుచున్న దేమి సేయుదు?'ననుచుఁ గ
న్నీరు తాను నింపు చూరకుండె. 45

సీ. ఆరీతిఁ దన కొఱ కార్తిఁబొందిన తల్లి
నా పడంతుక చూచి తాపమొంది
కనుల బాష్పము లొల్కఁగా నిట్టులనియె ' నో
యమ్మ ! పుష్పవనంబునందు నేను
సఖులతో నాట్లాడు సమయమం దచటికి
దివ్యపురుషుఁడొక్క తేజిమీఁదఁ
దగనెక్కి వచ్చి నన్నెగసక్కెమాడఁగా
నేను కోపించి , మన్నింప కతని

తే. ఱాళ్ల రువ్వింప , నేల గుఱ్ఱంబు వడియె
నతఁ డెచటఁ జేరినాఁడొ? నే నది యెఱుంగ
నతని సుందరనీలదేహంబు కనులఁ
గట్టినట్టిప్పుడున్నదే కన్నతల్లి ! ' 46

క. అని పద్మావతి వలుకఁగ
విని ధరణీదేవి సుతను వీక్షించి మనం
బున మోదము ఖేదముఁ బెనఁ
గొనఁగా లజ్జించి ముద్దుకూఁతురి కనియెన్. 47

సీ. 'నా తల్లి ! నీ చిన్ననాఁడు నీ కిటువంటి
బుద్ధి యేల జనించెఁ బువ్వుఁబోఁడి!
వనమున కేఁగి యా వన పురుషునిఁ జూచి
వలచె నందురె నిన్ను వనజపాణి !

పుట్టిపుట్టకతొల్లి పురుషస్వరూపంబు
నీకెట్ల దెలిసెనే నీలవేణి !
వాని కులంబేమె ? వానిపై నీ కింత
మరులేల కలిగెనే మధురవాణి ?

తే. కటకటా ! మానధనుఁడు నిన్ గన్న తండ్రి
నీ మనోవ్యథ నిజముగా నేఁడు వినినఁ
జింతచేఁ దలయెత్తలే కెంత మదినిఁ
గుందునో దీని కెటుసేతుఁ గుందరదన ? 48

క. 'వనమున సుందరపురుషునిఁ
గనుఁగొని మదిలో వరించె గగనాధిపు బి '
డ్డని లోకులు నిందించిన
వినవలసిన దేమి సేతు? విధి యిటు సేసెన్. 49

క. లోకంబంతయు మూయను
మూఁకుడు లే , దతని నేల మోహించితివే ?
మాకును నీకును ధరపై
నే కరణినిఁ గీర్తి వచ్చు నిటువలెనైనన్ ! ' 50

సీ. అని యిట్లు వల్కఁగా నపుడు పద్మావతి
హరిపూర్వవృత్తాంత మాత్మయందుఁ
దలఁచి యిట్లనియె ' నో తల్లి ! నీ కపకీర్తి
వచ్చుననియెడు చింత వల,దతండు
మనుజమాత్రుఁడటంచు మది నెంచినావేమొ
మనుజుండు గాఁడు , రమావిభుండు
పురుషోత్తముండు సంపూర్ణ ప్రకాశుండు
సర్వజ్ఞుఁ డాద్యుండు శాశ్వతుండు

తే. గాన , నా స్వామియందు నా మానసంబు
కుదిరి నిలిచిన ; దిది నాకుఁ గొదువ గాదు
నా కొఱకు భూమి నపకీర్తి మీకు లేదు
కావలసినట్టి పని యింకఁ గాకపోదు. 51

వ. జననీ ! విను మే మహామహుని దివ్యచక్రంబు కౌరవ బలంబులఁ ద్రుంచి కరినగరంబున ధర్మరాజును పట్టభద్రుం జేసి తత్పురసంరక్షణంబు సేయుచుండు, నే మహాత్ముని శంఖారావంబు దైత్యబృందంబునకు భ[illegible]దంబయి దేవతల కానందంబు నిచ్చుచుండు , నట్టి శంఖచక్రదరుండైన పరమపురుషుండు లీలామానుషవిగ్రహుండై నిన్న నవ్వనంబున నాకుఁ బ్రత్యక్షంబయ్యె ; నప్పుడు నే నీ మర్త్యలోకానుసారంబుగా నద్దేవు ధిక్కరించి ఱాళ్ళ రువ్వించి తఱిమించితి, నయ్యపచారం బేను చేసినందు కమ్మహావిష్ణుండు నన్ను రక్షించునో , రక్షింపఁడో యను సంశయంబున భయంబు నొంది కన్నీరునించుచుండుటే కాని , కామ వికార వ్యాపారం బెఱుంగ ; నా శ్రీనివాసస్వామి దివ్యమంగళవిగ్రహంబు నాకుఁ గ్రమ్మఱఁ బ్రత్యక్షంబైన జీవించుచుండెదఁగాక ! లేకపోయిన నిమ్మహియందు నిర్వహింపఁ జాల'నని పల్కి , బాష్పధారాపరిపూరితాక్షియై పూఁబాన్పుమీఁద మరల వ్రాలినం జూచి ధరణీదేవి యిట్లనియె. 52

సీ. 'అమ్మ ! పద్మావతి ! హరిభక్తి నీ చిత్త
మందింతగా నిల్పినందువలన
నీ కోర్కి సిద్ధించు ; శోకింపవలదింక
నా చక్రి నినుఁ బెండ్లియాడుననుచుఁ
దేటగా నొక ధర్మదేవత వచ్చి నా
కెఱుఁగఁజెప్పిన మాట లేల తప్పుఁ ?
దప్ప విప్పుడు నీవు ధైర్యఁ బుఁ ' చుండు'
మని చెప్పుచుండఁగా నంత నటకుఁ

తే. గ్రమముగా విప్రముఖ్యు లగస్త్యలింగ
మునకు రుద్రాభిషేక మిమ్ముగ నొనర్చి
పరఁగఁ దత్తీర్థమును , బూలు , పత్రి , పండ్లు
కోరి గైకొని రాఁ జూచి , వారితోడి. 53

తే. చెలులతో ముచ్చటాడుచు స్నేహమొప్ప
వకుళమాలిక వేడ్కగా వచ్చె నపుడు ,
ద్విజులు రుద్రాభిషేక సత్తీర్థ మమరఁ
బరఁగఁ బద్మావతీదేవిపైనఁ జల్లి. 54

## వకుళమాలిక ధరణీదేవితో సంభాషించుట

తే. పొసఁగ మంత్రాక్షతంబులు , పూలు , పండ్లు
వెలయ నా రాజసుతకు దీవించి యొసఁగి
వీఁడుకొని చని ; రటుమీఁద వేగ వకుళ
మాలికను జూచి సంతోషమగ్న యగుచు. 55

క. ధరణీదేవి రయంబునఁ
బెరిమెను వకుళను సురత్నపీఠముమీఁదన్
గరమర్థి నునిచి పదములు
మురియుచుఁ దా గడిగి పూజ ముందుగఁ జేసెన్. 56

సీ. అటుమీఁద భక్తి నిట్లనియె ' మహామాత !
యెందుండి వచ్చితి విచటి కిపుడు
వచియింపు ' మనఁగ నవ్వకుళమాలిక యిట్టు
లనియె 'నోయమ్మ ! శేషాద్రినుండి
వచ్చితి'ననఁగ , 'నెవ్వరిదాన ' వని ధర
ణీదేవి యడుగఁగా 'నిరత మేను
ధర వేంకటేశ్వరు దాసినై యుందు , నా
స్వామి పంపించఁగా వచ్చి యిచటఁ

తే. జేరినా'నని వకుళ మచ్చికను బలుక
విని మహీపతిసతి ' యేమి పనికి నీవు
వచ్చినా?' వని యడుగఁగా వకుళ ' పెండ్లి
పెత్తనము సేయవచ్చితిఁ బ్రేమమీఱ.' 57

క. అని పలికిన వకుళను గనుఁ
గొని ధరణీదేవి ' యెవరికొఱ కిప్పుడు పె
త్తన మిచటఁ జేయవచ్చితి ? '

వని యడుగఁగ వకుళ యిట్టు లనియెను వేడ్కన్. 58

సీ. 'విను ధరణీదేవి ! వేంకటేంద్రునకు నీ
వరకన్య నడుగ నే వచ్చితి నిటు
తక్కక మీరియ్యఁ దగు'నన్నఁ 'గులగోత్ర
ములు దెల్పు , తల్లి దండ్రులను దెలుపు '
మని ధరణీదేవి యడుగఁగా వకుళ యి
ట్లనియెఁ ' గులంబు శీతాంశుకులము
గోత్ర మొప్పు వసిష్ఠగోత్రంబు , దేవకి
జనని , శూరసుతుండు జనకుఁ 'డనుచుఁ

తే. జెప్పఁగా , నవ్వి వకుళ నీక్షించి ధరణి
పలికె నిట్లని ' సౌందర్య భాగ్య సుగుణ
శీలములఁ దేటగా నీవు చెప్పు'మనిన
విని ముదంబున వకుళ యిట్లనియె మరల. 59

సీ. 'సతి ! నీవు మా స్వామి సౌందర్య మడిగిన
మహి నొప్పు మన్మథ మన్మథుండె
పట్టుగా నమిత సౌభాగ్యంబు నడిగిన
జెప్ప శక్యంబె ! లక్ష్మీవిభుండె

సుస్థిరంబైనట్టి సుగుణంబు లడిగిన
గురుతరానంత సద్గుణగణుండె
శీలంబు నిపుడు మచ్చికను నీ వడిగిన
వేదోక్త సద్ధర్మ విహరణుండె

తే. కనుక సౌందర్యమును , సుభగత్వగుణము
లమలశీలము నామ్నాయసమితి దెలిసి
చెప్పలేవందు ; రేనేమి సెప్పనేర్తు?
నమ్మ ! మీ కన్యకామణి కబ్బె నతఁడు. ' 60

మ. అని యా భామిని పల్కఁగా ధరణి ' నెయ్యంబొప్పఁగా శ్రీరమా
వనితారత్నము చెంతనుండఁగను మా వామేక్షణన్ బెండ్లియా
డను విష్ణుండు దలంచెనంటి , విది యెట్లా నిశ్చయం?బంచు నా
కనుమానంబుగఁ దోఁచె ; విన్న మనుజుల్ హాస్యంబుగా నెన్నరే ? ' 61

సీ. అని ధరణీదేవి యనుమానముగఁ బల్క
వకుళ యిట్లనియె ' నవ్వార్ధితనయ
కొల్లాపురముఁ జేరి యెల్ల భక్తులను సం
రక్షించుచున్నది , వక్షమందుఁ
గమల యిప్పుడు లేదు గావున మీ కన్య
నీక్షించి చక్రి మోహించినాఁడు
మీరు మీ కన్య నా నారాయణున కిచ్చి
చెలఁగి వివాహంబుఁ జేయుఁ'డనుచుఁ

తే. జెప్పి , కొల్లాపురము సిరి చేరినట్టి
పూర్వ వృత్తాంత మతివకుఁ బొసఁగఁ జెప్పి ,
వేదవతి పూర్వవృత్తాంత మాదరముగఁ
బట్టుగాఁ జెప్పి సమ్మతిపఱచి మరల. 62

తే. లేచి రత్నాసనంబిచ్చి లెస్స పూజఁ
జేసి మ్రొక్కఁగ, నృపతి నీక్షించి కరుణ
నతనిఁ గూర్చుండ నియమించి, యమరగురునిఁ
జూచి ముదమంది వేడ్కనా శుకుఁడు పలికె. 71

క. 'సురగురువర ! నన్నిచటికిఁ
గరుణను బిలిపించినట్టి కార్యము నాతోఁ
ద్వరగాఁ జెప్పు'డనఁగ విని
గురుఁడు ముదంబొదవ నా శుకున కిట్లనియెన్. 72

సీ. 'విను శుకయోగీంద్ర ! ఘనుఁడైన వేంకటే
శ్వరుఁడు పద్మావతి వలచి తాను
పెండ్లియాడెదనను ప్రేమ రెట్టింపఁగా
వకుళమాలికయను వనజముఖినిఁ
దక్కక పెండ్లి పెత్తనముఁ జేయుటకు నేఁ
డంపించినాఁడు, నన్నందుకొఱకు
నృపతి పిల్పింపఁగా నేను వచ్చితి, నీవు
వచ్చితి; విపుడు భూవరున కేమి

తే. సెప్పవలె ?' నన్న గురుని వీక్షించి శుకుఁడు
పలికె 'నీ రాజు పుణ్యప్రభావముననె
పద్మ గల్గిన, దిట్టి సౌభాగ్యవతికిఁ
దగఁడు మనుజుండు, శ్రీరమాధవుఁడె తగును. 73

తే. అని, 'నృపాలక ! నీవు మహాతపంబుఁ
జేసి యీ కన్య నిలను గాంచితివి, పుణ్య
ఫలము సిద్ధించె; నిపుడ యీ పద్మగంధిఁ
బ్రేమ మీఱఁగ హరి కిచ్చి పెండ్లి సేయు. 74

చ. అని శుకయోగి పల్కఁగ మహాముదమొంది నృపాలపుంగవు
డనియె ' గురుండు,నీవు శుభదంబగు లగ్నము నేర్పరించి , పొం
తనములు చూడుఁ'డన్న విని తక్కక నాశుకుఁడున్ గురుండు పెం
పొనరఁగఁ బొంతనంబులు మహోన్నతలగ్నమునందుఁ జూచుచున్. 75

వ. అప్పుడు నక్షత్రానుగుణంబుగా యోనికూటంబును , నాడీకూటంబును , సూత్రయోగంబును మొదలైన దశ విధంబులగు పొంతనంబులు సూచి రాజునకు సమ్మతంబుగాఁ జెప్పి ; రంత నా నృపాలకుండు సభామధ్యంబున భుజంబెత్తి ' శ్రీనివాసస్వామివారికిఁ బద్మావతి నిచ్చి పెండ్లిచేసెద ' నని నిశ్చయించి పలికి, బృహస్పతినిఁ జూచి మఱియు నిట్లనియె. 76

సీ. 'హరికి నమస్కార మనుచు వ్రాయించెద '
నన విని ధిషణుఁ డిట్లనియె ' నృపతి !
యా స్వామి మానవుండై నీ సుతను బెండ్లి
యాడఁదలంచినాఁ , డందువలన
మొనసి నమస్కారమని వ్రాయఁగూడదు
మేలు కాశీర్వాదమే యటంచు
నమరఁ బత్రిక వ్రాసి యంపించు'మని శుక
సమ్మతంబుగఁ బల్క , జన విభుండు

తే. ననుజ పుత్ర కళత్రాదులైన బంధు
జనులు హర్షింపఁగా సభాస్థానమందుఁ
బ్రాకటంబైన బంగారు రేకుమీఁద
మంచి లగ్నంబునందు వ్రాయించె నిట్లు. 77

సీ. 'శ్రీమదఖండలక్ష్మీ ప్రసన్నేక్షణా
లంకృతులయిన సల్లలితులయిన
యఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన
సర్వజ్ఞులయిన శ్రీస్వామివారి

కాకాశనృపుఁ డాయు రారోగ్య పుత్త్ర పౌ
త్త్రాభివృద్ధులు గల్గునట్లుగాను
దీవించితిమి , నేఁటి దినమున కిచ్చుటఁ
గుశలంబు మాకు , మీ కుశల మచట

తే. వ్రాసి పంపించవలయు , నా వ్యాససుతుఁడు
గురుఁడుఁ జెప్పఁగ మీకు నా కూఁతురైన
పద్మవతి నిచ్చి చేసెదఁ బరిణయంబు
చిత్తగింపు చిదుల్లాస ! శ్రీనివాస ! ' 78

వ. అని శుభ పత్రిక వ్రాయించి హరిద్రాలేపనంబుఁ జేయించి బృహస్పతి చేతి కిచ్చె ; నా లిఖితంబు చూచి గురుండు శుకయోగీంద్రుని చేతికిచ్చి చిఱునవ్వు నవ్వి ' యీ లిఖితంబు శ్రీనివాసస్వామివారికి సమర్పించి , ప్రత్యుత్తరంబుఁ దెచ్చుటకు మీరే యోగ్యు'లని పలికిన , శుకయోగీంద్రుండు పరమానందంబు నొంది యా లిఖితంబు చేకొని వేంకటాచలారోహణంబు చేసె ; నప్పు డమ్ముని రాకడ కెదురుచూచుచున్న శ్రీనివాసుం డెదురుగాఁ బోయి శుకుం దోడ్కొని వచ్చి , తింత్రిణీవృక్షమూలంబునఁ దాను రచియించియున్న పుష్పపీఠంబునం దుంచి, యిట్లనియె. 79

క. 'ఓ యోగీశ్వర ! సత్కృప
నీ యెడ కిటు మీరు వచ్చుటిది మేలయ్యెన్
మాయావిరహిత ! నాపని
కాయో పండో నిజంబుగాఁ దెల్పుమయా ! ' 80

క. అనఁగా మందస్మితుఁడై
విని శుకయోగీంద్రుఁడనియె ' విశ్వాత్మక ! మీ
ఘన చిత్తంబునఁ దలఁచిన
పని కాయగ నిలువనేల? పండై యొప్పెన్. ' 81

చ. అని శుకయోగి పల్క , నపు డబ్జదళాక్షుఁడు సంతసించి య
మ్మునికి నమస్కరించి తనముచ్చట లొప్పుగఁ గొన్ని చెప్పఁగా
విని ముదమొంది తాపసుఁడు వేడ్కను దాఁగొనివచ్చినట్టి యా
ఘనశుభలేఖ మచ్చికను కంజదళాక్షుని చేతి కిచ్చినన్. 82

క. అప్పుడు హరి యా పత్రిక
తప్పక తాఁ జదివి తెలిసి , తడయక యపుడే
గొప్ప మొగలి తేకులపై
నొప్పుగఁ గొనగోట లిఖిత మొనరఁగ వ్రాసెన్. 83

సీ. బాదరాయణసుతున్ పట్టుగా వినుమని
సరసీరుహాక్షుండు చదివె నిట్లు
' శ్రీపూర్ణ రాజపూజితులైన ధర్మత
త్పర సుధర్ముల వరతనయుఁడైన
సామ్రాజ్యకలిత రాజశ్రీ గగనరాజు
వారికి శేషాద్రివల్లభుండు
వందనంబులు , నేఁటివఱకు మాకు శుభంబు
వసుధ మీ కుశలంబు వ్రాసి పంపఁ

తే. దగును , వైశాఖమున శుక్లదశమినాఁటి
శుక్రవారంబు రాతిరి శుభముహూర్త
మునకు మా బంధుమిత్రుల మొనసి కూడి
వత్తుమట , కివే పదివేల వందనములు. 84

సీ. అని తాను వ్రాసియున్నటువంటి లిఖితంబు
పొలుపొందఁ జదివి , సత్పుష్పహార
మును , శుభలేఖ నమ్మునిహస్తమున కిచ్చి
నవ్వుచు నాలింగనంబొనర్చి

వినుతించి హరి శుకు వీడ్కొల్ప , గిరి డిగ్గి
మునియు నారాయణపురముఁ జేరి
యాకాశరాజున కా లిఖితంబిచ్చి
యతనిచే సత్కృతుఁడై , గురునకు

తే. నృపునకును హరిశుభవార్త లపుడు సెప్పి
మహిమచే నొప్పు నైజాశ్రమంబు వేగఁ
జేరె ; నంతట నాకంబుఁజేరె గురుఁడు
పురముఁ గైసేయఁదలఁచి యా భూవరుండు. 85

వ. పరిచారకుల నియమించె ; నందు ధరణీదేవి వకుళమాలికకు దివ్యాంబరాభరణంబు లిచ్చి వీడ్కొల్ప , శేషాద్రికి వచ్చి శ్రీనివాసు నీక్షించి యా యింతి యిట్లనియె. 86

## వకుళమాలిక హరికి శుభవార్త లెఱిఁగించుట

సీ. 'నా తండ్రి ! వేంకట ! నారాయణపురంబు
నకుఁ బోయివచ్చితి , సకల శుభము
లొదవె , వివాహమహోత్సవంబునకు నే
నేమి పనులు సేతు నిచట'ననిన
విని హరి పల్కె ' నో జనని ! యీ పెండ్లిపె
త్తనముఁ జేసితి , వింక ద్రవ్యమేడఁ
దెచ్చెద , వేనేడఁ దెత్తు ? దీని కుపాయ
మేమి ? నా కెఱిఁగింపు మిప్పు'డనిన

తే. వకుళమాలిక పల్కె ' నవ్వసుధితనయ
నిచ్చుటకిఁ బిల్వనంపిన హెచ్చుగాను
ధనము నీకిచ్చు'ననిన మాధవుఁడు వకుళ
మాలికను జూచి పలికె ' నో మాత ! వినుము. 87

సీ. వనజాలయను బాసి వచ్చి , యిచ్చటఁ బెండ్లి
యాడెద ననిన నా కాప్తముగను
ధనమిచ్చునే సిరి? ' యని పల్కి తలవాల్చి
చింతింప , వకుళ శ్రీశ్రీనివాసు
నీక్షించి 'వారితో నెంతో భరమ్ముగఁ
జెప్పి వచ్చితిని , నీ విప్పు డిట్ల
చింత నొందిన నేమిసేయుదు ? నీమాట
లా వరాహస్వామికైనఁ జెప్పి

తే. తక్క కేమైన నొక ప్రయత్నంబుఁ జేయ
వలయు , నిపు డూరకుండి వివాహమునకు
వారు పిలిపించినపుడు ద్రవ్యంబు లేక
పెండ్లి కేరీతిఁ బోదమో బిసరుహాక్ష ! ' 88

క. అని యా వకుళ మహాభయ
మునఁ బలుకఁగ , నవ్వి చక్రి ముచ్చటగా ని
ట్లనియె ' వరాహస్వామిని
ధనమిపు డీవడిగిరమ్ము తల్లి ! రయమునన్. ' 89

వ. అని హరి వినోదంబుగాఁ జెప్పినం జని , వకుళమాలిక వరాహస్వామి చెంతఁ జేరి నమస్కరించి యిట్లనియె. 90

సీ. 'శ్రీ వరాహస్వామి ! శ్రీనివాసుఁడు పెండ్లి
యాడఁదలంచినాఁ , డర్థ మిచట
లేదు , వివాహ మేలీలగా నగు ? నిందు
కే యుపాయముఁజేత మింకమీఁదఁ ?
బడుచు నిచ్చెడువారు భాగ్యవంతులు , వారి
తో సరిగాఁ దులఁదూఁగవలయు ;
నది మాని వేంకటుఁ డామహీపతి గన్న
కన్యకు మెడ బొట్టుఁ గట్టఁదలఁచి

తే. నా౯, డతం డిట్లు చేసిన నరులు నవ్వి
పోదు రటుగాన, నీవైన భూరిధనము
పొసఁగ నొడఁగూర్చు'మనఁగ,నా భూవరాహ
దేవుఁ డా సతి నీక్షించి ధీరుఁడగుచు. 91

సీ. పలికె ' నో వకుళ ! నిర్భయముగా నీవుండు
మా శ్రీనివాసున కర్థ మిచటఁ
దక్కువ గాదు, మోదంబుతో నూరక
చూచుచునుండు మా చోద్యములను
నీవు సెప్పక మున్నె నే నా మహాస్వామి
యలఘుచరిత్రముల్ దెలిసినాఁడ
మొనసి నే నానందముగఁ జూచుచున్నాఁడ
నీకేల యీ చింత ? నెమ్మదిగను

తే. హరికడను నిల్చియుండు ! బ్రహ్మాదు లిటకు
వచ్చి చేతురు చక్రి వివాహ'మనుచుఁ
జెప్పి వీడ్కొల్పఁగాఁ, బోయి శ్రీనివాసుఁ
జేరి కిటి యన్న మాటలు సెప్పె వకుళ. 92

వ. అంత రమాకాంతుండు సంతసించి స్వాంతంబునం దనంత గరుడుల స్మరించె ; నపు డుప్పొంగి యప్పన్నగేంద్రుండును, బక్షినాయకుండును వేంకటాద్రికి వచ్చి చక్రికి దండప్రణామంబు లాచరించినం జూచి, రెండు శుభలిఖితంబులు వ్రాసి వారల కిచ్చి యిట్లనియె. 93

ఆ. 'గరుడ ! నీవు వోయి కంజసంభవున కీ
లిఖిత మిచ్చి నైజనిఖిలబంధు
సహితముగఁ గుటుంబసంఘంబుతో వచ్చి
చెలఁగి నాకుఁ బెండ్లిసేయు మనుము. 94

క. పొ'మ్మని యా విహగేంద్రుని
సమ్మతిగాఁ బనిచి ' శేష ! శర్వునిఁ బిలువన్
బొమ్ము , కుటుంబయుతమ్ముగ
రమ్మను నా పెండ్లిఁ జూడ రయమున శివునిన్. ' 95

## బ్రహ్మేంద్రాదులు సపరివారులై వివాహమున కేతెంచుట

మ. అని నారాయణుఁ డంపఁగా నపుడు శేషాఖ్యుండు శ్రీకంఠుఁ బి
ల్వను బోయెన్ ; ఖగనాయకుం డెగసి యా వాణీశ్వరుం జేరి , కొ
మ్మని యా పత్రిక చేతి కిచ్చిన , నజుండచ్చోట నుండే మహా
మునులెల్లన్ వినఁ దా వచించె నిటు సమ్మోదంబు దీపింపఁగన్. 96

సీ. 'శ్రీరస్తు బ్రహ్మ కాశీర్వాద , మహిగిరి
మీఁద మాకు శుభంబు , మీ కుశలము
వ్రాయించి పంపించవలయును ; దరువాత
సురుచిర వైశాఖశుక్లదశమి
శుక్రవారమునాఁటి శుభముహూర్తంబున
గగనాధిపతిసుతఁ గ్రమముగాను
గలియుగంబునఁ గరగ్రహణంబుచేసెద
మెఱయఁ గుటుంబసమేతముగను

తే. రాఁదగినవారిఁ దోడ్కొని రయముగాను
వచ్చి సాగింపవలె నా వివాహ'మనుచు
వ్రాసియుండిన లిఖిత మా వనజభవుఁడు
చదివి శిరసావహించి యాశ్చర్యముగను. 97

వ. అప్పు డక్కమలాసనుండు శ్రీనివాసస్వామివారి వివాహ మహోత్సవంబునకు సహకుటుంబులై రావలెనని దిక్పాలకప్రముఖులకు శుభలేఖలు వ్రాయించి పంపించి , తాను సకలదివ్యాభరణాలంకృతుండై , సావిత్రీ , గాయత్రీ ,

సరస్వతీ సమేతుండై హంసవాహనం బెక్కి , చతుర్వేద పారాయణులైన మహర్షులం దోడ్కొని, మంగళ వాద్యంబులు ఘోషింప , ఖగేంద్రునితోడ వేంకటాద్రికి వచ్చె ; నప్పుడు శ్రీనివాసుండా వాద్యరవంబు విని లేచి బ్రహ్మ కెదురుగాఁ బోయె , నపుడు హంసవాహనంబు డిగ్గి విరించి చక్రికి నమస్కరించినం జూచి విష్ణుం డజునిమీఁదఁ బుత్రస్నేహం బగ్గలింప ముహూర్తద్వయంబు గద్గదకంఠుండై మాట్లాడక యజు నాలింగనంబుఁ జేసి తోడ్కొనివచ్చి , తింత్రిణీవృక్ష మూల ప్రదేశంబునం దుంచిన సింహాసనంబుమీఁదఁ గూర్చుండి , భృగుమునీంద్రుఁడు తన్నుఁ దన్నిన వ్యాజంబున లక్ష్మి కొల్లాపురంబుఁ జేరినది మొదలుకొని తా ననుభవించిన కష్టంబులును , బద్మావతినిఁ బరిణయంబగుటకుఁ బుట్టిన హేతువులును గ్రమంబుగా విరించితోఁ జెప్పుచున్న సమయంబున. 98

సీ. శేషుండు కైలాసశిఖరికిఁ జని చంద్ర
శేఖరునకు శుభలేఖ యిచ్చె
నజునకు వ్రాసియున్నటువలె వ్రాసిన
పత్రిక గిరిజయున్ బ్రమథగణము
లరుదుగా విన శివుం డా జాబుఁ జదివి , గ్ర
క్కున లేచి పార్వతిఁ గూడి దివ్య
భూషణాంబరములు పొలుపుమీఱ ధరించి
వృషభవాహన మెక్కి , వివిధవాద్య

తే. రవము లుప్పొంగఁగా ఫణిరాజుతోడఁ
బ్రమధగణములు గొల్వ శ్రీపన్నగాద్రిఁ
జేరవచ్చుచునుండఁగా , శివుని రాకఁ
దెలిసి సమ్మోదమున వాసుదేవుఁడపుడు. 99

వ. అందున్న బ్రహ్మతోడ లేచి శివుని కెదురుగాఁబోయినం జూచి నందివాహనంబు డిగ్గి రుద్రుం డా చక్రికి నమస్కరించె ; నారాయణుం డా రుద్రు నాలింగనంబు చేసి యతనిఁ దోడ్కొనివచ్చి మణిపీఠంబునం దుంచి, తన పూర్వ వృత్తాంతంబు శంకరునకుఁ జెప్పుచుండె ; నంతలో సకుటుంబులై తమతమ పరివారంబులతోడ నిజవాహనారూఢులై యింద్రాదులు వచ్చి శేషాద్రిఁ జేరి హరి హర బ్రహ్మలకుఁ బ్రణామంబులు చేసిన , వారు వారి నాశీర్వదించి ; రంత శ్రీనివాసుండు శేషగరుడులఁ బిలిచి వారిచేత నింద్రాదులకు విహితాసనంబు లిప్పించి ; కుశలంబు లడిగి తెలిసి , తదనంతరంబున నందఱిం జూచి యిట్లనియె. 100

సీ. 'ఇంద్రాదులార ! నే నీ కలియుగమందు
గగనాధిపతికన్యకను ముదమున
నఱలేక పాణిగ్రహణముఁజేసెద నిది
మీకెల్ల సమ్మతమే ? ' యటంచు
నడుగఁగా వారంద అబ్జాక్షు నీక్షించి
పరమసంతోష సంభరితులగుచు
' శ్రీకాంత ! యీ పని మాకెల్ల సంతోష '
మని, రటుమీఁద దేవాధిపతినిఁ

తే. గాంచి హరి ' యింద్ర ! యీ విశ్వకర్మతోడ
రమ్య నారాయణాఖ్యపురంబుఁ జేరి
భూరిభవనము నిర్మింపు పొ'మ్మటన్న
విని యతఁడు ఫణిగిరి డిగ్గి వేగఁ బోయి. 101

వ. తత్పట్టణ సమీపంబున విశ్వకర్మచేత మరకతమణితోరణాలంకృతంబుగాఁ గనకమందిరంబు నిర్మాణంబుఁ జేయించి యతనిం దోడ్కొని క్రమ్మఱ వేంకటాద్రికి వచ్చె ; నపుడు శ్రీనివాసుండు పిలువఁదగువారినిఁ బిలుచుట షణ్ముఖునకుఁ, బ్రత్యుత్థానాది కృత్యంబు లాచరించుట మన్మథునకు ,

స్వయంపాకంబుఁ జేయుట పావకునకు , జలాకర్షణంబుఁజేయుట వరుణునకు , గంధ కస్తూరీ ప్రముఖ పరిమళంబులఁ దెచ్చుట గంధవాహునకు , ధనదానంబుఁ జేయుట కుబేరునకు, దీపప్రకాశంబు నెరపుట నిశాకరునకుఁ, గావలయు పాత్ర లొసంగుట వసువులకుఁ, బనుల జాగరూకతతో దండించి చేయించుట దండధరునకును నియమించె ; నంత వసిష్ఠుండు వరాహస్వామిసాన్నిధ్యంబున యజుశ్శాఖోక్తక్రమంబుగా గృహయజ్ఞప్రయత్నంబుఁ జేయించె ; నంతఁ బద్మసంభవుండు వివాహపీఠంబు నిర్మించి , పార్వతీప్రముఖ సువాసినులచే సంపెంగ తైలంబును , బసుపు మొదలైన మంగళద్రవ్యంబులును బంగారు పళ్లెరంబులతోఁ దెప్పించి యందుంచి, హరినిఁజూచి 'యభ్యంగన స్నానానంతరంబునఁ బుణ్యాహవాచనంబును , నిష్టదేవతా ప్రార్థనంబును, గులదేవతాప్రతిష్ఠయు సాంగంబుగాఁ జేయవలయుంగావున శీఘ్రంబుగా నభ్యంగనోత్సవంబునకు రావలయు'నని ప్రార్థించిన , హరి చింతాక్రాంతుండై బ్రహ్మతో నిట్లనియె. 102

## సిరినిఁ దలంచి హరి చింతించుట

క. 'విను పద్మజ ! కొల్లాపుర
మున శ్రీసతి యున్నదిపుడు , ముచ్చటగా న
వ్వనజాలయ రాకను నే
నొనరఁగ నభ్యంగనమున కొప్పందగునే ? 103

తే. కారణం బిట్టు లుండఁగాఁ గార్యమటులఁ
బుట్టనేటికి ? సిరి యల్గి పోయె నిపుడు
ప్రీతితో నట్టి సఖి రాక పెండ్లియాడఁ
దగదు తన'కంచు లక్ష్మినే తలఁచి తలఁచి. 104

సీ. హరి రోదనముసేయ నబ్జజాదులు భీతి
చే నుత్తరము తాము సెప్పలేక
చూచుచునుండఁగాఁ, జోద్యమందుచు రుద్రుఁ
డిట్లని పలికె ' నో యిందిరేశ !
శుభకాలమున నింత శోకింపఁదగ దిది
లౌకికహానియౌ, లక్ష్మి నిటకుఁ
బ్రేమతోఁ దొల్తనే పిలిపింపవలె ; నది
మాని సన్మంగళస్నానవేళఁ

తే. దాత ! మీ రీ విధమున రోదనముఁ జేయు
చున్న , వారింప శక్తు లిందౌరులు గలరె ?
మదిని ఖేదము నడఁచి యీ మంచి లగ్న
మందె గూర్చుండు పీఠమం దంబుజాక్ష ! ' 105

క. అని రుద్రుం డా లగ్నం
బున హరి నభ్యంగనంబు ముఖ్యముగాఁ జే
యను హెచ్చరికగ లెమ్మన ,
విని శంభునిఁ జూచి యాదివిష్ణుం డనియెన్. 106

సీ. 'శంకర ! బాల భాషలు పల్కకిఁక , వారి
వారి దుఃఖంబులు వారి కెఱుక
పరులకుఁ దెలియ, వా బ్రహ్మప్రళయవేళఁ
బరదేశినై వటపత్రమందు
నేనుండినపుడును నిత్యానపాయిని
యగుచు నా హృదయమందంటియున్న
కమలాలయను గాలగతిచేత నెడఁబాసి
యేకాకినై యుంటి నిన్నినాళ్లు

తే. నా కపుడు మది నొక చింత లేకయుండె
నిపుడు నేను వివాహేచ్ఛ నెనయుకతనఁ
గలిగి రందఱు, నిచట శ్రీకాంత యొకతె
తక్కువైనందుచేత ఖేదంబు వచ్చె. 107

సీ. వనధిజ రాక వివాహంబు కాఁగూడ
దని యెవ్వరైన నా కాప్తముగను
జెప్పుదురని యుంటిఁ; జెప్పరై రెవరిందుఁ
గావున మదికి దుఃఖంబు పుట్టె'
నని హరి పల్క బ్రహ్మాదులు భీతిల్లి
ముకుళితపాణులై ముందు నిలిచి
పలికి రిట్లని 'రమా భామ రాకయ పెండ్లి
యిప్పుడు సాగింప నొప్పదనుచు

తే. సిరినిఁ బిలిపింపుఁడని మీకుఁ జెప్పవెఱచి
యుంటి, మపచారమయ్యె; నయ్యుదధికన్య
రాకయుండినఁ బెండ్లి గారాదటంచు
మీకుఁ దోఁచినదే మాకు మేలు తండ్రి! 108

చ. సిరి నిపుడైన నిచ్చటికి శీఘ్రముగాఁ దగఁ బిల్వనంపుఁ డం
దఱి కిది సమ్మతం' బనఁగఁ దామరసాక్షుఁడు సంతసించి 'యిం
దిర నహిపర్వతంబునకుఁ దెప్పునఁ దోడ్కొనిరమ్ము, పొమ్మహో!
సరసిజ మిత్ర!' యన్న విని చక్కఁగ మ్రొక్కి దివాకరుండనెన్. 109

సీ. 'హరి! నేను కరవీరపురమునం దుండెడి
శ్రీరమాసతి కేమి సెప్పవలయుఁ
నా రీతు లెఱిఁగింపుఁ'డన విని సప్తసైం
ధవుని వీక్షించి మాధవుఁడు నవ్వి

'జలజాప్త ! వినుము మా జలధికన్యకు మ్రొక్కి
'యబ్జనాభుఁడు వేంకటాద్రిమీఁద
నొదిఁగి యశక్తుఁడై యున్నాఁడు, నినుఁ జూడ
వాంఛింపు చున్నాఁడు, 'వచ్చి మోముఁ

తే. జూడు'మని మీకుఁ జెప్పుమన్నాఁడటంచు
నిజముగాఁ దెల్పు, మిది విన్న నెనరుమీఱ
వచ్చు నిచ్చటి కా రమావనిత'యనుచుఁ
జెప్పి హరి యంపఁగా భానుఁ డప్పు డరిగి. 110

తే. శ్రీ సతికి మ్రొక్కి పల్కె 'నో సింధుపుత్రి !
చక్రి యిప్పు డశక్తుఁడై జాలిఁబడుచు
శేషగిరిమీఁద నున్నాఁడు, శీఘ్రముగను
నేఁడు నినుఁ జూడవలయునన్నాఁడు తల్లి !' 111

క. అని యా సూర్యుఁడు పలుకఁగ
విని భీతినిఁబొంది లక్ష్మి వేగ రథముపై
నొనరఁగ నెక్కి, గగనపథ
మునఁ జని శేషాద్రి కరిగె ూహముమీఱన్. 112

క. అప్పుడు బ్రహ్మేంద్రాదులు
తప్పక సిరి వచ్చు టెఱిఁగి తమ వాద్యతతుల్
తెప్పున మొరయించుచుఁ జని
రొప్పుగ సంతోష మెదల నురువై యుండన్. 113

సీ. శ్రీలక్ష్మి నీక్షించి చిరతరభక్తితో
మ్రొక్కి తోడ్కొనివచ్చి రక్కఱగను
పార్వతీ భారతీ ప్రముఖాంగనామణు
లాదిలక్ష్మికి మ్రొక్కి యాదరించి ;

రవు డాదివిష్ణుండు కపటనాటకసూత్ర
కారుఁడా లక్ష్మిని గారవించి
యట ముహూర్తద్వయ మాశచే లక్ష్మి కం
రాలింగనముఁజేసి లాలనముగ

తే. రత్నపీఠంబుమీఁద శ్రీరమణి నుంచి
తాను గూర్చుండి సిరికి మోదంబు గలుగు
నట్టి మాటలు కొన్ని రహస్యముగను
జెప్పి మన్నించి పలికె మచ్చికను మరల. 114

క. 'శ్రీ వనితామణి నాపై
నీ వలుగుట మొదలుగాను నేఁటిదనుక నిం
దేవేళ నిన్నె తలఁచుచు
నీ వల్మీకంబులోన నిరవుగ నుంటిన్. 115

ఆ. గొల్లఁడిటకు వచ్చి గొడ్డంట నడినెత్తిఁ
బగులఁగొట్టినపుడు బాధపడుచు
నుంటి , నన్నుఁ జాల నూఱడించుచు నిందు
వకుళ కన్నతల్లివలెనె ప్రోచె. 116

సీ. పటుకుఠారము తలపైన నాఁటిన వేళ
బాధకు నే నోర్చి బ్రతికినట్టి
మహిమ యేమనిన నీ మంగళసూత్ర స
న్మహిమయే కాని , నా మహిమ కాదు
వనజాక్షి ! నీపతివ్రతనిష్ఠచే నేను
జీవించితిని; యిన్ని సెప్పనేల ?
నది యటులుండని, మ్మాకాశనృపతి క
న్యక నన్ను మోహించె నందువలనఁ

తే. ప్రేమమీఱఁగ నే దానిఁ బెండ్లియాడ
మదిఁ దలంచితి , నీవు సమ్మతముగాను
బెండ్లియాడుమటన్న నేఁ బెండ్లియాడు
వాఁడ , వలదన్న నే నా వివాహమొల్ల. ' 117

మ. అని పద్మాక్షుఁడు పల్కఁగా మనములో నాశ్చర్యమున్ బొందుచున్
వనజాతాలయ పల్కెనిట్లు ' హరి ! యా వామాక్షి మోహంబుచే
నినుఁ గామించెనొ ! దాని నీ విపుడు మన్నింపం బ్రయత్నంబు లిం
దొనరం జేయుట చూచితిన్ , మదిని నే నుప్పొంగితిన్ కేశవా ! 118

సీ. కమలాక్ష ! మంగళకరముగాఁ బసుపుజా
బింపుగాఁ దొలుతఁ బంపింప కీవు
మొగి నశక్తుఁడనని , మోముఁ జూచుటకు ర
మ్మని నన్నుఁ బిలిపించినందువలన
భీతిల్లి వచ్చితి ; ఖ్యాతిగా నే వచ్చు
రీతి రానైతి , సంప్రీతి మెఱయ
నేఁ దొల్త వచ్చిన నీ పెండ్లి కిపు డొప్పు
నని సంశయించితీవందుచేత

తే. నింతపని చేసితివి ; మంచి దీ వివాహ
కారణముచేతనైన నిక్కడికి నన్ను
నేఁడు పిలిపించినందున నీ ముఖంబుఁ
గంటి నా కింతయే చాలుఁ గమలనాభ ! 119

తే. వసుధపై నీవు పెండ్లికావలయుననిన
నేను విఘ్నముఁజేతునే ? నీకు నేను
గలిగియును లేకయుండెడి కారణంబు
చే వివాహేచ్ఛ పుట్టె నీ చిత్తమందు. 120

క. నా కిది సమ్మతమైనది
నీ కీ సంశయము వలదు ; నెమ్మదిగా నిం
దా కన్యను జేపట్టుము
జోకగ నీసుఖమె నాకు సుఖము మహాత్మా ! 121

క. నీవు మనుష్యునికైవడి
గా వేంకటశైల మెక్కి గాయపడిన ని
న్నీ వకుళ వచ్చి ప్రోవఁగ
జీవించితి వింతెచాలుఁ జిన్మయరూపా ! 122

ఉ. నా కిపు డేమి గావలయు , నాఁడు భృగుం డెడఁబాపె నిన్ను న
న్నో కమలాక్ష ! నే నచట నుండిన నీ మహనీయ రూపమే
జోకగ భావమందునిచి చూచి సుఖించెదఁగాని , వేడ్కగా
నా కలికిన్ విరించి ముఖు లందఱు మెచ్చఁగఁ బెండ్లియాడవే ! 123

క. అని కన్నీ రొల్కఁగ సిరి
తన శిర మఱవాంచియున్నఁ , దామరసాక్షుం
డనుమానించుచు లక్ష్మినిఁ
గనుఁగొని యిట్లనియెఁ జాలఁ గనికర మొప్పన్. 124

సీ. 'సిరి ! నీవు మదిలోనఁ జింతింపవలదు , నీ
కన్న నా కాప్తులెందైన లేరు
నీవె నా దైవంబు,నీవె నా ప్రాణంబు
నీవె నా భాగ్యంబు నిశ్చయముగఁ
గావున నా పెండ్లి నీ విపు డొప్పి చే
సిన మేలె , చేయకుండినను మేలె
నా కేమి గావలె , లోకవిడంబనా
ర్థంబుగా నీ ప్రయత్నంబు నేఁడు

తే. కాలకర్మానుగుణముగాఁ గలిగె ' ననుచుఁ
దాను గన్నీరు నించిన ధవునిఁ జూచి
పల్కె నిటు సిరి ' దేవ ! యీ పామరంబు
నీకుఁ దగ'దని చాల మన్నించి నగుచు. 125

సీ. హరి నాదరించి బ్రహ్మాదుల నీక్షించి
' యిది యేమి యాలస్య ? మెల్లవారు
లేచి మీ మీ పనుల్ సూచి చేయుఁడు ! చక్రి
కభ్యంగనముఁ జేయుఁ'డనుచు లక్ష్మి
యానతీయఁగ , నంద అన్ని పనుల్ చేసి ,
రపు డబ్జజుండు ఖగాధివిభునిఁ
బన్నగేంద్రానిల ప్రముఖులఁ బంపించి
పుణ్యతీర్థముల నా భుజగగిరికిఁ

తే. గలశముల నిండఁ దెప్పించి క్రమముగాను
' గుంకుమము గల్పి నాల్గు దిక్కులను బెట్టి
సూత్రములు వానిచుట్టును జుట్టుఁ'డనుచు
నతఁడు సెప్పఁగ గిరిజాముఖాంగనలును. 126

తే. మంగళ స్నానములు చేసి రంగు మీఱ
వస్త్ర భూషణములు దాల్చి వచ్చి దీప
కలశముల్ మంగళారతుల్ కరములందుఁ
బట్టి కళ్యాణముల్ శోభనము లందు. 127

ఉ. పాడుచుఁ దెల్తఁ బద్మజుఁడు పల్కినరీతిగ నాల్గు దిక్కులన్
పోఁడిమిఁ గుంకుమంబిడిన పుణ్య శుభోదక కుంభముల్ తగన్
వేడుకమీఱ నుంచి , సరవిన్ వరసూత్రముఁ జుట్టి యైదువల్
జోడుగ దాని మధ్యమున శోభితసన్మణిపీఠ ముంచఁగన్. 128

ఆ. అజుఁడు ' పెండ్లిపీఠమందుఁ గూర్చుండుఁ డో
స్వామి!'యనఁగఁ జక్రి జలధికన్య
దిక్కుఁ జూడ , వాసుదేవుని మోమెత్తి
చూడ కాదిలక్ష్మి చోద్యముగను. 129

సీ. చెక్కిటఁ జెయి సేర్చి శిర మఱవాంచి ప
దాంగుష్ఠమున సున్న లవనిమీఁద
వ్రాయుచు , మదిఁ జింతఁ జేయుచు నెమ్మోము
చిన్నఁజేసికొని , యందున్న వేడ్క
లైనఁ జూడక యుండినట్టి రమాసతి
దాఁ జూచి హరియిట్లు దలఁచె మదిని
' నేఁ బెండ్లియాడుట కీ పద్మముఖి చింతఁ
జేయుచున్నది యేమిసేతు నింక ? '

తే. ననుచు యోచించి వేసట ననుసరించి
వారకన్నుల నా రమావనిత మోము
సారెసారెకుఁ జూచుచు జాలి నొంది
పద్మసంభవు నీక్షించి పలికెఁ జక్రి. 130

సీ. 'ధాత ! యీ పెండ్లియత్నమునకు నే నొప్పి
నందుచేఁ దప్పు నాయందుఁ గలిగెఁ
గాన నా కీపెండ్లి గావలసిన దేమి ?
నే నొల్ల , మీ!రెల్ల నేఁడె కదలి
పోయి మీ మీ పురంబులు చేరుఁ , డెప్పటి
పగిది వల్మీకగర్భంబునందె
నిలిచెదఁ, దల్లిదండ్రులు లేని పరదేశి
వానికిఁ బెండ్లిగావలెనె యిపుడు ?

తే. దిక్కులకు నేను దిక్కనై , దిక్కు లేక
యొంటిగా నిల్చి తేర కా మింటనుండి
మంటిపై వ్రాలి పొట్టకై మానవులను
జేరి యాచించి బ్రతుకుటే సిద్ధమయ్యె. 131

తే. ఇట్టి నాకు వివాహేచ్ఛ పుట్టఁదగదు
గనుక నభ్యంజనము నొల్ల ' ననిన బ్రహ్మ
దేవుఁ డదరుచు శ్రీ స్వామి దిక్కుఁ జూచి
పాదపద్మములకు మ్రొక్కి పలికె నిట్లు. 132

వ. 'దేవా ! మహాలక్ష్మి మీకు నిత్యానపాయినియైన పత్నియై యుండి , నేను, మన్మథుండును పుత్త్రులమై , తక్కిన రుద్రపవనేంద్రాదులు మనుమలై , మునిమనుమలై వృద్ధిఁబొందుచుండఁగా , నందఱికి నాధారభూతమై కూటస్థ బ్రహ్మంబైన మీకు విచారంబేల ? ' యని సాభిప్రాయంబుగాఁ బల్కిన విని హరి యిట్లనియె. 133

## మంగళాభిషేచనము

సీ. 'దయను నాచేతికిఁ దాంబూల మిపు డిచ్చి
నన్ను దీవించి యానందమెసఁగ
నా కిప్పు డభ్యంజనంబు చేసెడివార
లెవ?'రంచుఁ జింతతో నెనసి కనుల
నీరు నింపఁగ , హరి నెమ్మోము సిరి సన్నఁ
జూచుచుండఁగఁ , దమ్మిచూలి సంజ్ఞఁ
జేసి రమ్మనఁగ , నా శ్రీలక్ష్మి హరిచెంతఁ
జేరి నవ్వుచు రెండుచేతు లపుడు

తే. పట్టి లేపఁగఁ , దనమదిఁ బుట్టియున్న
చింత విడిచి ముదమున వసిష్ఠ ముఖ్య
మునుల కప్పుడు మ్రొక్కి దీవనల నొంది
యొనరఁ బీఠంబుమీఁదఁ గూర్చుండె శౌరి. 134

వ. అప్పు డరుంధతీప్రముఖ సువాసినులు శోభనంబులు పాడుచుండఁగా , మంగళవాద్యంబులు మ్రోయుచుండఁగా, నమ్మహాలక్ష్మితోడఁ బార్వతియు సావిత్రియు సరస్వతియుఁ గుంకుమోదకంబులు పైఁడి పళ్ళెరంబుల నించి పాటలు పాడుచు నారతు లిచ్చి ; రంత రమాదేవి మంగళాక్షతంబులు లలాటశీర్షంబులం దుంచి కర్పూరతాంబూలం బా స్వామిచేతి కందిచ్చి , దీర్ఘ నీలకుంతలంబుల చిక్కు విడిపించి పైఁడిగిన్నెలోని సంపెంగతైలంబు చేరనిండఁబట్టికొని ' దీర్ఘాయుష్మంతుండవై, యష్టపుత్త్రవంతుండవై, చతుర్దశభువనంబులకు నేకచ్ఛత్త్రాధీశ్వరుండవై వృద్ధిఁబొందుమో మహాస్వామి!' యని యాశీర్వదించి యభ్యంగనంబుఁ జేసి , కర్పూర కస్తూరీ హరిద్రాచూర్ణంబు పునుఁగు తైలంబులోఁ గలిపి నలుఁగుపెట్టి , పరిశుద్ధోకంబుల నభిషేకంబుఁ జేసి , కృతార్థురాల నైతినని సిరిమనంబున సంతసించె ; నంతఁ బార్వతి , సావిత్రి , గాయత్రి , సరస్వతి యీ నలువురు నాలుగుకలశంబులఁ గుంకుమోదకాభిషేకంబుఁ జేసి , లక్ష్మితోడఁ దత్తీర్థంబు పుడిసిళ్ల వట్టి ' శ్రీరామరక్ష ! ' యని , ' దీర్ఘాయుష్మంతుఁడవు గ ' మ్మని శిరంబునకుఁ జొట్టి చల్లిరంత. 135

సీ. సావిత్రి దెచ్చి వస్త్రము లియ్యఁగా సిరి
తడియొత్తి మస్తకస్థలము నిమిరి
చక్కగాఁ జికురాళి చిక్కు మెల్లఁగఁబట్టి
విడిపించి జాఱుగా ముడి యొనర్చె ,
హరి చేలములఁ దాల్చె నట గౌరి యొసఁగఁగా ,
నంబుధికన్య ధూపంబు నిచ్చె
శ్రీ సరస్వతి దెచ్చి చేతి కియ్యఁగ లక్ష్మి
వరరత్నభూషణావళులు దొడిగె

తే. ముకుర మటుమీఁద గాయత్రి మొనసి చూపె
రతియు శచియును వరచామరములు వీవఁ ,
బవనుసతి ఛత్ర మొప్పఁగాఁ బట్టి నిలిచె
గంగ పాదుక లొసఁగె శ్రీకాంతుఁ డపుడు. 136

తే. పాదుకలు మెట్టికొనుచు నా బ్రహ్మసభకు
నడచుచును వచ్చి సింహాసనంబుమీఁద
నమరఁ గూర్చుండి , మునిముఖ్యు లలరి చూడ
నూర్ధ్వపుండ్రము ధరియించుచుండి చక్రి. 137

వ. బ్రహ్మను జూచి ' లక్ష్మి కభ్యంగన,మంగళస్నానంబులు చేయింపు ' మనినఁ బద్మజుండు వోయి పార్వతీభారతీప్రముఖనువాసినులఁ బిలిచి 'మజ్జనని కభ్యంగనంబుఁజేయుం'డని, సిరినిఁ'బీఠంబుపైఁ గూర్చుండు' మనిన,సిరంబు వంచి విరించితో రమాదేవి యిట్లనియె. 138

క. 'వనరుహభవ ! నే నభ్యం
గన మొల్లను , స్నాన మిపుడు గ్రక్కునఁ జేతున్ '
అని సిరి పల్కిన వాక్యము
విని సంశయమొంది యాదివిష్ణుండనియెన్. 139

సీ. 'అబ్ధిజ ! నీ విప్పు డభ్యంగనస్నాన
మొప్పకుండిన , వివాహోత్సవంబు
నేనొల్ల'నని పల్కఁగా నవ్వికొని రమా
సతి యూరకుండఁగా , శైలకన్య
మొదలుగా నందున్న ముత్తైదువలు సిరి
కభ్యంగనముఁ జేసి , యపుడు పసుపు
నలుఁగొప్పఁబెట్టి స్నానము వేగఁ జేయించి
తడియొత్తి నవ్యవస్త్రముల నొసఁగి

తే. కురులు కీల్గంటుగా వేసి , విరిసరములు
చుట్టి , కుంకుమతిలకంబుఁ బెట్టి నుదుటఁ
గనులఁ గాటుక దీర్చి,శ్రీగంధ మలఁది
వరుసగా రత్నభూషణావళులు దొడిగి. 140

తే. పెండ్లిపాటలు పాడి సంప్రీతి సిరినిఁ
దోడుకొనివచ్చి యా చక్రిజోడుగాను
వారు గూర్చుండఁబెట్టి ; రవ్వల ఫణీంద్ర
శైలపతి యా సతినిఁ జూచి సంధ్యవార్చె. 141

వ. ఆ సమయంబున వసిష్ఠాది మహామునులును , సనకాది యోగివరులును, నింద్రాది దేవతలును , గరుడగంధర్వాదు లానందంబున లక్ష్మీనారాయణుల నీక్షించుచుండఁగా , నిది శుభలగ్నంబంచు నందున్న జ్యోతిర్విదులు సెప్పఁగా విని వకుళమాలిక పసుపు కుంకుమ మొదలైన మంగళద్రవ్యంబులు పైఁడి పళ్లెరంబుతోఁ దెచ్చి స్వామి సన్నిధియందుంచి , 'హరి కలంకారంబుఁ జేయు ' మని సిరికిఁ జెప్పిన విని లేచి నిజేశ్వరునకు శృంగారంబుఁ జేసె; నంతఁ గుబేరుండు దివ్యరత్నభూషణాంబరంబులు దెచ్చి లక్ష్మి కందిచ్చె నప్పు డా భూషణాబరంబు లా స్వామి కలంకరించి రమాదేవి సంతసించె; నంత వసిష్ఠ కశ్యపాత్రిప్రముఖ మహామునులకుఁ జక్రి లోకవిడంబనార్థంబుగా నమస్కరించె ; నా సమయంబున వసిష్ఠుండు. 142

తే. ముత్యములఁ జతురస్రకంబుగ వివాహ
వేదికను వేగ రచియించి , వేంకటాద్రి
పతిని సతి నుంచి, తత్పురోభాగమందు
హోమకుండము నిర్మించి నేమముగను. 143

## కులదేవతార్చానము

వ. యజుశ్శాఖానుక్రమంబుగా వైఖానససూత్రోక్తంబుగాఁ బుణ్యాహవాచనాది శుభకృత్యంబు లాచరించి , సభాతాంబూలంబు లిప్పించి , తదనంతరంబా హరినిఁ జూచి ' కులదేవత యెవ్వ'రని యడిగినఁ ' బాండవులకు మాకు శమీవృక్షంబే కులదేవత ' యని చక్రి వచింపఁగా, విని వసిష్ఠుండు 'శమీవృక్షం బెందుండు? 'నని యడిగినఁ , ' గుమారధారాతీర్థసమీపంబునం

దున్నది ' యని కుంభసంభవుండు చెప్పె ; నంత మంగళవాద్యంబులు మొరయ బ్రాహ్మణులతోడ నరిగి హరి శమీవృక్షంబునకుఁ బ్రదక్షిణ నమస్కారంబులు చేసి పూజించి , ' నిర్విఘ్నంబుగా వివాహంబు నెఱవేర్పు' మని ప్రార్థించి , తద్వృక్షశాఖను గ్రహించి , శిరసావహించికొని వచ్చి ' యీ కులదేవత నెచ్చట నుంపవలయు'నని యోచింపఁగా విని నారదుండు 'వరాహస్వామి సాన్నిధ్యంబునందుంచవచ్చు ' ననిన సమ్మతించి వచ్చి కిటిదేవానుమతంబునఁ దత్సాన్నిధ్యమందు ముక్తాతండులంబులమీఁదఁ గులదేవతను నిల్పి , తదుపరి నూతన వస్త్రయుగ్మంబు నుంచి పూజించి, యందఖండదీపంబుఁ బెట్టించి మ్రొక్కి , క్రోడస్వామి నీక్షించి యిట్లనియె. 144

సీ. 'శ్రీ వరాహస్వామి ! నీవు , భూదేవి రా
వలయు నిప్పుడు నా వివాహమునకుఁ
బైనమై ర'మ్మన్నఁ బలికె నిట్లని పోత్రి
' క్షేత్రమంతయు ఫలించినది గనుక
నాకు రాఁ దీరదు , నామాఱు వకుళ మీ
పెండ్లికి వచ్చును ప్రేమమీఱ '
ననవుడు ' నట్లైన నానతీయుఁడు పోయి
వచ్చెద'మని పల్కి మచ్చి కలర

తే. నవల బ్రహ్మను జూచి ' ప్రయాణభేరి
నీవు వేయింపు'మని పల్కఁగా విరించి
'నేఁడు సంతర్పణం బిందు నిలిచి చేసి
పోవుదము తే , పిపుడు చాలఁ బ్రొద్దు పోయె . ' 145

వ. అని పలికిన యజుం జూచి హరి యిట్లనియె. 146

ఆ. 'దేశకాలములను దెలియ కీ యత్నంబు
నీవు సేయఁబూనినావు, తలఁచి
నపుడు దొరకునే పదార్థంబు లద్రిపై '
ననినఁ జక్రి కిట్టులనియె శివుఁడు. 147

క. 'చేసిన యత్నము పూర్తిగ
వాసిగ నెఱవేర్పఁదలఁచువా రుత్తములం,
ద్రీ సంతర్పణఁ జేయక
గాసిలి యిపు డటకుఁ బోవఁగారాదు హరీ!' 148

చ. అని యభవుండునుం దనకు నాప్తముఁ జెప్పఁగ నవ్వికొంచు న
వ్వనజదళాక్షుఁ డర్థమును వార్ధిజ నందడుగంగఁ బూని, 'సి
గ్గున మగవాఁడనై సతినిఁ గోరి వరా లిపుడిమ్ము నా కటం
చును బతిమాలనే'ననియె శూలిని బ్రహ్మను గూడి గ్రక్కునన్. 149

వ. వల్మీక సమీపంబునఁ బార్వతీ భారతీ ప్రముఖ సువాసినుల మధ్యంబునఁ గూర్చుండియున్న లక్ష్మితోఁ జెప్పక, పోయి పుష్కరిణీతీరస్థాశ్వత్థవృక్ష చ్ఛాయయందుఁ గూర్చుండి, కుబేరుని దగ్గరికిఁ బిలిచి యేకాంతంబుగా హరి యిట్లనియె. 150

సీ. 'ధనదా! వివాహయత్నము నేనుఁ జేసితి
నర్థంబులేదిప్పు డబ్ధిసుతను
'నా పెండ్లి కీవు ధనంబిమ్ము!' యనుటకు
నాకు సంకోచమైనది, రయమున
నీవు ద్రవ్యము నిమ్ము నే వడ్డి పత్రంబు
వ్రాసి యిచ్చెదను, సంవత్సరమున
కొకమాటు వడ్డి నీ కొప్పించుచుండుదుఁ
గలియుగాంతమున నిష్కర్షగాను

తే. మొదలు దీర్చెద , నీమాట మోసమనుచుఁ
దలఁచి వేదనవలదు ; విధాత నొకని ,
శంభు నొకని లిఖితమందు సాక్షిఁజేసి
వ్రాసి యిచ్చెద ' నన ధనపాలుఁ డపుడు. 151

సీ. పలికె నిట్లనుచు ' నో పద్మాక్ష ! నీకృప
నిపుడు గల్గిన ద్రవ్యమెంతయైన
నిచ్చెదఁగాక , వడ్డీయనేటికి ? వివా
హంబైనఁ జాలు మా కందఱికిని
ఇది మహాసంతోష, మింతకన్నను లాభ
మెక్కువే ?'మనిన లక్ష్మీశ్వరుండు
నవ్వి యిట్లనియె ' దానము నేను గొనుటకుఁ
దగదని వడ్డిపత్రంబు వ్రాసి

తే. ప్రేమతో నిందొసంగెద , రామటెంకి
నిష్కములు శీఘ్రముగ నిమ్ము నిర్మలాత్మ ! '
యని పొసఁగఁ జెప్పి శ్రీవేంకటాద్రివిభుఁడు
పద్మజుని,శంభు నీక్షించి పలికె నిట్లు. 152

చ. 'అజహరులార ! యీ కలియుగాంతము వచ్చెడుదాక ధన్యమౌ
భుజగగిరీంద్రమందుఁ బరిపూర్ణవిలాసము లద్భుతంబుగాఁ
సుజనుల కెల్ల మెచ్చుగను జూపి , వరంబుల నిచ్చి విత్తమున్
నిజముగ సంగ్రహించి , యట నేను గుబేరున కప్పు దీర్చెదన్. 153

తే. మీరు సాకిరు'లని పల్కి భూరికనక
పత్రి కప్పుడు దెప్పించి , పంక్తులమరఁ
దడయ కప్పుడె వ్రాసి విధాత చేతి
కిచ్చి 'వచియింపు'మన నజుండిట్లు చదివె. 154

సీ. 'శ్రీ కరలీల స్వస్తిశ్రీ జయాభ్యుద
యాష్టాదశ ద్వాపరాంతమందుఁ
గల కలి నాది వేంకటనాయకుఁడు ధన
పతి కొసంగిన వడ్డిపత్ర మెట్ల
యనినను మా వివాహమునకు నీచేత
నప్పుగాఁ గైకొనినట్టి రామ
టెంకి నిష్కములు కోటియుఁ జతుర్దశ లక్ష
లందుకు వడ్డి సహస్రనిష్క

తే. ములను బ్రతివత్సరము దీర్చి మొనయు కలియు
గాంతమున మేము గైకొనినంత విత్త
మియ్యఁగలవార, మజరుద్రు లిందు కిపుడు
సాక్షు, లశ్వత్థుఁ డిచ్చుట సాక్షి నిజము. 155

తే. ఇటని మాసమ్మతిని వ్రాసి యిచ్చినట్టి
స్వకర లిఖితం'బనుచును ముచ్చటగ వ్రాసి
నట్టి పత్రంబు పద్మజుం డమరఁ జదివి
శంకరుని చేతి కీయఁగా సమ్మతించి. 156

వ. అప్పు డా లిఖితం బా శివుండు గైకొని కుబేరుని కిచ్చె; నప్పు డా ధనేశ్వరుండు పత్రంబు చేకొని హరి కా నిష్కంబు లెంచి యిచ్చిన గ్రహించి, యా హరి క్రమ్మఱఁ గుబేరుని వశంబుగా నా ధనంబు నుంచి ' కావలయు పదార్థంబులఁ దెప్పింపు ' మని యానతిచ్చిన, ధనదుం డా హరి యాజ్ఞాధారియై మంగళసూత్రాది భూషణాంబరంబులను, దండులాది పదార్థంబులను దెప్పించె ; నంత స్వామివారు పావకునితోఁ ద్వరగాఁ బాకప్రయత్నంబుఁ జేయుమని చెప్పుటకు షణ్ముఖు నంపింపఁగా, నరిగి ' పాకంబుఁ జేయుమని హరి నీతోఁ జెప్పు'మనె ననిన విని ' పాత్రలు లే వెట్లుసేతు ? ' నని హుతాశనుండు పల్కఁగా, మరలంజని సేనాని శ్రీనివాసున కావార్త విన్నవింపఁగా నాలకించి, బ్రహ్మాదులు వినుచుండఁగా నవ్వి నారాయణుం డిట్లనియె. 157

సీ. ‘[illegible] పేశి పెండ్లికిఁ బాత్ర లెందుండు ? నిం
దమరు పుష్కరిణీ దివ్యాన్నపాత్ర
ప[illegible]తంబైన పాపవినాశమే
శుద్ధమైనటువంటి సూపపాత్ర
యమలమైనటువంటి యాకాశగంగ స
దానందకర పరమాన్నపాత్ర
గురుతరంబైన తుంబురుకోన చిత్రాన్న
పాత్ర , శాకముల నేర్పఱచి సేయఁ

తే. బాత్ర ఘనదేవతీర్థంబు , భక్ష్యములను
గోరి కావింపఁ బాత్ర కుమారధార
పచ్చడులు సేయనగు పాత్ర పాండుతీర్థ
మనుచుఁ జెప్పుము హవ్యవాహ ఘన కనఘ !’ 158

## విందు భోజనము

వ. అని హరి వినోదంబుగాఁ బలికిన విని , యా స్వామికి నమస్కరించి యష్టవసువు లక్షయపాత్రలఁ దెప్పించి యొసంగి ; రందగ్నిదేవుండు శీఘ్రంబుగాఁ బాకంబుఁజేసి , ‘ భోజన ప్రయత్నంబుఁ జేయింపుం’డనిన విని , హరి కార్తికేయునిఁ బిలిచి ‘ బ్రాహ్మణ భోజనంబునకుఁ బాండవ తీర్థంబు మొదలుకొని శ్రీశైలపర్యంతంబు చదరంబుఁ జేయించి , సభవారితో స్నానంబులు చేయుండని చెప్పు’మనఁగ , నతం డా పనులు చేసె ; నప్పు డమ్మునిముఖ్యులు స్నాన సంధ్యాది సత్కృత్యంబు లాచరించి పంక్తులు సాగి కూర్చుండఁగాఁ , బద్మాక్షుం డజుం బిలిచి ‘ యనర్పితాన్నంబు బ్రాహ్మణయోగ్యంబు గాదు గావున నహోబల నారసింహ కులదేవతార్పణంబుఁ జేయు ’మనఁగా విని పద్మజుండు శుచిర్భూతుండై నృసింహకులదేవు నర్చించి , ధూప దీపనైవేద్యంబు లిచ్చి , వైశ్వదేవ బలిహరణాది నిత్యకర్మంబు లాచరించె ; నప్పుడు శ్రీనివాసుఁ డాజ్ఞాపింపఁ గాఁ బవనుండు కదళీపర్ణంబు లుంచి పాత్రాభిఘారంబుఁ జేసి సకల

పదార్థంబులను వడ్డించె. బ్రహ్మ గంధపుష్పాక్షతంబుల ద్విజార్చనంబుఁ జేసె. దేవతలు కొందఱు ధూపారాత్రికలు చేకొని పంక్తిప్రదక్షిణంబుఁజేసి వచ్చి, రా సమయంబునందుఁ గమలజుం 'డేకో విష్ణు ర్మహద్భూత'మ్మను మంత్రంబు సాంగంబుగాఁ జెప్పి శుభాక్షతోదకంబు విడిచి, 'సర్వంబును శ్రీకృష్ణార్పణమ'స్తని యందఱి కాపోశనంబు లీయఁగాఁ, బుచ్చుకొని గోవిందనామ భజనంబుఁ జేయుచు, వరాహ, భూదేవతలతోడ నందఱు భుజించుచున్న వరుణదేవుం డందఱికి నుదకం బొసంగె; మన్మథుండు, నాంజనేయుండు పంక్తుల వెంబడిఁ దిరుగుచుఁ 'బ్రొద్దు పోయినది, సావకాశంబుగా భోజనంబులు చేయుం'డని యుపచారంబులు చెప్పుచుండఁ గా, సభవారు భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయంబులతోఁ బరితృప్తిం బొంది, యజునిచే నుత్తరాపోశనంబును దీసికొని లేచి, వదన,పాణి పాదప్రక్షాళనాచమనంబులు చేసివచ్చి, సమ సుస్థలంబునందుఁ గూర్చుండి వారు వేదఘోషణంబు సేయఁగా, శ్రీనివాసుండు సభాతాంబూలంబు లిప్పించి, ద్విజులకు రెండేసి నిష్కంబులును, ఋషుల కొక్కొక్క నిష్కంబు చొప్పున దక్షిణ లిప్పించి, సభా నమస్కారంబులు చేసి, యాశీర్వాద మంత్రాక్షతంబులు గైకొని పుత్ర కళత్రాది మిత్రులతోడ శిరసావహించె; నంత హరిహర బ్రహ్మేంద్రాదులు నిజభార్యాసమేతులై భుజించిన పిమ్మటఁ దక్కిన హవ్యవాహన, పవన ప్రముఖులారగించి లేచి; రవ్వలఁ బర్జన్యుండు పాకపాత్రలు పరిశుద్ధంబులు చేసె నంత. 159

## సాయంకాల వర్ణనము

తే. 'హరి వివాహంబునకు వచ్చినట్టి బ్రహ్మ
ముఖ్యులందఱు భోజనములను జేసి,
రింక నిచ్చట నాకుండ నేమి ? మేరు
భూధరంబున నా దిక్కు పోయివత్తు. 160

తే. చంద్ర ! నీ వింక వేంకటాచలముమీఁద
సకలసురమునిముఖ్యులు సంతసించు
కొఱకు వెన్నెల నంతట నెఱపు'మనుచుఁ
జెప్పిచనినట్ల నపరాద్రిఁ జేరె నినుఁడు. 161

సీ. అబ్జబాంధవుఁ డిట్టు లపరాబ్ధిఁ గ్రుంకఁగా
నపు డహిగిరి నుండినట్టి లక్ష్మి
మొదలైన సతులను ముచ్చటగాఁ జూడ
హేమాంబరము ధరియించి , పద్మ
రాగభూషణములు , రక్తచందనమును
బసుపు కుంకుమ దాల్చి భక్తి మెఱయఁ
బశ్చిమాశాకాంత పైనమై వచ్చెనో
యనఁగ సంధ్యారాగ మతిశయిల్లె

తే. నందుచేఁ బార్వతీప్రముఖాబ్జముఖుల
మణుల భూషణముల రక్తిమములు మించెఁ
బక్షు లా రత్నములు సూచి ఫలములనుచు
మెక్కుటకుఁ బొంచుగతిఁ జెట్లమీఁద వ్రాలె. 162

తే. విపుల నీలాంబరము నిండ విమల మౌక్తి
కముల గుమిఁ గూర్చి శేషనగంబుపైనఁ
గట్టినటువంటి చందువాకరణిఁ దార
కలను గూడి నభంబు ప్రకాశ మెసఁగె. 163

## చంద్రోదయ వర్ణనము

సీ. జలధి నుప్పొంగించి , జలరుహపంక్తుల
నీక్షించి నోళ్లు మూయించి , మించి
కుముదసంతతులను బ్రమదంబు నొందించి
తొలఁగక శుభ్రకాంతులను బెంచి

విరహుల నలయించి , విరసముల్ గలిగించి
చక్రవాకుల వేడ్క లాక్రమించి
చీఁకటిఁ గబళించి , చిగురుటాకుల దీప
ములె మాడ్కి వెలిఁగించి , మొనసి మంచి

తే. చలువ చీరలు సాను దేశముల నిండఁ
బఱచినటువలె వెన్నెలఁ బ్రబలఁ జేసి
పూర్వదిక్సతి నీక్షింప మొనయు కరణి
సరగ వచ్చుచునుండె నా చంద్రుఁడంత. 164

చ. వనగిరి సానుశృంగముల వారిజసంభవుఁ డాదిగా మహా
మునులు , శివుండు , దిక్పతులు మోహము లుప్పతిలంగఁ గామినీ
జనములఁ గూడియుండఁగను , శౌరి మహానియమంబుతో సిరిన్
నెనరున వక్షమం దిడక నేల వసించుఁ జిగుళ్ల పాన్పులన్. 165

ఆ. వకుళవద్ద లక్ష్మి , వల్మీకవివరంబు
చెంత శౌరియును వసించి యొక్క
రొకరి నంటకుండు టుడురాజు గని , కలం
కమును బొంది రోషకలితుఁడగుచు. 166

క. 'నాతోడఁ బుట్టి వెలసిన
శ్రీతరుణీమణిని వేఱుఁ జేసిన దనుజా
రాతికి నేఁ డుపకారముఁ
జేతునె?నే'ననుచుఁ జాల సిడిముడిపడుచున్. 167

తే. 'చెలువ మలరఁగ హరి యురఃస్థలిని భోగ
లీల వెలయఁగ ముసు పవ్వళించు లక్ష్మి
రాగవిరహితయై కొండఱాతిమీఁద
నిపుడు శయనించియున్న దే నెట్లు సూతు ? 168

సీ. చెనఁటియై భృగుఁడు చేసిన పని కలిగి కొ
ల్లాపురమందున్న లక్ష్మి నిటకు
మొదటఁ బిల్పింపక , మోసంబుఁ జేసి మా
యలు పన్ని తనకుఁ దలంటు వేళఁ
బిలిపించె ; నిఁకనైనఁ బ్రేమమీఱఁగ నుర
మందుంచుకొనియుండు నంచు నమ్మి
వచ్చితి , నీ రమావనిత నా హరి తేరఁ
జేసిన విధముఁ జూచితిని , గనులు

తే. చల్లనాయెను , నేను నా చలము దీర
నేమి చేయుదు?'నని క్రోధ మినుమడింప
శ్రీశు నేత్రాబ్జముల నిండ శీతకిరణ
తతిని నపుడు సొన్పి ముకుళితములఁ జేసి. 169

తే. 'రెండు జాముల దనుక నీ రీతి మేను
మఱచి శయనింపు మో బావమఱఁది ! ' యనుచు
హెచ్చి హిమకిరణుఁడు శాపమిచ్చె నేమొ
యనఁగ హరి నిద్రఁ జెందె దేహంబు మఱచి. 170

తే. తలిరుఁ బానుపుపై విశ్వ తైజసులను
గడచి , ప్రాజ్ఞుని దాఁటి , యఖండ తుర్య
మందమరఁ బొంది తదతీతమైన సుఖము
ననుభవించుచునుండెఁ బద్మాక్షుఁ డచట. 171

క. అంతట నలరులపై శ్రీ
కాంతామణి నిదురఁజెందఁగాఁ జూచి హా
చింతన్ వెలవెలఁ బోవుచు
సంతోషము లేక చిక్కి సగమగు పగిదిన్. 172

సీ. శుక్ల సప్తమినాఁటి సోముఁ డాలోచించి
తలఁచె నిట్లని ' రమాతరుణి కిచట
నలుకఁ దీరిచి వక్షమం దుంచికొనియుండ,
కఱఁజేసి గగనరాజాత్మ సుతను
దాఁ బెండ్లియాడను దయలేక విష్ణుండు
దలఁచెఁగదా ! యీ విధాతముఖులు
' నిపుడైన సురమునం దిందిర నిడికొని
యేలుచుండు , వివాహమేల ? ' యనక ,

తే. పెద్దలై శౌరి కిఁక మీఁదఁ బెండ్లిఁజేయ
వచ్చినందున , వీరి నీ వనములందుఁ
జీఁకటిని ద్రోసిపోయెదఁగాక ! ' యనిన
చందమునఁ బశ్చిమాబ్ధికై చనుచునుండె. 173

చ. తమ విభుఁ డల్గి పోవఁగను దారలు విన్నఁదనంబు నొందుచున్
క్రమముగఁ జంద్రుతోడుతనె గ్రక్కునఁ బోవుచునుండె నప్పుడే ,
కుముదము లప్పుడేఁగుటకుఁ గ్రూరుఁడు వచ్చుట కార్తిఁబొందుచున్
భ్రమయుచు నప్పులం దొదుఁగు భావముగా ముకుళించె ఖిన్నతన్. 174

ఉ. అప్పుడు ' చంద్రుఁ డేగె , నిఁక నంబుజమిత్రుఁడు జాముదోయికే
తెప్పున వచ్చు , వాఁడు చనుదేరక మున్నె విరించి ముఖ్యులన్
తప్పక చూడవచ్చు'నని తామసి నల్లనిచీర గట్టి తా
నొప్పుచుఁబోయెనో యనఁగఁ నుబ్బుచుఁ జీఁకటి గ్రమ్మెఁ గొండపై. 175

సీ. ఆ చీఁకటినిఁ జూచి యద్రిరూపము దాల్చు
పన్నగేంద్రుఁడు నిజఫణము లెత్తి
' హరి హర బ్రహ్మాదు లంగనలను గూడి
యుండఁగా జీఁకటిందుండఁదగునె ? '

యని ఫణామణుల మహాప్రకాశముఁజేసి
నాఁడేమొ యనురీతి నగముమీఁది
జ్యోతిర్లతావళుల్ చూపట్టె ; ' హేమాద్రి
కీవల దట్టమై హెచ్చియున్న

తే. చీఁకటినిఁబట్టి కొట్టెదఁగాక ! ' యనుచు
నలుక దీపింప నరుదెంచె ననిన రీతి
మిహిరుఁ డుదయగిరీంద్ర సమీపమునకు
వచ్చుచుండఁగఁ దిమిరంబు లెచ్చు వెఱచె. 176

చ. 'జలరుహసంభవాదులను సంతస ముప్పతిలంగ వేంకటా
చలమునఁ జూచుచుంటి , నిదె సప్తతురంగుఁడు వచ్చు , నిచ్చటన్
నిలిచినఁ గొట్టునో 'యనుచు నీచతమం బపరాద్రి దారినే
కలఁగుచుఁబోయె నన్నటులఁ గాంచనశైలము చాటు నొందఁగన్. 177

ఆ. హరిని లేపి పెండ్లి కంపించుటకు శుభ్ర
వస్త్రమును ధరించి వసుధపైకిఁ
బ్రాగ్దిశాబ్జనేత్ర భక్తితో వచ్చెనో
యనఁగఁ దూర్పు వెల్లనాయె నంత. 178

తే. పసుపు సున్నము బంగారు పళ్లెరాన
జలముతోఁ గల్పి వేంకటేశ్వరున కార
తిచ్చుటకు ఛాయయను భామ తెచ్చెననఁగ
నమరి తూర్పున నరుణోదయంబు నయ్యెఁ. 179

క. మక్కువతో హరిపెండ్లికి
గ్రక్కునఁ బోవలయు ననెడి కైవడి నపుడే
చక్కని యుదయాచలమం
దెక్కి దివాకరుఁడు వేంకటేశ్వరు మోమున్ 180

తే. చూడఁగాఁ , జంద్ర కిరణవిస్ఫూర్తి చేత
నచట నా రేయి ముకుళించినట్టి నేత్ర
జలజములు సూర్యకిరణ సంస్పర్శవలన
వికసితములయ్యె ననినట్లు విష్ణుఁడపుడు. 181

తే. కనులు దెఱచి వినోదియై కమలముఖముఁ
జూచి సంతోష చిత్తుఁడై లేచి ' యచటి
నలినజాభవముఖుల పైనములు చేయు '
మనఁగ విని చని విహగేంద్రుఁ డట్లఁ జేసె. 182

తే. హెచ్చి మిత్రుఁడు తముఁ బ్రోవ వచ్చినపుడు
శత్రుఁడగు చంద్రుఁ డలుకతోఁ జనుట దలఁచి
నవ్వెనో యను విధముగా నళిన సమితి
సరస మొప్పఁగ వికసింపసాగె నంత. 183

క. సరసిజములలో రాతిరి
చెఱ లుండిన యళులు లేచి జిరజిరమని య
త్తఱిఁ గమలంబులఁ బొదివెడి
కరణిని ఝుంకృతు లొనర్చి కదియుచునుండెన్. 184

తే. కలకల ధ్వను లెసఁగ ఖగంబు లెల్ల
శౌరి పెండ్లికి రమ్మంచు సరభసముగఁ
బొసఁగ దిగ్దేవతలఁ బిల్వఁబోయినటులఁ
జెలఁగి కూయుచు సకల దిక్కులకుఁ జనియె. 185

ఉ. పీత నిజప్రకాశమును బెంచుచు వృక్షలతాద్రి దిక్పుర
వ్రాతములందుఁ గప్పుచును వచ్చు దివాకరుఁ జూచి లేచి యా
ధాతృముఖామరార్యులును దాపసులున్ హరియున్ శివుండు వి
ఖ్యాతిగ నుండు పుష్కరిణీగట్టులఁ జేరి యథాక్రమంబుగన్. 186

శా. స్నానార్ఘ్యాదిక నిత్యనిర్మలవిధుల్ జాగ్రత్తగాఁ దీర్చి ,రం
దా నారాయణుఁ 'డెండ మించు నిఁక లెం'డన్నన్ బ్రయాణంబులై
యానందంబున భార్యలన్ సుతుల నెయ్యంబొప్పఁ దోడ్కొంచు రాఁ
గా , నాగేంద్రగిరీశుఁ బేర్కొనుచు సత్కల్యాణముల్ పాడుచున్. 187

## శ్రీనివాసుఁడు బ్రహ్మాదులతో వివాహమునకుఁ దరలిపోవుట

శా. ముత్తైదుల్ సనుచుండఁగా , ద్విజులు తామున్ నాల్గు వేదంబు లె
ల్లెత్తైంతో రభసంబుగాఁ జదువ , నందింద్రాణి,దేవాంగనల్
ముత్తైంబుల్ , విరులున్ , శుభాక్షతములున్ ముఖ్యంబుగాఁ బూనుచున్
జిత్తంబుల్ ముదమొంద సేసలిడిరా శ్రీస్వామి శీర్షంబునన్. 188

ఆ. హేమరథము మీఁద నిందిర , పుష్పర
థంబుమీఁద వకుళ , తార్క్ష్యవాహ
నంబుమీఁదఁ జక్రి , నందిపై రుద్రుండు
హంసవాహనంబునందు బ్రహ్మ. 189

సీ. ఎక్కిరి ; పురుహూతుఁ డిభమందుఁ , దగరుపై
నసలుండు , మహిషంబునందు యముఁడు
నరునిపై నైరృతుం , డిరవొందు మకరంబు
పై జలేశుఁడు , జింకపైఁ బవనుఁడు
హయముపై ధనదుండు , నవలఁ దక్కినవారు
వారి వారికిఁ దగు వాహనముల
యందుఁ బత్నీయుక్తులగుచుఁ గూర్చుండి ; ర
త్నాఱి హరిముందఱ ధాత చనఁగ

తే. గుడిని రుద్రుండు , శ్రీసతి యెడమ దిక్కు
వెనుక శరజన్ముఁ డరుగఁగా , వివిధ వాద్య
రవము లతిశయముగ నంబరంబు నిండఁ
దగు బిరుదులెత్తి మాగదుల్ పొగడుచుండ. 190

తే. గొడుగు శేషుఁడు పట్టఁగాఁ, గుడి యెడమల
నమరి పవనుఁడు ఘనచామరములు వీవ
భక్తి మెఱయఁగ సేనాధిపతి ముదమున
నాలవట్టము పట్ట శేషాద్రి డిగ్గి. 191

వ. నేల యీనిన చందంబున నెఱసి కపిలతీర్థ మార్గంబునం జని చని శుకాశ్రమంబునకుఁ బోవుచుండఁగా, నా వ్యాసాత్మజుం డాస్వామి కెదురుగా వచ్చి తోడ్కొనిపోయి సుస్థలంబునందుంచి, నిజయోగప్రభావంబున సకల పదార్థాకర్షంబుఁ జేసి హరిహరబ్రహ్మాదులకు విందు సేయించె; నయ్యష్టమినాఁటి రాత్రి హరి గంధర్వయక్షకిన్నర గానంబు లాలకించుచు, రంభాద్యప్సరఃస్త్రీల నృత్యంబు లీక్షించుచు, సామగానంబులు విని విని చొక్కి, కుసుమ శయ్యలయందు విశ్రమించి లేచి, యమ్మఱునాఁడు నారాయణవర పురసమీపంబున కరుగఁగాఁ నాకాశరాజు హితమంత్రిపురోహితసహితంబుగాఁజతురంగబలములతోడ నా చక్రి కెదురుగా వచ్చి పూజాలింగనాది సత్కృత్యంబు లాచరించి, వీధినిఁ బ్రదక్షిణంబుగాఁ దోడ్కొని వచ్చి విడిదియందుంచి, హరిమతంబున నిజమందిరంబుఁజేరి తొండమానుని శౌరిసాన్నిధ్యంబునకుఁ బంపింపఁగా, నతం డరిగి యచ్చట హరిహర బ్రహ్మాదులకు భోజనంబులు చేయించి, తాంబూలంబు లిప్పించి నిజగృహంబున కరిగె; నచ్చట గురువాక్యానుసరణంబుగా నాకాశ నృపతి మంగళస్నానంబుఁజేసి, నాంది, నవగ్రహయజ్ఞము మొదలయిన వివాహ కృత్యంబు లాచరించె నంత. 192

సీ. అస్తమయముగాఁగ హరితోడ విడిదిలో
బ్రహ్మరుద్రాదులు పవ్వళించి
నిదురించి; రావల నుదయపర్వతముపై
నరుణోదయంబయ్యె, నపుడె లేచి

యందఱు స్నాన సంధ్యాది కృత్యంబులు
నెఱవేర్చి ; రటుమీఁద హరియు స్నాన
సంధ్యాదు లొనరించి సంతోషమెసఁగ వ
సిష్ఠసంయమిని వీక్షించి పలికె

తే. 'నేను , లక్ష్మియు , నజుఁడును , నీవు , వకుళ
మాలికయు భుక్తి గొనక నేమమున నుండ
వలెఁగదా ? కన్య నొసఁగెడివారి నగర
గగననృపుడు , ధరాదేవి , కన్యకయును. 193

తే. తొండమానుండును , బురోహితుండు నైన
సురగురుండు భుజింప కచ్చోటఁ దగిన
నియమమున నుండవలెఁగదా ! నిలిచినట్టి
వార లందఱు భుజియింపవచ్చుఁ గనుక. 194

వ. త్వరగా బ్రాహ్మణ భోజనంబుఁ జేయింపందగు'ననిన విని వసిష్ఠుండు కుబేరున కా వృత్తాంతంబంతయుం జెప్పి పంపఁగా , నతండరిగి యుపవాస నియమ , సంతర్పణప్రకారం బాకాశరాజునకుఁ జెప్ప , నా నృపాలుండు సమ్మతించి మధ్యాహ్నంబునకు బ్రాహ్మణ సంతర్పణంబుఁ జేయించి , యొక్కొక్క నిష్కంబుచొప్పున దక్షిణయుఁ , దాంబూలంబు లిప్పించి , 'ప్రొద్దు గ్రుంకిన పదుమూఁడుగడియలకు ముహూర్తంబుగావలయుఁ గనుకఁ దగుమంగళ ద్రవ్యంబులు వివాహమంటపమందుంచు'డని పరిచారకులకు నియమించి, పురోహితబంధుమిత్రానుజులతోడ ధరణీదేవిని సువాసినులతోఁ దోడ్కొని సాయంకాలంబున హరి యున్న విడిదికిఁ బోయి , నక్షత్ర సమూహ పరివృతుండైన సుధాకరునిచందంబున బ్రహ్మరుద్రాదులమధ్యంబున రత్నపీఠంబునందుఁ గూర్చుండియున్న హరినిఁజూచి యానందించి , వసిష్ఠాది మునులం జూచి 'స్వామివారిం దోడ్కొని మీరందఱును రావలయు'నని ప్రార్థించె ; నప్పుడా వసిష్ఠుండు 'శ్రీస్వామివారినిఁ

బూజింపు'మని చెప్పిన , విని ధరణీదేవి సంకోచంబుతో నరుంధతిని మున్నిడికొని భయభక్తులెసఁగ స్వామికి దివ్య వస్త్రాభరణ చందన తాంబూలంబు లర్పించి , పుష్పహారంబు కంఠమందు నుంచి 'కృతార్థురాలనైతి'నని సంతోషించె. తొండమానుండు సభాతాంబూలంబు లిప్పించె. తదనంతరంబున. 195

సీ. ఐరావతముమీఁద హరిని , శ్రీసతి నుంచి
కొని రాజవీథులఁ గోరి రాఁగ
వివిధంబులగు చతుర్వేద ఘోషణములు
ఘనయక్ష,గంధర్వ గానములును
మిన్నంది ఘోషింప , మెఱయుచు రంభాది
సతులు నృత్తంబులు సల్పఁగాను
ఘనతర కరదీప,గగనబాణంబులు
పెక్కు దిక్కులను దీపింపఁగాను

తే. సకల దిక్పతులును , బద్మసంభవుఁడును
గొలువఁగాఁ జక్రి సంతోషకలితుఁడగుచు
నిర్మలుండగు నాకాశనృపతి నగరు
సేరుటకు వచ్చి మందిర ద్వారమందు. 196

తే. నిలువ , మంగళవాద్యముల్ నెరసి మొఱయఁ
దొండమానుని భార్య సంతోష మెసఁగ
నైదువలతోడఁ జేపట్టి హరికి , సిరికి
నిష్టముగ మంగళారతు లిచ్చె నపుడు. 197

క. తనకును సిరి కారతు లి
చ్చిన వారికి వీడెములును , జీనాంబరముల్
ఘనమతి వరనిష్కములును
బెనుపుగ నిప్పించె నా కుబేరునిచేతన్. 198

## పద్మావతీ వేంకటేశ్వరుల కల్యాణము

వ. అంత నా శ్రీనివాసుం డైరావతంబు డిగ్గి , లక్ష్మికరంబుఁ బట్టికొని బ్రహ్మరుద్రాదులతోడ నంతఃపురంబులోఁ బ్రవేశించి , కల్యాణమంటపంబులోఁ జతురస్ర రత్నవేదికయందున్న హేమసింహాసనంబుమీఁద లక్ష్మీసమేతంబుగాఁ గూర్చుండఁగా , శాస్త్రోక్తంబుగా నాకాశరాజు నిశ్చితార్థంబుఁ జేయించె నంత. 199

సీ. అమరఁ బద్మావతి కనసూయ మొదలైన
యైదువలెల్ల సమ్మోద మెసఁగ
భాసుర నూతనాభరణంబులును , నవ్య
చేల , చందన , పుష్పమాలికలును
గాటుక , కుంకుమ క్రమమొప్పఁగా నలం
కారంబుఁ జేసి , శ్రీగౌరిచెంత
నుంచి పూజలను జేయించిరి , ఋషులు క
న్యావరణముఁ జేసి రచట , నవల

తే. సుతను దీవించి , మంగళసూత్ర మఱుతఁ
గట్టి యా ధరణీదేవి కన్యతోడఁ
గూడ నైదువలను దోడుకొని వివాహ
మంటపముఁ జేరవచ్చి సమ్మతముగాను. 200

తే. తూర్పుముఖముగ సుత నుంచెఁ , దోయజాక్షుఁ
డచట పశ్చిమముఖముగా నలరుచుండె
నలఘు మంగళవాద్యంబు లన్నిదిశల
నురుతరంబుగ ఘోషించుచుండె నంత. 201

క. గడియారము చూచుచు న
పుడిదే శుభలగ్నమనుచుఁ బురుహూతాదుల్
తడయక చెప్పఁగ , నృపుఁడ
క్కడ హరిసాన్నిధ్యమునకు గ్రక్కున వచ్చెన్. 202

సీ. అచ్చటఁ దగు వివాహక్రియలు వసిష్ఠ
మౌని చేయింపఁ గ్రమముగఁ జేసి,
యపుడు నూతన భర్మయజ్ఞోపవీతముల్
ధరియించి కంకణధారణంబుఁ
జేయించికొనియున్న శ్రీహరిపాద ప
ద్మముల బంగరు పళ్లెరమున నుంచి
తపసులు పురుష సూక్తము వచింపఁగఁ, బుణ్య
తీర్థ మా నృపుభార్య తెచ్చి యొసఁగ

తే. భూవరుఁడు శుభ సంకల్పపూర్వకముగ
హరి పదంబులు గడిగి యా యమలతీర్థ
మపుడు శిరసావహించి , భార్యాత్మజాది
బంధుమిత్ర శిరంబులపైనఁ జల్లి. 203

ఆ చక్రి కాచమనార్ఘ్యముల్ , మధుపర్క
మిచ్చి , పద్మావతి నివలఁ బిలిచి
జగదీశుఁ డవల నుండఁగ నిర్వురకు మధ్య
మునఁ దెర గట్టించి మొదట నత్రి
యనుమతంబున నృపు ' డత్రిగోత్రజ సువీ
రక్షమానాధపుత్రక సుధర్మ
రాజాత్మజుఁడ నభోరాజాఖ్యుఁడను నేను
నా కన్య నిచ్చెద నీకుఁ గరుణ

తే. నగ్నిసాక్షిగఁ జేపట్టు మంబుజాక్ష ! '
యనఁగ విని చక్రి సంతోష మతిశయింప
సకల సురముని ముఖ్యులు సాక్షిగాఁగ
నా వసిష్ఠానుమతి నిట్టు లనియె నపుడు. 204

వ. 'వసిష్ఠ గోత్రోద్భవ శూరసేనాత్మజ వసుదేవపుత్త్రుండనై **వాసుదేవాభిధానంబు** నొంది శ్రీవేంకటేశ్వరుండనైన నే నీ యత్రి గోత్ర సంజాత**యైన పద్మావతి** నగ్నిసాక్షిగాఁ బాణిగ్రహణంబుఁ జేసెద'నని పల్కిన విని నృపాలుండు హరికి వరదక్షిణ కోటినిష్కంబులు సమర్పించి, తదనంతరంబున దివ్య నవ్య శుభ్ర వస్త్రంబులును , జీవరత్న కలిత శతభార కిరీటంబును , నూఱు బారువులదియు , నేఁబది బారువులదియు , నిరువదియయిదు భారంబులదియు నీ ప్రకారంబుగా మూఁడు బంగారు కంటెలను , ననర్ఘ రత్నఖచిత పదకహారంబు లాఱున్నొకటియు , మఱియు నొక్క దివ్య మౌక్తికహారంబును , నింబఫలప్రమాణంబులైన ముత్యాల పోఁగులు రెండు జోళ్లను , వెలలేని భుజకీర్తులును , నాగాభరణంబులును , నఱువదినాలు గపరంజి సందిటితాయెతులును , వజ్ర,పద్మరాగ కాంతుల నొప్పిన ద్వాత్రింశద్భార కంకణంబులును , వీరముద్రాద్యంగుళ్యాభరణంబులును, బంచాశద్భారకనక కటిసూత్రంబును , గంఠాది పాదపర్యంతం బావరించిన యేకాదశ శతభార వజ్రకవచంబును , నష్టాదశభార కనకమయపాదుకాయుగ్మంబును , బరిమళగంధ పారిజాతపుష్పహారంబులును శ్రీనివాసున కలంకారంబుఁ జేసి , ఋషులు మంగళాష్టకంబులు చదువఁగాఁ , గుశ పుష్ప **హిరణ్యాక్షతోదకంబులు చేపట్టి** కనకరత్నాభరణభూషితయైన కన్యకను హరికి **ధారాదత్తంబుఁ జేసి** , యానందబాష్పపూరితలోచనుండై ' ధర్మార్థకామమోక్ష సంకల్పంబులయం దీ కన్యక ననువర్తించి రక్షింపవలయునో స్వామీ ! ' యని ప్రార్థింపఁగా ,

విని హరి మహాప్రసాదంబని తద్వాక్యంబు నంగీకరించె ; నంత మాంగల్య, కంకణధారణంబులును , నక్షత్రారోపణంబును , ప్రధానహోమంబును , సప్తపదాతిక్రమణంబును , లాజహోమంబును , ప్రవేశహోమంబును , నరుంధత్యాద్యవలోకనంబును , స్థాలీపాకంబును , నౌపాసనంబును నివి మొదలైన వివాహకృత్యంబులు సురగురు వసిష్ఠాత్రిప్రముఖులు నెఱవేర్చి; రప్పుడు రాజేంద్రుండు షోడశమహాదానంబులు చేసి, గంధాక్షత పుష్పంబుల సభాపూజ చేసి , ఫల, దక్షిణ, తాంబూలంబులు సకల జనుల కిప్పించె నంత. 205

సీ. బ్రహ్మ రుద్రాదుల పంక్తుల నడుమగాఁ
బేరైన నవరత్న పీఠ మునిచి
పటువజ్ర కలిత దీపస్తంభముల మీఁద
బహుళ మాణిక్య దీపములఁ బెట్టి
పైఁడి పళ్లెర మునిచి భక్ష్య భోజ్యాది ప
దార్థముల్ వడ్డించి , రపుడు శౌరి
వనధిజఁ బద్మావతినిఁ దా నుభయ పార్శ్వ
ముల నుంచుకొని చాల ముచ్చ టమర

తే. నందు విధి రుద్ర ముఖులతో నారగించె;
నంద ఱటు తృప్తులై లేచి హస్త పాద
శుద్ధి గావించికొని , మహాసుఖముమీఱ
వీడెములు చేసి పవళించి వేడ్క మెఱయ. 206

ఆ. నిదురఁ జెంది , సూర్యుఁ డుదయింపఁగా లేచి
వారి వారి పనుల వారు వారు
చేసి , రాజసుతకు సిరికిఁ జక్రికి నల్గు
లొనరఁ బెట్టి రట్లు దినదినమును. 207

సీ. నలుఁగులు , నౌపాసనంబులు , బువ్వముల్
సంతర్పణంబులు సాంగముగను
నడపుచున్ , మూఁడవనాఁడు పాకెనఁ జేసి
నరులెన్న నాలవనాఁటి రాత్రి
యందఱితో శౌరి హరిబువ్వము భుజించి
శయనించి నిదురించి , జామురాత్రి
కలదనఁగా లేచి క్రమముఁ దప్పక శేష
హోమంబు గావించి హుతవహునకు

తే. మ్రొక్కులిడి , తన చేతికిఁ జిక్కినట్టి
కనకకలశముఁ గొని దొంగతనముగాను
బొరుగువారిల్లు సేరె నప్పుడు రయమున
నగజ మొదలైన యైదువ లపుడె లేచి. 208

తే. అందఱును గుమిగూడి యా యబ్జవతిని
హరికడకుఁ దోడుకొని పోయి మురిప మెసఁగఁ
బుష్ప , చందన , తాంబూల , భూషణములు
పెండ్లికూతురుచేత నిప్పించి రందు. 209

తే. గౌరి నవ్వుచుఁ బల్కె ' నీ శౌరి నిందు
మోహమునఁ బెండ్లియాడిన ముద్దుగుమ్మ !
సిగ్గు నీకేల ? నీపతి చిత్త మలరఁ
బిలిచి ప్రార్థించి , రమ్మంచు నలుకదీర్పు. ' 210

చ. అన విని పెండ్లికూఁతురు మహాభయభక్తులు మానసంబులోఁ
బెనఁగొన , హాస చంద్రికలు బింబనిభాధరమందుఁ గ్రమ్మఁగాఁ
గనుఁగువబెళ్కు ముద్దు గులుకంగ నిజేశ్వరు మోముఁ జూచి , ల
జ్జను దలవాంచి చిల్కవలె జాణతనంబున నవ్వి యిట్లనెన్. 211

సీ. 'హృదయేశ ! చోరత్వ మెసఁగఁగా నీవు మా
చెంబుఁ దెచ్చినదేమి చెప్పవోయి !
హర పద్మభవుల ముందఱఁ జిన్నపని నీవు
చేసిన గొప్పేమి చెప్పవోయి !
జలజాలయకు , నాకుఁ దలవంపు పని నీవు
చేయు కారణమేమి చెప్పవోయి !
ఘననాకబలికాలమునఁ దేర కీ యల్కఁ
జేసి వచ్చినదేమి చెప్పవోయి !

తే. దేవ ! పెండ్లికి నీ వప్పు దీసినట్టి
ద్రవ్యమున కీడుగా దొంగతనముఁ జేసి
తెచ్చితివి చెంబు , దీనిచేఁ దీఱ దప్పు
రమ్ము మేమియ్యఁగలము వరాలు సామి ! 212

ఆ. గొల్లవారి యిండ్లు కొల్లఁబెట్టుచుఁ , బాలు
వెన్న ముచ్చిలించి మున్ను దిరుగు
చున్నబుద్ధి విడువ , కూరివారింటిలోఁ
జెంబు ముచ్చిలింపఁ జెల్లదోయి !' 213

వ. అని యనేక ప్రకారంబులఁ బ్రార్థించి పిలిచిన , హరి చిఱునవ్వు నగుచుఁ బద్మావతి కరంబువట్టి తోడ్కొని సకల వైభవంబులతోడ వచ్చి , పూర్వ వివాహ మందిరంబుఁ జేరె ; నందు మంగళస్నానపూర్వకంబుగా వస్త్రభూషణాద్యలంకృతుండై , రత్నపీఠంబుమీఁద లక్ష్మీపద్మావతీసమేతుండై కూర్చుండియుండె. 214

సీ. అట నాకబలి , దేవతార్చనంబులు , నీల
మణిధారణంబును , మధురఫలము
లార్యుల కొసఁగుట , లైదువలకు శూర్ప
దానముల్ సేయు , టత్తఱిని వేడ్క

లమర వసంతోత్సవము , వధూవరులు మేల్
పాన్పుపైనుండి దంపతుల పేరు
లడిగి చెప్పఁగ విని విడెము లిచ్చుటయు , న
చ్చట నొప్పు నాందీవిసర్జనంబు

తే. మొదలుగాఁగల శుభకృత్యములను దేవ
దేశికాత్రివశిష్ఠులు ధీరమణులు
వరుసగా నడిపించి ; రావల నృపాలుఁ
డందు బ్రహ్మాదులకు ముదం బతిశయింప. 215

వ. దంపతులకు నభ్యంగనస్నానంబులు చేయించి , వస్త్ర భూషణ చందన పుష్పంబులచే దంపతిపూజలు సేయించి , షడ్రసోపేతంబుగా నందఱికి భోజనంబులు వెట్టించి , తాంబూలంబు లిప్పించె ; నంత సాయంకాలంబుగాఁగ నలంకారయుక్తంబగు నైరావతంబుమీఁద హరిని సిరినిఁ బద్మావతిని నుంచి సకలోత్సవంబులతో వీధిప్రదక్షిణంబు చేయించికొనివచ్చి నిజమందిరంబునఁ జేర్చి , ' కృతార్థుండనైతి'నని సంతోషించె. అమ్మఱునాఁ డరుణోదయంబున హరి ప్రయాణోన్ముఖుండై 'పద్మావతినిఁ బంపుఁ'డనిన విని పత్నీసహితుండై గగనభూపాలుం డిట్లనియె. 216

సీ. 'శ్రీశేషగిరివాస ! శ్రీసతితోడ మీ
రొక్క మాసంబైన నుండుఁడిచట'
ననుచుఁ బ్రార్థింపఁగా హరి యిట్లులనియె ' నిం
దుండఁగూడదు,పనులుండు నచట'
ననఁగఁ 'బద్మావతి నంపించు విధమెట్లు ?
పసిబిడ్డయగుఁ గాని , ప్రౌఢ గాదు
గాన నేనిపు డంపలే'నన్న విని చక్రి
సిరిఁజూచి కనుసన్నఁ జేసె నపుడు

తే. చక్రిభావంబుఁ దెలిసి యా జలధికన్య
తాను గగనాధిపతిఁ జూచి ' తండ్రి ! యబ్జ
వతిని హరివెంటఁ బంపింపవచ్చు , నదియె
మాకు సంతోషమగుఁ ; జింత మీకు వలదు. 217

సీ. వకుళమాలిక తల్లివలెఁ బ్రోచు నచ్చోట
నన్యు లెవ్వారు లే'రని యనేక
రీతులుగా సిరి ప్రీతితోఁ జెప్ప , న
మ్మనుజేశ్వరుండు సమ్మతము నొంది
సిరికినిఁ , దనయకున్ మెఱయు దివ్యాంబరా
భరణంబు లిప్పించి , భార్యచేతఁ
గడువేడ్క ముత్యాల యొడిఁబ్రాలు గట్టించి
హేమాంబరము హరి కిచ్చి , వకుళ

తే. మాలికకు భూషణంబులు , చేల లిచ్చి
యొప్పుగా సిరి కా బిడ్డ నొప్పగించె
హరియు వసుదానుఁడను బావమఱఁది కచట
తాను గప్పిన దివ్యవస్త్రంబు నొసఁగె. 218

క. గగనాధీశ్వరుఁ డంతట
జగదీశ్వరు చెంత నిలిచి సద్భక్తుండై
నిగమాంత గుంఫితోక్తులఁ
బొగడుచు మఱి యిట్టులనియెఁ బుణ్యాత్మకుఁడై. 219

సీ. 'పెద్దకాలమునుండి బిడ్డలు లేకుండి
గాంచితిఁ దొలుత నీ కమలనయన
మొనసి యీ కన్య గల్గిన విశేషముచేత
వసుదానుఁ డుదయించె ; వాని మీరె

పాలింపవలయు మా పద్మావతీదేవి
నిచ్చితిఁ గనుక మీరింకమీఁదఁ
జిరకృప నీళ్ల ముంచినఁ బాల ముంచిన
భారంబు మీఁదని బాష్పములను

తే. గన్నులను నించి , మఱి పల్కకున్నఁ జక్రి
గగననృపతినిఁ జూచి సత్కరుణమీఱఁ
బలికె నిట్లని ' మామ ! మీ పట్టికొఱకుఁ
జింతసేయకుఁ డేను రక్షింపఁగలను. 220

తే. పెద్దలైతిరి మీరు , సంప్రీతి నెపుడు
జాల నామీఁద నుంచి నిశ్చలత నొందుఁ
డమలసౌఖ్యము గలుగు మీకనుచుఁ గృపను
పలికి పద్మదళాక్షుండు పయనమయ్యె. 221

వ. అప్పు డాకాశరాజు శాలితండులంబు లిన్నూఱు భారంబులును , ముద్గఖండంబులు ముప్పది భారంబులును , నిక్షుతింత్రిణీఫలంబులు నలువది భారంబులును , సహస్ర క్షీర భాండంబులును , సహస్రార్థ ఘృత భాండంబులును, ద్విశత శర్కరాఘటంబులును , ఆవ , జీలకఱ , మెంతి, యింగువ , మిరియాలు , లవణంబును , వార్తాక , కదళీ , కూష్మాండ , కందమూలాది శాకంబులును , చూతామలక ప్రముఖ ఫలంబులును , దశమధు ఘటంబులును , ననేక కదళీ వర్ణంబులును హయ,గజ,వృషభంబులపై నిడి శ్రీనివాసార్పితంబుగా దత్తంబుసేసె. దాసీజన శతంబును , ద్రిశత దాసజనంబును , దశసహస్ర ధేనువులును , దివ్యాంబరాభరణ పర్యంకద్రవ్యోపకరణంబు లనేకంబులుఁ బుత్త్రి కరణంబుగా నిచ్చి , హరి సాన్నిధ్యంబునకుఁ గ్రమ్మఱ వచ్చినం జూచి లేచి శ్రీనివాసుం డిట్లనియె. 222

సీ. 'అవనీశ ! మీసుత కరణంబు తగుమాత్ర
మీవలె , నింత మాకేల ? ' యనఁగ
నాకాశనృపుఁ డిట్టు లనియె ' లక్ష్మీశ ! మీ
కేమి తక్కువగాదు ; హెచ్చుగాను
బూని మీకీయను నే నెంతవాఁడను ?
గలుముల చెలి మాకుఁ గరుణ మెఱయ
నిచ్చిన దిచ్చితి , నింతమాత్రంబైనఁ
గైకొనుఁడని పల్కి కరము మోడ్చి

తే. నపు ' డగస్త్యాశ్రమంబున కరుగవలయు
నబ్జవతి నంపుఁడనుచుఁ బద్మాక్షుఁడనఁగ
విని నృపాలుఁడు తన సుతన్ వేగఁ బలిచి
' యమ్మ ! నీ పతితోడ నీ వరుగు మిపుడు. ' 223

చ. అని తన తండ్రి పల్క , నపుడంబను దెప్పునఁ గౌఁగిలింపఁగా
నెనరున బిడ్డ నెత్తి ధరణీసతి కన్నుల నీరు నింపుచున్
మనము గరంగ ముద్దుగొని మచ్చిక మీఱఁగ గారవించి , యి
ట్లనియె ' విచారమేల ? యిపు డబ్జవతీ ! సిరిచెంత నుండుమీ 224

సీ. నాకన్న నెక్కువగాఁ గమలాదేవి
నిను గారవించి మన్నించుచుండు
నదిగాక వకుళ నిన్నాదరించుచు భక్తి
చేఁ గృప నచటఁ బోషించుచుండు
హరి సిరి,నిను నొక్క కరణిగా నీక్షించి
యింపుసొంపెసఁగఁ బాలించుచుండుఁ
బతిభక్తి నెదనుంచి పద్మమందిరతోడ
వేంకటగిరిమీఁద వెలయుచుండు

తే. మేము వచ్చెద మచటికిఁ బ్రేమమీఱ
నీవు వచ్చెద విచటికి , నేఁడు చలము
చేయవల'దని శ్రీలక్ష్మి చేతి కిచ్చి
మఱియు నిట్లని పల్కె నిందిరను జూచి. 225

క. 'అమ్మా ! సిరి ! పద్మావతి
నిమ్మధుసూదనున కిచట నిచ్చితిఁ గనుకన్
సమ్మతముగ నా సుత మీ
సొమ్మైనది , చాలఁ గరుణఁ జూడుము తల్లీ ! 226

సీ. ఆటలాడుచునుండు , నబల యే పనిపాట
లెఱుఁగదు , తప్పొప్పు లెఱుఁగ దిపుడు
కావున మీరు చక్కని బుద్ధు లిఁకఁ జెప్పి
వరుసగాఁ దీర్చికోవలయు దయను
నా మఱుంగున నిన్ని నాళ్లుండె , నిపుడు నీ
మఱుఁగునఁ జేరె నేమఱక ప్రోవు !
బిడ్డలు లేక నేఁ బెద్దగాలంబుండి
కాంచితి నీ కన్యకను ధరిత్రిఁ

తే. బెంచి నీ చేతి కిచ్చితిఁ , బిన్నపడుచు
నెట్ల ప్రోచిన నీ భార , మింక నేనుఁ
జెప్పవలసినదేమి ? నీ చిత్త'మనుచు
నపుడు కన్నీరు నింప నిట్లనియె లక్ష్మి. 227

మ. 'ధరణీదేవి ! ముదంబు నొందు మిపు డీ తాపంబు నీకేల ? యే
మఱకన్ నన్నును , నీ సుతన్ గరుణతో మన్నించు భారంబు మా
హరియం దున్నది ; చింతసేయ కిపుడీ యబ్జాక్షి నంపించు , స
న్నుతిగాఁ జూడకు,మేను నీకు సుతనే యంచుం దలంపందగున్. 228

వ. అని మఱియు ననేకవిధంబుల నాదరించిన , సంతసించి ధరణీదేవి పద్మావతితో నిట్లనియె. 229

తే. 'వినవె ! నా ముద్దుపట్టి వివేక యుక్తి
హరికి సిరికిని శ్రీవేంకటాద్రిమీఁద
గెంటకను సేవఁ జేసి సత్కీర్తిఁ బొందు
పొమ్ము సిరివెంట'నని చాల బుజ్జగింప. 230

క. అప్పద్మావతి తల్లిని
తప్పక కని , కనుల బాష్పధారలు వెడలన్
ఱెప్పల నడ్డము సేయుచు
నప్పుడు సిరితోడ విభున కభిముఖి యయ్యెన్. 231

## వివాహానంతరము హరి యగస్త్యాశ్రమమున కరుగుట

వ. అంత శ్రీనివాసుండు సిరినిఁ , బద్మావతినిఁ దోడ్కొని గరుడవాహనారూఢుండై బ్రహ్మాదులతోడ నగస్త్యాశ్రమంబునకుఁ బోయి బ్రహ్మరుద్రాదుల కాదినం బందు విందు సేయించె ; నమ్మఱునాఁడు విధి శివ ప్రముఖులు శ్రీనివాసాజ్ఞాధారులై మ్రొక్కి తమతమ నివాసంబుల కరిగి ; రంత సిరి కొల్లాపురంబునకుఁ బ్రయాణంబై హరికి మ్రొక్కి యిట్లనియె. 232

తే. 'దేవ ! కరవీరపురిఁ జేరఁబోవవలయుఁ
గరుణతో సెలవిమ్ము శీఘ్రముగ ' ననిన
విని శిరము వంచి విన్ననై విష్ణుఁ డపుడు
పద్మమందిర కరముఁ జేపట్టి పలికె. 233

సీ. 'ఇందిర ! నన్ను నీ వెడఁబాసిపోను గా
ళ్లాడునే ? నిన్ను బొమ్మనను నాకు
నోరాడునే ? నీవు నూతన బంధుల
వలె సెలవిమ్మంచుఁ బలుకఁదగునె ?

పద్మావతిని నీవె పాలింపవలయు , నీ
చిఱుతను నేను పోషింపఁగలనె ?
యకట ! నీ విందుండ కరిగిన , ధనదుచేఁ
దీసిన ఋణమేను దీర్పఁగలనె ?

తే. నన్ను నఱమఱఁగాఁ జూడ కన్నిటికిని
గర్తవై యుండు'మని పల్కఁగా సుధాబ్ధి
కన్య దరహసితాస్యయై కమలనాభు
నింపుమీఱఁగ నీక్షించి యిట్టులనియె. 234

మ. 'సకలజ్ఞత్వము దాఁచి , దివ్యమహిమల్ చాలించి పద్మావతిన్
ప్రకటాసక్తినిఁ బెండ్లియాడితివి ; సౌభాగ్యంబు నీ కబ్బె ; నే
నిఁక నెందుండినఁ జింతలేదు , నను నీ విందుండుమంచున్ వచిం
పక పంపింపుము , వచ్చెదన్ మరల నో ప్రాణేశ ! శీఘ్రంబుగన్. ' 235

చ. అన విని విష్ణుఁ డిట్లనియె ' నంబుధికన్యక ! నేను రాముఁడై
జననము నొందియున్నతఱి జానకివై ' ఘనలంకలోన ము
న్నొనరుచునున్న వేదవతి నొప్పి వివాహముఁ జేసికొమ్ము నీ '
వనిన రహస్యసూక్తి హృదయంబున నున్నదొ , లేదొ మానినీ ! 236

మ. అనలంబందుఁ జలింపకన్ నిలిచి నీ కాప్తంబుగా మేలు చే
సిన యా వేదవతీవధూమణియె రాజీవంబులో నుండగాఁ
గని యాకాశనృపాలుఁ డీ సతిని బల్గారాముగాఁ బెంచె ; నీ
వని యున్నట్టి విధంబు దప్పక వివాహంబైతిఁ బద్మావతిన్. 237

శా. నే నీవాక్యము మీఱరాదనుచు నీ నీరేజపత్రేక్షణన్
ఆనందంబుగఁ బెండ్లియాడితిని , యింకన్యోన్యభావంబుగా
దీనిం బాలనమొప్పఁజేయుటకు నీదే భారమై యుండఁగాఁ
బైనంబైతివి తేరకత్తెవలె , నాపై మోహమున్ నిల్పకన్. 238

ఉ. పావనమూర్తియైన మునిపాదము నాయురమందు సోకఁగా
నీ వపు డల్గిపోయితివి ; నిన్నెడఁబాసిన జాలిచేత నే
నావల నన్నియున్ విడిచి యార్తినిఁబొందుచు వచ్చి పుట్టలో
నీవఱదాఁక యుంటి , నిపు డిందుముఖీ ! నినుఁగంటిఁ గ్రమ్మఱన్. 239

చ. నను విడనాడి దూరముగ నాఁటివిధంబున నుండనేల ? పెం
పున నురమందు భూషణముపోలిక నుండుము ; శేషపర్వతం
బున విహరించుచుండుటకు ముచ్చటయైనది గానఁ బోవని
య్యను , నిలు మిచ్చటన్ మరల నావలఁబోవఁగనేల భామినీ ? ' 240

మ. అని నారాయణుఁ డానతిచ్చిన మహాయాసంబుతో లక్ష్మి యి
ట్లనె ' నోస్వామి ! భృగుండు నీ యురమునం దజ్ఞానియై తన్నినం
దున , నచ్చోట వసింపకన్ తొలఁగి బల్దూరంబుగా నిల్చి నే
ననిశంబున్ మదిఁ గుందుదాన ; నిఁక నేమందున్ త్రిలోకేశ్వరా ? 241

శా. కాలం బీగతిఁ జేసె , నా భృగుననంగాఁ గారణంబేమిఁకన్ ?
జాలా నాయెడ సత్కృపన్ నిలుపుమో స్వామీ ! కడుంజాలు ; నిం
దీ లావణ్యవిలాసినిన్ గరుణతో నింపొందఁగా ముందు న
న్నేలే రీతిగ నేలు ! నా మది కిదే యిష్టంబు ప్రాణేశ్వరా ! 242

క. శ్రీ రాముఁడ వీవైనపు
డారయఁగా నేను సీతనై ' వేదవతిన్
గూరిమితోఁ జేకొను'మని
గౌరవమునఁ జెప్పియుంటిఁ గావున వేడ్కన్. 243

ఆ. వసుధయందు వేదవతి యబ్జవతిగాఁగ
నీవు పెండ్లియాడినావు గనుకఁ
గొదువ లేదు , మదినిఁ గోరి యీ లలితాంగి
యందె సకలసుఖము లనుభవించు. ' 244

వ. అని సమ్మతంబుగాఁ బల్కి , పద్మావతిని గారవించి , ' హరికి సంతోషకరంబుగా సేవఁజేయుచుండు'మని యనేక ప్రకారంబులుగా బుజ్జగించి చెప్పి , వకుళమాలిక నీక్షించి ' యా బాలికామణి నాదరణంబుతోఁ బోషింపుచుండు'మని నియమించి , హరికి మ్రొక్కి , రమాదేవి కొల్లాపురంబుఁ జేరి చక్రిని హృదయకమలమం దిడికొని సుఖస్థితి నుండె ; నంత వేంకటేశ్వరుం డగస్త్యు నీక్షించి యిట్లనియె. 245

తే. 'సంయమీశ్వర ! వేంకటాచలముఁ జేర
మేము పోయెద'మని పల్కఁగా , మునీంద్రుఁ
డనియె ' షణ్మాసపర్యంత మహిగిరీంద్ర
మెక్కుదురె ! పెండ్లికొమరు లో యిందిరేశ ! 246

క. అనఘా ! షణ్మాసంబులు
చనునంతకు నిచట నుండు సంతోషముగా '
నన విని వేంకటగిరిపతి
తన సతితో నచట నుండెఁ దద్దయు వేడ్కన్. 247

వ. అంత గొన్నిమాసంబులకు గగననృపాలుండు వైకుంఠంబున కరిగిన , వసుదానుండు వైదికకృత్యంబులు సాంగంబుగా నాచరించె ; నటు పిమ్మట దూతముఖంబున నవ్వార్త విని వేంకటేశ్వరుండు నారాయణవర పురంబునకుం జని, వసుదానునిఁ దొండమానుని విచారించి దుఃఖోపశమనంబుఁజేసి,యగస్త్యాశ్రమంబునకు వచ్చి , తండ్రికొఱకు దుఃఖించుచున్న పద్మావతి నాదరించుచుండె'ననిన సూతుం జూచి శౌనకాదు లిట్లనిరి. 248

## వసుదాన తొండమానుల యుద్ధము

సీ. 'ఆకాశరాజు శ్రీహరిపదంబును జేర
విమలుఁడై పోయిన వెనుక నతని
తమ్ముఁడు , దనయుఁ డిద్దఱు నుండి ; రందుఁ బ
ట్టార్హుఁ డెవ్వండయ్యె ? నా విధంబుఁ

జెప్పు ' మన్నను సూతుఁ డప్పు డిట్లనియె ' నో
మునులార ! నృపతితమ్ముఁడు ' ధరిత్రి
తనదే ' యనఁగ , నృపతనయుండు ' తమతండ్రి
యేలిన రాజ్య మే నేలవలయు'

తే. ననఁగ , విని తొండమానుఁడందాగ్రహించి
పలికె ' నిరువురమును నిందు భండనంబుఁ
జేయుదము , నీవు మించి గెల్చినను బృథ్వి
నీది , నే హెచ్చి గెల్చిన నాది ధాత్రి. ' 249

క. అని యిరువురు పౌరుషముల
మొనయుచుఁ గదనమున కొప్పి ముఖ్య బలములన్
పనిఁ బూని కూర్చి ; రవ్వేల
వనజాక్షునిఁ జేరి తొండవానుం డనియెన్. 250

సీ. 'వసుదేవసుత ! నేను , వసుదానుఁ డీ క్షితి
కొఱకింక ఘోరసంగరముఁ జేయ
వలె , నాకుఁ దోడు రావలె నీ'వనఁగ నవ్వి
తన మది నిటు దాను దలఁచె శౌరి
' తొండమానున కేను దోడుగాఁ బోయితి
నైనఁ బద్మావతి కలుకవుట్టు
దనతమ్ముఁడగు వసుదానునితట్టు నే
నుండిన , సతి చాల నుత్సహించుఁ

తే. దొండమానుండు పరమభక్తుండు నాకుఁ
బరఁగ వసుదానుఁ డన్యుఁడే బావమఱఁది
గనుక నిరువురితోను సఖ్యంబు పొసఁగఁ
జేయవలె , దీని కిఁక నేమిసేతు నకట ! ' 251

మ. అని యోజింపుచుఁ దొండమాను నపు డయ్యబ్జాక్షుఁ డీక్షించి యి
ట్లనె ' నో మామ ! మహాజియం దిపుడు తోడై నేను నీ దిక్కు వ
చ్చినఁ , బద్మావతి తోడఁబుట్టుకొఱకై చింతించుచుండున్ మదిన్
నిను వీడందగ దెట్లనైన జయమే నీ తట్టుగా నుంచెదన్. ' 252

సీ. అని రహస్యంబుగా నతని కాప్తతఁ జెప్పి
సమ్మతంబుగఁ దన చక్రమిచ్చి
పంపించె , నటుమీఁద బావమఱఁది వచ్చి
తనకుఁ దోడడుగఁగా విని రయమున
లేచి , యా వకుళమాలికకుఁ బద్మావతి
నం దొప్పగించి , నెయ్యంబు మెఱయ
బావమఱఁదితోడఁ బైనమై నారాయ
ణాఖ్య పురంబున కరిగి , యచట

తే. భండనముఁజేయఁ జతురంగబలము లందుఁ
గొలువఁగా బావమఱఁదినిఁ గూడి సమర
భేరి వేయించె ; నప్పు డా భూరిరవము
తొండమానుండు విని మహోద్దండుఁడగుచు. 253

క. శరచాపంబులు గైకొని
విరివిగ రణభేరి తాను వేయించుచు నా
హరికిని వసుదానునకును
సరగున నెదురేఁగి నిలిచె సరభసమతితోన్. 254

వ. అప్పుడు హరియును వసుదానుండును గనకరథంబు లెక్కి వీరులై నిల్చియున్నం, జూచి తొండమానుండు తన రథంబుపై నుండి నిజచతురంగ బలంబులం బరబలంబులపైఁ బురికొల్పె ; నప్పు డుభయబలంబు లుప్పొంగి రథంబులమీఁద రథంబులును , గజంబులమీఁద గజంబులును , ఘోటకంబులమీఁద ఘోటకంబులును , గాల్బలంబుల మీఁదఁ గాల్బలంబులును బడి యొండొరులు కరవాలంబులం ఝుళిపించి

నఱుకుచు , నుఱుకుచు , ధనుర్గుణ టంకారంబులు సేయుచుఁ జండకాండంబు లేయుచు , డాయుచు , గుదియల నడుచుఁచుఁ గుంతంబుల గ్రుచ్చుచు , ముద్గరంబుల నొత్తుచుఁ , జక్రంబులఁ దఱుగుచు, ముసలంబులెత్తి కొట్టుచు , శూలమ్ములఁ జిమ్ముచు నివ్విధంబున విడువక పూర్వపశ్చిమ సముద్రంబుల భంగిఁ బొంగి పోరుచుండి; రందుఁ దొండమాను బలంబులు మొనకు నిల్వక యుఱుకుచున్నం జూచి యతండు విజృంభించి ' నిలునిలుం'డని నిలిపి , తాను వసుదానుని రథంబుపైకి రథంబుఁదోలి ఘోరబాణంబులు వేసె ; నవ్వసుదానుండేయు చండకాండంబుల ఖండించెఁ , దొండమానుండు చండప్రచండుండై యనేక శిలీముఖంబు లేసి వసుదానుని నొప్పించె ; నప్పుడా వసుదానుం డనేక ఘోరాంబక వృష్టిఁ దొండమానునిపైఁ గురియించుచుండగా నతండు రోషభీషణాకారుండై హరి యొసంగిన చక్రం బవ్వసుదానునిపై నేసె ; నప్పుడా చక్రంబు ప్రళయార్కబింబంబుచందంబున నతనిమీఁదికి వచ్చుచున్నఁ జూచి హరి యతని కడ్డంబుగా నిలిచె ; నప్పుడా చక్రంబు శ్రీనివాసునిపైఁ బడిన, మూర్ఛాక్రాంతుండై యరదంబుపై నొరిగినం , జూచి భీతిల్లి తొండమానుండు శస్త్రాస్త్రంబులు విడిచి , నిజరథంబు డిగ్గి హరిరథంబుమీఁదికిఁ జని, పన్నీటఁ గన్నులం దడుపుచుఁ , దాలవృంతంబుఁ బూని విసరుచుండె ; నప్పుడా వసుదానుండును బాష్పపూరితాక్షుండై యరదంబు డిగ్గి హరిరథంబుపై కరిగి , కప్పురంపుఁబలుకులు నమలి చెవులలో నూఁదుచుండఁగా శ్రీనివాసుండు పెద్దప్రొద్దునకు మాయామూర్ఛ దెలిసి లేచి కూర్చుండినం , జూచి కరంబులు మొగిచి తొండమానుం డిట్లనియె. 255

క. 'హరి ! నే వసుదానునిపై
నరిభీకరచక్ర మేసినపు డడ్డముగా
సరగున నిలిచితి , వందునఁ
బొరి చక్రము దాఁక మూర్ఛఁబొందితి వకటా ! 256

క. నీ కపకారముఁ జేసిన
ప్రాకటపాపంబు నన్నుఁ బాయుటకొఱకై
జోకం గాశికిఁ బోవలె !
నా కిప్పుడు సెలవొసంగు నలినదళాక్షా ! 257

క. వసుదానున కీ పట్టము
పసమీఱఁగఁ గట్టు ! జనులఁ బాలించుటకై
వసుమతి నేనిఁక నొల్లను
వసుదేవాత్మజ ! యొసంగు వైరాగ్యంబున్. ' 258

క. అన విని హరి వసుదానునిఁ
గనుఁగొని యిట్లనియె ' నిన్నుఁ గాంచిన జనకుం
డనఘుండై పరలోకం
బున కేఁగెను ; పిన్నతండ్రి పుణ్యముకొఱకై. 259

క. ఘన గంగానది కరిగెద
ననుచున్నాఁ , డింందు కిప్పు డాలోచన యిం
దొనరఁగఁ జెప్పుము నీ'వన
విని వసుదానుండు వలికె వినయము మీఱన్. 260

సీ. 'హరి ! నీవు నన్నుఁబ్రోవ నడ్డంబుగా రాఁగ
నిరుపమచక్రంబు నిన్నుఁ దాఁకె
నపుడు మూర్ఛిల్లితి , వటువంటి పాపంబు
నిఁక నీఁగ నేను రామేశ్వరమున
కరిగెద ; నగ్రజుఁడైనట్టి మాతండ్రి
పట్టంబు పినతండ్రి కట్టికొనుట
లోకసమ్మత మిది , నాకును సంతోష
మటువలెనే చేయుఁ'డనిన శౌరి

తే. విని, యగస్త్యుని, శుకుని వేవేగ నటకుఁ
బిలువనంపించి వీరు చెప్పిన విధములు
వారి కెఱిఁగించి, 'యెటు సేయవలయు ?' ననిన
నవ్వి, వారిట్టులని 'రహో ! నళిననాభ ! 261

సీ. కాశిరామేశ్వరగతులు వీ రగుటేల ?
యన్నదమ్ముల పాళ్ల నరసి మీరు
గగనాధిపుని పాలు తగఁబంచి, యీ వసు
దానున కిపుడిచ్చి, ధర్మముగను
దొండమానుని పాలు తొండమానున కిచ్చి
సమ్మతపఱుపుఁ డిచ్చుట' నటంచు
నమ్మునుల్ వల్కఁగా, హరి సుధర్ముని సొమ్ము
రెండు పాళ్లుగఁ జేసి, తొండమాను

తే. నకు సగంబిచ్చి, సగము నిర్ణయముగాను
గగనపతిసుతున కొసంగి తగవు దీర్చి,
వారి వీడ్కొని యట నబ్జవతినిఁ జేరి
హరి సుఖస్థితి నుండఁగా, నంత నచట. 262

తే. అర్ధరాజ్యము వసుదానుఁ డమర నేలు
చుండఁగా, నర్ధరాజ్యంబు తొండమానుఁ
డేలఁగాఁ బుణ్యపరిపాక కాల మొదవె
నప్పు డా నృపుఁ డాత్మ నిట్లని తలంచె. 263

ఉ. 'వేంకటనాయకుండు ప్రభవిష్ణుఁడు గాని, నరుండు గాఁడు ; నే
మంకుగుణంబుచే మనుజమాత్రుఁడటంచుఁ దలంచుచుంటి, నీ
పంకజనేత్రు దివ్యపదపద్మముల న్నెఱనమ్మి భక్తితో
నింక నిజంబుగా నితని హేమసుమంబులఁ బూజఁజేసెదన్. 264

క. ఈ పరమాత్ముఁడు మనుజుం
డై పద్మావతినిఁగూడి యల్లునివలెనే
కాపట్యముతో మెలఁగుట
లీపట్లం దెలిసె నిందిరేశ్వరుఁ డితఁడే ! ' 265

సీ. అని యగస్త్యాశ్రమంబునకు వేగమె వచ్చి
శేషాద్రిపతిచెంతఁ జేరి భక్తి
తాత్పర్యమొప్పఁగా దండప్రణామంబుఁ
జేయఁగా , నృపుని వీక్షించి చక్రి
నవ్వి యిట్లనియె ' నో నరనాథ ! నీకు నే
నల్లుఁడనైయుండినపుడు నాకు
మ్రొక్కుదురే?'యన్న ముకుళితహస్తుఁడై
యానందమునఁ దొండమానుఁడనియె

తే. ' మాధవా ! నీవు నాయందు మాయ గప్పి
పలుకవలదింక , మీ పాదభక్తి నిచ్చి
నను గృతార్థునిఁగాఁ జేయు'మనఁగ , నగుచు
ఫణిగిరీంద్రుఁడు దివ్యరూపంబుఁ జూపె. 266

వ. అట్టి విశ్వరూపంబుఁ జూచి తొండమానుం డిట్లని నుతించె. 267

**దండకము :**

శ్రీమద్రమాధీశ ! జీమూతసంకాశ ! కాలత్రయాతీత ! కంజాతసంజాత తాతా! జగత్త్రాత ! వేదార్థనిర్ణేత ! భూతాత్మ ! సీతాధిపా ! సద్గుణవ్రాత ! పూతావనీజాతనాథా ! శచీనాథ దాతా ! మహాఘోరదైత్యాద్రి దంభోళిధారా ! సహస్రారసంచార ! భర్మాద్రిధీరా ! సదాసింధుగంభీర ! మంథాచలోద్ధార ! నారాయణానంత! నీ పాదముల్ చూడఁ బాతాళమై , శీర్షభాగంబు నీక్షింపఁ

గా సత్యలోకంబునై , మధ్యదేహాంగముల్ మధ్యలోకంబులై , నేత్రముల్ సూర్యశీతాంశులై , శ్రోత్రముల్ దిక్కులై , నాసికాంగంబు నాసత్యయుగ్మంబునై , జిహ్వ నీరప్రభుండై , మహాకుక్షి యంభోధిబృందంబునై , నాడులెల్లం బ్రవాహంబులై , రోమముల్ వృక్షజాలంబులై, శల్యముల్ సర్వశైలంబులై , కేశపాశంబులున్ మేఘజాలంబులై, ప్రాణముల్ గంధవాహుండునై , బాహు లింద్రాదులై , దివ్య గుహ్యేంద్రియంబున్ బ్రజానాథుఁడై , వృష్టి సద్వీర్యమై , సుస్తనం బెన్నఁగా ధర్మమార్గంబునై , వెన్ను ధర్మంబునై , సారవాగింద్రియం బగ్నియై, దంష్ట్రలున్ దండహస్తుండునై మించె ; నిత్యాది చిత్రంబు లీవేళ నీయందుఁ గన్పింపఁగా మిక్కిలిన్ వేయు శీర్షంబులున్ , వేయు నేత్రంబులున్ , వేయు హస్తంబులున్ , వేయు పాదంబులున్ గోటికోట్యర్క సంకాశపూర్ణప్రకాశంబుచే నొప్పు నీ విశ్వరూపంబు నేఁ జూడ శక్తుండనే ? దేవ ! పూర్వస్థితిన్ నీ మహాసౌమ్యరూపంబునే చూపి రక్షింపుమీశా ! చిదాకాశ ! శేషాచలేశా! తరీగొండసత్పట్టణాధీశ్వరా! నారసింహప్రభూ ! శ్రీనివాసా ! నమస్తే ! నమస్తే! నమస్తే ! నమః. 268

వ. అని యనేక ప్రకారంబుల వినుతించిన , సంతసించి పరమపురుషుండైన శ్రీనివాసుండు విశ్వరూపంబును దిరోధానంబు నొందించి , క్రమ్మఱ సౌమ్యమనుష్యశరీరధరుఁడై తొండమానుని జూచి నవ్వి ఇట్లనియె. 269

క. 'మామా ! నేను వినోదము
గా మనుజుఁడనగుచు వేడ్కగా మీ కన్యన్
బ్రేమమునఁ బెండ్లి యాడితి ,
నీమీఁద గృహస్థధర్మ మేను వహింతున్. 270

క. అమరఁగ వేంకటశైలా
గ్రమునందు నయమున దివ్యకనకమయముగా
విమలంబగు మణిభవనముఁ
గ్రమముగఁ గావింపు విశ్వకర్మకుశలతన్. 271

సీ. దేవాలయముగానె తీర్పింపు , మెట్లన్నఁ
గుదురుగా నొక రెండు గోపురములు
ద్వారసప్తకమును దగువాస్తుశాస్త్రప్ర
కారంబుగాను వేంకటగిరీంద్ర
మందుఁ గట్టించి నన్నందుంచి , నీవు ప్ర
కాశునిఁజేయు మీ కలియుగమున
మును పా నగంబుమీఁదను నీవు ద్రవ్విన
బావికట్టడమును భద్రముగను

తే. బొసఁగఁ గట్టించు'మనఁగ నద్భుతమునొంది
' బావి నే నెన్నఁడా స్వర్ణపర్వతమునఁ
ద్రవ్వలే'దని నృపుఁడన్న , నవ్వి యతనిఁ
గాంచి యిట్లని పలికె శ్రీకాంతుఁ డపుడు. 272

క. 'మనుజేశ్వర ! జన్మాంతర
మున నీవొనరించు ధర్మముల మఱచితివే ?
యనుమానించెద , వది నే
వినిపించెద ; నిచట నీవు వేడుక మీఱన్. 273

## రంగదాసుని యుదంతము

క. విను వైఖానసవంశం
బున నుద్భవమైన విప్రముఖ్యుఁడు విమలుం
డును , శాంతుఁడు , సద్గుణగణుఁ
డనఘాత్ముఁడు గోపినాథుఁడను ఘనుఁ డిలపై. 274

తే. కృష్ణలీలల విని చొక్కి, గెంట కతనిఁ
గలియుగాదినిఁ బూజింపఁదలఁచి చోళ
దేశమున కేఁగి , యచ్చోట ధీరుఁడగుచుఁ
దపముఁ జేయుటకై కుశస్థలిసి నిలిచి 275

సీ. శ్రీకృష్ణరూపంబు చిత్తమందుంచి త
పంబుఁ జేయఁగను గోపాలవేష
మున నేను ప్రత్యక్షముగ నిల్చి 'వరమేమి
కావలె?' నని పల్కఁగా, నతండు
'పరమాత్మ! కృష్ణరూపంబుతో మీ రుండ
వలె, నేనుఁ బూజింపవలయు, నట్టి
సద్వరం బీయు మో స్వామి!' యంచు వచింప
నతని కిట్లంటి 'శేషాద్రియందు

తే. శ్రీనివాసుఁడనంగాఁ బ్రసిద్ధిఁబొంది
యుందు, నన్నందుఁ బూజింపుచుండు, కృష్ణ
వేషమునఁ బూజఁగొన నిది వేళ గాదు
గాన నిఁక లేచి వేంకటగ్రామమునకు. 276

చ. చను'మని 'రంగదాసుఁడను సజ్జనుఁడొక్కఁడు దారిలోపలన్
గనఁబడు, వానిఁదోడుకొని కాననభూముల దాఁటిపోవఁగాఁ
గనకమయాద్రి ముందఱఁ బ్రకాశముగాఁ గనిపించుచుండు; నీ
వును నతఁ డేఁగుఁ, డేనచట నుండి ప్రసన్నుఁడనయ్యెదన్ గృపన్. 277

తే. శూద్రుఁడైనట్టి రంగదాసుండు పుష్ప
తులసికాదళములను సంతోషమెసఁగఁ
దెచ్చి నీ చేతికిచ్చు, సందేహ మాత్మ
నుంచ కవిగొని పూజించుచుండు నన్ను. 278

ఉ. అచ్చటఁ గృష్ణలీలల మహోముదమొప్పఁగ నీకు నిత్యమున్
మెచ్చుగఁ జూపుచుందు, నటుమీఁదటనైనను నీకులస్థులే
యచ్చటఁ జేరి నన్నెపుడు నర్చనసేయుచునుండు సద్వరం
బిచ్చితి నమ్ము'మంచు వచియించి యదృశ్యుఁడనైతి భూవరా! 279

సీ. వరవిప్రుఁ డందుండి వచ్చుచుండఁగ రంగ
దాసాభిధానుఁ డా దారియందు
జతగూడఁగా , శేషశైల మా యిరువురు
చేరి నన్నచట నీక్షించి మ్రొక్కి ;
రా రంగదాసుఁడే యచ్చట నొక బావి
త్రవ్వి , గట్టునఁ బూలతోట వేసి
తానె శ్రీతులసికాదళ,సుమంబు లొసంగు
భూసురుం డవి గొని పూజ సేయు

తే. నా విధంబుగఁ గొన్ని యేం డ్లరిగె ; నవల
సకలజనమోహనంబౌ వసంతఋతువు
వచ్చె , నాదాసుఁ డడవిలో వరసుమములఁ
బుట్టిలో నుంచికొని వచ్చి , పుష్కరిణిని. 280

తే. జలకమాడెడి గంధర్వపతులఁ జూచె
నపుడు చిత్తంబు గరఁగ వీర్యంబు జాఱె
నందు 'కపవిత్రగాత్రుఁడ నైతి' ననుచుఁ
బుష్కరిణిలోనె గ్రుంకి తెప్పునను బోయి. 281

సీ. కుసుమముల్ క్రమ్మఱఁ గోసి తెచ్చిన , నందు
గోపినాథుఁడు చూచి కోపమెసఁగ
' స్వామినిఁ బూజించు సమయమునకుఁ బూలు
తులసిఁ దేవైతివి దుష్టచిత్త !
గర్వించి చెడితివి గావున నిందుండ
కరిగి యధోలోకమందుఁ బుట్టు'
మని శపింపఁగను వాఁ డడరి శోకింపఁగా
నే జాలినొంది మన్నించి పిలిచి

తే. 'దోషభోగ్యుఁడవే నీవు దుఃఖపడకు
రంగదాసరి ! నీ మనోరాగ మింత
చేసె , బ్రాహ్మణశాపంబు సిద్ధముగను
నే నివారింపలే, నట్లుగాన నిపుడు. 282

తే. పుష్కరిణిలోనె మునిఁగి యీ బొంది విడువు !
మట సుధర్మమహీపతియందుఁ జేరి
నాగకన్యకగర్భంబునం జనించి
దారుణినిఁ దొండమానుఁడన్ పేరు గలిగి. 283

సీ. వసుధ నేలుచును నావాఁడ వయ్యెదవు , సి
ద్ధముగ నాసేవ వ్యర్థంబు గాదు
చింతింప కిపుడు నేఁ జెప్పినపనిఁ జేయు '
మన రంగదాసుఁడందట్లు చేసె ;
నతఁడు నీవై పుట్టి హితము రెట్టింప నా
భక్తుఁడవైతివి పార్థివేంద్ర !
పూర్వజన్మమున నేర్పుగ నీవు ద్రవ్విన
బావి యందున్నది భద్రముగను

తే. జక్కఁ జేయింపుమిఁక నది శాశ్వతముగ
నుండు , నేఁదాల్చి విడుచుచునుండు పుష్ప
ముల దరించుట కది ధర ముఖ్యముగను
జాలు శుభమూర్తి ! తొండమాన్ చక్రవర్తి ! ' 284

చ. అని హరి యానతిచ్చిన మహాద్భుతమొంది నరాధినాథుఁ డి
ట్లనియె ' మహానుభావ ! సకలాత్ముల యాత్మవు నీవుగాన , నా
జననము పూర్వజన్మగతి చాలుగఁ జెప్పితి వాదిదేవ ! నే
మనుజుఁడఁగాన నీ త్రిగుణమాయ నెఱుంగుదునే పరాత్పరా ! ' 285

## తొండమానుఁడు దేవాలయమును నిర్మింపఁజేయుట

క. అని బహువిధములుగా నిటు
వినుతులు గావించి , హరిని వీడ్కొని యపుడా
జనపతి సంతోషించుచు
ఘనభక్తి చెలంగ విశ్వకర్మను గొనుచున్. 286

వ. వేంకటాద్రిఁ జేరి , ' తా మున్ను ద్రవ్విన బావికి కట్టడంబు గట్టించి , స్వామివారికి దేవాలయంబు నిర్మింపు'మనిన విని యా విశ్వకర్మ శిల్పశాస్త్రప్రకారంబుగాఁ బ్రాకారత్రయంబును , గోపుర ద్వయంబును , సప్త ద్వారంబులును , నాస్థానమంటపంబును , ముఖమంటపంబును , గోశాలయును, ధాన్యశాలయును , మహానసగృహంబును , వస్త్ర , భూషణ, పరిమళ ద్రవ్య గృహంబులును , వైవాహిక మంటపంబును , దైల, ఘృతకూపంబులును , భక్ష్య శాలయును, నైవేద్యశాలయును , నన్నశాలాగ్రంబున భూతీర్థకూపంబును నిర్మించి, యన్నిటికి మధ్య ప్రదేశంబునఁ దాళవృక్ష ప్రమాణోన్నత విమానంబు రచియించి, తదుపరి శాతకుంభంబు నుంచి , విశాల వీధీత్రయంబు గావించి , వేంకటాద్రికిఁ బరుష వచ్చుటకు యోజనమార్గసోపానంబులును , నడుమ నడుమ మంటపంబులును , నీరాగారంబులును నిర్మించి , సకల పదార్థాకర్షణంబుఁ జేయించి యా యా గృహంబులం దుంచి , గిరి డిగ్గి , హరి చెంతఁ జేరి మ్రొక్కి యిట్లనియె. 287

మ. 'హరి ! మీ సత్కృపచేత వేంకటగిరీంద్రాగ్రంబునన్ మీకు మం
దిరమై యున్నది , మీరు మీ సతియు నందే నిల్చి యుండుండు ; మి
మ్మౌఱ లేకిప్పుడు కొల్చి కింకరుఁడనై యందుండెదన్ రమ్మహో
పరమాత్మా ! ' యని తొండమానుఁ డిటు దన్ బ్రార్థింపఁగా వేడుకన్.
288

క. ఘనవైఖానసవంశం
బున నుద్భవుఁడైన విప్రముఖ్యునితోడన్
వనజాక్షుఁడు శుకకుంభజు
లను దోడ్కొని వేంకటాచలము మార్గమునన్. 289

క. వచ్చుట కుద్యుక్తుండగు
టచ్చట వసుదానుఁడెఱిఁగి యబ్జాక్షునకున్
హెచ్చుగఁ బద్మావతి కం
దిచ్చెదనని భూషణములు హేమాంబరముల్. 290

తే. తెచ్చి వారల కర్పించి , దీనవదనుఁ
డగుచునుండఁగఁ జూచి యిట్లనియెఁ జక్రి
చింత నీకేల ? వసుదాన ! శేషగిరిని
నిలిచియుండెద'మని పల్కి నెనరుమీఱ. 291

ఆ. మరల నిట్టు లనియె ' మచ్చిక నార్యుల
నాదరింపుచుండు , మబ్జవతినిఁ
జూచుకొఱకు దండశూకాద్రి కెపుడైన
వచ్చిపోవుచుండు ; వసుధ నేలు ! ' 292

## శ్రీ వేంకటేశ్వరుఁడు పద్మావతీసహితుఁడై ఆనందనిలయమునఁ బ్రవేశించుట

వ. అని సమ్మతంబుగాఁ జెప్పి వాని వీడ్కొని , పద్మావతీసమేతంబుగాఁ దొండమానుం దోడ్కొని మంగళవాద్యంబులతోడ వికృతినామసంవత్సరంబునఁ బాద్యమిదినంబును , నశ్వినీనక్షత్రంబును , గురువాసరంబును గూడిన శుభదినంబునాఁడు సాయంకాలంబున వేంకటాద్రిఁ జేరి , వైఖానస బ్రాహ్మణునిచేత వైఖానసాగమోక్తంబుగాఁ బుణ్యాహవాచనాది కృత్యంబు లాచరింపించి , స్థిరలగ్నంబున'స్థిరో

భవ'యని పల్కుచుండఁగా శ్రీనివాసుం డానందనిలయంబులోఁ బ్రవేశించె; నప్పుడు బ్రహ్మేంద్రాదులు సుమవృష్టి గురియించి శ్రీనివాసునిచెంతఁ జేరి నుతించి, రందు వైఖానసద్విజుండు ద్వారపాలకుల నిల్పి యథాక్రమంబుగా హరినిఁ బూజించె ; నప్పుడు హరి పద్మపీఠంబుమీఁదఁ బాదంబు లుంచి నిలిచి , కటిప్రదేశంబున వామకరంబు నుంచి దక్షిణపాదప్రదేశంబును దక్షిణకరంబుతోఁ జూపుచు , బ్రహ్మాదులఁ జూచి ' యిది పరమ పదం'బని పలికె ; నంత పద్మజుం డా హరిసాన్నిధ్యంబున రెండఖండదీపంబు లుంచి, యింద్రాదులతో నిట్లనియె. 293

సీ. 'ఎందాఁకఁ గలిధర్మ మిద్ధాత్రియందుండు
నందాఁక దీపద్వయంబు నుండు
నెందాఁక దీపంబు లిరవొందు నందాఁక
మహనీయ దివ్యవిమాన ముండుఁ
గలియుగం బడఁగిన మలఁగు దీపంబులు
నపుడు విమాన మీ యవనిఁ ద్రెళ్లు
నవ్విమానము వడినప్పు డీవేంకటే
శ్వరుఁడు నా వైకుంఠపురముఁ జేరు

తే. నంతఁ గృతయుగ ముదయించు నవనిమీఁద
ధర్మదేవత నాల్గుపాదముల నడచు
మూఁడు యుగములు వైకుంఠమున వసించి
కలిని శేషాద్రిఁ జేరు వేంకటవిభుండు.' 294

క. అని బ్రహ్మ వల్కు పల్కులు
విని ముదమునఁబొంది , యాదివిష్ణుం ' డిచటన్
వనజజ ! నాకు రథోత్సవ
మనువందఁగఁ జేయు మరల'నన నజుఁ డంతన్. 295

వ. అంధాధ్యుండై యున్న తొండమాన్చక్రవర్తిచేత వైఖానసాగమోక్తంబుగా నుత్సవప్రయత్నంబులు సేయించి , పూర్వప్రకారంబుగాఁ గన్యామాసంబునం దంకురార్పణ , ధ్వజారోహణ , వివిధ వాహన , రథోత్సవ, తీర్థవారిప్రముఖ కృత్యంబు లాచరింపంజేసి , బహుభక్ష్య బహువిధాన్న నైవేద్యంబు లర్పింప నిర్ణయించి , ' సర్వంబును శ్రీనివాసార్పితం ' బని మ్రొక్కి , హరి యాజ్ఞాధారియై యింద్రాదుల నిజస్థానంబుల కంపి , తానును సత్యలోకంబుఁ జేరె ; నంతఁ దొండమానుండు హరికి సకలోత్సవంబులు సాగింపుచు నిజరాజ్యపాలనంబుఁ జేయుచుండె ; నందొక్కనాఁడు. 296

## కూర్ముని వృత్తాంతము

సీ. శ్రీకరమతిని వసిష్ఠగోత్రుఁడు కూర్ముఁ
డను బ్రాహ్మణోత్తముఁ డటకు వచ్చి
తొండమానునిఁ జేరి తొలుతఁ గార్యార్థియై
యాశీర్వదించి యిట్లనియె ' రాజ !
విను భార్యతో జాహ్నవీయాత్ర వోవఁగా
భార్యకు గర్భంబు ప్రాప్తమయ్యెఁ
బంచాబ్దములవాఁడు బాలుండు తల్లిని
వీడి నా వెంట రాలేఁడు గనుక

తే. ధర్మసంకటమైన దిత్తఱిని సతిని
సుతుని నిందుంచి పోయెద సుస్థిరముగ
నిరువురకు నన్నమిప్పించి యీ స్థలమున
నీవు పాలించుచుండు మో భూవరేణ్య ! ' 297

మ. అని యా విప్రుఁడు వల్కఁగా నృపుఁడు ' నీ వా రీతి నిందుంచి పొ '
మ్మనఁగాఁ గూర్ముఁడు నమ్మి యాత్రఁ జనె; నందావిప్రభార్యన్ , సుతున్
మనుజేంద్రుం డొక మూలగేహమున నేమంబొప్పఁగా నుంచి తె
ప్పున నా ఇద్దల్లకు జీవనం బచట సంపూర్ణంబుగా నుంపఁగన్. 298

ఆ. బహువిశాలమైన భవనంబులో నంత
విప్రభార్య యుండె ; విధివశమున
వీథితలుపు చిలుకువేసి యందెవ్వఁడో
యుఱికె , నంత విప్రతరుణి లేచి. 299

ఉ. 'వాకిలి తీయుఁ'డంచవలివారినిఁ  బిల్చిన , వారి వీనులన్
సోఁకకయుండె నప్పలుకుఁ , జోద్యమునందుచు విప్రభామ ' నే
నే కరణిం దరింతు ? హృదయేశ్వరుఁ డిచ్చటనుంచె'నంచుఁ బల్
శోకము నొందుచున్ , దిశలు చూచుచు నచ్చట నుండె ; నయ్యెడన్. 300

అఱునెలల బత్య మైపోయె , నటుమీఁద
కూడులేక చాలఁ గుంది కుంది
బెండువడి కృశించి బిడ్డ లిద్దఱు , తానుఁ
బ్రాణములను విడిచి పడిరి ధరను. 301

చ. ఘనుఁడగు తొండమానుఁ డిటు కర్మవశంబున విప్రకాంత నం
దొనరఁగ నుంచుటే మఱచియుండఁగఁ , గాశికిఁ బోయి బ్రాహ్మణుం
డును దనుఁజేరి 'పుత్రి, సుతుఁడున్, సతి యేడ?' నటంచుఁ బల్కఁగా
విని మది భీతినొంది నృపవీరుఁడు చారుల నంపె నత్తఱిన్. 302

ఉ. చారులు వోయి విప్రసతి సంతతితోడ నశించుచందమున్
బోరునఁ జూచివచ్చి నృపపుంగవు వీనులలోనఁ జెప్పఁగా
నారటమొంది,దుఃఖమపు డాంతరమం దొకమూల దాఁచి , యా
భూరమణుండు నవ్వుచుఁ దపోధనవిప్రునిఁ జూచి యిట్లనెన్. 303

సీ. ' విను బ్రాహ్మణోత్తమ ! వేంకటేశ్వరు దర్శ
నార్థమై మాయింటి యాడువారు
సనఁగాఁ , బతివ్రత యననొప్పు మీభార్య
వారితో శ్రీశ్రీనివాసుఁ జూడఁ

బోయిన దిఁక వచ్చు , భోజనకృత్యంబు
సాగింపుచుండు మిచ్చట'నటంచు
సమ్మతిగాఁ జెప్పి , సామగ్రి నిప్పించి
పంపించి,యచ్చటఁ బగలు గడపి

తే. రాత్రి రాఁగానె బిలముమార్గమునఁ బోయి
వేంకటేశ్వరు చరణారవిందయుగళి
చెంత బాష్పములొల్క నిల్చిన , నృపాలు
నిందిరాధీశ్వరుఁడు సూచి యిట్టు లనియె. 304

సీ. 'రాజేంద్ర ! నీ వింత రాత్రికాలమున నొ
క్కఁడ విందు వచ్చిన కార్యమేమి?
సెప్పు మేర్పడ'నన్న శ్రీనివాసున కిట్టు
లనియె నృపాలకుం'డంబుజాక్ష !
పాపాత్ముఁడై నేను బ్రాహ్మణస్త్రీవధఁ
జేసితి , నన్ను రక్షింపవలయు '
ననుచుఁ దత్క్రమము దుఃఖాక్రాంతుఁడై చెప్పఁ
గా హరి పల్కె ' భూనాథ ! వినుము

తే. ' మించి పోయిన పని కింక మిడుకనేల ?
యెండిపడియున్న దట్టంబు లిచటి కిపుడె
నీవు దెప్పింపు'మనఁగ,నా నృపుఁడు భటులఁ
బట్టి తెప్పించెఁ దత్కళేబరము లటకు. 305

వ. అంత శ్రీనివాసుండు తొండమానునితోడ నక్కళేబరంబులఁ బట్టించికొని స్వామి పుష్కరిణికిఁ బూర్వదిగ్భాగంబునందున్న దివ్యసరోవరంబునకుఁ బోయి , తత్తీర్థంబునం దా కళేబరంబుల ముంచి యెత్తె , నప్పు డమ్ముువ్వురు పునర్జీవితులై లేచి ; రంత దేవతలు పుష్పవృష్టిఁ గురియించి,

యప్పుణ్యతీర్థంబున కస్థితీర్థంబను నామంబిడి,రందుఁ దొండమానుండు సంతసించి హరిని నుతించె ; నంత శ్రీనివాసుండు నిజస్థానంబుఁజేరి 'కలియుగంబున జనులతోఁ బ్రత్యక్షంబుగా మాట్లాడిన నిట్టి ధర్మసంకటంబులు పుట్టుంగావున నింక మాట్లాడఁదగదు ; చెప్పఁదగు మాటలు స్వప్నంబులందుఁ జెప్పెదఁగాక !' యని మౌనముద్ర ధరించె. తొండమానుండు మృతులై బ్రతికిన యమ్మువ్వురినిఁ గూర్మిన కొప్పగించె; నప్పు డవ్విప్రుఁడు భార్యా పుత్ర పుత్రికలం జూచి 'యెందుఁ బోయితి?' రని యడుగఁగా నబ్భార్య యిట్లనియె. 306

సీ. 'స్వామి ! నేనేమని చర్చించి చెప్పుదు?
మహనీయమగు విష్ణుమాయచేతఁ
బుణ్యమార్గంబునఁ బోయి బ్రహ్మాదులు
న్నట్టి లోకంబులనన్ని చూచి
వచ్చితి ' ననియె , నవలఁ గుమారుండిట్టు
లనియె ' నో తండ్రి ! నే నద్భుతముగఁ
బోయి సప్తద్వీపములను , దోయధులను
గైలాసగిరిని , శంకరునిఁ జూచి

తే. యలరి వచ్చితి'ననియె ; న య్యాడుశిశువు
పలికె నిట్లని ' తాత ! నేఁ బర్వతముల
సకల వనముల , దేవరాక్షస గణముల
వరుసగాఁ జూచి వేడ్కతో వచ్చినాను. ' 307

క. అని యా ముగురును దమతమ
యనుభవములఁ జెప్పి ; రప్పు డా వాక్యములన్
విని వెఱఁగున విప్రుం డి
ట్లనియెన్ ' మీ పుణ్య మతిశయంబై యొప్పెన్. ' 308

ఆ. అనుచు వారితోడ నరుగ నుద్యుక్తుఁడై
యుండురీతిఁ దెలిసి తొండమానుఁ
డపుడు భూషణంబు , లంబరంబులు వారి
కిచ్చె ; ద్విజుఁడు నృపుని మెచ్చి లేచి. 309

తే. రాజు నాశీర్వదించి 'భూరమణ ! మేము
పోయి వచ్చెద'మని పల్కి పొగడి , సతిని
బాలకులఁ దోడుకొని పోయి చాల మదిని
సంతసించుచు నిజనివాసంబుఁ జేరి. 310

క. తోషించి సతిని బిడ్డలఁ
బోషించుచుఁ,దాను ముక్తిఁ బొందెడికొఱకై
శేషాచలపతి మహిమ వి
శేషముగాఁ బ్రజకుఁ దెలియఁజెప్పుచు నుండెన్.' 311

సీ. అన విని మునులెల్ల నాశ్చర్యమునఁ బొంది
యిట్లని పలికి ' రిదేమి వింత ?
యీ కళేబరముల నిలమీఁదఁ బడవైచి
పోయి లోకాంతరంబులఁ జరించి
క్రమ్మఱ వచ్చి తద్ఘటములలోఁ జొచ్చి
యా కూర్మునకు వార లచటఁగనిన
వింతలు సెప్పిన విధము తేటగఁ జెప్పు '
మన విని సూతుఁడిట్లనియె ' వారు

తే. స్థూలములను విసర్జించి , సూక్ష్మతనువు
లందు వెలుఁగుచునుండి లోకాంతరముల
స్వప్నములఁ గన్న వింతలచందముగను
గూర్మునకు వారు సెప్పి రా గుఱుతు లెఱిఁగి. 312

ఆ. బ్రహ్మమందు జీవపంక్తులున్ కర్మసం
స్కార లింగదేహకలితులగుచు
నంబరమునఁ దిరుగునట్టి పక్షులరీతి
సకలలోకములను సంచరించి. 313

వ. ఆవలఁ దమతమ ఋణానుబంధానుసారంబుగాఁ గర్మసంస్కారంబులతోడం గూడి యణురూపులై గగనాంతర్గత వాయుపథంబునఁబడి సూర్యకిరణోదిత మేఘబృందంబులం బొంది, వృష్టి మార్గంబున సకలౌషధీజాలంబులం జొచ్చి యన్నరూపంబు నొంది, పురుష వీర్య స్వరూపంబై స్త్రీ గర్భంబులందుఁ బ్రవేశించి, స్థూల దేహంబుల ధరించి నవమాసంబు లందుండి వెడలి, బాల్య, కౌమార, యౌవన, వార్ధక దశ లనుభవించి, కాల పరిపాకంబున మృతిఁ బొంది, క్రమ్మఱఁ బుట్టినవా రా లోకాంతరంబులం దనుభవించిన కష్ట సుఖంబుల మరలం జెప్ప మఱచిపోదు ; రటుగాక యిమ్మువ్వురు కాలపరిపాకంబుగాకనే యన్నంబు లేకయు నశించిన స్థూలదేహంబులందుండక, సూక్ష్మదేహంబుల నవలంబించికొని లోకాంతరంబులందుఁ జరించి, హరికటాక్షంబువలన నప్పుణ్యతీర్థంబునందుఁ బ్రవేశించి పరిపూర్తి నొందిన పూర్వస్థూలదేహంబులందే మరలఁ జేరినందున వారి కా లోకాంతర వ్యాపారంబులు హృదయంబులందుండి, నిద్రఁ జెంది కలలన్ గని మేల్కాంచి పరుల కా కలలు చెప్పినచందంబున వా రా కూర్మనకుఁ దమ విహారంబులు చెప్పి ; రిది యంతయు విష్ణుమాయావిలాసంబని తెలియందగు, నీ యితిహాసంబు విన్నవారి పాపంబులు నశించు ; వారు పుణ్యాత్ము లగుదు'రని చెప్పిన విని శౌనకాదులు సూక్ష్మజ్ఞానదృష్టిచేత జీవతత్త్వానుభవ ప్రకారంబు తెలిసి, సూతుం జూచి మరల నిట్లనిరి. 314

సీ. 'నీవు సెప్పిన సూక్ష్మనిర్మలభావంబు
తెలిసె నో సూత ! సందియము దీరె
నది యటులుండని,మ్మా కూర్మ్ఁడరిగిన
వెనుక నృపాలుండు వేంకటాద్రి
పతి నెవ్విధంబున భక్తుఁడై పూజించె
నా రీతిఁ జెప్పు వి[illegible]నిన మునులఁ
గని సూతుఁడిట్లనె ' జననాయకుఁడు భూమి
నేలుచు శ్రీవేంకటేశ్వరునకు

తే. దాసుఁడై ప్రత్యహంబును దప్తహేమ
కమలములు గొని బిలమార్గమునఁ బోయి
తులసికాదళహార పంక్తుల , సువర్ణ
పుష్పముల వేంకటేశ్వరుఁ బూజ చేసి. 315

ఆ. అవల మరలిపోవునపుడు కుమ్మరవాఁడు
మంటిపూలు , తులసి యింటఁ దీర్చి
దారుమూర్తియందుఁ దా సమర్పింపఁగా
నట్టి మంటిపూలు హరినిఁ జేరు. 316

క. వనజాక్షుం డా సుమములఁ
దనయందే దాఁచుచుండు ధరణీంద్రునకున్
గనఁబడనీక , కులాలునిఁ
దనమదిలో మెచ్చుచుండుఁ దద్దయుఁ బ్రేమన్. 317

## శ్రీనివాసుఁడు భీమునకు ( కులాలునకు)
## సాయుజ్యము నొసంగుట

సీ. రాజు చేసిన పూజఁ రాజసంబని మెచ్చ
కుండి , మృత్కుసుమంబు లొక్క నాఁడు
భూనాయకుఁడు తాను పూజఁజేసెడి వేళఁ
జూపె ; వాఁ డా మృత్ప్రసూనములను

గాంచి ' నే నితని బంగరుపూలఁ బూజింతు ,
నీ మంటిపువ్వు లిందెవ్వఁడుంచె ? '
నని సంశయించుచు నబ్జాక్షునకు మ్రొక్కి
పలికె నిట్లనుచు ' నో పరమపురుష !

తే. నే సమర్పించు సుమముల నేలఁద్రోసి
మంటిపూ లిందుఁబెట్టిన మనుజుఁడెవఁడు ?
తెలుపు'మని నృపుఁడడుగ , నద్దేవదేవుఁ
డమ్మహీపతి కపుడిట్టులనియె నగుచు. 318

తే. 'అనఘ ! యిచటికిఁ గ్రోశద్వయార్థదూర
మందొకఁడు కుర్వక గ్రామమందుఁ గలఁడు
ధరఁ గులాలుఁడు భీమాభిధానుఁ డధిక
భక్తుఁ , డిలఁ బేదవాఁ డందుఁ బ్రతిదినంబు. 319

ఉ. కుండలు చేసి చేసి యొక గూఁటను బెట్టుచు , నప్పుడప్పుడున్
రెండుకరంబులం బులిమి రేఁగిన మృత్తికచేతఁ బుష్పముల్
దండిగఁ జేసి , నావలెనె దారుకరూపము నేర్పరించి , దా
నిండిన భక్తి మీఱఁగను నిత్యము నర్చనఁ జేయుచుండఁగన్. 320

సీ. ఆ పుష్పములను నే నంగీకరింతు ని
ట్లనుదినం'బని పల్కె , నపుడు నృపతి
వెఱఁగునొందుచు హరిఁ వేవేగఁ బూజించి
బిలము వెల్వడిపోయి భీముచెంతఁ
జేరిన , రాజు నీక్షించి కులాలుఁ డి
ట్లనె ' మహారాజ ! నీ వద్భుతముగ
శూద్రగృహమునకుఁ జొచ్చి వచ్చుట కేమి
పని ? యానతిం'డన్న జనవిభుండు

తే. పలికె నిట్లని ' భీమ ! నీ భక్తి శేష
శైలపతి మెచ్చినాఁడు నిశ్చయముగాను
నీవు చేసిన సద్భక్తిభావరీతి
తేటగా నా కిపుడు నీవు తెలుపు మనఘ ! ' 321

చ. అనినఁ గులాలుఁడిట్లనియె ' నయ్య ! నృపాలక ! శూద్రజాతివాఁ
డను , బహునీచకర్ముఁడ , జడత్వమనస్కుఁడ నేను విష్ణుభా
వనఁ గని నీకుఁ జెప్పఁగలవాఁడనె ? భూపవరేణ్య ! ' యంచు న
య్యనఘుఁడు వల్కుచున్నతఱి నంబరమార్గమునందు ధీరుఁడై. 322

తే. గరుడవాహన మెక్కి వేంకట విభుండు
భీముఁడున్నట్టి చోటికిఁ బ్రేమమీఱఁ
బోయి ' రావోయి ! నీ వహో పుణ్యపురుష !
నీకు సాయుజ్య మిచ్చెద నేఁ'డటంచు. 323

క. సరసిజనాభుఁడు వల్కఁగ
సరఁగున భీముండు మ్రొక్కి , సతితో నపుడే
హరి సాయుజ్యపదంబున
కరుగఁగఁ , గని తొండమానుఁ డారటపడుచున్. 324

## హరి తొండమానునకు సారూప్యము నిచ్చుట

సీ. హరి కిట్టులనియె ' నోయబ్జాక్ష ! నీ భక్తుఁ
డగు భీముఁ జూచి నే నాప్తముగను
భాషించుచుండఁగాఁ బరమపదము వాని
కిచ్చి పంపించితి వింతలోనె ,
నాకు సాయుజ్య మెన్నఁటి కియ్యఁదలఁచియు
న్నా'వన్న విష్ణుండు నవ్వి పలికె
' నతని సాత్త్వికభక్తి నంగీకరించితి
సాయుజ్య మిచ్చితి , సజ్జనుండు

తే. పూర్వమే మోక్షమడుగ , ' నీ పూజ పరుల
కెఱుకయై , చక్రవర్తి నీ యింటి కెపుడు
వచ్చు , నప్పుడు నీకు , నీ వనిత కేను
మోక్షమిచ్చెద'నని యంటి ; నీ క్షణమున. 325

క. వానికి మోక్షము నిచ్చితి
దీనికిఁ జింతింపనేల ? ధీరుఁడవగుచున్
నీ నందనునకుఁ బట్టము
మానితముగఁ గట్టియుంచు మానవనాథా ! 326

సీ. పట్టిన విజ్ఞాన భక్తి వైరాగ్యముల్
గలవాఁడవగుచు , దుష్కామములను
విడిచి , నిర్మలుఁడవై విజనస్థలముఁ జేరి
నన్ను ధ్యానించుచున్నను రయమున
సారూప్య పదవి నిశ్చయముగా నిచ్చెద '
నని యతనికిఁ జెప్పి యంపెఁ జక్రి
నిజనివాసముఁ జేరి నిశ్చలుండై తొండ
మానుండు సుతుఁడైన శ్రీనివాసుఁ

తే. జేరి వేడ్కతొ రాజ్యాభిషిక్తుఁ జేసి
' వేంకటేశ్వరు చరణారవిందములను
క్రమముగాఁ గొల్చి నిత్యోత్సవములు సేయు '
మనుచు సుతునకు నియమించె ననఘుఁ డచట. 327

ఆ. తొండమానుఁడంతఁ దుర్యభక్తి జ్ఞాన
యుక్తుఁడై , మహావిరక్తుఁడగుచుఁ
వేంకటాద్రిఁ జేరి విజనస్థలమునందు
నిలిచి ధ్యానయోగనిష్ఠ నొందె. 328

ఉ. అంతటఁ గొంత కాలమున కంబుజలోచనుఁడా నృపాలకున్
స్వాంతమునందు మెచ్చుచును సత్కృపతో నటకేఁగి నవ్వుచున్
వింతగఁ జెంతనిల్చె ; నటవిన్ వసియించిన భూవిభుండు శ్రీ
కాంతునిఁ జూచి లేచి కరకంజములన్ ముకుళించి నమ్రుఁడై. 329

ఉ. సద్గుణమొప్పఁగా , మది నచంచలభక్తిరసంబు నిండఁగా
గద్గద కంఠుఁడై నృపుఁడు కన్నుల బాష్పములొల్క మ్రొక్కుచున్
'మద్గురుచంద్ర ! నన్నిచట మానసమందుఁ దలంచి వచ్చితే !
చిద్గగనాత్మ ! నీ మహిమ శేషుఁడు సన్నుతిసేయనేర్చునే ? 330

శా. నేనా మానవమాత్రుఁడన్ , చపలుఁడన్ , నీచాత్ముఁడన్ , దుర్మతిన్
నే నిన్నేమి నుతింపనేర్తు ? నను మన్నించే స్వభావంబుచే
నీ నిర్హేతుకజాయమానకరుణన్ నేఁడిందు వేంచేసినా ,
వానందం బొదవెన్ ; కృతార్థుఁడను నేనైతిన్ జగన్నాయకా ! 331

మ. మును నేఁజేసిన నేరముల్ మఱచి , నా మూర్ఖత్వమున్ , గర్వమె
ల్లను బోగొట్టుచుఁ దండ్రిచందమున నన్ లాలించి , విజ్ఞాన మి
చ్చిన నీ దొడ్డఋణంబు దీర్పఁగలనే ? శ్రీస్వామి ! నీ సత్కృపా
ఘనతం బ్రోచితి విన్నినా , ళ్లిపుడు మోక్షంబిచ్చి రక్షింపవే ! 332

చ. మతి సెడ విప్రభార్యను , గుమారునిఁ , బిడ్డను దేరకేను జం
పితి ; నటువంటి పాపమిల భీకరవృత్తిని ముంచునంచు నన్
హితముగఁ బ్రోవ , వారలకు హెచ్చుగ దేహము నిచ్చినట్టి నీ
యతిశయమెంచ శంభునకు,హాటకగర్భునకైన శక్యమే ? 333

చ. సతిపతి యేకమైనపుడు సారవివేకము లేక రాత్రి వ
చ్చితి నలనాఁడు , నే నిటులఁ జేసిన ద్రోహము నెంచ కింతఁబ్రో
చితి ; విటువంటి సైరణయుఁ జిక్కునె యెంతటివారికైన ? శ్రీ
పతి ! నినుఁబోలు వేల్పులు ప్రపంచములోఁ గలరే పరాత్పరా !' 334

వ. అని యనేకప్రకారంబుల వినుతించిన నృపాలకున్ మెచ్చి , హరి యిట్లనియె. 335

చ. ' విను నృప ! నీకు సాత్త్వికవివేకము పుట్టుటకై తపంబుఁ జే
యను నియమించి,తిప్పుడు మహాపురుషోత్తమ ! భక్తినిష్ఠ నీ
మనమున నిల్చెఁగాన , ననుమానములే దిఁక మోక్ష మిచ్చెదన్
ననుఁ బరమాత్ముఁడంచు నెఱనమ్మిన నమ్మిక రిత్తవోవునే ? 336

చ. జనవర ! యింకఁ గొన్ని దివసంబులు భూతలమందు నిల్చెదో
ఘనభుజ ! మోక్ష మీక్షణమె కావలెనో నిజమీవు సెప్పు'మ
న్నను హరిఁజూచి నవ్వి నరనాథుఁడు 'మోక్షమె నా కొసంగవే!'
యని శరణాగతుండగుచు నంచున రాఁగని చక్రి నవ్వుచున్. 337

సీ. కరుణారసము నృపాగ్రణిమీఁద నిండించు
చుండఁగా గగనమందుండి దివ్య
పుష్పకం బచటి కద్భుతముగా వచ్చె , న
ప్పుడు తొండమాను నా పుష్పకంబు
నందుంచి,సారూప్యమతనికిఁ దా నిచ్చి
శ్రీవికుంఠపురంబుఁ జేరనంపి
తన నివాసముఁ జేరెఁ ; దదనంతరమున నా
చక్రవర్తిసుతుండు సాంగముగను

తే. వేగఁ దండ్రికిఁ బరలోకవిధు లొనర్చి
శ్రీనివాసుని పాదరాజీవయుగళ
మందు భూభారముంచుచు నచలుఁడగుచుఁ
దాను , వసుదానుఁడును రమాధవున కచట. 338

## స్వయంవ్యక్తార్చావిగ్రహ స్వరూపుఁడు

సీ. ప్రబలి నిత్యోత్సవ , పక్షోత్సవములు , మా
సోత్సవ , సంవత్సరోత్సవములు
నడిపించుచుండఁగా , నారాయణుఁడు శిలా
విగ్రహుఁడై మహావిభవములను
సొంపుగా నంగీకరింపుచు వసుదాను ,
నా శ్రీనివాసాఖ్యు నాదరముగఁ
బాలనసేయుచు , భక్తి భావింపుచు
సకల కార్యములను స్వప్నములను

తే. దానె చెప్పుచు మౌనముద్రను ధరించి
కుదిరి పద్మావతినిఁ గృపఁగూడి వివిధ
వరము లందఱి కిచ్చుచు , వారి ధనము
లాదరించుచు శ్రీపన్నగాద్రిమీఁద. 339

ఉ. వేంకటనాయకుండనఁగ విశ్వమునందుఁ బ్రసిద్ధిఁబొందుచున్
గొంకక భక్తి విత్తమును గూరిమితోఁగొని కోర్కు లిచ్చుచున్
సంకరజాతి మర్త్యులకుఁ జాలుగఁ బైకము నొప్పగించుచున్
బింకముఁ జూపుచున్ , ధరఁ గుబేరునివడ్డికి రూక లిచ్చుచున్. 340

క. లీలామానుషచర్యలు
చాలం జూపుచు సమస్తజనులకు హితుఁడై
మేలు నొసంగుచు నీ కలి
కాలము ఫణిశైలమందె కడపుచునుండున్. 341

ఆ. కలియుగాంతమందు గ్రమ్మఱ వైకుంఠ
మందుఁజేరుఁ ; గలియుగాదికాల
మవల వచ్చినప్పు డా వేంకటాద్రిపై
మరలఁ జేరుచుండు మాధవుండు. ' 342

క. అని సూతుఁడు వేంకటపతి
ఘన చరితము లొప్పఁజెప్పఁగా , మునులెల్లన్
విని సంతోషభరితులై
మనముల వెఱఁగొంది యనిరి మఱి యిట్లనుచున్. 343

మ. 'అహహా ! సూత ! పరాత్పరుండు జలజాతాక్షుండు నిత్యుండు శ్రీ
యహిరాట్పర్వతనాథుఁ డవ్యయుఁడు సర్వాత్ముండు లీలార్థమై
మహి మర్త్యాకృతి నొంది , పిమ్మట మహామాహాత్మ్య పాషాణవి
గ్రహుఁడై లోకులఁబ్రోచు సత్కథల మా కర్ణప్రమోదంబుగన్. 344

క. చెప్పితి విచ్చట వరుసగఁ
దప్పక వింటిమి మహాముదంబొదవెను ; నీ
గొప్పఁదనం బింతంతని
యప్పప్పా ! పొగడ శక్యమగునె మహాత్మా ! '

చ. అని ఘనశౌనకాదిమును లందఱు గౌరవమొప్పఁ బ్రస్తుతిం
చిన విని సూతుఁడిట్లనియె ' సింధుసుతాధిపుఁడైన పద్మలో
చనుని చరిత్రముల్ వొగడ శక్యముగాదు విధాతకైన , నే
నొనరఁగ మీ కటాక్షమున నూహకుఁ దోఁచినయంత చెప్పితిన్. ' 346

సీ. అనుచుఁ బల్కిన రోమహర్షణుసుతుఁ జూచి
మును లిట్టులని ' రాదిమూలమైన
విష్ణుఁడే పాషాణవిగ్రహంబు ధరింప
హేతువే ?'మన సూతుఁ డిట్టులనియె
' ననఘాత్ములార ! శ్రీహరి స్వస్వరూపంబు
నందఱికినిఁ జూపఁ,డందువలనఁ
దన చిహ్నములు సర్వజనులు చూచి తరించు
టకుఁ గృప లోకవిడంబనముగఁ

తే. ద్రామ్ర,పాషాణ,మృత్తికా,దారుమూర్తు
లందు దీపించి భూలోకమందు వివిధ
పుణ్యనామంబులను దాల్చి , పూజఁగొనుచు
వారి కిష్టార్థముల నిచ్చు భూరిదయను. 347

వ. ఇవ్విధంబుగా నొప్పు నర్చావిగ్రహచిహ్నంబుల నీక్షించి , హరిచిహ్నంబు లిట్టివని తెలిసి , యీ చర్మచక్షుస్సులతోఁ జూచిన విగ్రహంబులు మనోదృష్టికిఁ బ్రత్యక్షంబులగుచుండఁగా హరి వారి మనోమాలిన్య నివారణంబుఁ జేయుచుండుం గావున , సర్వజనులు కడతేరుటకు నర్చా విగ్రహంబులు ప్రథమ సాధనంబులగుం గావునఁ బ్రతిమార్చనంబులు చేసి, తద్ద్వారా హరి సర్వాంతర్యామి యగుటందెలిసి , రామకృష్ణాదివిభవావతార ధ్యాన,గుణానుభవంబులు చేయుచుండి , దాన ననిరుద్ధ,ప్రద్యుమ్న,సంకర్షణ,వాసుదేవ వ్యూహప్రభావంబులు నెఱింగి ధ్యానించి , తన్నామజపంబులు చేసి పరమగతిఁబొందుట కర్చారూపంబులు హేతువులగునందున , సకలజన సంరక్షణంబుఁ జేయుటకొఱకు శ్రీనివాసుండు స్వయంవ్యక్తార్చా విగ్రహుండయ్యె ' నని చెప్పి , సూతుండు మఱియు నిట్లనియె. 348

## జయ మంగళము

క. 'శృంగారాంగునకును జయ
మంగళ , మహిరాజశైలమందిరునకు శ్రీ
మంగాపతి కతిశయశుభ
మంగళ మొనఁగూడవలయు మహియందెపుడున్. ' 349

క. అని సూతుఁడు వచియింపఁగ
విని శౌనకముఖ్యమునులు వేంకటపతినే
కొనియాడుచు సూతునితో
నొనరఁగ శుభగోష్ఠి నచట నుండిరి వేడ్కన్. 350

క. బావజజనక ! శుభాకర !
భావజరిపుమిత్ర ! భూతభావన ! విలసత్
భావాతీత ! జగన్మయ !
శ్రీవేంకటగిరినివేశ ! చిదచిదధీశా ! 351

## తురంగవృత్తము :

వికటసురరిపు హరణ ! గురుతర విశ్వరక్షణకారణా !
సకలమునిజన హృదయకమల విచారణాఘనివారణా !
మకుటకలితవిలసిత మణిఘృణిమస్తకాఖిలపూరణా !
ప్రకటకనకరుచిరశిఖరయుతపన్నగాద్రివిహారణా ! 352

## మాలినీవృత్తభేదము :

కర్మవిధాయక ! కర్మవినాశక ! కర్మఫలాశ్రిత ! కాంతియుతా !
ధర్మవివేచన ! ధర్మసుఖార్జన ! ధర్మమతవ్రత ! ధర్మహితా !
మర్మసుఖాస్పద ! మర్మఫలప్రద ! మర్మవిలక్షణ ! మర్మరతా !
భర్మనగాత్మక ! భర్మగిరీశ్వర ! భర్మమయాంబర ! బ్రహ్మనుతా ! 353

## విభూతిమయవృత్తము :

జ్ఞానమార్గదీపకా ! జ్ఞానదివ్యరూపకా !
జ్ఞానయోగరక్షకా ! జ్ఞానవిఘ్నశిక్షకా !
జ్ఞానసద్విధాయకా ! జ్ఞానశక్తినాయకా !
జ్ఞానకర్మసాధకా ! జ్ఞానపూర్ణబోధకా ! 354

## మాలిని :

సురహృదయ వికాసా ! క్షుద్రరక్షో నిరాసా !
గురుతర సువిలాసా ! కోటిసూర్య ప్రభాసా !
పరమపద నివాసా ! పాలితాచార్య దాసా !
సురుచిర దరహాసా ! సుందరశ్రీనివాసా ! 355

గద్య :

ఇది శ్రీతరిగొండలక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలితకవితావిలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ వెంగమాంబాప్రణీతంబైన శ్రీవేంకటాచల మాహాత్మ్యంబను భవిష్యోత్తరపురాణంబునం దెఱుక కథయును , హరి ధరణీదేవి కెఱుకఁ జెప్పుటయు , ధరణీదేవి పద్మావతి నాదరించుటయుఁ , బద్మావతి తల్లికి హరివృత్తాంతంబుఁ జెప్పుటయు , వకుళ వచ్చి ధరణీదేవితో సంభాషించుటయు, నాకాశరాజు హరికి శుభలేఖ పంపించుటయు , హరి యాకాశరాజునకుఁ బ్రత్యుత్తర లిఖిత మంపించుటయు , వకుళ శేషాద్రికి వచ్చి హరికి శుభవార్త లెఱిఁగించుటయు, వివాహంబున కర్థంబు లేదని వకుళ వరాహస్వామితోఁ జెప్పుటయు , హరిచే శుభలేఖఁ గైకొని గరుడుండు సత్యలోకంబున కరుగుటయుఁ , జక్రిచే శుభపత్రికఁ గొని చని శేషుండు శంకరున కిచ్చుటయు , శ్రీనివాసుఁ డింద్రాదులతో సంభాషించుటయు , సిరినిఁ దలంచి హరి చింతించుటయుఁ, గొల్లాపుర వాసినియైన లక్ష్మిని సూర్యుండు దోడ్కొనివచ్చి హరిచెంత నిల్పుటయు , సిరితో హరి తన కష్టంబుఁజెప్పుటయు , హరితో లక్ష్మి సంభాషించుటయుఁ , గులదేవతార్చనంబును, హరి కుబేరున కప్పుపత్రంబు వ్రాసియిచ్చుటయు, సాయంకాల వర్ణనంబును, చంద్రోదయ వర్ణనంబును, సూర్యోదయ వర్ణనంబును, బ్రహ్మాదులతో శ్రీనివాసుండు వివాహంబునకుఁ దరలిపోవుటయు, స్వామి కాకాశరాజు కన్యాదానంబుఁ జేయుటయు, వివాహానంతరంబున హరి యగస్త్యాశ్రమంబునకుఁ బోయి బ్రహ్మాదుల వీడ్కొల్పుటయు, శ్రీలక్ష్మి క్రమ్మఱఁ గొల్లాపురంబున కరుగుటయు, వసుదాన తొండమానులు యుద్ధసన్నద్ధులగుటయుఁ, దొండమాన్ చక్రవర్తికి హరి విశ్వరూపంబుఁ జూపుటయు, శ్రీనివాసునకు విశ్వకర్మ దివ్యాలయంబు నిర్మించుటయుఁ, బద్మావతీసమేతంబుగా హరి శేషాద్రిఁ జేరుటయుఁ, గూర్మని వృత్తాంతంబును, శ్రీనివాసుండు భీమునకు సాయుజ్యమిచ్చుటయుఁ, దొండమానునకుఁ జక్రి సారుప్యమిచ్చుటయు నను కథలం గల పంచమాశ్వాసము.

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

## షష్ఠాశ్వాసము

### వీరలక్ష్మీవిలాసము

#### ఇష్టదేవతా స్తుతి

శ్లో. శ్రీమత్కోమలనీలతోయదనిభం , శృంగారపూర్ణేక్షణం
హేమాభాంబరదివ్యభూషణధరం , హేలావతీఖేలనమ్ ,
కౌమారీశ్వరసన్నుతాంఘ్రికమలం , కల్యాణలీలాగుణో
ద్దామం , శ్రీతరిగొండశేషకుధరాధ్యక్షం భజే2హం సదా. 1

క. శ్రీమద్గురువర ! శుభకర !
శ్రీమన్నరసింహదేవ ! చిన్మయభావా !
శ్రీమహిళాధిప ! ఘనతర !
శ్రీమద్వేంకటగిరీశ ! జితదనుజేశా ! 2

సీ. అని గురుదైవంబులను దలంపుచు వేంక
టాద్రి మాహాత్మ్యమంచనుచు ధరను
వెలయు వరాహ , భవిష్యోత్తరపురాణ
ములయందు నలువదిమూఁడునైన
భాసురాధ్యాయముల్ పద్యకావ్యంబుగా
మొనసి యైదాశ్వాసములు రచించి
హరికి సమర్పించి , యవలఁ బద్మపురాణ
మందు వింతగ వేంకటాద్రివిభుఁడు

తే. సిరినిఁ గూరిచి తపము మున్ జేసినట్టి
చరితములు కొన్నిదొరకఁగా సంగ్రహించి
సరవి నాశ్వాసమున కవి చాలవనుచు
వేఱు కల్పన కొంత గావింప వలసె. 3

క. కావున నిపుడొక గతిఁ గృతి
గా విరచించెదను దప్పుగాఁ జూడక నన్
గావుఁడటంచును పెద్దల
సేవించెద నెల్లప్రొద్దు చిత్తంబలరన్. 4

తే. ఈ కృతికిఁ దగు నభిధానమెద్ది యనిన
శ్రీకరంబగు వీరలక్ష్మీవిలాస
మనెడు నామంబు పెద్దల యనుమతమున
నిర్ణయించితి నన్ను మన్నింపవలయు. 5

తే. భారతిని జిహ్వయందుంచి నారసింహుఁ
డేవిధంబునఁ బలికించు నా విధమున
బలికెదను , భాగవతులు నా బాలభాష
లం దసహ్యత లేక నెయ్యమున వినుఁడి ! 6

వ. తత్కథా ప్రారంభంబెట్టిదనిన భవిష్యోత్తర పురాణంబునం దొప్పుచున్న
శ్రీనివాసస్వామి చిత్రచారిత్రంబులు విని శౌనకాదిమహామునులు మఱియు
నొక్కనాఁడు ప్రాతఃకాలంబున స్నానసంధ్యాద్యనుష్ఠానానంతరంబున సూతుం
జూచి యిట్లనిరి. 7

సీ. 'ఓ సూత ! శ్రీశ్రీనివాసు చరిత్రంబు
లెన్ని విన్నను తృప్తి నెనయదాత్మ
కావున నీవు తత్కథలఁ గ్రమ్మఱఁ జెప్పు
మనుజవేషమున రమావిభుండు
ధీరుఁడై పద్మావతినిఁ బెండ్లియాడిన
వెనుక మహాలక్ష్మి విశ్వసించి
హరివక్షమందుండ కలిగి కొల్లాపుర
మందున్న పిమ్మట, నబ్ధి సుతను

తే. దలఁచునో, లేక నిర్దయతచేతఁ
దలఁప, కాకాశపతిసుతన్ దాను గూడి
మఱచి యూఱకయుండెనో ? మరల లక్ష్మి
నెదను జేర్చెనో , లేదొ మా కెఱుఁగఁ జెపుమ ! ' 8

క. అని వారడుగఁగ సూతుఁడు
విని నవ్వుచు సంతసించి వేదవ్యాసున్
మనమునఁ దలఁపుచు నపు డి
ట్లనియెన్ ' మునులార ! వినుఁడి ! హరిచరితంబుల్. 9

క. నను మీ రడిగిన విధమున
మును దేవలుఁ డడుగఁగాను ముచ్చటమీఱన్
ఘనుఁడైన దేవదర్శనుఁ
డనఘుం డిట్లనియె నతని, కది యెట్లన్నన్. 10

మ. 'వినుమో దేవల ! వేంకటేశ్వరుఁడు శ్రీవిష్ణుండు పద్మావతిన్
మన ముప్పొంగఁగఁ గూడియుండియును , వేమాఱున్ రమాదేవినే
తన చిత్తంబున జాలిచేఁ దలఁపుచుం దద్రూపలావణ్య చిం
తనమే చేయుచుఁ బన్నగాచలముమీఁదన్ సర్వభోగంబులన్. 11

## వేంకటేశ్వరుఁడు తన చింతనుగూర్చి పద్మావతికి వివరించుట

సీ. అనుభవింపుచునుండె ; నటుకొన్ని యబ్దంబు
లరిగిన వెనుక శేషాద్రివిభుఁడు
తనమదిలోఁ దాను దలఁచె నిట్లని ' సిరి
నెడఁజేసి నరుఁడనై యిన్ని యేండ్లు
గడపుచునుంటి , నింక నెడంబుగా నుంచి
యుండుట మేరగా , దుదధిసుతను
వక్షమందుంచికోవలెఁగాన నేరీతి
నయినఁ బ్రార్థించి నెయ్యమున నిటకు

తే. నేను దోడ్కొని రాకున్న నిఖిల కార్య
ఘటనములు గావు , కీర్తి దక్కదు , కుబేరు
చేతఁ దీసిన ఋణముఁ దీర్చెడి యుపాయ
మైనఁ దోఁచదు నా కిప్పు'డంచు నెంచి. 12

మత్తకోకిల :

నిరతము న్మదిఁ జింతఁజేయుచు నీరజేక్షణుఁ డార్తుఁడై
నరుని చందముగా విరక్తుఁడనంగ నొప్పుచు , సర్వమున్
మఱచి తాఁ దనుఁ జూచుచుండెడి మౌనిమాడ్కినిఁ బద్మమం
దిర విలాసగుణంబులెల్ల మదిం దలంపుచునుండఁగాన్. 13

సీ. అపుడు పద్మావతి హరి సర్వవైరాగ్య
కలితుఁడైయున్న లక్షణములెల్ల
భావించి భావించి భయమొంది యొక్కనాఁ
డేకాంతసమయమం దిట్టులనియె
'శ్రీస్వామి ! యిపుడు మీ చిత్తమందొక చింత
పుట్టుట మీ ముఖాంబుజమునందు
గనిపించుచున్న , దీ కాలమందరుదుగా
నిటు చింతవొడమిన హేతువేమి ?

తే. దాఁచకను జెప్పుఁ'డనుచుఁ బాదములమీఁద
ఫాలమును జేర్చి విడువక బహువిధముల
వినుతిసేయుచు నడుగఁగా , విడువదనుచు
సతినిఁ గరములతో నెత్తి హితము మీఱ. 14

క. లాలింపుచుఁ బద్మావతి
నాలింగన మొనరఁజేసి , యన్యోన్యముగా
శ్రీలక్ష్మీశ్వరుఁ డపు డా
హేలావతి మోముఁ జూచి యిట్లని పలికెన్. 15

సీ. 'వినవె ! పద్మావతి ! వివరంబుగా నీకుఁ
జెప్పెద , నెట్లన్న సృష్టిలేని
కాలంబునందొంటిగా నిర్వికారుండ
నయి నిర్గుణ బ్రహ్మమగుచు నుంటి
నాయందనాదియై పాయక మూలప్ర
ధానమై మాయాభిధాన మొంది
చిద్రూపమై లక్ష్మి సద్రూపమై నన్నుఁ
బొందఁగా నప్పు డానంద మొదవె

తే. నందు మహదాది తత్త్వంబు లన్ని వొడమె
వాని మేళనమున సృష్టి వరుసగాను
బట్టుగను బుట్టి సర్వ ప్రపంచమయ్యె
నప్పు డంతటికినిఁ గర్తనగుచు నేను. 16

క. అది మొదలుగ బ్రహ్మాదులఁ
బదపడి పుట్టింతు , నీ ప్రపంచము నాలోఁ
గుదురై యుండును ; వెలిఁ బెం
పొదవుచు నీ రీతి వెలుఁగుచుండు మృగాక్షీ ! 17

క. ఇంత మహత్త్వంబా శ్రీ
కాంత కటాక్షమున నాకుఁ గలిగిన , దిపుడా
యింతి నెడఁబాసి యుండుట
కెంతయుఁ జింతింపుచుందు నిందునిభాస్యా ! 18

సీ. అద్వయబ్రహ్మంబునై నిరాకారమై ,
యచలమై యున్న నాయందుఁ బొంది
ఘన సుందరాకారమును నాకుఁ గల్పించి
తను సుందరాంగియై తాను నిలిచి

గురుతరకల్యాణగుణములు నాకిచ్చి
నను గొప్పఁ జేసె నానాఁటనుండి
చంద్రునియందున్న చంద్రిక విధముగ
వెలుఁగుచు నాయురస్స్థలిని నిలిచి

తే. వేడ్కతో నుండఁగా , నొకవేళఁ భృగుఁడు
వచ్చి సిరియున్న యురముపై హెచ్చి తన్నె
నందుచే లక్ష్మి నా మీఁద నలుకఁజేసి
విరసములు వల్కి కరవీరపురముఁ జేరె. 19

క. అప్పుడు సర్వజ్ఞత్వము
తెప్పున నను విడిచి లక్ష్మిదేవినిఁ బొందెన్
అప్పారపాటున మార్గము
దప్పక యీగిరికి వచ్చి దైన్యముచేతన్. 20

సీ. విలసిల్లు తింత్రిణీవృక్ష మూలమ్మునం
దున్న వల్మీకమందుంటి నపుడు
నాకు సర్వజ్ఞత లేకుండఁగా నిందుఁ
దేరకు గొల్లచే దెబ్బ గలిగె
నినుఁ జూచి మోహింప నీసఖీజనముచే
బలముగా ఱాళ్ల వ్రేటులును గలిగె
సిరిలేకయుండినతఱి వివాహేచ్ఛచే
నా కుబేరునిచేత నప్పు గలిగె

తే. వనిత ! మీతండ్రి , తమ్ము లిచ్చిన ధనంబు
చే ఋణము దీర , ' దిఁక నేమిసేతు ? ' ననుచుఁ
జింత పుట్టినదిపుడు నాచిత్తమందు
దీని కాలోచనంబేమి ? మీననయన ! ' 21

క. అనవిని పద్మావతి యి
ట్లనియె ' మహాస్వామి ! మీకు నమరఁగ నాలో
చన మేనుఁ జెప్పనేర్తునె ?
నను మీరిట్లడుగు రీతి నాయంబగునే ? 22

సీ. సృష్టి పూర్వమునందె చేపట్టి మిమ్మింత
గొప్ప చేసిన లక్ష్మి నిప్పు డిట్ల
నెడఁబాయ మేరగా , దెట్లైనఁ బ్రార్థించి
తోడ్కొని వచ్చి , నాతోడుగాను
మీ చెంత నిడికొన్న , మీకిర్వురకు దాసి
నైకొల్చి సేవింతు , నంతె కాని
నామది కాలోచనంబింతకన్న వే
ఱొఁక నేమి తోఁచలే దిందిరేశ !

తే. రయమునను ఘన కొల్లాపురమున కరిగి
కమలమందిర మదిలోని కలఁక దీర్చి
యిరువురము దోడుకొని వత్తు'మిచటి కనినఁ
జింతతో నిట్టులనియె నా శ్రీధరుండు. 23

చ. 'విను పద్మావతి ! యొంటి కాపురము నీవే చేయుచున్ వేడ్కగా
నను నర్ధక్షణమైనఁ బాయక సదానందాత్మవై యుంటి , నా
వనజాతాలయ వచ్చి సంతతము నా వక్షస్స్థలంబందు ని
ల్చిన , నీవప్పుడు చూచి యోర్వఁగలవే ? చింతన్ మదింబొందకన్. 24

క. నీవిచ్చట ననుఁ గూడుట
కై వననిధితనయ వచ్చినప్పుడు తిరుగా
నా వక్షస్స్థలి నిడికొన
కా వేళనె పంచితచటి కబ్జదళాక్షీ ! ' 25

సీ. అన విని చింతించి యపుడు పద్మావతి
పలికె నిట్లని ' రమాభామ యిటకు
వచ్చియున్నపుడు మీ వక్షస్స్థలంబునం
దిడికొన్న కొదువ నాకేల గలుగు ?
నా లక్ష్మి మీకు నా కన్యేన్యముగఁ జేసి
యంతటికినిఁ గర్త యగుచునుండు ,
శ్రీరమాకాంతయే సీతయై నను౯ఁ బెండ్లి
యాడుమటంచు మీ కాప్తముగను

తే. జెప్పినందుననే కదా ! చిత్తగించి
నన్నుఁ జేపట్టితిరి ; సదానంద మొదవె
నింత భాగ్యంబు కృపను నాకిచ్చినట్టి
సిరికిఁ బ్రత్యుపకృతి నేనుఁ జేయఁగలనె ? 26

క. ఏరీతినైన నిచటికిఁ
గూరిమితో సిరినిఁ దోడుకొని వచ్చిన , నే
నా రామామణి పదములు
గారవమునఁ గొలిచియుందుఁ గమలదళాక్షా ! 27

మ. ననుఁ గొల్లాపురమందుఁ జేర్చుఁ , డచటన్ నానాప్రకారంబులన్
వనజాతాలయ నొప్పవేడికొని సర్వంబున్ సమర్పించి , ర
మ్మని నేఁ దోడ్కొని వత్తు'నన్న , దరహాసాస్యంబు దీపింప న
వ్వనజాతాక్షుఁడు సంతసంబొదవ నా వామాక్షితో నిట్లనెన్. 28

క. 'సతి ! నీ లలితోక్తికి నా
మతి సంతస మొందె , వకుళమాలిక చెంతన్
హితముగ నుండుము ; నే నిపు
డతిశీఘ్రమ తోడితెత్తు నబ్ధిజ నిటకున్. ' 29

వ. అని శ్రీనివాసుండు నిశ్చయించె, నట్టి వృత్తాంతంబు లక్ష్మి భావించి తెలిసి తనలోఁ దా నిట్లని వితర్కించె. 30

సీ. 'శ్రీవేంకటేశుఁ డాశ్రితజనావనుఁ డింక
నిందుండనీయ కహీంద్రగిరికి
నను సత్కృపను దోడుకొనిపోవుటకు వచ్చు,
నపుడు 'నే రానుపొ'మ్మనను నాకు
నోరాడ, దిప్పుడ గారవంబుగ దాఁగ
వలయు, నే నా స్వామివక్షమందుఁ
బగలు రేలుండినఁ బద్మావతికిఁ జింత
గలుగు, నా కేల ? యీ కర్మ'మనుచు

తే. రయమునను లేచి, కొల్లాపురంబు విడిచి
దారి తప్పక యరిగి పాతాళమందుఁ
జేరి, హరియంశుఁడయ్యు విశేషయోగ
మహిమచే నొప్పు కపిలాఖ్యమౌనిఁ జేరె. 31

క. అపు డా లక్ష్మినిఁ గనుఁగొని
కపిలమునీంద్రుండు చాల గౌరవముగ న
వ్విపులాశ్రమతలమం దా
చపలాక్షిని నిల్పె మదిని సంశయపడకన్. 32

క. హరి యంశము గల మునిపై
నరమర మది నుంచుకొనక యంబుధిసుత యం
దిరవుగ నిలిచి, నిజేశుని
స్థిరముగ హృదయమునఁ బూజసేయుచునుండెన్. 33

## లక్ష్మినిఁగూర్చి హరి కొల్లాపురంబునఁ దపంబుసేయుట

సీ. అటుమీఁద శ్రీవేంకటాద్రినాయకుఁడు ప్రా
తఃకాలమున లేచి, తప్తహేమ
చేల,భూషణములు సిస్తుమీఱ ధరించి
హరి గరుడాఖ్యతురంగ మెక్కి
'యటఁబోయి వచ్చెద'ననుచుఁ బద్మావతి
కనుకూలముగఁ జెప్పిచనిన కరణి
నందున్న వకుళతో, నావరాహస్వామి
తోఁజెప్పి కదలి యెంతో ముదమునఁ

తే. బోయి గ్రక్కున కరవీరపురమునందుఁ
బద్మమందిర యున్నట్టి భవన మపుడె
చేరి, యందందు వెదకి యా క్షీరవార్ధి
కన్యకామణి లేకున్నఁ గలఁత నొంది. 34

శా. ఖిన్నుండై మది నేమి దోఁచ కచటం గ్లేశాత్ముఁడై సారెకుం
గన్నీరూరక నింపుచున్, వెదకుచుం, గామాతురుండై, మహా
పన్నుండై 'యకటా! రమాతరుణి నాపై మోహమే లేక యిం
దిన్నాళ్లుండిపుడెందు దాఁగినదొ, నే నింకేడ శోధింపుదున్?' 35

సీ. అని చింతసేయుచు, నచట నుండక పోయి
పర్వతాదులఁ జూచి పలికెఁ జక్రి
'గిరులార! తరులార! కిన్నరాంగనలార!
కానరే? మా రమాకాంత నిచట
సురలార! మునులార! నరులార! మీరైనఁ
గానరే? మా రమాకాంత నిచట
పద్మాకరములార! పద్మాలయను జూ.
యుండినచోఁ జెప్పుఁ డుండునునికి

తే. నన్ను బొంకించి యెచటనో యున్నదిపుడు
దానిఁ జూడక యింక నేఁ దాళలేను
గానఁ జూచినవారు శ్రీకాంత నిపుడ
చూపుఁ'డన వారు హరిమోముఁ జూచి యనిరి. 36

**మత్తకోకిల :**

'దేవదేవ ! మహాత్మ ! మేచకదేహ ! యిచ్చట లేదు శ్రీ
దేవి , యెచ్చటనుండు చందము తేటగాఁ గనలేదు , మీ
కే విధంబున విన్నవింతు? మహీంద్రసద్గిరినాయకా ! '
నావుడున్ విని శౌరి చెంతను నాల్గుదిక్కులఁ జూచుచున్. ' 37

వ. ఇవ్విధంబునఁ గొంత తడవుండి చింతించి , మరలఁ గొల్లాపురంబు చేరి , యందొక్కచోట లక్ష్మి నర్చారూపంబుగాఁ దీర్పించియుంచి పూర్వంబునం దగస్త్యుండు పూజింపుచున్న లక్ష్మీవిగ్రహంబు నీక్షించి జాలినొందుచు , నచ్చోట వసియించి యా మహాలక్ష్మీవిగ్రహంబును బూజింపుచు దశవత్సరంబు లందుఁ దపంబుసేయుచుండె ; నంత నొక్కనాఁడు సిరినిఁ దలంచి యతి చింతాక్రాంతుడైయున్న సమయంబున నద్భుతంబుగా నశరీరి యా హరి నుద్దేశించి యిట్లనియె. 38

సీ. 'దేవ ! యిచ్చట రమాదేవి మీకిప్పుడు
పొడసూప దీ తపంబునకు మెచ్చి ,
గాన నిచ్చటికిఁ జక్కగ దక్షిణంబుగాఁ
గీర్తింపఁదగియున్న కృష్ణవేణి
యను నది ప్రవహించు , నటకు ద్వావింశతి
యగు యోజనంబుల కవల నధిక
ముఖ్యమైన సువర్ణముఖరి యన్నదికి ను
త్తరతటంబున నిల్చి తపసివగుచుఁ

తే. గుంభసంభవుఁడున్న దిక్కునకుఁ దూర్పు
గాఁ బ్రకాశించు సిద్ధసౌఖ్యస్థలమున
స్వర్గమందున్న దివ్యసువర్ణకమల
మొకటి దెప్పించి నాఁటి యందొనర నిలిపి. 39

క. ఆ కమలమునకుఁ దూర్పు ది
వాకరునిఁ బ్రతిష్ఠచేసి యర్చించినచో
నా కమలము ముకుళింపక
జోకగ వికసించియుండు శోభనకరమై. 40

శా. నీవా కంజమునందు దృష్టి నిడుచు న్నిష్ఠాగరిష్ఠుండవై
భావంబందు రమాసతిం దలఁచి తత్పద్మాంతరాసీనగా
నేవేళ న్గనుచున్ సుమార్చనము నందింపొందఁగన్ జేయుమా !
దేవింపొంది ప్రసన్నయై యురమునందే నిల్పుఁబొమ్మచ్యుతా ! 41

క. పదియునురెండబ్దంబులు
మది శ్రీసతియందె నిల్పి మౌనముగా నిం
పొదవిన లక్ష్మీమంత్రము
చెదరని నిష్ఠను జపంబుఁజేయు మహాత్మా ! ' 42

సీ. అని భారతీదేవి యశరీరయై పల్క
విని వింతగాఁ జక్రి కనులు దెఱచి
నాల్గు దిక్కులఁజూచినను దన కెవరందు
గనిపింపకుండఁగా ' గగనవాణి
చెప్పిన దీ మాట సిద్ధం'బనుచు లేచి
గరుడవాహన మెక్కి కదలి , దారి
దప్పక శేషభూధరముఁ గ్రక్కునఁ జేరి
వేఱె తానొక రాజవేష మచటఁ

తే. గ్రమముగా ధరియించి పుష్కరిణియందు
స్నానసంధ్యాది కృత్యముల్ సలుపుచున్నఁ
గాంచి పరరాజితండని గౌరవముగ
నెంచి వైఖానసార్యులందిష్టులగుచు. 43

తే. వేగఁ గ్రతుభోక్తయగు మహావిష్ణుదేవు
నతిథి యని పూజచేసి , దివ్యాన్నమపుడు
పొసఁగ నర్పించి , విడెమిచ్చి , పుణ్య కథలు
చెప్పి , 'దయ నుంచు'మంచు నాశీర్వదించి. 44

**అశరీరవాణి పల్కుల ననుసరించి స్వామి పద్మసరోవర తీరమున నిష్ఠతోఁ దపము గావించుట**

క. తను వీడ్కొల్పఁగఁ , బర్వత
మును డిగ్గి యగస్త్యనామ ముఖ్యాశ్రమముం
గనుఁగొని , దానికిఁ దూర్పుగఁ
జని సిద్ధస్థలమునందు సరగువఁ జేరెన్. 45

వ. అప్పుడు విష్ణుదేవుండు గరుడ ఘోటకంబు డిగ్గి యచ్చట నిలిచి వాయుదేవుని స్మరింపఁగా, నతండు వచ్చి యాచక్రికిఁ బ్రణమిల్లి యిట్లనియె. 46

క. 'దేవా ! నన్నుఁ దలంచుట
కీ వేళను గార్యమేమి ? యెఱిఁగింపుఁడు ! మీ
సేవకుఁడనగుచుఁ జేసెద
శ్రీవల్లభ ! ' యనఁగఁ జక్రి చిఱునవ్వొసఁగన్. 47

సీ. పలికె నిట్లని ' విను పవన ! నీ వాస్వర్గ
మున కేఁగి యచ్చట ముఖ్యమైన
యలఘుమందాకినియందున్న పరకాంచ
నాబ్జంబు సురరాజు నడిగి తెమ్ము

పొమ్మనఁగాఁ జక్రి కమ్మారుతుఁడు నిట్టు
లనియె ' హేమాబ్జంబు లమిత మగుచు
ముఖ్యంబుగా స్వర్ణముఖి యందు గలుగఁగా
వేఱె భర్మాబ్జంబు వెదకనేల ? '

తే. యనఁగ , నశరీరి తనకుఁ జెప్పిన విధంబు
లతని కెఱిఁగించి పంపఁగా , ననిలుఁ డఱిగి
వరసహస్రదళముల సువర్ణపద్మ
మమరపతి సెలవునఁ దెచ్చి హరి కొసంగి. 48

క. నిలువఁగ , మాధవు ( డిట్లని
పలికెను ' విను పవన ! నేఁ దపం బిచ్చోటన్
సలిపెద , నీ కీ గోప్యముఁ
దెలిపితి , నిది యెవరితోడఁ దెలుపకు మనఘా ! ' 49

తే. అనిన విని పవనుండు ' మహాప్రసాద '
మనుచు హరి యాజ్ఞఁ గైకొని యరిగె , నంతఁ
గమలలోచనుఁ డచటి పుష్కరిణి నడుమఁ
గుంతమున గ్రుచ్చి గోకర్ణమంతయైన. 50

సీ. ఖాతంబు చేసి యక్కడ సువర్ణాంబుజ
నాళంబు లోఁతుగా నాఁటి , నీటి
పైనఁ బద్మము నుంచి , భాస్కరు నా తూర్పు
నందుంచి పూజించి యచలమతినిఁ
బద్మాకరమునకుఁ బశ్చిమ తటమందుఁ
జేరి , పద్మాసనాసీనుఁడగుచు
నేకాగ్రమగు దృష్టి నాకాంచనాబ్జమం
దుంచి శ్రీసతిని భావించి యచట

తే. నిలిపి , మానసపూజఁ దా నిత్య మొనర
ధీరుఁడై చేయుచును , రమాదేవిమంత్ర
మును జపించుచు నచ్చోట ముఖ్యతపముఁ
జేయుచుండెను విష్ణుండు సిరినిఁగూర్చి. 51

**రంభాదులు స్వామినిఁ జలింపఁజేయఁజాలక యోడి చనుట**

క. హరి యిటు తప మొనరించుట
హరిహయుఁ డెఱిఁగియును , మఱచి ' యవనీస్థలిపై
నరపతి యెవఁడో ఘనతప
మురునిష్ఠను నిలిచి చేయుచున్నాఁ'డనుచున్. 52

ఆ. తలఁచి , యతఁడు చేయు తపము పూర్ణంబైనఁ
దన పదంబుఁ జేరునను భయంబు
వొడమఁ , ' దపమునకును బుడమిపై విఘ్నంబుఁ
జేతు'నంచు నెంచి జిష్ణుఁ డపుడు. 53

చ. తన మది నిశ్చయింపుచును దక్కక నప్పుడె వారకామినీ
జనములఁ బిల్చి యిట్లనియె ' సాహసి యొక్కఁడు మత్పదంబుఁ జే
రను దపమాచరించు, నల రాజును మోసముచేసి తత్తపం
బును జెఱుపందగన్ జనుఁడు ! పుష్పశరున్ జతగూడి వేడ్కగన్. ' 54

మ. అని రంభాది సతీసమూహమును నెయ్యంబొప్పఁ బంపింప , నత్తనుమధ్యల్
మణిభూషణంబులు , సువస్త్రంబుల్ , విరుల్ , దివ్యచందనముం దాల్చి
యొయారముల్ చెలఁగఁగా దాంబూలముల్ చేయుచుంజని , విష్ణుండు
తపంబొనర్చు ఘన సుస్థానంబునం జేరఁగన్. 55

క. కలకంఠము , లళులును , జిలు
కలు కలకలరవముఁ జేయఁగా , సూనశరుం
డులుకక మలయానిలమును
జెలువలరఁగఁ గూడి యచటి చేడెలచెంతన్. 56

క. చేరిన మారునిఁ గని యా
నారీమణులెల్ల మురిసి నగి , యచ్చటి శృం
గారవనములోఁ జొరఁబడి
కోరిక లుప్పొంగఁ బూలు గోయుచు వేడ్కన్. 57

క. చిలుకలవలెఁ దగి జిలిబిలి
పలుకులు పలుకుచును , జెలఁగి పకపక నగుచున్.
గలిబిలిగా నొండొరులను
బిలుచుచు నిట్లనిరి చాలఁ బ్రేమ చెలంగన్. 58

సీ. 'అక్కలారా ! కొమ్మలెక్కి పువ్వులు గోసి
చక్కగా వనమెల్లఁ జల్లరమ్మ !
భువిని వసంతమాధవుచెంత వనలక్ష్మిఁ
జేర్చి వివాహంబుఁ జేయరమ్మ !
మల్లెపూవులు గోసి మగువలారా ! వేడ్కఁ
దలఁబ్రాలు వోయరే ! దంపతులకుఁ ,
గీరంబులను చెంతఁజేర్చిపాటలు పాడ
సెలవు మీరొసఁగరే చేడెలార ! '

తే. యనుచు ఘనతాళపద్ధతి నాడి పాడి
రభసములు చేయఁగాఁ , బరరాజవేష
ధారియై తపమొనరించు దానవారి
నాకపతిసేఁత కాత్మలో నవ్వికొనుచు. 59

చ. కనులు వినోదియై తెఱచి కాంతులు దిక్కులఁ బిక్కటిల్లఁగా
వనజదళాయతేక్షణుఁడు వారినిఁజూచి చలింప , కాత్మలో
వనధిజనే తలంపుచు సువర్ణమయాబ్జము దిక్కె చూడఁగా
ననిమిషకాంతలే భ్రమసి యా హరిపైఁ దమ మోహముంచుచున్. 60

మ. అపు డంచంచుకుఁ బోయి పూలసరముల్ హాస్యంబుగాఁబూని య
త్రపనీయాంగలు శౌరి వక్షముపయిన్ దామేయుచున్ , నవ్వుచున్
గపటంబుల్ పచరించి నాట్యములు సద్గానంబులుం జేసినన్
జపలం బించుక లేక యచ్యుతుఁడు నిష్ఠ న్నిల్చి దీపింపఁగన్. 61

శా. వీణ ల్మీఁటుచుఁ బాడుచున్ గులుకుచున్ వింతల్ , వినోదంబులున్
జాణ ల్చూపుచు నందుఁ దాము తమలోఁ జాపల్యభావోక్తులై
నాణెంబుప్పతిలంగఁ బల్కుచును శ్రీనారాయణస్వామినే
యేణాంకాస్యలు చూచి చూచి తమలో హెచ్చైన మోహంబునన్. 62

సీ. కరఁగుచునుండఁగాఁ , గందర్పుఁ డల్కతోఁ
గోకిలకాహళి కూచి చేసి
మలయానిలునితోడ , మధుపాళిబలముచేఁ
జెలరేఁగి పురికొల్పి , చిలుకతేజి
పైనెక్కి , యిక్షుచాపం బెక్కువెట్టి బం
భరమౌర్వి సారించి , ప్రబలపుష్ప
బాణంబు లా చక్రిపైఁ గాఁడనేయుచు
నార్చి విజృంభించి యలసి నిలిచి

తే. యతనిఁ జలియింపఁజేయలే కవల నరిగెఁ
జింతసేయుచు రంభాదికాంత లబ్జ
లోచనునిఁ జూచి తమ కేమి తోఁచ ' కితని
నే విధంబున వలపింతు మింక ? ' ననుచు. 63

సీ. ఒక రొక్కరినిఁ జూచి ' యోయక్కలార ! యీ
నరపతి తపమే ఘనంబు చూడ
మొనసి విశ్వామిత్రముని తపంబునకన్న
ద్వైపాయనుఁడు సేయు తపముకన్న

మ. దిగులుం బొందుచు నేమి దోఁచ కపుడా దేవాదిదేవున్ , మహా
జగదీశుంగని భక్తి మీఱఁగ నమస్కారంబులుం జేసి , మె
ల్లఁగ మాట్లాడుచు సద్దుసేయ కట శ్రీలక్ష్మీశ్వరుంబాసి , యా
మృగనేత్ర ల్సని నాకనాయకుని సామీప్యంబునం జేరఁగన్. 67

క. వారినిఁ గని పురుహూతుఁడు
'నారీమణులార ! ధరను నరపతి తపముం ,
ధీరతఁ జెఱిచితిరే? ' యనఁ
గా రంభా ప్రముఖసతులు కళవళపడుచున్. 68

సీ. పలికి రిట్లని ' నీవు పంపింపగాఁ బోయి
నరపతే యనుచు నానావిధములఁ
దలకొని నృత్తగీతము లెంతఁ జేసిన
మా దిక్కుఁ జూడక మహిమమీఱఁ
దనచెంత విశ్వమోహినినిఁ బుట్టించినాఁ ,
డా కాంతకన్న మేమందఱమును
దక్కువైనందునఁ దగ్గివచ్చితి , మిలఁ
జిరతరతపముఁ జేసెడు ఘనుండు

తే మనుజుఁడని యుంటి , మతఁడే రమావిభుండు
గనుక , చలియింపకున్నాఁడు ; కాముఁ డతనిఁ
గదిరి చనినాఁడు , తత్తరం బతిశయించి
యున్న,దిది నిక్కమో పురుహూత ! ' యనిన. 69

ఆ. విని సురేశ్వరుండు విస్మయస్వాంతుఁడై
' చక్రి తపముసేయు సరణి మఱచి
యేనుఁ జేసితిప్పు డిటువంటి యపచార '
మనుచు హరికిమ్రొక్కి , యళుకుచుండె. 70

సీ. దనుజారి యచ్చుటఁ దన మాయచేఁ బుట్టి
నట్టి శక్తినిఁ జూచి యచలుఁడగుచుఁ
బలికె నిట్లని ' నీవు ప్రజలచే నిందందుఁ
బూజలొందుచునుండు ' మ్మటంచుఁ
దా దానిఁ బంపించి , తదనంతరంబున
జిష్ణుండు నేరక చేయుపనికిఁ
గోపింప నొల్లక , కొడుకు తప్పులు తండ్రి
గాచి రక్షించిన కరణిఁ బ్రోచి

తే. శాంత సుస్వాంతుఁడై , హేమజలజమందె
పూర్వరీతిని మరల సంపూర్ణదృష్టి
నిలిపి , చలియింప కత్యంతనిష్ఠ మెఱయ
శ్రీరమేశుండు తప మొప్పఁజేయుచుండె. 71

**హరినిఁ దలంచి పద్మావతి దిగులు నొందుట**

తే. అచటఁ బద్మావతీదేవి హరినిఁ బాసి
నది మొదల్ నిద్రలేక, యాహారమైన
లేక యా చక్రధరునిపై వ్యాకులతను
విరహతాప జ్వరంబుచే వేఁగుచుండి. 72

క. 'ఇరువదిరెండేండ్లాయెను
హరి యింటికి రాకపోయె'ననుకొని చింతం
బొరలుచు , మఱచుచుఁ దెలివిన్
దొరకొని యొకనాఁడు వకుళతో నిట్లనియెన్. 73

మ. 'వకుళా ! విష్ణుఁడు నన్ను శేషగిరిపై వర్తింపనేమించి , నాఁ
డకలంకంబుగ మాటలాడి చని రాఁడయ్యెన్ , మహాచింతచే
నొకనాఁ డొక్కయుగంబుగా గడపలే నో యమ్మ ! నా ప్రాణనా
యకుఁడా లక్ష్మినిఁ గూడ నెందఱిగినాఁ ? డంచున్ విచారింపుదున్. 74

తే. నిలిచియున్నచోట నిలువ సహింపదు
మఱచియుండుదనిన మఱపు రాదు
కనులఁ గట్టినట్లుగాఁ దోఁచుచున్నాఁడు
మాటలాడఁ డిపుడు మౌనివలెను. 75

సీ. కనిపింపుచున్నాఁడు కలలలో నిత్యంబు
తపసి వేషము దాల్చి దగ్గఱగను
ధ్యానయోగసునిష్ఠఁ బూనినట్లున్నాఁకు
జోడులే కొక్కఁడున్నాఁ డిదేమొ ?
కమల యా స్వామికిఁ గనిపించెనో , లేదో ?
నా కనుమానమైనది , దినంబు
నీ కాని స్వప్నముల్ రాఁగారణంబేమి ?
తెలియలే , దీ మాయ దేవుఁడెఱుఁగు '

తే. ననుచుఁ గన్నీరు నింప , నయ్యబ్జముఖినిఁ
జూచి జాలినిఁబొందుచు లేచి వకుళ
మాలికాదేవి యాకొమ్మమస్తకంబు
నివిరి కన్నీరుదుడిచి బల్కెనరుమీఱ. 76

తే. పలికె నిట్లని ' తల్లి ! యీ పామరంబు
విడువు ! భయమేమి ? శ్రీమహావిష్ణువునకును ,
' గడఁగి మునిరీతిఁ గలలలోఁ గానిపించు '
ననుచుఁ జింతింప ; కిదియె శుభావహంబు. 77

క. అమ్మా ! సంతోషముతో
నెమ్మదిగా నుండు , కనుల నీరిటు తేరా ,
దమ్మాధవుఁడా లక్ష్మిని
సమ్మతిగాఁ గూడి యిటకు సరగున వచ్చున్. ' 78

## లక్ష్మీకపిలముని సంవాదము

సీ. అని వకుళాదేవి యంటఁ బద్మావతి
నాదరించు మ నుండె ; నంత లక్ష్మి
కపిలాశ్రమంబులోఁగానుండి పద్మావ
తీదేవిచింత దాఁ దెలిసి ' చక్రి
తనకొఱకై యేల తపముసేయఁగవలె ? '
నా కాంత కొండపై నడలనేల ? '
యని చింతసేయుచు , నందున్న కపిలము
నీశ్వరు నీక్షించి యిట్టులనియె

తే. ' మౌని ! పద్మావతినిఁ జక్రి మహినిఁ బెండ్లి
యాడి విడనాడి , నాకొఱ కద్రిదిగువఁ
దపము సేయుచునున్నాఁడు , దానికిప్పు
డేమి సేయుదు?'ననఁగ యోగీంద్రుఁడనియె. 79

క. 'హరి యురమున వసియింపక
సిరి ! నీవపు డలిగివచ్చు చిత్రంబే?మా
సరణిని ముందుగఁ దెలుపుము
వెరవును నే నవల విన్నవించెద నతివా ! ' 80

క. అని కపిలుం డపుడడుగఁగ
విని శ్రీసతి యిట్టులనియె ' విష్ణుని యురమం
దొనరఁగ నేనుండిన భృగు
ముని హరియురమునను దన్నెమూఢాత్మకుఁడై. 81

క. పరుఁడగు పురుషుని పాదం
బరుదుగ సోఁకిన యురంబునందుండిన , సు
స్థిరపాతివ్రత్య బలం
బఱిముఱిఁ జెడునంచు దూరమరిగితి ననఘా ! ' 82

చ. అనవిని మౌని యిట్లనియె 'నా భృగుఁడెవ్వఁడు? సుతుండు , మున్
గనిన కుమారుఁ , డన్యుఁడనఁగాఁదగ , దెట్టులటన్న వాఁడు నీ
మనుమఁడు , పుత్రతుల్యుఁ డనుచూనము నుంచక మాత్మలోపలన్
దనుజవిరోధి యీ సరణి దాఁచక చెప్పెనొ,లేదొ ? మానినీ !' 83

చ. అనవుడు లక్ష్మియిట్లనియె 'నంబుజనాభుఁడు నాకు మున్ను చె
ప్పిన విధమీవు చెప్పితివి , భేదములే దిసుమంత ' యన్న , న
మ్మని సిరిఁజూచి నవ్వికొని మూర్ఖతఁజేసిటు భర్తమాటలన్
విన,కెడఁబాసి నీవు కరవీరపురంబున కేఁగవచ్చునే ?' 84

క. అని కపిలుఁడు పల్కఁగ విని
వనజాలయ చింతనొంది వారక యపుడా
ఘనయోగీంద్రునిఁ గనుఁగొని
వినయంబున నిట్టులనియె విశ్వాసముతొన్. 85

క. 'ఆ విప్రుఁ డతి గర్వము
తో విష్ణునిఁ దన్నినట్టి దుఃఖముచేతన్
నే వక్షస్స్థలి నుండక
పోవలెనని తలఁచితపుడు పుణ్యవిచారా !' 86

ఉ. నావుడు నవ్వికొంచు మునినాయకుఁడిట్లనియె 'న్నిజంబుగా
నీవిభు డొప్పినట్టి పని నీమది కొప్పకయుండవచ్చునే ?
నీవు పతివ్రతాశివి , నీమదిఁ దోఁచని ధర్మమున్నదే ?
శ్రీవనితాలలామ ! హరిచిత్త మెఱుంగక యిట్లు సేతురే ? 87

సీ. సిరి ! యెన్ని తపములోఁ జేసి నీ వాస్వామి
యురమందు వసియించియుండి , భృగుని
యందు నేరముఁబెట్టి యలిగిపోవుట నీకుఁ
దగునె ? భృగుండేమి తప్పుసేసె ?

ముగురుమూర్తుల గుణములఁ బరీక్షించుట
కై మునుల్ పంపఁగా , నజునిఁ జేరి
యతని రజోగుణం బటఁ బరీక్షించి , శం
కరుని తమోగుణక్రమముఁ దెలిసి

తే. హరి మహాసత్వగుణము బ్రహ్మాదులకును
దెలియఁజేసెడికొఱకు భక్తిని మనమున
నుంచికొని తన్నినాఁడు , గర్వించి తన్నె
ననుచు మునిభావ మెఱుఁగ కిట్లలుగనగునె ? 88

సీ. స్వల్ప దోషములకె జలజజుండును , రుద్రుఁ
డలిగిన యా దోష మతిశయముగఁ
దాఁ జేసి , చక్రి నందఱిచేత మెప్పింప
వలెనంచుఁ దన్నినవాఁడె కాని,
క్రోధంబు మది నుంచుకొని తన్నలేదు గా
వున విష్ణుఁ డా పని కనుమతించి
యతని గొప్పగ నెంచి యంపించె ; నా హరి
యందు , నా భృగుమునియందుఁ దప్పు

తే. లుంచి హరి నెడఁబాసి పోవుటను నీదె
తప్పనుచుఁ జెప్పవలయు ; నంతటి విరోధ
మీవు చేయఁగ నద్దేవదేవుఁ డచట
నిలువ , కప్పుడె వేంకటాచలముఁ జేరి. 89

తే. అచటఁ గొన్నాళ్లు కష్టంబు లనుభవించి
నట్ల నటియించి , పిదప నయ్యబ్జముఖినిఁ
బ్రేమమీఱఁగ వీక్షించి పెండ్లియాడె
నతని కెందున్నఁ గొదువలే దంబుజాక్షి ! 90

క. హరి కరుణాసాగరుఁడై
మరల న్నినుఁ బిలువవచ్చు మర్మము మదిలో
నెఱిఁగియు , నఱ విడువక యా
వరదుని వంచించి యిటకు వచ్చుట తగునే ? 91

చ. పరమపతివ్రతామణివి భర్తను జిక్కులఁబెట్టి చాలఁ దొం
దర లొనరించి,బాలకులు డాఁగురుమూఁతల నాడురీతిగాఁ
దిరుగుచునుండు చందము పతివ్రత కొప్పునె ? యెందునైన నీ
వెఱుఁగని నీతులున్నవె ? యిదేమి విచిత్రము పుట్టె నంగనా! 92

సీ. వనితా ! ద్వివింశతి వత్సరంబులనుండి
తల జడల్ గట్టఁగాఁ దపసి యగుచు
నాహార నిద్రా సుఖాసక్తులను మాని
నీకొఱకై సర్వలోకకర్త
మనుజుఁడై నీ నామ మంత్ర జపంబును
జేయుచున్నాఁడు సుస్థిరముగాను
నీవు మంత్రాధీనవై వాసుదేవునిఁ
జేరఁగాఁదగు , నిది సిద్ధమిలను

తే. నింక నీవేడ దాఁగెద ? విపుడ లేచి
యంబుజాక్షుఁడు నాఁటియున్నట్టి పద్మ
నాళపథమున నరిగి , నీ నాయకుండు
దృష్టిఁబెట్టిన కమలమందే ముదమున. 93

ఆ. నిలిచి యచట నుండు ! నీరజాసనముఖ్యు
లటకు వత్తు , రప్పు డందఱెరుఁగ
వనిత ! నీవు చక్రివక్షస్స్థలమునందుఁ
జేరియుండు భూప్రసిద్ధముగను.' 94

క. అని కపిలుం డాప్తముగా
వినిపించిన విమలతరవివేకోక్తుల కా
వనధిజ సంతోషింపుచ
మనమలరఁగ నిట్టులనియె మౌనీంద్రునితోన్. 95

సీ. 'నీవు చెప్పినమీఁద నావల్లనే తప్పు
గలదని తోఁచె నిష్కర్షగాను
నే నేమి సేయుదు ? నానాఁటి కా కాల
గతు లీ విరోధంబుఁ గలుగఁజేసె
నటుగాన నాస్వామి కపచార మీ రీతిఁ
జేసితి ; నిఁకమీఁద సిగ్గులేక
నేను వక్షమునందు నిలువఁబోయినఁ జక్రి
నవ్వఁడే, భృగుఁడైన నవ్వికొనఁడె !

తే. కాన సంకోచమైనది , కాయ మిచట
నుంచి , నే నర్ధకళతోడ నురుతపంబు
చేసి , పతి కపకారంబుఁజేసినట్టి
పాపమును నీఁగవలయు నో పావనాత్మ ! 96

క. ఈ దేహముతో నపకృతి
యాదేవున కాచరించినందున , నిపుడే
యీ దేహము హరియెదపై
నాదరముగ నిల్పఁ జెల్లదయ్యఁ మహాత్మా ! 97

ఉ. కావున నవ్యదేహమును గైకొని , విష్ణుఁడు పూజచేయు రా
జీవములోన నిల్చి , హరిఁ జేరి యురస్స్థలమందు నిల్చెదన్
నీ విధి సమ్మతించుము మునిప్రవరా ! ' యని సన్నుతింప , న
ద్దేవిముఖంబు దివ్యతరదృష్టినిఁ జూచి మనంబులోపలన్. 98

సీ. తలఁచె నిట్లనుచు నత్తాపసశ్రేష్ఠుఁ ' డీ
తెరవ దేహంబు ప్రత్యేకపూజ
లందు కారణముండు'ననుకొంచు నిట్లనె
' దేవి ! నీ విప్డు డిందే వసించి
తపముఁ జేయుచునుండు ! తదనంతరమున నా
పద్మసరోవర ప్రాంతమునకుఁ
జని పాంచరాత్రపూజల నందుకొనుచుండు ,
వందుపై నీ చిత్తమందుఁ దలఁచి

తే. నట్లనే చేయు'మని లక్ష్మి కానతిచ్చి
మరల నిట్లనియెను ' లోకమాత ! నీవు
హరికి నిత్యానపాయిని వగుచుఁ జక్రి
యెన్నియవతారముల నెత్తుచున్న నీవు. 99

క. అన్ని శరీరము లమరన్
బన్నుగ ధరియించి విభునిఁ బాయక కీర్తిన్
గన్నట్టి నీప్రభావము
మున్నెఱుఁగుదు నేను విశ్వమోహిని ! ధరపై. 100

క. నీవెత్తిన దేహంబులు
నా విష్ణుండెత్తినట్టి-యవతారము లిం
కా వేయుతలల శేషున
కా వనజజ శంకరులకు నలవె గణింపన్ ? 101

క. మీ రాదిమదంపతులై
భూరిజగత్త్రయము నిట్ల పుట్టించినవా
రారయ నిపు డెడఁబాయను
గారణ మున్నందువలనఁ గార్యము గలిగెన్. 102

క. వేంకటగిరిపై మీరిపు
డంకితముగ నుండవలసినందున , నాఁ డా
శంక మనంబునఁ బొడమెను
పంకజముఖి ! మీకు భేదభావము గలదే ? 103

క. నిను నేఁ దప్పనిపించితి
నని కోపము నుంచవలవ , దాప్తుండను నా
మనమునఁ దోఁచిన యర్థము
వినిపించితిఁ గూర్మిచేత విమలేందుముఖీ ! ' 104

ఆ. అనఁగ లక్ష్మి యిట్టులనియె ' నో మునినాథ !
నీవు చెప్పినందుచే విరోధ
మడఁగె , నిటకు వచ్చునప్పటి నా భావ
మిపుడు విన్నవింతు నెట్టులనిన. 105

క. అలఁ బద్మావతి చక్రినిఁ
గలిసి మెలంగుచును వేడ్కగా నుండఁగ , నా
జలజాక్షుని వక్షముపై
నెలమిన్ నే నిల్చియుండు టెట్టు?లటంచున్. 106

తే. తలఁచి , హరి నన్నుఁ గరుణతోఁ బిలువవచ్చు
నపుడు వంచించి వచ్చి నీయాశ్రమంబు
నందుఁ జేరితి'ననఁగ సంయమివరుండు
చిఱునగవు నవ్వి లక్ష్మి నీక్షించి పలికె. 107

తే. 'వినుము విష్ణుఁడు కృష్ణుఁడై వేల సంఖ్య
లైన కాంతలఁ జేపట్టి యందఱికిని
నన్నిరూపములై కూడునపుడు నీవు
శౌరి నెడఁబాసి యుంటివే చంద్రవదన ? 108

క. మా యాశ్రమము పవిత్రముఁ
జేయుట కిటువచ్చితివి ; విశేషంబయ్యెన్
నీ యాత్మేశ్వరు నిఁక నెడఁ
బాయక శేషాచలంబుపై నుండు సిరీ !' 109

## వ్యూహలక్ష్మి హరికి దివ్యకమలముపైఁ బ్రసన్న యగుట

క. అని యివ్విధమునఁ జెప్పఁగ
విని సిరి యా కపిలగురుని వీడ్కొని వేడ్కన్
తన యోగమహామహిమం
బును బెంచుచు లేచి లోకపూజ్యతకొఱకై. 110

సీ. పూర్వాంగమునకుఁ దపోనిష్ఠఁ బుట్టించి
యందుంచి, దివ్యదేహంబుఁ దానుఁ
బ్రత్యేకముగఁ దాల్చి పద్మనాళంబులోఁ
జొచ్చి యా దారిలో వచ్చి వచ్చి
పైన వెల్గుచునుండు పద్మకర్ణికయందుఁ
జేరి సుఖాసనాసీనయగుచుఁ
గ్రొక్కాఱుమెఱుపులు గుమిగూడి విగ్రహం
బై నిల్చినట్టు లయ్యబ్జమందు

తే. శ్రీరమాదేవి యున్న , నీక్షించి విష్ణు
దేవుఁ డానందజలధిలోఁ దేలి సిరినిఁ
జూడ , నా లేమ హరిమోముఁ జూచి సిగ్గు
చేతఁ బల్కక తలవాంచి చింతనొంది. 111

సీ. తన మదిలోఁ దాను తలఁచె నిట్లని లక్ష్మి
' నాకతంబున నిందు నా విభుండు
తపసియై, ఘనజటాధారియై , తా నిరా
హారియై భోగంబులన్ని విడిచి

యీ రీతిగా నుండు వైరాగ్యవిగ్రహం
బిటు చూడవలసె నింకేమి సేతు ? '
నను చుఁ జింతింపఁగా , నా లక్ష్మిభావంబు
భావించి విలసితాభరణములను

తే. గనకచేలము, శంఖచక్రములు దాల్చి
నీలమేఘనిభాంగుఁడై నిలిచియున్న ,
హరిని శ్రీదేవి చాల మోహమునఁ జూచు
చుండఁగాఁ జక్రి తలవాంచి యూరకుండె. 112

సిరి తనుఁ జూచుచున్నపుడు శీర్షము నేలకు వంచి లజ్జతో
నరమరఁజేయుచున్న పతి నంబుధికన్యక చూచి సిగ్గునన్
మఱల శిరంబు వంచి యనుమానమునం దనుఁ జూడకుండఁగా
హరి కమలాలయాననము నప్పుడు మోహముమీఱఁ జూడఁగన్. 113

క. కందర్పుఁడు మదిని భయం
బొందక , సిరి నెదకుఁ బిలువకున్నాఁడని గో
విందుని మదిలోఁ జొరఁబడి
సందడిసేయుచును బుష్ప శరములఁ గ్రుచ్చెన్. 114

సీ. అప్పుడు గోవిందుఁ డళికియు నళుకక
ధీరుఁడై శ్రీరమాదేవి తొలుతఁ
దనుఁ జూచి మాట్లాడినను దాను మాట్లాడ
వలెనంచు శిరమరవాంచియుండె
హరి పిల్చినపుడు మాట్లాడెదనని లక్ష్మి
కమలంబుపై నిల్చి కదలకుండె
బ్రహ్మ రుద్రాదు లా భావముల్ భావించి
తమ వాహనము లెక్కి తరలి వచ్చి

రమ్యతరమైన పద్మసరస్సు చెంతఁ
జేరి శుభవాద్యములను ఘోషింపఁజేసి
పుష్పవర్షంబు గురియించి పొగడి వారి
కిర్వురకు భక్తితో మ్రొక్కి యిట్టు లనిరి. 115

**దండకము :**

శ్రీమత్పరంధామ ! జీవావళిస్తోమ ! శ్రీమానినీలోల ! శృంగార సల్లీల !
కందర్పలావణ్య ! కంజోద్భవాగణ్య ! షాడ్గుణ్య సంపన్న ! సంరక్షితాపన్న !
సత్యవ్రతాచార ! సాధువ్రజోద్ధార ! సారాంబుదశ్యామ ! సంపూర్ణ సత్కామ!
వేదాంత సంచార ! విశ్వంభరాధార ! శ్రీవేంకటాద్రీశ ! సచ్చిత్ప్రకాశా ! పరాకాశ!
లోకేశ ! వాగీశగౌరీశనాకేశవంద్యాంఘ్రిపద్మద్వయా ! నిత్యసత్యా2ద్వయా !
సద్దయాసాంద్ర ! యోగీంద్రహృత్పద్మ భృంగా ! శుభాంగా ! సుచారిత్ర !
మిత్రాబ్జనేత్రా ! ధరిత్రీకళత్రా ! మహోల్లాస ! దాసప్రియా ! శ్రీనివాసా !
మమున్ సత్కృపం జూడు మో తండ్రి ! తర్గొండవాసా ! నృసింహా !
హృతాంహా ! నమస్తే నమస్తే నమస్తే నమః.

116

క. అని మ్రొక్కుచు హరి నిటువలె
వినుతింపుచుఁ బద్మమందు వెలిఁగెడు లక్ష్మిం
గనుఁగొని బ్రహ్మ శివాదులు
వినయముతో నిట్టులనిరి విశ్వాసమునన్. 117

సీ. క్షీరసాగరజాత ! చిత్తసంభవ మాత !
ప్రథితగుణోపేత ! భాగ్యదాత !
యమృతాంశు సోదరి ! యార్తిదోష విదారి !
నవ్య సుందరి ! సదానందలహరి !

బహుభక్త పరిపాల ! పాపకర్మ విఫాల !
హిత సర్వమూల ! సంతత సుశీల !
కనకపంకజ వాస ! కమనీయ దరహాస !
వదన మహోల్లాస ! వరవిలాస !

తే. లక్ష్మి ! నీస్వామి వక్షస్స్థలంబునందుఁ
జేరి శేషాద్రిపై భూప్రసిద్ధముగను
వెలసి మామీఁద సత్కృప నిలుపవలయు '
ననుచుఁ బ్రార్థించి వారిట్లులనిరి మరల. 118

సీ. 'పరఁగఁ గార్తికశుద్ధపంచమీ భృగువార
ముత్తరాషాఢ గావున దినంబు
మంచిది , శుభమైన మైత్రతారను జక్రి
వక్షస్స్థలముఁ జేరవలయు నిపుడు
తడవేల?'యనుచు విధాతయు , రుద్రుండు
విన్నవించిన , మహావిజయలక్ష్మి
పలుకకుండినఁ జూచి బ్రహ్మదేవుఁడు భృగు
సంయమీంద్రునిఁ గనుసన్నఁ జేసె,

తే. నపుడు భృగుముని సిరిపాలి కరిగి మ్రొక్కి
' మాతృదేవత ! నా తప్పు మఱచి , యిప్పు
డైన నే నీకుఁ బుత్రుండనంచు నెంచి
హరి యురంబున నిల్వు మా యమ్మ ! ' యనుచు. 119

క. బహువిధముల వినుతింపఁగ
సహజ జ్ఞానమున , నధిక సంతసమున శ్రీ
మహిళామణి భృగుమౌనిని
విహితంబుగ నాదరించి వేడ్కగ ననియెన్. 120

క. 'ముని ! నీ దృఢతరభక్తియు
ననుపమ ధైర్యమును మెచ్చి,తల సత్త్వగుణుం
డన(దగు నా దేవునిపై
నను మానమునొంది దూర మరిగితినయ్యా ! 121

సీ. నా రజోగుణమున కా రీతి కా(గల
గతి జతగూడిన కారణమున(
బ్రాణేశు నెడ(బాసి పరదేశినై యుండు
టొక్కటి , విభునిచే నుగ్రతపము(
జేయించు టొక్కటి సిద్ధించె ; నందుచే(
గాల మెంతటివారు గడవలేరు
నీతప్పు గాదది , నా తప్పు గాదిది
కపటనాటకసూత్ర కరు(డు నైన

తే. చక్రి సేయు వినోదముల్ చక్రి కెఱుక '
యనుచు భృగుముని నందు వీడ్కొని ముదమున
నవల హరి పాదపద్మంబులందు దృష్టి(
బెట్టి చూచుచు భక్తియుం బ్రేమమీఱ. 122

## బ్రహ్మాదులు వినుతింప(గా వ్యూహలక్ష్మి శుభలగ్నమున వేంకటేశ్వరుని వక్షము నలంకరించుట

క. పుత్తడిబొమ్మ విధంబున
నత్తన్వి సువర్ణపద్మమందుండి , ' విభుం
డెత్తి యురంబున నిడుకొను
నిత్తఱి'నని తల(చి కదలకిందిర యుండెన్. 123

చ. వనజజ శంభు లిద్దరును వార్ధితనూభవమోము( జూచి త
న్మనమున నుండినట్టి యనుమానము తాము గ్రహించి,పద్మలో
చనునకు మ్రొక్కి, యిట్లనిరి ' సాగరకన్యక నెత్తి వక్షమం
దొనర(గ నుంచుకోవలయు నో జగదీశ !'యటంచు( బల్క(గన్. 124

చ. విని హరి నవ్వి యిట్లనియె ‘ వింతగఁ జూచుచు నుండనేల ? య
వ్వనధిజ కెల్లకాలము నివాసముగాఁ దగినట్టి నా యురం
బున నిఁకనైన నిల్వు’మని పొందఁగఁజెప్పుఁడు మీర లిప్పు’డ
న్నను , విధి రుద్రు లిద్దరు మనంబున సంశయమొంది వేడుకన్. 125

తే. పలికి రిట్లని ‘ దేవి ! నీ ప్రాణవిభుని
వక్షమునఁజేరియుండఁగావలయు నిపుడు
మంచిలగ్నము గనుక తామసముఁజేయ
వల’దని విన్నవింప , నవ్వనధికన్య. 126

సీ. ఘలుఘల్లురని కాళ్ల గజ్జెలందెలు మ్రోయ
మొలనూలిఘంట లిమ్ముగ నటింపఁ
జెలువగు బంగరంచుల నొప్పు తెల్లని
చీర కుచ్చులు చాల సిస్తుమీఱ
రహినిఁ జందురుకావి అవికెలో బంగారు
గిండ్లచందమునఁ బాలిండ్లు మెఱయ
జారుకొప్పునఁ బూల సరులు చిందులు ద్రొక్క
ముంగురుల్ నుదుటిపై ముద్దు గుల్కఁ

తే. గర్ణకంఠాభరణ , కరకంకణములు
వరశిరోభూషణంబులు , సురుచిరంబు
లైన సందిటిదండలు , హారములును
విలసితాంగములను జాల వెలుఁగుచుండ. 127

సీ. భాసుర నాసికాభరణంబుతోఁ గూడి
బింబాధరము కాంతి పిక్కటిల్ల
దిద్దిన కస్తూరితిలకంబుతోఁ గూడి
నిటలతటద్యుతుల్ నివ్వటిల్ల

నెలవంక బొమలును, నేత్రాంజనము సరి
గా సొగసై నీలకళల నీనఁ
బరిమళ గంధలేపనముతో నెనసి స
త్కుసుమ సౌరభము దిక్కులను నెఱయ

తే. హంసగతి నొప్ప మథితదుగ్ధాబ్ధినుండి
వెడలి మును వచ్చి హరిఁజేరు విధముగాను
రమ్యతరమైన పద్మసరస్సు వెడలి
శ్రీరమాసతి పతిచెంతఁ జేరినిలిచి. 128

క. మును తనకు నివాసంబై
ఘనమగు హరి వక్షమందుఁ గరములతోఁ జం
దన మలఁది మహామోహం
బును, భక్తియుఁ బెనఁగొనంగ ముచ్చటమీఱన్. 129

సీ. తులసీదళంబులు, దూర్వాంకురంబులు
మల్లెపువ్వులును, జేమంతిపూలు
మొదలైన విరులతో ముచ్చటగాఁ గట్టి
నటువంటి ఘనపుష్పహార మొకటి
కరములతో నెత్తి కంకణంబులు మ్రోయ
హరికంఠమందుంచి, యచట నిలిచి
యున్న లక్ష్మినిఁ జూచి మన్నించి రెండుహ
స్తంబుల నెత్తి వక్షంబుపైనిఁ

తే. జక్రధరుఁ డుంచికొనియె; నా సమయమందు
వారి శిరములపైఁ బుష్ప వర్షములను
దొడరి గురియించి దేవదుందుభులు మొఱయఁ
జేసి జిష్ణుఁడు హరిచెంతఁ జేరి మ్రొక్కె. 130

సీ. ఆడిరి రంభాదు లంబరంబున నిల్చి
పాడిరి గంధర్వపతులు , సతులు
తుంబురు నారదాదులు వీణలను మీఁటి
గానముల్ చేసిరి , కశ్యపాది
మునులును, దేవతల్ మొదలైన భక్తులు
నిగమాంత సూక్తులఁ బొగడి రపుడు
శైలజయును , సరస్వతి మంగళారతు
లిచ్చి సేసలు చల్లి ; రీశ్వరుండు

తే. జలజజుండును సంతోషకలితులగుచు
వేడ్కగాఁ దాపసులఁగూడి వేదఘోష
ణములు గావింప విష్ణుఁ డానందమొంది
గరుడవాహన మెక్కి శ్రీకాంతతోడ. 131

వ. అప్పుడా బ్రహేంద్రాదులు ' మహాలక్ష్మి యుదయించిన యా పద్మసరస్సులో నిట్టి కార్తీకశుద్ధపంచమీదినమందు స్నానంబులు చేసినవారలు లక్ష్మీకటాక్షార్హులై సుఖంబు లనుభవించి ముక్తులగుదు'రని తత్తీర్థంబు నంద అన్నివిధంబులఁ బ్రస్తుతించి మ్రొక్కి , శిరంబులను బ్రోక్షించుకొని తమ తమ వాహనంబులెక్కి రప్పు డా లక్ష్మీనారాయణులు వారలం దోడ్కొని వేంకటాచలారోహణంబు చేసి, వరాహస్వామి యనుమతంబున విష్వక్సేనాది పరమ భాగవతు లలంకరించియున్న నిజనివాసముఁ జేరి ; రప్పుడు పద్మావతి సకలభూషణాంబరాలంకృతయయి తదానందనిలయంబులోఁ బ్రవేశించి హరికి , సిరికి నమస్కరించె ; నప్పు డప్పద్మాలయ పద్మావతిని దీవించి, చెంత నుంచికొని , వకుళ నాదరించి , యిచ్ఛామాత్రంబున సకల పదార్థంబుల నాకర్షించి బ్రహ్మాదులకు విందుఁ జేయించి, వస్త్రాభరణ,చందన, పుష్ప,ఫల,తాంబూలంబు లందఱికి నిప్పించి యాదరించె : నప్పుడు వారలందఱు సంతుష్టాంతరంగులై వినుతించి

మ్రొక్కి, లక్ష్మీనారాయణాజ్ఞాధారులై నిజనివాసంబుల కరిగి ; రంత వేంకటేశ్వరుఁడు లక్ష్మీపద్మావతీ సమేతుండై సుఖస్థితి నుండి, యట నొక్కనాఁడు వినోదంబుగా సిరినిఁ జూచి యిట్లనియె. 132

## ఆనందనిలయములో లక్ష్మీ వేంకటేశ్వరులు వినోదముగా సంభాషించుట

తే. 'శ్రీరమాదేవి ! నీవు వచ్చిన కతమున
నాకు సంతోషమయ్యె , నానాఁడు ధనదు
చేతఁ దీసిన ఋణముఁ దీర్చెడి యుపాయ
మేమి ? నా కిప్డు దెలిఁగించు మిందువదన ! ' 133

క. అనుచు వినోదంబుగ నా
వనజాక్షుం డడుగ , నపుడు వనజాలయ యి
ట్లనె ' ఋణము చేయునప్పుడు
నను నడిగితివే?'యటంచు నగి , మఱి పలికెన్. 134

మ. 'అనఘా ! పెండ్లికి నేను వచ్చినపు డిందర్థంబు లేదంచుఁ జె
ప్పినఁ దప్పే?మటు చెప్పినన్ ధనము నేఁ బ్రేమంబుతో నియ్యనే ?
నను నీవప్పుడు తేరఁజేసి ధనదున్ ' నా పెండ్లి కీ వర్థ మి '
మ్మని యాచించి ఋణంబుఁజేయు పని కేమందున్ జగన్నాయకా! 135

క. అపు డరమరఁ జేయఁగఁ గద
కపటాత్ముఁడవనుచుఁ దెలిసి కరవీరపురం
బుపముగఁ జేరి , యటావలఁ
జపలతఁ బాతాళమునకుఁ జనుట మహాత్మా ! ' 136

ఉ. నావుడు విష్ణుఁడిట్లనియె ' నన్నెడఁబాసిన జాలిచేతనే
నీ వతిచింతనొందఁగను , నేను ముదంబునఁ బెండ్లి కర్థమున్
గావలెనంచు నిన్నడిగి కైకొన బుద్ధెటు పుట్టు ? నో రమా
దే !యిది తప్పు చేసి ననుఁదేరగఁ జూడకు మంచుఁ బల్కఁగన్. 137

శా. ఆ మాటల్ విని లక్ష్మి యిట్లనియె ' నాఁ డా రీతి యయ్యెంగదా !
యా మీఁదం దడవైన వడ్డి బళువై హెచ్చుంగదా ! హెచ్చనీ
కీ మర్యాదను నిల్పు , కోరిన ధనం బీవేళ నే నిచ్చెదన్
స్వామీ ! వాని ఋణంబు దీర్పు'మనినన్ సంతోషసుస్వాంతుఁడై. 138

సీ. హరి యిట్టులనె ' నీ మహామహిమంబు నే
నెఱుఁగనే ? ముని క్రొత్తయే తలంప ,
నిపుడు కుబేరున కీ వర్థ మీనేల ?
నానాఁటి వడ్డి నిర్ణయముగాను
గ్రమముగా నిచ్చుచుఁ గలియుగాంతంబునం
దంతయుఁ దీర్చి విశ్రాంతి నొంది
వైకుంఠపురిఁ జేరవచ్చు , నంతకు శేష
శైలమందుండి భూజనులనెల్లఁ

తే. బాలనముఁజేసి వారి పాపముల నింకఁ
బరిహరింపుచు రక్షించు పనులు చాలఁ
గలిగియున్నవి గనుక , శీఘ్రముగ నప్పు
తీర్పఁబనిలే , దదేలన్నఁ దెలియ వినుము. 139

సీ. కలియుగంబునఁ బాపకర్మంబు లొనరించు
ప్రజలు రోగాది తాపత్రయములు
కలుగఁగా, వెఱచి తత్కాలంబులను నన్నుఁ
బేర్కొంచుఁ బలుమొఱల్ బెట్టునపుడు
వారి యాపదల నివారించి ప్రోవక
నే నూరకుండుట నీతి గాదు
కనుక నా నరుల దుష్కర్మముల్ వారి ద్ర
వ్యంబుపై నాకర్షణంబు చేసి

తే. వచ్చు నాపదలను దీర్చి , వారి ధనము
నేను గొండకుఁ దెప్పించి నిస్పృహుండ
నగుచుఁ దత్పాపరూపమైనట్టి ద్రవ్య
మజ్జజనముల కిప్పింతు నచలమతిని. 140

తే. ఇలను బుణ్యాత్ములైనవా రిచ్చినట్టి
ధనము నేఁ గొంత గైకొని , ధనదునకును
గొంత వడ్డికిఁ జెల్లించి వింత లీలఁ
జేయుచుండెద'ననుచు మచ్చికను బలికె. 141

సీ. మరల నిట్లనె ' నో రమాదేవి ! ద్రవ్యంబు
నెల్లవారికిని నీ విచ్చుచుండు ,
మా ద్రవ్య మిచటి కే నాకర్షణము చేసి
సుజన దుర్జనుల కిచ్చుచుఁ గ్రమముగ
నా ప్రభుత్వము నిందు నడిపించుకొనుచు నీ
కలికాల మీరీతిఁ గడుపవలయు ;
నందుచే ధనపతి కప్పిప్పుడే తీర్పఁ
దగదని కలియుగాంతంబు గడువు

తే. పెట్టి వ్రాసిన వ్రాఁత కుబేరు చెంతఁ
జేరినది , దాని నిప్పుడే చెఱుపఁదలఁప
నేల ? వానికి మొద లీయనేల ? యనుచుఁ
దలఁచితిపు'డన్న , శ్రీరమారమణి పలికె. 142

క. 'దేవా ! మీ చిత్తమునం
దీ విధమునఁ దలఁచియుండి , ' యీ ఋణ మిఁక నే
నే విధమునఁ దీరుతు?'నని
యా వేళ వినోదలీల నడిగిన దేలా ? ' 143

క. అనుచు రమాసతి యడుగఁగ
విని హరి యిట్లనియె ' నీవు విత్తము ప్రజకున్
ఘనముగ నిచ్చిన , నది గై
కొనియెదనని నిన్ను వేడుకొంటిని లక్ష్మీ ! ' 144

వ. అనిన విని లక్ష్మి యిట్లనియె. 145

వ. 'మనమలరఁగ నే ద్రవ్యం
బనఘా ! నీ కిత్తుఁ దీర్పుమా ఋణమనినన్
వినక , పరస్పరముగ భూ
జనులకు నన్నియు మనెడి సరణినిఁ జెపుమా!' 145

సీ. అనుచును మరల నిట్లనియె ' నో ప్రాణేశ !
కలియందు నరు లతికఠినహృదయు
లగుచు దానములు సేయరుగాన , జన్మ జ
న్మాంతరంబుల దరిద్రాంశ నొంది
నశియింతు ; రటువంటి నరులకు ధనము నీ
వీయుమటన్న నే నీయలేను
వరద ! నీ కెంత ద్రవ్యంబైన నిచ్చెద
నీవె వారల కిమ్ము నెనరుమీఱ '

తే. ననఁగ హరి యిట్టులనియె ' మోక్షార్హులైన
వారలకు ముక్తి , కోరికల్ కోరి పుణ్య
కర్మములు చేయువారి కా కర్మఫలము
నిచ్చి రక్షించు పనులు నా కిష్ట మతివ ! 147

సీ. కలుములచెలి నీవు గావునఁ గలుము లి
చ్చెడు పని నీ వంతు , చెలఁగి వారి
మెండు దూకల నాక్రమించి యాపదల ని
వారించి , సంతాన వరము లిచ్చి

సంతసించుటకు నా వం'తని పల్కఁగా
హరిని వీక్షించి యిట్లనియె లక్ష్మి
' మనుజులు దానధర్మ పరోపకారముల్
జేయరు , వారికి సిరుల నొసఁగు

తే. టేల ? వారవి దెచ్చి నీ కిచ్చుటేల ?
ధనము గల్గఁగనే దంభ , దర్ప , లోభ
ములను బెంచుదు ; రా ద్రవ్యమును నిజముగ
నీకుఁ దెచ్చి యిత్తురె ? వారు నీరజాక్ష ! ' 148

వ. అనిన విని నవ్వి హరి యిట్లనియె. ' లక్ష్మీ ! నీవు చెప్పినట్లు కలియందుఁ బుట్టిన నరు లట్ల లోభులగుటకు సందియంబు లేదు , నిక్కంబగు ; నందొక్క యుక్తి గల , దది యెట్లంటేని నీ జనులు పాపంబులు సేతురు. అందున రోగాది బాధ లనుభవింతురు. అట్టి సమయంబుల నన్నుఁ దలంతురు. అప్పుడు నేను వారి స్వప్నావేశంబులందుఁ బ్రత్యక్షంబై వారి కలిమికొద్దిగా ముడుపు లెత్తించి , యా స్వల్పవిత్తంబునకు విస్తారంబుగా వడ్డి పెరుఁగ నిచ్చి , ప్రతి వత్సరంబును వారిని దండించి యీ వేంకటాద్రికిఁ దోడ్కొని వచ్చి , వారు దెచ్చిన ద్రవ్యంబు నీక్షించి పుణ్య , పాప విత్తంబుల నేర్పరించి , సుజన , దుర్జనులకుఁ బంచిపెట్టించి, ' నాకు సంతర్పణంబుఁ జేయుం'డని యాజ్ఞయుంచి , వారిచేత నన్నదానంబులును జేయింపుదు; నందున వారు ద్రవ్యాన్నదానంబులు చేసినవారగుచుందురుగావున , వారు చేసిన స్వల్పదానంబైన నధికంబుగా నెంచి నీవు వారికి ధనధాన్యంబుల నిచ్చుచుండవలయు. నేను వారికి నయభయంబులఁ జూపి తద్ద్రవ్యాన్నంబు లిచ్చుటికిఁ దెప్పించి , వారిచేత దానంబులు చేయింపుచుండవలయు ; నీ వేంకటాద్రియందుఁ జేసిన దానంబులు స్వల్పదానంబులైన నధిక ఫలంబుల నిచ్చు , నందున నీ యుక్తిఁ జేసితి ; నీ యుక్తి చేయకుండినఁ గలిపురుషుండు

సకల ధర్మంబులఁ జెఱిచి , ప్రజల ననేక విధంబుల బాధించి రౌరవాది నరకంబులం ద్రోఁ ంచుఁగావున , మదంశసంభవులైన జీవులఁ గలికాలంబునం దీ ప్ర రంబుగా రక్షించుకొఱకై నే నీ వేంకటాద్రియందు నిలిచితి. నీవును నాకు సహాయ్యంబుఁజేసి , మదర్పణంబులు సేయుటకై ప్రజలకు భాగ్యంబుల నిచ్చుచుండుమని నిన్నుఁ బ్రార్థించితి. నీ విప్పుడే కుబేరుని యప్పు దీర్చితివేని , నే నిందు నిరుద్యోగంబుగా నుండవలయు ; నట్లూరకుండుట నాకు సహింపదు గావున , నీ విట్టి యుద్యోగంబు నా కొసంగు'మనిన విని నవ్వి లక్ష్మి యిట్లనియె. 149

సీ. 'ధన్యాత్మ ! నీతోడ దబ్బుఱాడఁగ రాదు
చెప్పెద నిప్పుడే సిద్ధముగను
మహియందు దాన,ధర్మ,పరోపకారముల్
చేసి , నీ కర్పణచేయుచున్న
వారికి ధన, ధాన్య,వరసంపదల నిత్తు ;
నందులో లోభపాపాత్ములైన
నరుల ధనంబులు నానాఁట నశియింపఁ
జేయుదు , నది వృద్ధిఁజేయ'ననుచు

తే. హరికి సమ్మతముగఁ జెప్పి , నరులకెల్ల
సంపదల నిచ్చుచుండె ; నా సమయమందు
సకల జనములు వేంకటాచలముఁ జేర
వచ్చి , ధనరాసు లా స్వామి కిచ్చి మ్రొక్కి. 150

వ. అదియునుంగాక నందా శ్రీనివాసార్పితంబుగా ననేకబ్రాహ్మణులకు సకల దానంబులు చేసి యిహపరసౌఖ్యంబు లనుభవింపుచుండి , రా శ్రీనివాసుండు సకలజనుల సకలవిధంబుల రక్షింపుచుండె ; ' నని దేవదర్శనుండు చెప్పిన, విని సంతసించి , క్రమ్మఱ దేవలుండిట్లనియె. 151

## శుక మార్తాండ సంవాదము

సీ. ' ఘన దేవదర్శనముని ! శుకాశ్రమమందుఁ
దపనీయచేలుండు తపముఁజేయు
నప్పుడా యోగీంద్రుఁ డందుండెనో , లేదొ ? '
యనిన దేవలున కిట్లనియె నతఁడు
'విను విప్ర ! హరి తపంబొనరింప కటమున్నె
బ్రహ్మపదానందభరితుఁడగుచు
శుకయోగిచంద్రుండు సూర్యమండలములోఁ
జొరఁబడిపోఁజూచి సూర్యుఁ డతని

తే. నిలిపి యిట్లని పలికె ' నో నిర్మలాత్మ !
నీకు గురుఁడైన వ్యాసుఁడీ లోకమందు
నిన్ను వెదకుచునుండఁగా , నీవు నింగి
కెగిరిపోవుట మేరగా దెట్లయనిన. 152

క. నీవాశ్రమ ధర్మములను
బోవిడిచి మహావిరక్తిఁబొందుట తగునే ?
దేవర్షి పితౄణంబులఁ
బావనమతివగుచుఁ దీర్చి పై కరుగుమయా ! 153

సీ. ఆదియందమరఁగా వేదముల్ చదివితి
వందుచే ఋషిఋణం బపుడు తీరె
సతి నింకఁ జేపట్టి సవనముల్ గావించి
ధీరుఁడవై తీర్చు దేవఋణము
పుణ్యాత్ములగునట్టి పుత్రకులను గాంచి
పెంచి గ్రక్కునఁ దీర్చు పితృఋణము
కొంకక ఋణవిముక్తుఁడవై , విరక్తుండ
వై , బ్రహ్మవేత్తవై ,యవల నిటకు

తే. వచ్చి నామండలము దాఁటి హెచ్చి పైకిఁ
క్రమముగాఁ బోయి , మీఁది లోకములు గడచి ,
పరమపదమును జెందుమో పరమమౌని !'
యనినఁ జెఱునవ్వు మెఱయ నిట్లనియె శుకుఁడు. 154

వ. మార్తాండ ! నీవు త్రిమూర్త్యాత్మకుండవై , కర్మసాక్షివై , జగచ్చక్షువై ప్రకాశింపుచున్న నీ చిత్తంబునకుఁ దెలియని యర్థంబు లే , దైన నా మనంబునఁ దోఁచిన యర్థంబు విన్నవించెద నెట్లన్నను , మాతృగర్భంబు సొచ్చి , దేహధారియై భూమియందుదయించిన దినంబు మొదలుకొని , యుదయాస్తమయ వ్యాజంబునఁ బురుషాయువును గాలంబు వంచించి కొనిపోవుచుండుంగావున , జలబుద్బుదంబన నిత్యంబుగాని దేహంబునందుండి చతురాశ్రమంబుల నడపి, దేవ,ఋషి,పితృసంబంధ ఋణంబులఁ దీర్చి జ్ఞాన,వైరాగ్యంబు లభ్యసింపవలయు నంటి ; రిది వేదోక్తకర్మమర్యాద యగుంగావున నాచరింపందగు ; నైనను దేహం బనిత్యంబైనందున ముముక్షుండైనవాడు కర్మారణ్యంబునందుఁ బ్రవేశింపఁ' డనిన శుకుం జూచి సూర్యుం డిట్లనియె. 155

శా. 'ఆదిన్ విశ్వము వృద్ధిఁజేయుటకుఁ బద్మాక్షుండు గల్పింపఁగా
వేదోక్తాశ్రమ ధర్మకర్మతతి భూవిఖ్యాతమై యుండఁగాఁ
గాదంచున్ విడనాడి నీ వెగిరిపోఁగావచ్చునే?'యంచు న
య్యాదిత్యుండు వచింపఁగా , శుకుఁడు నెయ్యంబొప్పఁగా నిట్లనెన్. 156

సీ. 'వనజాప్త ! విను సర్వవర్ణాశ్రమాచార
ధర్మంబులును , మోక్షధర్మములును
మాతండ్రి బోధింపఁగా , దత్త్వవిజ్ఞాన
మాత్మయం దుదయించె , నపుడె గురునిఁ

గాంచి యిట్లంటి నిష్కర్షగాఁ ' బ్రథమాశ్ర
మమున నాత్మవివేక మమరఁ గలిగి
నట్టివాఁ డావలి యాశ్రమధర్మముల్
విడువఁగావచ్చునో , విడువరాదొ ?

తే. తేటగా నిశ్చయము నాకుఁ దెలుపు 'డనుచు
నేనుఁ బ్రార్థింపఁగాఁ , జూచి నెనరుచేతఁ
జెప్పఁజాలక ' మిథిలేశుఁ జేరి యడుగు '
మనఁగ , నేఁబోయి జనకు నట్లడుగ , నతఁడు. 157

సీ. ననుఁజూచి పలికె ' నో మునివర ! విజ్ఞాన
మబ్బుటకై చతురాశ్రమములు
నడిపింపఁగావలె ; నాఁటిన జన్మజ
న్మాంతరవాసన నంటినట్టి
సదమలవిజ్ఞాన ముదయించినప్పు డా
శ్రమ ధర్మకర్మముల్ సల్ప , కపుడె
పట్టైన స్వస్వరూప , పరస్వరూపముల్
తెలిసి వర్ణాశ్రమాతీతుఁడగుట

తే. విహిత ధర్మం'బనుచుఁ జెప్పి వీడుకొల్పె ;
నదిమొదల్ గాఢవైరాగ్యమందుఁ బొంది
నట్టి నన్ను ' గృహస్థుఁడ వగు'మటంచు
వింతగా నిందు మీ రానతీయఁదగునె ? ' 158

చ. అని శుకయోగి పల్క , విని యంబుజమిత్రుఁడు నవ్వి యిట్లనెన్
' జనకుఁడు జ్ఞాన,కర్మముల సల్పుచు సర్వసమత్వమొంది , భూ
మినిఁ బరిపాలనం బెపుడు మెచ్చుగఁ జేయుచునుండి , బిడ్డలన్
గనినటువంటివాఁడు నిను గాఢవిరక్తినిఁబొందఁ జెప్పెనే ! 159

సీ. హరియందుఁ బద్మజుం , డజునియందు వసిష్ఠుఁ
డా మునినాథునియందు శక్తి
శక్తియందలఁ బరాశరుఁ , డా ఘనునియందు
వ్యాసుఁ డా వ్యాసునియందు నీవు
పుట్టి విరక్తినిఁ బొంది యూరక పోక
పుణ్యాత్ముఁడైనట్టి పుత్రు నొకనిఁ
గాంచి ధరిత్రిపై నుంచి వచ్చిన నిన్నుఁ
బోనిత్తు , నందాక పోవనీయ '

తే. ననుచు సూర్యుఁడు వల్కఁగా , నా శుకుండు
సమ్మతింపుచు నిజతనుచ్ఛాయ నొక్క
పుణ్యపురుషునిఁగా జేసి , బుద్ధి నిచ్చె
నప్పు డా పురుషుండు మహాత్ముఁడగుచు. 160

చ. శుకునకుఁ , బద్మమిత్రునకు సుస్థిరుఁడై ప్రణమిల్లి భక్తితో
ముకుళితహస్తుఁడై నిలిచి ముందర నుండఁగఁ , జూచి సూర్యుఁ డా
శుకముని యోగసిద్ధి కతిచోద్యము నందుచు సంతసించి , తా
నకుటిలచిత్తుఁడై , జనితుఁడైన కుమారునిఁ జూచి యిట్లనెన్. 161

క. 'మాయగ శుకముని దేహ
చ్ఛాయను బురుషుండవగుచు జనియించిన నీ
వీ యవనీస్థలి నరుదుగ
ఛాయాశుకుఁడనెడి పేరఁ జరియించుమయా ! ' 162

క. అని సూర్యుఁ డానతిచ్చిన
విని ఛాయాశుకుఁడు చాల వినయముమీఱన్
వినుతించి , యవల నా శుకుఁ
గనుఁగొని యిట్లనియెఁ జాల గౌరవమొప్పన్. 163

క. 'జనకా ! నన్ను సృజించిన
పనియే?మిపు డానతిచ్చి పంపుఁ'డటంచున్
వినయంబున మ్రొక్కినఁ , గనుఁ
గొని ఛాయాశుకున కా శుకుం డిట్లనియెన్. 164

సీ. 'పుణ్యాత్మ ! నీవింక భూలోకమున కేఁగి
శ్రీవేంకటాద్రి దక్షిణముగాను
ముఖ్యమైన సువర్ణముఖరికి నుత్తర
తటమున వెల్గు సిద్ధస్థలమున
మహిమనొప్పు మదాశ్రమమునందు నీవుండు ,
మదిగాక శ్రీగంగ కరిగి , మాకుఁ
దండ్రియైనట్టి వేదవ్యాసముని నన్నుఁ
బేర్కొనినపు డతిప్రేమమీఱ

తే. నీవు నా రీతిగా నందు నిలిచి పలికి
చెలఁగి వారికి శుశ్రూషఁ జేసి , వారి
యనుమతినిఁ బెండ్లియాడి , నందనులఁ గాంచి
చెలఁగి సంతతి ధర వృద్ధిఁజేయుమయ్య ! 165

తే. ఇపుడు ముందుగ శ్రీకాశి కేఁగి , యచట
నచలభక్తిని బాదరాయణునిఁ గొన్ని
వత్సరంబులు గొలిచి , యవ్వల మదాశ్ర
మస్థలంబునఁ జేరు కుమార ! ' యనుచు. 166

## శుకుఁడు సూర్యతత్త్వమును వివరించుట

సీ. వానికి నియమించి వసుధకుఁ బంపించి
పంకజాప్తునిఁ గాంచి పలికె నిట్లు
' మార్తాండ ! నీ కృపామహిమచే సుతుఁ డుద
యించె , నన్నింకఁ బోనియ్యు'మనిన

నగి సూర్యుఁ డిట్లనె ' నా స్వరూపంబగు
జీవతత్త్వం బెద్ది ? చెప్పు'మనఁగ
శుకుఁ డిట్టులనె ' జగజ్జ్యోతిస్వరూప ! నీ
చిన్మాత్రసత్తు నేఁ జెప్పగలనె ?

తే. నాకుఁ దోఁచినయంత నిర్ణయముగాను
మద్గురుని సత్కటాక్షసన్మహిమచేత
విన్నవించెద మదిని భావించి'యనుచుఁ
బద్మబాంధవునకు మ్రొక్కి పలికె మరల. 167

వ. 'మిహిరా! చిత్తగింపుము. ప్రకాశసుఖరస స్వరూప నారాయణపరబ్రహ్మంబను చిద్బిందువువల్లఁ బ్రణవస్వరూపంబైన శబ్దంబు పుట్టె , నా శబ్దంబువల్లఁ బయలైన నభంబునందు స్పర్శవలన వాయువు పుట్టె , నవ్వాయుగగన సంబంధముచేత నుష్ణరూపమైన తేజస్సు గలిగె , నందగ్ని పుట్టె , నయ్యగ్ని విస్తారమై ప్రకాశించి తనలో వ్యాపింపఁగా , నబ్బిందువు రసాత్మకంబైన సారమును మహాజలముగా సృజించి , తేజోరూపంబగు నప్పరమాత్మ తా నా మహాజలమందు నిలిచె ; నదియే హిరణ్మయంబైన తేజస్సై కొంత కాలంబునకు - నారికేళ వృక్షంబు ఫలంబులఁ బుట్టించుచందంబున - ననేకకోటి బ్రహ్మాండంబుల సృజించి , యా బ్రహ్మాండంబులలో - నొక్కవట బీజము వృక్షఫలంబులం దనేకబీజరూపంబై నిల్చినట్టుగా - మూలకారణంబయిన హిరణ్మయతేజస్సు సూర్యరూపమై , స్థావరజంగమాత్మకంబయిన జగత్తును దన రసాంశమువల్ల జీవమై పోషింపుచును, తేజోంశమువల్ల హరింపుచును - వటబీజము భూ,జల సంబంధముచేత వృక్షాకృతియై , వృక్షములో రసరూపమై నిలిచినట్లు - హిరణ్మయ తేజస్సు సప్తద్వీప , సప్తసాగర , సప్తకులాచలాధారంబయిన బ్రహ్మాండముగాఁ బరిణమించి సూర్యరూపమై నిలిచియున్నది. ఆ స్వరూపమే సకలభూతములయందును రసరూపమైన జీవంబగు , నా రసమందే తైలవర్తియందు జ్వాల వెలిఁగినట్టుగాఁ దెలివి వెలుఁగుచుండు,

నా తెలివి యేదన్నను జెవుల వినిన శబ్దంబులను , జర్మంబువలనఁ దెలియు స్పర్శంబులను , గన్నులవలనఁ జూచు రూపంబులను , జిహ్వచేత గ్రహించిన రుచులను , ఘ్రాణంబువలన నాఘ్రాణించిన గంధంబులను , గర్మేంద్రియవిషయంబులైన వచన,నాదాన,గమన,విసర్గ , నానందంబులను, మనోబుద్ధి చిత్తాహంకార విషయంబులైన సంశయ, నిశ్చయ, విచార , కర్తృత్వంబులను దెలియు నెఱుకే చిన్మాత్రంబైన స్వరూపంబగు ; నింకఁ బరస్వరూపం బెద్దియన్నను వ్యష్టిసమష్టి రూపంబులైన పిండాండ , బ్రహ్మాండంబులయం దేకరూపంబై , యావ్యష్టిసమష్టి రూపంబులందు - మేఘమండలమందలి జలమే వర్షించి భూమియందున్న వాపీకూపతటాకాదులయందు నిలిచినట్టుగా - నీశ్వరచైతన్యంబను మేఘజలంబు జరాయుజాండజోద్భిజ్జ స్వేదజంబులను చతుర్విధ భూతములయందు నిల్చియుండు'ననిన భాస్కరుం డిట్లనియె. 168

తే. 'ఆ హిరణ్మయతేజ మీ యఖిలభూత
వితతులం దే విధమునఁ బ్రవేశమగును ?
మరల స్వస్థానమం దే క్రమమునఁ జేరు ?
నా సరణిఁ దెల్పు బాదరాయణకుమార !' 169

వ. అనిన శుకుం డిట్లనియె. 170

సీ. 'కమలజాండమును బ్రకాశింపఁజేయుచు
రమణీయవిశ్వకారణమునైన
మహితహిరణ్మయమండలం బధిక తే
జోరసాత్మకమై , విశుద్ధమయ్యె ;
నందు రసాంశమే యమృతాంశురూపమౌ ,
నది కాలవశమున ననిలమగుచుఁ
దా మేఘమగుచుఁ జంద్రరసాత్మకంబైన
జలముచేఁ బూర్ణమై చల్లనగుచు

తే. వర్షధారలు నిండింప వసుధమీఁద
సస్యములు వృద్ధిఁబొందు , సస్యములయందు
సారతరమైన ఘనజీవసత్తు నిలిచి
ధాన్యమై మర్త్యతతుల కోదనము నగును. 171

వ. మఱియుఁ దృణరూపమై పశువుల కన్నంబగు , వివిధఫలరూపంబులనొంది విహంగాది జంతువుల కన్నంబగు , వాయురూపంబై సర్పాదుల కన్నంబగు, నయ్యన్నంబు తత్తద్భూతములయందున్న జఠరాగ్నివల్లఁ బచనమై పాలలో ఘృతంబు పైకిఁదేలినచందంబున బిందురూపమై పురుషులయందు నిలిచి, స్త్రీగర్భంబులందుఁ జొచ్చి పిండరూపంబగుఁ , దత్తత్పిండంబులయందు జరాయు సంబంధమువల్ల , మాతృధాతు సంబంధమువల్ల నాఱు నెలలకు వహ్ని దా నందుఁ బ్రకాశించుకరణిఁ జైతన్యంబు దీపించు, దదనంతరంబునఁ గాలకర్మపరిపూరితంబైన తఱి నుదయించు. మఱియు నవ్వర్షజలంబే వృక్షాదులందు రసాత్మకమై జీవనంబగు. ఇది యుత్పత్తిప్రకారం, బింక లయప్రకారంబెట్లన్నను వాతపైత్యశ్లేష్మాది రోగంబులవల్ల భూతంబులు లోఁబడినప్పుడు పల్లముల నిలిచిన వర్షజలంబుల సూర్యకిరణములు పీల్చుకరణిఁ గాలస్వరూపమైన సూర్యుఁడు సర్వభూతములయందలి జీవరసంబుఁ బీల్చిపోవు , నప్పు డా రసస్వరూపంబు సూర్యకిరణములలో మిళితమై, వాయుమండలమందేకంబై, గగనమార్గంబునఁ జంద్రమండలంబుఁ జొచ్చి, చంద్రుఁడు సూర్యునియందేకీభవించినప్పుడు సూర్యునియందుఁ జెందు ; నని మద్గురుండుపదేశించె'ననిన విని నవ్వి శిరఃకంపంబుఁ జేసి భానుం డిట్లనియె. 172

తే. 'దేవ రాక్షసముఖుల సుస్థితి , లయముల
వరుసగాఁ జెప్పు'మనఁగ నా వ్యాససుతుఁడు
జలజబాంధవు నీక్షించి సంతసించి
మరల నిట్లని పలికె సమ్మతముగాను 173

వ. 'దేవా ! వటబీజంబునకు, వ్రీహిబీజంబునకు భూసంబంధం బొక్కటియైనఁ గాని వ్రీహిపరిమాణంబు షణ్మాసంబులును, వటపరిమాణంబు సహస్రసంవత్సరపర్యంతంబు గల, దా ప్రకారంబుగా బ్రహ్మాదిదేవ శరీరములకును, మనుష్య శరీరములకును గాలభేదం బున్నది. ఆ హిరణ్మయుతేజస్సత్త్వాంశం బధికంబుగాఁగ నిలావృతఖండాది దేశములయందు దేవజాతు లుత్పత్తియై దీర్ఘాయుష్మంతులై వర్తింతురు. సామాన్య దేవజాతులకు సుధర్మావధియు, నింద్రాది లోకపాలురకు మన్వంతరావధియు, బ్రహ్మాదులకు బ్రహ్మాండప్రళయావధియుఁ గలిగియుండు; నంతటికి నాధారమై, సచ్చిదానందనిత్యపరిపూర్ణుండై, వాఙ్మనసాతీతుండైన నారాయణుండు ప్రకాశించుఁ; దత్ప్రకాశంబు నీవని నిశ్చయించియుందు'నని మఱియు సకలవేదాంతసార నిశ్చితార్థానుభవక్రమంబు విన్నవింప, విని సూర్యుఁడు శుకుంజూచి యిట్లనియె. 174

సీ. 'ఓ మహామౌనీంద్ర ! నిమనోదార్ఢ్యంబు,
యోగసిద్ధియుఁ దెలియుటకును జాల
నాక్షేపములు చేసి యడిగితి, నన్నిటి
కన్ని యుత్తరము లీ వనుభవముగఁ
జెప్పితి; వందుచేఁ జిత్తంబు రంజిల్లె
మహితాత్మ ! నీవు నామండలంబు
లోఁజొచ్చి వెడలి పైలోకంబులను దాఁటి
పట్టి పై నుండెడు పరమపదము

తే. నందుఁ బొందు'మటంచు నయ్యబ్జసఖుఁడు
చాల మన్నింపఁగా శుకసంయమీంద్రుఁ
డతులితానందరసమగ్నుఁడగుచు లేచి
దినకరుని మండలంబు భేదించి వెడలి. 175

వ. తదనంతరంబున నూర్ధ్వమండలంబుల , నూర్ధ్వ లోకంబుల నతిక్రమించి శుకుండు నిర్వాణపదంబు నొందె ; నంత ఛాయాశుకుండు కాశిఁజేరి వేదవ్యాసులకు వివిధశుశ్రూషలు చేయుచుండి , కొన్ని యబ్దంబుల కా కృష్ణద్వైపాయనుని యనుమతంబున శుకాశ్రమస్థలంబునందుఁ జేరి విప్రకన్యకను బాణిగ్రహణంబుచేసి సంతానంబు వడసె'నని దేవదర్శనుండు చెప్పిన , విని దేవలుం డిట్లనియె. 176

తే. 'శ్రీరమాదేవి పూర్వశరీరకలిత
యై తపము కపిలాశ్రమమందుఁ జేయు
చుండె నంటివి , మరల నీ యుర్విమీఁదఁ
జేరినటువంటి కథ నాకుఁ జెప్పుమయ్య !' 177

మ. అని యా దేవలమౌని తా నడుగఁగా నా దివ్య యోగీంద్రుఁ డి
ట్లనె ' నా దేవి సుశీలయై హృదయమం దా చక్రి నర్చింపుచున్
మన మా స్వామి పదారవిందములపై మగ్నంబుగావింపుచున్'
తన దేహస్మరణంబు లక జగమంతా విష్ణురూపంబుగన్. 178

క. భావింపుచుఁ గొన్నేండ్లా
శ్రీవనితామణి తపంబుచేయఁగ , నపు డీ
శ్రీవేంకటగిరినిలయుం
డా వెలఁదిని మెచ్చి , తలఁచె నపు డిట్లనుచున్. 179

సీ. 'తనుఁగూర్చి తొలుత నేఁ దపమాచరించితి
నని నన్నుఁగూర్చి యయ్యాదిలక్ష్మి
పాతాళమందే తపంబాచరింపుచు
ననుఁ జిక్కఁబట్టియున్నది , ధరిత్రి
పైకివచ్చుట కే నుపాయంబుఁ గావింతు'
నని వీరలక్ష్మి హృదబ్జమందు
వెలిఁగెడి తన రూపములను నచ్చట తిరో
ధానమొందింపఁగ , ధ్యాననిష్ఠ

చలనమొందిన , నప్పు డాశ్చర్యమొంది
కన్నుఁగవ విప్పిచూచి పంకరుహనాభు
నచటఁగానక చింతించి యపుడు లేచి
కపిలమునిపాలి కరిగి శ్రీకాంత నిలిచె. 180

క. అపు డా లక్ష్మినిఁ గనుఁగొని
కపిలమునీంద్రుండు చాలఁ గరుణను బలికెన్
చపలత్వరహితమగు నీ
తప మమలంబై ఫలించెఁ దామరసాక్షీ ! 181

క. ఇఁక నీ విందుండక చని
ప్రకటితశేషాద్రిదిగువఁ బద్మసరస్సం
దకుటిలమతివై చేరుము
శుకమునిసుతుఁ డందు నిన్నుఁ జూచి ముదమునన్. 182

## వీరలక్ష్మి పాతాళమునుండి వెడలి , మహావైభవముతో వచ్చి శుకాశ్రమమున నెలకొనుట

సీ. ఘనపాంచరాత్ర ప్రకారంబుగా నిన్నుఁ
బూజించు , నచటికే పొ'మ్మటంచుఁ
బలికి పంపింపఁగాఁ బాతాళమందున్న
శేషుండు లక్ష్మి నీక్షించి మ్రొక్కి
బహురత్నవిలసితాభరణాంబరంబులు ,
చందన, సుమదామచయము లొసఁగి
రమణీయమగు దివ్యరథములోఁ దగుసహ
స్రారహేమాబ్జంబునందు వెలుఁగు

తే. కర్ణికాపీఠమున నుంచి గజచతుష్ట
యంబుతో వీడుకొల్ప , నయ్యాదిలక్ష్మి
సంతసింపుచు మధ్యాహ్నసమయమునకు
ధరణి భేదించుకొనుచు మోదమున వచ్చి. 183

తే. మహిమతో నూటయెనిమిదిమంది సేవ
కజనులును జేరికొల్వఁగా ఘనతమీఱ
శేషపర్వతమునకు దక్షిణముగాను
గలుగు స్వర్ణముఖరి కుదగ్భాగమందు. 184

సీ. ఘనతరంగయుతంబు , గంగోపమానంబు
నలినకైరవ,కోకనదయుతంబు
భాసురమకరందపాన మత్తమిళింద
పటలవిహారంబు , పావనంబు
మత్స్య,కచ్ఛప,భేక,మకర,కుళీరక
వ్రాతనివాసంబు , శీతలాంబు
పరిపూర్ణ,మలఘుసోపానావృతంబు , సు
స్వాదుగంధాఢ్యమై జగతిమీఁద

తే. రమ్యమైయున్న పద్మసరస్సునడుమ
వెలయు నా వీరలక్ష్మి దా వెడలిరాఁగఁ
బారిజాతము లా లక్ష్మిపైన నించి
చెలఁగి జయజయశబ్దముల్ చేసి సురలు. 185

చ. పొగడుచునుండఁగా, జలధి పుత్రిక దివ్యశరీరకాంతు లీ
జగతిని నిండి దిక్కులను సాంద్రముగాఁ బ్రసరించి పిమ్మటన్
గగనము నావరింప , నది గాంచి గిరీశ్వరుండు దా
ఖగపతి నెక్కి యచ్చటికి గ్రక్కున వచ్చెఁ బ్రమోదచిత్తుఁడై. 186

క. అప్పుడు బ్రహ్మ శివాదులు
తప్పక నక్కడికిఁ బోయి తమ వాక్యతతుల్
గొప్పగ మొఱయంజేయుచు ,
నుప్పొంగుచు సిరిని లోచనోత్సవమెసఁగన్. 187

సీ. చూచుచుఁ గార్తీకశుద్ధపంచమి యుత్త
రాషాఢ భృగువార మమరఁగూడి
యున్ననాఁ డరుదుగా వ్యూహమహాలక్ష్మి
హరికి మున్ బ్రత్యక్షమయ్యె , నట్టి
విమలదినమునందె వీరలక్ష్మి ప్రసన్న
మయ్యె , నందఱి కీ మహాదినంబు
ముఖ్యం'బనుచు బ్రహ్మముఖ్యు లాలోచించి
ఫణిగిరీంద్రునిఁ జూచి పలికి రిట్లు

తే. ' దేవ ! యీ పుణ్యతీర్థమందే ముదంబు
వెలయఁగా వ్యూహలక్ష్మియు , వీరలక్ష్మి
వెడలివచ్చిరి గనుక నీ విమలతోయ
మవనిపైఁ బద్మతీర్థాఖ్య నమరియుండు. 188

వ. అటుగావున , నీ పుణ్యతీర్థంబులో నిట్టి శుభదినంబునందు స్నానంబుచేసినవారు పాపవిముక్తులై భాగ్యంబు లనుభవింతు'రని నిర్ణయించి , తా మందఱు స్నానంబులు చేసి , యప్పద్మతీర్థంబున కాగ్నేయభాగంబున దివ్యాలయంబు విశ్వకర్మచేత నిర్మాణంబుచేయించి , యా వీరలక్ష్మినిఁ బ్రార్థించి తోడ్కొనివచ్చి , సకలోత్సవంబులతో నాలయంబునందుంచి ఛాయాశుకునిచేతఁ బాంచరాత్రోక్తంబుగా సకలోపచారపూజలు చేయించి ; రందుఁ జక్రి తన కంఠమందున్న పుష్పహారంబు నవ్వీరలక్ష్మి కంఠంబునందుంచి , శుకాశ్రమంబు నగ్రహారంబు చేయించి ఛాయాశుకున కొప్పగించి , బ్రహ్మాదులకు విందు చేయించి, వస్త్ర,తాంబూలంబు లిప్పించి , సెలవిచ్చి వారినంపించి , వీరలక్ష్మితో నిట్లనియె. 189

సీ. 'పాలేటిపట్టి ! నీ ప్రథమశరీరంబు
కనుఁగొంటిఁ , గన్నుల కఱవుదీరె
నీ వ్యూహలక్ష్మితో నెనసి వేంకటశైల
మందుండవచ్చు , నీ వచటి కిపుడు
ర'మ్మన , నా రమారమణి చక్రికి మ్రొక్కి
పటుభక్తి దీపింపఁ బలికె నిట్లు
' నా ప్రాణనాయక ! నాకొఱకై నీవు
తపము చేసిన మహాస్థలము గనుక

తే. శ్రీకరంబైన,దీ శుకక్షేత్రమందె
నిలిచెదను ; నా హృదయములో నీవు నిలిచి ,
వ్యూహలక్ష్మి నురంబుపై నుంచికొనుము
నన్నిచట నుంచి రక్షించు నళిననాభ ! 190

క. నా కది సమ్మతమైనది
నీ కనుమానంబు వలదు , నీ ఘనకరుణే
యీ కాయమునం దుంచుచు
నా కనకాచలముఁ జేరు మబ్జదళాక్షా ! 191

తే. నేను రాలేదనుచు మది నీవు కొదువ
నుంచవల , దింక నేనె శ్రీవ్యూహలక్ష్మి
రూపమును దాల్చి వచ్చి నీ ఱొమ్ముమీఁదఁ
గుదురుగా నిల్చి; తిఁక నీకుఁ గొదువ యేల? 192

క. కరుణను బద్మావతి నం
దరమరలే కేలుచుండు , మహిగిరిపైకిన్
పరుషను రప్పించుచు ఘన
వరములఁ గృప నిచ్చుచుండు వార్ధిశయానా ! 193

సీ. సురుచిర కార్తీకశుద్ధపంచమి వచ్చి
నప్పుడు నీ పుష్పహార మొకటి ,
ప్రియమైన వస్త్రంబు ప్రేమతోఁ బంపించు
చుండుము , నిచట మహోత్సవముల
నంగీకరించి నా యాత్మలో వెలుఁగు నీ
కన్నియు నర్పించి , యచలమతిని
నిన్నుఁ జూచుచు నిందె నేనుండెదను , మీరు
శేషాద్రిమీఁద వసించియుండుఁ'

తే. డనుచుఁ బాదంబులకు మ్రొక్కె , నపుడు చక్రి
వీరలక్ష్మిని వీడ్కొని వేంకటాద్రి
చెంత నా వ్యూహలక్ష్మితో స్నేహమెసఁగఁ
గలిసి క్రీడించుచుండె నుత్కంఠ మెఱయ. 194

చ. అపుడు శుకాగ్రహారవరమందు శుకుం డతిభక్తిమీఱఁగా
నెపుడు మహోత్సవక్రమము లిందిర కచ్చట నాచరింపఁగా
నపరిమితంబుగాఁగలుము లందఱి కిచ్చుచుఁ బూజలందుచున్
విపులసుఖస్థితి న్నిలిచి వీరరమాసతి యుండె నచ్చటన్. 195

## బలరామ కృష్ణుల సంవాదము

సీ. అంతకు ముందుగా నాదిశుకుండందుఁ
జేరినప్పుడ భూప్రసిద్ధముగను
బల,కృష్ణమూర్తుల భక్తితో భావించి
యందుంచి పూజించి యతఁడు చనిన
వెనుక , ఛాయాశుకుండనెడు విప్రుఁడు పాంచ
రాత్రోక్తముగ రమారమణి నచట
నర్చింపఁ బరకాంతయగు లక్ష్మి హరిచెంతఁ
జేరియుండక యిందుఁ జేరె నిపుడు,

తే. నేనిచట నిల్చియుండుట నీతి గాదు
తిన్నగా లేచి యిప్పుడె తీర్థయాత్ర
చనుదు'నని సీరి లేచె , నా సమయమందుఁ
బట్టి కృష్ణుండు గూర్చుండఁబెట్టె నతని.

క. అప్పుడు కృష్ణునిఁ గని బలుఁ
' డప్పా ! కూర్చుండఁబెట్ట నర్థంబగునే ?
గొప్పై పరసతి వేడ్కగ
నిప్పుడు దా నిందు నిలిచె నింపుదలిర్పన్.

సీ. కావున నేను వేంకటగిరిపై కేఁగి
యందొక తీర్థంబు నాశ్రయించి
యుండెద'ననఁగ , ' నన్నొంటిగా నిందుంచి
యో యన్న ! పోనేల ? యుండుమిచట '
ననినఁ గృష్ణునిఁజూచి హలపాణి పల్కె ' నీ
వును రమ్ము నా వెంట'ననఁగఁ గృష్ణ
దేవుఁడిట్లనె ' రమాదేవి నిందొంటిగా
నుంచి నే వచ్చుట యుచితమగునె ? '

తే. యనుచుఁ గృష్ణుఁడు పలుకఁగా , హలధరుండు
మరల నిట్లనెఁ ' గరవీరపురముఁ జేరి
యొంటిగా నీ మహాలక్ష్మి యుండినపుడు
నీవు దోడుగ నుంటివె ? నిర్మలాత్మ ! ' 198

చ. అని హలపాణి పల్క , నపుడల్లన నవ్వుచుఁ గృష్ణదేవుఁడి
ట్లనె ' సిరి దవ్వుగా నిలిచినప్పటిరీతిఁ దలంపనేల ? యిం
దొనరఁగఁజేరియున్న, దిపు డొంటిగ నిచ్చట నుంచి నేనుఁ బో
యిన జనులైన నవ్వరె ? యహీంద్రగిరీశ్వరుఁడైన మెచ్చునె ? 199

తే. మనకు భయమేమి ? యిచట రమాలలామ
విభవములు చూచుచుందము వేడ్క నిలిచి '
యనిన , బలభద్రుఁ డా మాట విని భయమును
జెంది శ్రీకృష్ణదేవు నీక్షించి పలికె. 200

సీ. 'భృగుమునీంద్రునిఁ బూర్వ మగడు సేయుచుఁ బర
పురుషుండనుచు మది రికియుంచి
హరిఁబాసి కరవీరపురిఁ జేరి , పాతాళ
మున కేఁగి , విభునిచేతనె తపంబు
చేయించి , తపముఁదాఁజేసి యీ స్థలమందుఁ
జేరి యిచ్చట నిల్చె ; వీరలక్ష్మి
యనఁగాఁ బ్రసిద్ధయై హరివలెనే చతు
ర్భుజములతో మహాస్ఫురణ మెఱయ

తే. నిలిచినదిగాన , నే నిందు నిలువ వెఱతు '
ననిన దరహసితాస్యుఁడై యన్న మోముఁ
గాంచి కృష్ణుండు పలికె ' నో కామపాల !
శ్రీతరుణిమీఁదఁ గోదువ లెంచేది మేల ? 201

సీ. వైకుంఠపురమందు వరమృదుతల్పమై
యున్నతాకృతిని నీ వుండినపుడు
హరిఁగూడి నీమీఁద నానందముగ నుండు
నంతియకాని , నిన్నన్యుఁడనుచుఁ
దలఁచునె ? లక్ష్మి సీతాదేవియైనప్పు
డిలను లక్ష్మణుఁడవై యెల్లయెడలఁ
జరియించునపుడైనఁ బరుఁడంచు నీమీఁద
నరమర యుంచెనే?'యనిన బలుఁడు

తే. నవ్వి యిట్లని పలికె ' నానాఁడు సీత
యన్నమాటలు మఱపురాకున్న విపుడు
సిరిరజోగుణమును దలంచిన భయంబు
నామదినిఁ బుట్టుచుండు నో నందతనయ ! ' 202

క. అని తాలాంకుఁడు వలుకఁగ
విని కృష్ణుం డిట్టులనియె ' విశ్రవసుని పు
త్రుని రామునిచేఁ జంపిం
పను బనిగలుగంగ నట్ల పలికెఁగదన్నా ! 203

క. ఆ మాటలు మఱువక యిపు
డీమాడ్కిని లక్ష్మితప్పు లెన్నుచు , మదిలోఁ
బ్రేమము నుంచక కనరున
నీమహితాశ్రమము విడువనేమిటి కనఘా ! 204

తే. మించి సిరిమీఁద నిటు తప్పులెంచ కిపుడు
శాంతమును బొందుమీ ! శుకాశ్రమతలంబు
విడిచిపోవఁదగదని వివేకసరణి
నన్నతోఁ గృష్ణుఁ డేకాంతమాడుచుండె. 205

సీ. ఛాయాశుకుఁడు తన జనకుఁ డర్చించిన
రామకృష్ణుల, రమారమణి నచట
నర్చింపుచుండఁగా నపుడు కన్యామాస
మందు బ్రహ్మోత్సవం బద్రిమీఁద
సాగఁగా నటకేఁగి ఛాయాశుకుఁడు వీర
లక్ష్మిసేవకులైన లలితమతుల
మొనసి తానొక నూటయెనిమిది మందిని
హరియాజ్ఞవడసి వాహకులఁజేసి

తే. శుకపురముఁ జేరి రామకృష్ణులను,వీర
లక్ష్మి నర్చింపుచుండె సలక్షణముగ ,
నచట హరినిల్పినటువంటి యబ్జసఖునిఁ
జేరి వైఖానసులు పూజసేతు'రనుచు. 206

వ. ఇవ్విధంబున దేవదర్శనమందు దేవలునకుఁ జెప్పె'ననిన సూతుంజూచి శౌనకాదు లిట్లనిరి. 207

సీ. 'ఓ సూత ! శ్రీశ్రీనివాసుని శేషాద్రి
యందెవ్వరెవరు మున్నర్చనములు
చేసి , రా చందముల్ చెప్పఁగావలె'నంచు
నా శౌనకాదు లిట్లడుగునపుడు
విని సూతుఁడిట్లనె ' మునినాథులార ! మీ
రతిశయప్రశ్న నన్నడిగినారు
చెప్ప శక్యంబుగా,దిప్పు డా వ్యాసగు
రుండు నా జిహ్వయందుండి దయను

తే. బరఁగఁ బలికించినటుల నేఁ బలుకవలయు '
ననుచు వ్యాసుని ధ్యానించి యచలుఁడగుచు
శౌనకాదిమునీశ్వరసంఘములను
జూచి సంతోషచిత్తుఁడై సూతుఁడనియె. 208

సీ. ' వేంకటాచలమందు విధి,రుద్రముఖులకు
హరి తాను ప్రత్యక్షమైనయపుడు
కమలాసనుండు వైఖానససూత్ర క్ర
మంబుగఁ దా నర్చనంబుఁజేసి

మొనసి కన్యామాసమున రథోత్సవము గా
వించె, నా పిమ్మట విఖనసుండు
నర్చించె, నమ్మునియాజ్ఞచేత మరీచి
యర్చించె, నటుమీఁద నత్రి పూజ

తే. చేసెఁ, గశ్యపుఁడవల నర్చించె, భృగుఁడు
నంతఁబూజించె, ఫుల్లమహామునీంద్రుఁ
డవల నర్చించె, నట్టి సంయమికి శిష్యుఁ
లైన యక్షులు స్వాయంభువాఖ్య మనువు. 209

సీ. సమయంబునను సంధిసంవత్సరములతో
మొనయు ముప్పదికోటులెనుఁబదియును
నాలుగులక్షలు నలువదియెనిమిది
వేలయింటికి బ్రహ్మ విశ్వసృష్టిఁ
దాఁజేయ నూహించు ధ్యానకాలము కోటి
లలి మఱి డెబ్బది లక్షలగును,
నవి నఱువదియును నాల్గువేలబ్దముల్
గాక నిల్చిన యేండ్లు గణుతిసేయఁ

తే. గుదిరి యిరువదితొమ్మిదికోట్లపదియు
మూఁడులక్షలు నదిగాక మొనసి పైన
నెనుఁబదియునాలుగగువేల నెన్ని, లెక్క
చేసి, భాగించిచూడ విశేషమగుచు. 210

తే. ఇన్ని ముప్పదికోటులు నెనుఁబదియును
నాల్గులక్షలు నదిగాక నలువదెనిమి
దైన వేలేండ్లయింటికి నరసి చూడ
నందు బహుధాన్యవత్సరం బాదిగాఁగ 211

వ. అఱువదియెనిమిది చతుర్యుగంబులయింటికి నప్పటియీశ్వర నామాబ్దంబు వరకుఁ జతుర్యుగమొక్కింటికి సంవత్సరములు నలువదిమూఁడు లక్షల యిరువదివేలలెక్కను మహాయుగంబులు లోఁగడఁ జెప్పిన క్రమంబుగా నఱువదెనిమిదింటికి సంవత్సరము లిరువదితొమ్మిదికోట్లు ముప్పదియేడు లక్ష లఱువదివేలును వైఖానససూత్రక్రమముగా విఖనసబ్రహ్మకు శిష్యుఁడైన ఫుల్లమహామునికి శిష్యులైన యక్షులర్చించి రందు. 212

సీ. నలువొప్ప బహుధాన్యనామ సంవత్సరం
బాదిగా వైఖానసాగమోక్త
పద్ధతిన్ విఖనసబ్రహ్మసంతతివారు
నట కోటినలువదియాఱులక్ష
లెనుఁబదియును మఱి యెనిమిదివేలేండ్లు
చిరభక్తులై పూజచేసి రచట
మహిని స్వాయంభువమనుకాల మిన్ని యేం
డ్లయ్యె ; నీ క్రమముగా నబ్దసంఖ్య

తే. దనర స్వారోచిషుండు, నుత్తముఁడు, తామ
సుండు, రైవతుఁడును, జాక్షుషుండు ననెడు
పంచమనువుల కాల మేర్పఱిచి , సంధి
యబ్దములతోడ లెక్కింప నవనిమీఁద. 213

తే. నలువుగా నూటయేఁబదినాల్గుకోట్లు
నిరువదియురెండు లక్షలు నిదియుఁగాక
నొక్క నలువదివేలయేం డ్లొనరనయ్యె ,
నవల వైవస్వతాఖ్యమన్వంతరమున. 214

క. ఆ విధముగనే క్షితిపై
నా వేంకటశైలభర్త కానందముగా
నా వైఖానసు లిపుడును
సేవింపుచు నర్చనములు సేతురు ఘనులై. 215

తే. మరల నా లెక్క మనువుల కందఱికిని
జరుగు కాలము తారు భూచక్రమెల్లఁ
గ్రమము తప్పక తమతమ కాలములను
బాలనము సేతు'రని తాను బలికి , యవల. 216

సీ. 'జగతిపై దివ్యవత్సరములు నాల్గువే
లా కృతయుగమునం దమరి నడచు
నదిగాక తత్సంధియగు నెనిమిదినూర్లు ,
మొనసి త్రేతాయుగమునకు మూఁడు
వేలగుఁ దత్సంధి వివరింప నాఱునూ ,
ఱా ద్వాపరంబున కరసిచూడ
నొక రెండువేలయేం డ్లొనరఁగాఁ దత్సంధి
యబ్దముల్ నన్నూఱు , నవల వచ్చు

తే. కలియుగమునకు వేయేండ్లు గాఁగ దాని
సంధిసంవత్సరంబు లెంచంగ ద్విశత
మగుఁ ; జతుర్యుగ కాలంబు లవనిమీఁద
సార్వకాలంబు నీరీతి జరుగుచుండు. 217

తే. భూమి నిటు నాల్గుయుగములు పుట్టి పుట్టి
వేయిమాఱులు పోయిన విధికి నొక్క
దివమగున్ , రాత్రి కాలమంతే'యటంచు
గుఱుతొకటి చెప్పి , సూతుండు మరల ననియె. 218

వ. 'వినుం డివ్విధంబునఁ జతుర్యుగసహస్రంబులు గడచునంతకు బ్రహ్మసృష్టిం జేయుచుండు , నది గడచినతుద నిద్రంజెందినప్పుడు లోకంబు లడంగు, నతండు మేల్కాంచినప్పు డన్నియుం బుట్టుచుండు , నట్టి బ్రహ్మ దివంబునందుఁ జతుర్దశ మనువు లివ్వసుంధరఁ బాలింపుచుందు ; రట్టి మనుకాలంబెట్టిదనిన స్వాయంభువుండు మొదలగు మనువుల కొక్కరొక్కరికి

దివ్యయుగంబులు డెబ్బదియొక్కమాఱు చనిన నది యొక్కమనుకాలం బని చెప్పనొప్పు , నొక్కొక్క దేవేంద్రుఁడు , దేవతలు , సప్తఋషులు , రాజులు హరి యంశంబుల నుదయించి లోకంబులఁ బాలింతురు ; నారాయణుండు దేవ , తిర్య,ఙ్మనుష్యరూపంబుల ధరియించి సర్వంబును దానై సమర్థించి రక్షింపుచుండు ; నా శ్రీవేంకటేశ్వరుండు మూఁడుయుగంబుల ముని, యక్షాదులచేతఁ బూజింపఁబడుచుండు. ప్రతికలియుగంబునందు మనుష్య పూజ లంగీకరించి భక్తుల రక్షింపుచుండు'నని చెప్పి , మఱి యిట్లనియె. 219

## అష్టాదశ పురాణ ప్రశంస

సీ. 'మునివరులార ! మీ రనఘులు , సర్వజ్ఞు
లగుచునుండియు నన్ను నడుగఁగాను
భక్తితో శ్రీవ్యాసభట్టారకుల దయన్
విశదంబుగాఁ బదివేల సంఖ్య
నమరు బ్రహ్మపురాణ , మంత ద్వాదశసహ
స్రములచే బ్రహ్మాండ మమరు నొకటి ,
సరవి నెన్నఁగఁ బంచశతసంఖ్య నమరుచు
వలనొప్పు బ్రహ్మవైవర్తనంబు ,

తే. వెలయు నిరువదినాలుగువేల సంఖ్య
నమరు విష్ణుపురాణంబు , నదియుఁగాక
దశసహస్రకసంఖ్యతోఁ దనరి ధరను
నాణెమగు వామనుని పురాణంబు మఱియు. 220

సీ. అదిగాక యేఁబదియైదువేలగు సంఖ్య
నెనయు పద్మపురాణ , మెనిమిదియును
పదివేలనగు సంఖ్య నొదవు భాగవతంబు ,
వెలయఁగాఁ బదిరెండువేల సంఖ్య

నొనరు మత్స్యపురాణమును , బదియేడువే
లైన కూర్మపురాణ , మదియుఁగాక
నలువొప్ప నిరువదినాల్గువేలగు లెక్క
నమరు వరాహమహాపురాణ ,

తే. మిరువదియునొక్కవేయునై వరుసగాను
రచితమైనట్టి గరుడపురాణ మొకటి ,
పంచవింశతిసాహస్ర మెంచ నార
దుని పురాణంబు , నదిగాక తొడరి మఱియు. 221

తే. గురుతరంబుగ నొక పదకొండువేల
నొదవు లింగపురాణంబు , నదియుఁగాక
నరయ నిరువదిరెండువేలై తనర్చి
రమణఁ జెలువొందు శివుని పురాణ మొకటి. 222

తే. ఎనుఁబదియునొక్కవేల సంఖ్యను ఘనముగ
రచితమౌ స్కాందనామపురాణ మొకటి ,
వింశతిసహస్రసంఖ్యతో వివిధకర్మ
రంజితాగ్నేయనామపురాణ మొకటి. 223

సీ. వెలయఁగా నిరువదివేలగు సంఖ్యతోఁ
దనరు మార్కండేయముని పురాణ ,
మదిగాక నిరువదియగువేల సంఖ్యతో
సారమై తగు భవిష్యత్పురాణ
మెన్న , నే నీ పదునెనిమిదియగు పురా
ణంబులు మీకు నిర్ణయముగాను
జెప్పితి ; నిదిగాక శ్రీవరాహపురాణ
మున , భవిష్యోత్తరమునను , మఱియ

తే. రమ్యతరమైన పద్మపురాణముననుఁ
వింతలగుచుఁ బ్రకాశించు వేంకటాద్రి
పతిచరితములు కొన్ని యేర్పఱచి మీకుఁ
జెప్పితిని నేను మోక్షంబుఁ జెందుకొఱకు.' 224

క. అని యా సూతుఁడు పలుకఁగ
విని శౌనకముఖ్యమునులు విశ్వాసముతోఁ
గనుఁగొని యతని ముదంబున
వినుతింపుచు నిట్లులనిరి వేడుకమీఱన్. 225

చ. లంరుచిర భక్తియుక్తులును , సూనృత వాక్యము , లాత్మనిష్ఠయున్
పరమవివేక శీలములు , పావనమోక్షవిచార ధర్మముల్
కరుణయు , శాంతమున్ మొదలుగాఁగల సద్గుణముల్ దృఢంబుగా
నఱిముఱి నిల్చె నీహృదయమం , దతిధన్యుఁడవైతి విద్ధరన్. 226

శా. నీ వా చక్రిగుణంబులం దలఁపుచున్ నిర్వాణబోధస్థితిన్
భావంబందు గ్రహించి మా కొనరఁజెప్పన్ జాలయోగ్యుండవై
నా , విబ్భంగినిఁ గొంకులేక యిచటన్ నానాపురాణార్థముల్
ధీవిజ్ఞానుఁడవై వచించితివి సందేహంబులన్ దీర్చుచున్. 227

ఉ. కావున నీవు ధన్యుఁడవు , కంజదళాక్షుఁడు నీ హృదబ్జమం
దే వసియించియుండి బహుదివ్యతరోక్తుల నిచ్చి సత్కృపన్
బ్రోవఁగ , నీ కసాధ్యములు పుట్ట'వటంచు మునీంద్రు లందఱం
దా విమలాదిసూతు సుగుణావళి నెన్నుచు నాదరంబునన్. 228

చ. పలుకఁగ సూతుఁడిట్లనియెఁ ' బద్మదళాక్షుఁడు బాదరాయణుం ,
డలశుకయోగిపుంగవుఁడు , నార్యులునై తగు మీరలందఱున్
విలసితమైన సత్కరుణ వేడ్కగ నాయెడనుంచి యుండఁగాఁ
జెలువలరంగఁ దోఁచినవి చెప్పితి'నంచు వచించి , నమ్రుఁడై. 229

క. మునులను సన్నుతిసేయఁగ
విని వారలు మెచ్చి, యతని వినయోత్కర్షం
బున కలరుచుఁ గ్రమ్మఱ ని
ట్లని ' రింకొక ఘనరహస్య మడిగెద మనఘా ! 230

## పుణ్యజీవులు పొందు సద్గతి క్రమములు

ఆ. విను మనేకమర్త్యవితతులలో మోక్ష
కాములైనవారు కాయములను
విడిచి యెచట నెచట విమలులై పొందుదు?
రా విధంబు దెలుపుమయ్య ! సూత ! ' 231

క. అన విని సూతుం డప్పుడు
తన గురుని మనంబునందుఁ దలఁచి, యచలుఁడై
కనుఁగవ ముకుళింపుచు వి
ష్ణుని ధ్యానముచేసి, విమలసుస్థిరమతియై. 232

సీ. సూతుఁడిట్లనియె ' ఓ సూరిజనములార !
వివిధశ్రుతిస్మృతుల్ వినిన మీకు
నఖిలంబుఁ దెలియు, నాయందు సత్కృప నుంచి
యతిరహస్యప్రశ్న నన్నడిగినపుడు
చెప్పలేదననేల ? చెప్పెదఁ దప్పొప్పు
లంగీకరించి నెయ్యమున వినుఁడి !
పాపకర్ములు పోయి బహునారకములందుఁ
బడి పుట్టుచుందురు ప్రజ్ఞ లేక,

తే. పుణ్యకర్ములు పోయి తత్పుణ్యఫలము
లనుభవించినతుద భూమియందు వ్రాలి
క్రమ్మఱను బుట్టుచుందురు; కామముఖ్య
శత్రువుల గెల్చి గురుకటాక్షమును బొంది
నట్టివారు జనింప రీ యవనిమీఁద. 233

సీ. అట్టివా రెవరన్న నాచార్య భక్తులై
పరమ విరక్తులై , పటువివేక
కలితులై , శాంతులై , గర్వవిముక్తులై
హేయగుణంబుల నెగురమీఁటి
గురుతరకల్యాణగుణులై , యచంచల
చిత్తులై , విజ్ఞానసిద్ధులగుచు
హెచ్చక తగ్గక యేకాంతనిష్ఠులై
నారాయణధ్యాన పూరితాత్ము

తే. లయిన ఘను లంగముల వీడి యఖిలలోక
ముల నపుడె దాఁటి , మండలములను గడచి
వరుస మహదాదులయిన యావరణములను
గడచి , మూలప్రధానమున్ గడచి మఱియు. 234

వ. సహస్రశీర్షుండైన విరాట్పురుషు నతిక్రమించి యమృతపల్లియన నొప్పు విరజానదియందుఁ గ్రుంకి , లింగదేహంబులను విడిచి యప్రాకృతదివ్య దేహధరులై , శతసహస్రదివ్యావరణామృతంబై , యనేకకోటిసూర్యచంద్ర ప్రకాశమై యొప్పుచున్న పరమపదమందుఁ బ్రకాశింపుచున్న నారాయణ పరబ్రహ్మ సాన్నిధ్యంబునం బొందుదురు. మఱియు భక్తి , జ్ఞాన , వైరాగ్యంబుల నభ్యసింపుచు నధ్యాత్మవిద్యానుభవులగు నాత్మవేత్తలు స్వరూపవిలక్షణంబు లేక నిరాకారప్రకాశమైన కైవల్యపదమందుఁ బొందుదురు. విజ్ఞానంబ బ్రహ్మంబని యనుభవ సిద్ధులైన జ్ఞానవేత్త లమృతసముద్రంబను విరజయందుఁ బొందుదురు. సహస్ర శీర్షుండైన విరాట్పురుషుండె పరబ్రహ్మంబని నిశ్చయించి , తద్ధ్యానారూఢులైన వారా విరాట్పురుషుని శీర్షోపరిప్రదేశంబునందుఁ జేరుదురు. వీరందఱును బునరావృత్తిరహితులై యుందురు. మఱియు నవ్విరాట్పురుషుని భ్రూమధ్యాధఃప్రదేశంబునందుఁ ద్రిగుణమిశ్రమైయున్న మూలప్రకృతినే

పరతత్త్వంబని తదనుష్ఠాన మంత్రసిద్ధులైనవారు దుర్గధామంబునందుఁ బొందుదురు. తత్ప్రకృతిజన్యంబులైన మహదాదిసప్తావరణంబులనే పరతత్త్వంబుగాఁజూచువార లయ్యావరణంబులందుఁ బొందుదురు. వాసుదేవ ద్వాదశాక్షరీ , నారాయణాష్టాక్షరీ, నారసింహ , గోపాలాది మహామంత్రసిద్ధులును , సదా నారాయణస్మరణ నేమఱక చేయువారును వాసుదేవ , సంకర్షణ , ప్రద్యు,మ్నానిరుద్ధ వ్యూహంబులందుఁ బొందుదురు. విష్ణుం డొక్కఁడె మహద్భూతంబని , మఱి యనేకభూతంబులు పృథగ్భూతంబులని , విష్ణుండే సాత్త్వికబ్రహ్మంబని నిశ్చయించి , విష్ణుషడక్షరీ మహామంత్ర సిద్ధులయిన విష్ణు పరాయణులు శ్రీవైకుంఠముఁ జేరుదురు. మఱియు సద్వ్రత నిష్ఠులయిన , జ్ఞాన , భక్తి , వైరాగ్య సంపన్నులయిన విష్ణుమతములవారు కారణవైకుంఠములందును బొందుదురు. వీర లందఱును వటపత్రశయనుని నాభికమలమందుఁ బ్రళయకాలంబులందుఁ జొచ్చి , వెడలుచుందురు. బ్రహ్మ పరతత్త్వమని బ్రహ్మగాయత్రీ మహామంత్ర సిద్ధులయినవారు బ్రహ్మ లోకమందును , దపస్సిద్ధులైనవారు తపోలోకమందును, శమ దమాది సద్గుణసంపన్నులైనవారు జనలోకమందును బొందుదురు. ప్రళయజలము జన లోకంబున కెగఁ దట్టినప్పుడు జనలోకవాసులు మహర్లోకమందుఁ జేరుదురు. మఱియు యజ్ఞాదిసత్కర్మసిద్ధులు సువర్లోకంబు నందుదురు. దాన ధర్మ పరోపకారులయినవారు భువర్లోక మందుదురు. సూర్యమంత్రోపాసనా సిద్ధులైనవారు సూర్యలోకమందును , జంద్రమంత్రోపాసనా సిద్ధులైనవారు చంద్ర లోకమందును జేరుదురు. తత్తత్పుణ్యంబులు క్షీణించినప్పుడు భూలోకంబునఁ బుట్టవత్తురు. మిక్కిలి పాపకర్మంబులు చేసినవారు భూత, ప్రేత, పిశాచ, గ్రహమండలములఁ జేరి , కాలాంతరములకుఁ బాపంబులు క్షీణించినప్పుడు భూలోకంబునఁ గ్రమ్మఱఁబుట్టి , జన్మహేతుకర్మములఁ జేయుచుందు'రనిన విని శౌనకాదు లిట్లనిరి. 235

సీ. 'వెలయఁ గర్మము లెన్ని విధములై జీవుల
కే యే శరీరంబు లిచ్చుచుండుఁ ?
బుణ్యాతిశయమును , బుణ్యామధ్యమమును ,
బుణ్యసామాన్యంబు , భూరిపాప
మును , మధ్యపాపంబు , మొనసిన సామాన్య
పాపంబు నరుల కే ఫలము లిచ్చు ?
మిశ్రకర్మాధిక్య , మిశ్రమధ్యము , మిశ్ర
సామాన్య మే గతుల్ జనుల కొసఁగుఁ ?

తే. గామ్యకర్మంబులును , గతకాలకర్మ
ఫలము లే మార్గములఁ జూపుఁ? బ్రజల'కనిన
విని మనంబున భావించి , మునివరులను
జూచి గురునిఁ దలంచి , యా సూతుఁడనియె. 236

వ. 'మహాత్ములారా ! వినుం , డిట్టి కర్మములచేతనే జీవులకు జన్మంబులు గలుగుచుండు , నట్టి కర్మంబు లెన్నివిధంబులనినఁ బుణ్య,పాప,మిశ్ర కర్మంబులని మూఁడు విధంబులు. తత్కర్మఫలానుభవంబు లెట్లనినఁ బుణ్యకర్ములు దేవాది శరీరంబులందును , బాపకర్ములు తిర్యగాది శరీరంబులందును, బుణ్య పాప మిశ్రకర్ములు మనుష్యాది శరీరంబులందును బొందుదురు. మఱియును బుణ్యాతిశయులు హిరణ్యగర్భరూపంబునందును, పుణ్యమధ్యము లింద్రాది శరీరంబులందును , సామాన్యపుణ్యులు యక్షరక్షఃప్రముఖ తామస దేహంబులందును బొందుదురు. మఱియు నుత్కృష్టపాపంబులు చేసినవారు జనతాపకరంబులైన కంటకవృశ్చిక , వనమక్షికాది క్రూరజంతువు లగుదురు. పాపమధ్యములు కదళీ,నారికేళాదివృక్షంబు లగుదురు. సామాన్యపాపులు గో, గజాదు లగుదురు. మఱియు సామాన్యమిశ్రకర్ములు చండాలాది నీచజన్మంబు లెత్తుదురు. మిశ్రమధ్యమ కర్ములు వర్ణాశ్రమ ధర్మార్థ కామ్య కర్ములై యుదయింతురు. అత్యుత్కర్ష పుణ్యపాప మిశ్రకర్ములు

నిష్కామసత్కర్ములై పుట్టి , యీశ్వరార్పితపుణ్యకర్మంబు లాచరించి , యందువలనఁ జిత్తశుద్ధి గలిగి , యందువలన సాధనచతుష్టయసంపత్తి గలిగి , యందువలన సద్గురుభక్తి గలిగి , వారికిఁ జతుర్విధశుశ్రూషలు చేసి మెప్పించి , వారి కరుణకుఁ బాత్రులై వేదాంతసిద్ధాంతరహస్యోపదేశంబు వడసి , శ్రవణ,మనన,నిదిధ్యాసనపూర్వకంబుగా సంపూర్ణజ్ఞానము నవలంబించి , యజ్ఞానకారణావరణ విక్షేపశక్తులం గెలిచి , శబ్దానువిద్ధ , దృశ్యానువిద్ధ , సవికల్ప , నిర్వికల్ప సమాధుల నభ్యసించి , జ్ఞాన , జ్ఞాతృ, జ్ఞేయంబులనెడి త్రిపుటిం దాఁటి , సచ్చిదానంద నిత్య పరిపూర్ణ బ్రహ్మంబునందుఁ బొంది జీవన్ముక్తు లగుదురు. కామ్యకర్మాచరణులైనవారు సుఖ , దుఃఖ కారణంబులయిన స్వర్గ , నరకంబులందుంబొంది క్రమ్మఱఁ బుట్టి గిట్టుచుందు'రని చెప్పిన , విని శౌనకాదు లిట్లనిరి. 237

## వటపత్రశయనుని వర్ణనము

క. 'చటులోగ్ర ప్రళయంబున
నటమటమయి విశ్వమడఁగినపుడు లయాబ్ధిన్
వటపత్రమునం దా హరి
యెటువలె వర్తింపుచుండు నెఱిఁగింపవయా !' 238

తే. అనిన విని సూతుఁడనియె ' లయాబ్ధిమీఁద
మహిమమీఱఁగ నంగుష్ఠమాత్రదేహుఁ
డై , నిజాంగుష్ఠ మాస్యమం దమర నుంచి
లీల వటపత్రమునఁ బవ్వళించునపుడు. 239

సీ. పటుతరంగాహతిన్ వటపత్ర మటు నిటు
ఉయ్యాలవలె నూఁగుచుండఁగాను
జిరజిర నెగిరెడు శీకరమాలిక
ఉయ్యాలచేరుల ట్లొప్పఁగాను

ఫేనంబు చుట్టుగప్పి విశాల మయ్యుది
యుయ్యాలతెరవలె నుండఁగాను
ధ్రువమండలం బడ్డదూలంబు కైవడి
నుయ్యాలచేర్లతో నొఱయఁగాను

తే. బరమపదకాంతు లుప్పొంగి పద్మరాగ
ముఖ్యమణిజాలముల రీతి, ముద్దుగుల్కు
చెండ్లవలెఁ జూడ్కి కెదురుగా నుండ, దానిఁ
జూచుచును బాలుఁ డాత్మలోఁ జొక్కుచుండు. 240

ఆ. బాలకుండు దానిఁబట్ట నుద్యుక్తుఁడై
మురిసి మురిసి నవ్వి, కరము సాచి
'పట్టికొందు'ననుచు నట్టిట్టు జుణుఁగుచు
నుబ్బి నాట్యలీల నొప్పుచుండు. 241

క. ఘనపద్మజాండకోటులఁ
దన సూక్ష్మోదరమునంద దాఁచి ముఱియుచున్
వనరాశిమీఁదఁ దేలుచు
నొనరఁగ డోలోత్సవంబు నొంది సుఖించున్. 242

క. వనజనిభాకారుండై
వననిధిలోఁ దేలుచున్న వటపత్రముపైఁ
దనుఁ దానె చూచి చొక్కుచు
నెనవుగ నానందయోగనిద్రం జెందున్. 243

వ. ఇవ్విధంబున యోగనిద్రంజెందియుండి బహుకాలంబునకుఁ గ్రమ్మఱ మేల్కాంచి, నిజగర్భగతప్రపంచంబును వెలిఁ బూర్వప్రకారంబున నిర్మించునపుడు ముక్తజీవులు దక్క తక్కిన కర్మజీవులు యథాప్రకారంబుగాఁ బుట్టి గిట్టుచుందు' రని చెప్పి, క్రమ్మఱ సూతుం డిట్లనియె. 244

## శుభ మంగళము

సీ. 'పుట్టి గిట్టుచునున్న భూలోకవాసుల
రక్షించుటకు రమారమణితోడ
వేంకటాచలమందు విఖ్యాతిగా నుండి
నరులచే గోవిందనామభజన
మొనరఁజేయింపుచు ఘనపాపములనైన
క్షీణింపఁజేయుచు , సిరుల నిచ్చి
పాలింపుచున్నట్టి ఫణిగిరీశ్వరున , కా
వ్యూహమహాలక్ష్మి , కుర్విమీఁద

తే. వెలయు నా వీరలక్ష్మికి , విమలహృదయ
యగుచు నలమేలుమంగాఖ్య నద్భుతముగ
నమరు పద్మావతికి , వేంకటాద్రి కిలను
వెలయు శుభమంగళము గల్గవలయు'ననఁగ. 245

తే. అప్పు డా మునులెల్లఁ ' దథా 'స్తటంచుఁ
బలికి , శ్రీ వేంకటేశ్వరభక్తి కథలు
సూతుఁ డెఱిఁగింప వినుచు మెచ్చుచును వార
లంద అందుండి రానంద మతిశయింప. 246

## ఆశ్వాసాంతము

క. ధరణీ శ్రీ నీళాధిప !
కరుణారసపూరితాత్మ ! కామితఫలదా !
వరవేంకటగిరి నాయక !
తరిగొండ నృసింహ ! దురితదళన శుభాహ్వా ! 247

మాలిని :

సులలిత మణిభూషా ! సూరి చిత్తాబ్జపూషా !
కలుషజలధి శోషా ! కంజగర్భాండ వేషా !
కలిపురుషజ దోషాక్రాంతజీవాళి పోషా !
విలసిత సవిశేషా ! వేదవేదాంగ భాషా ! 248

గద్య :

ఇది శ్రీతరిగొండలక్ష్మీనృసింహ కరుణాకటాక్ష కలిత కవితావిలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ వెంగమాంబాప్రణీతంబైన వీరలక్ష్మీ విలాసంబను శ్రీవేంకటాచల మాహాత్మ్యంబునందు లక్ష్మినిఁగూర్చి హరి కొల్లాపురంబునఁ దపంబుసేయుటయు , ' శుకాశ్రమంబునఁ దపంబుఁ జేయు ' మని చక్రి కశరీరవాణి బోధించుటయు , నా స్వామి పద్మసరోవరతీరంబునఁ జేరి , దివాకరప్రతిష్ఠఁ జేసి , లక్ష్మినిఁగూర్చి తపంబుఁ జేయుటయుఁ , దత్తపో విఘ్నంబుఁ జేయుట కింద్రానుమతంబున రంభాదులు వచ్చి , హరినిఁ జలింపఁజేయనేరక యోడి చనుటయు , హరినిఁ దలంచి పద్మావతి చింతనొందుటయు, లక్ష్మీకపిలముని సంవాదంబును , వ్యూహలక్ష్మి హరికిఁ బ్రసన్నం బగుటయు , రమాసహితుండై బ్రహ్మాదులతోడఁ జక్రి శేషాద్రిఁ జేరుటయు , లక్ష్మీనారాయణులు వినోదంబుగా భాషించుటయు , శుకమార్తాండ సంవాదంబును, ఛాయాశుకోత్పత్తియు , వీరలక్ష్మి శుకాశ్రమంబుఁ జేరియుండుటయు , బల కృష్ణ సంవాదంబును , శ్రీనివాసుని బ్రహ్మాదు లర్చించిన కాలక్రమ విధంబును , మనుకాల నిర్ణయంబును , అష్టాదశపురాణ ప్రశంసయుఁ , బుణ్యజీవులు పొందు సద్గతిక్రమంబులును ననుకథలం గల శ్రీవేంకటాచల మాహాత్మ్యంబునందు వీరలక్ష్మీవిలాసంబను షష్ఠాశ్వాసము.

శ్రీవేంకటాచల మాహాత్మ్యము సర్వము సంపూర్ణము.



T.T.D.Religious Publications Series No. 641 Price : Rs. 40/-

"భారతం" అనే అక్షర త్రయం తెలుగు వారికి కవిత్రయాన్ని జ్ఞాపకం చేస్తుంది. "భాగవతం" అనే చతురక్షరి భక్తకవియైన బమ్మెరపోతనను స్మరింపజేస్తుంది.

అలాగే "వేంకటాచల మాహాత్మ్యం" - అనే అష్టాక్షరి తిరుమల పుణ్యక్షేత్రాన్ని, అందు నెలకొనివున్న శ్రీనివాసుణ్ణి, అచ్చటనే ఈ మహనీయ కావ్యాన్ని రచించిన భక్త కవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబను మన స్మృతిపథంలో భాసింపజేస్తుంది.

ఈ మాహాత్మ్య ప్రబంధం అవతరించిన నాటి నుండీ వేంకటాచల దివ్యక్షేత్రం యొక్క మహిమను ప్రజానీకంలో ప్రబోధించడంలో నిర్వహించిన, నిర్వహిస్తూవున్న పాత్ర నిరూపమానమైనది.

గడచిన ఒక శతాబ్ది (1850-1950) కాలంలో ఇంచుమించు పది పర్యాయములు ముద్రితమైనప్పటికీ, ఇది ఈనాడు అరుదైన గ్రంథమైపోయింది. ఈ అవశ్యకతను గుర్తించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఈ ప్రశస్త ప్రబంధాన్ని ప్రప్రథమంగా చక్కగా పరిష్కరింపజేసి, విశిష్ట ప్రచురణగా ప్రచురించారు.

అటు ఆధ్యాత్మిక భక్తిభరితమైన పవిత్రతను, ఇటు సరసకవితా చమత్కృతిని సంతరించుకొని "తెలుగులో వెల్లివిరిసిన వేంకటేశ్వర వాఙ్మయము"నకు తలమానికంగా అలరారుతూ వున్న ఈ కమనీయ కావ్యం అక్షరాస్యుడైన ప్రతి ఆంధ్రుడూ ఆసక్తితో పఠింపదగింది !

Published by Sri Ajeya Kallam, I.A.S., Executive Officer
T.T.Devasthanams and Printed at Sowbhagya Printers, Warengal.